శ్రీ ర స్తు.

శ్రీవరాహమిహిరాచార్యవిరచిత

# బృహజ్జాతకము.



ఆలూరు. వాసుదేవశాస్త్రికృతాంధ్ర

తాత్పర్యసహితము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము

1914.

 [Rs 1 4 0.

# పీఠిక.

బృహజ్జాతకమును రచించినకవి వరాహమిహిరాచార్యు డను హోరికుడు. బహుపురాణ ప్రసిద్ధమును, భారద్వాజమహర్షీయ సంతతి యునగు శాకద్వీపబ్రాహ్మణ వంశజుడు. తొలుత నాలుమన్వంతరములవఱకు సతీసరోవర మనుపేర జలమయమైయుండిన హిమాలయ దక్షిణ ప్రదేశంబున శాకద్వీపం బనునది కలదు. వైవస్వత మన్వంతరంబున నాసరోవరప్రదేశము స్థలమయమై కాశ్మీరంబునా నొప్పె. ఆకాశ్మీర పంజాబు దేశములకు మధ్యప్రదేశమున ప్రస్తుతము శాకల మని వ్యవహరింపఁబడునదియే శాకద్వీపము. మగధదేశమునందలి పాటలీపుత్ర నగరనివాసియై పిమ్మట నవంతీపట్టణమునకు లేచివచ్చిన యాదిత్యదాసను నాతడు వరాహమిహిరునకు తండ్రి తల్లిపేరు తెలియదు.

## వరాహమిహిరుని కాలనిర్ణయము.

ఈతండు క్రీ-శ 505 వ సంవత్సరమందు జనించి 82 సంవత్సరములు జీవించి మృతుడైనట్లు భారతవర్షీయ గ్రంథకర్తలను గ్రంథములను తిన్నగ ముందుకునెట్టి క్రీ-శ లో పడద్రోయవలెనను తలంపుగల బియట్ వీబర్ మొదలగు పాశ్చాత్యపండితులయొక్కయు స్వమతస్వభాషానభిజ్ఞులగు మన నవనాగరక నవీనజ్ఞానులయొక్కయు దుర్వాదములను పూర్వపక్షముచేయుచు ప్రొఫసర్ ఫాచి-యస్ వీ-పండిట్-డాక్టర్ భాదాజీ సర్ విల్లియంజోన్సు-ప్రొఫసర్ ఆప్టి-డాక్టర్ పేటర్సన్-ప్రొఫసర్ బహులర్-అనుపండితులయొక్క అభిప్రాయముల నుపబలముగ గొని బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిలవారు వారి సంస్కృతకవుల చరిత్రమునందు ననేకదృష్టాంతముల చూపుచు ఖండించి వరాహమిహిరుడు క్రీ-శ అయిదవ శతాబ్దములోని వాడు కాడనియు విక్రమార్క లేక మాళవశకము అయిదవశతాబ్దములోని వాడనియు క్రీస్తుకుముందు రమారమి యేబది సంవత్సరముల క్రిందటి వాడనియు సిద్ధాంతీకరించియున్నారు. ఇందున కుపబలముగ వరాహమిహిరుడు విక్రమార్కశకకర్తయగు శ్రీహర్షవిక్రమార్కుని సభయందాస్థాన పండితుడని యతనికి సమకాలికుడును కాలతంత్రశాస్త్రజ్ఞుడు నగు మహాకవి కాళిదాసు తారచించిన జ్యోతిర్విదాభరణమందు

"ధన్వంతరి క్షపణకామరసింహశంకు వేతాలభట్ట ఘటకర్పర కాళిదాసాః, ఖ్యాతో వరాహమిహిరో నృపతేస్సభాయాం రత్నానివై వరరుచిర్నవ విక్రమస్య." తా. ధన్వంతరి, క్షపణకుడు, అమరసింహుడు, శంకువు, భేతాలభట్టు, ఘటకర్పరుడు, కాళిదాసు, వరాహమిహిరుడు, వరరుచి యను కవిరత్నములు ఆదిమవిక్రమార్కుని సభలోనివారనుట. మఱియును శ్లో॥ "శంక్వాదిపండిత వరాః కవయస్త్వనేకే జ్యోతిర్విద స్సమభవంశ్చ వరాహపూర్వాః, శ్రీవిక్రమార్క నృపసంసది మాన్య బుద్ధి స్తైరప్యహం నృపసఖాః కిలకాళిదాసః." తా. శంక్వాదిపండితశ్రేష్ఠులును అనేకకవీశ్వరులును వరాహమిహిరుడును కాళిదాసనునేను మొదలగు జ్యోతిష్కులును విక్రమార్క సభయందు సఖులమై యున్నామని భావము. మఱియును "సత్యోవరాహమిహిరోశ్శ్రుత సేననామా శ్రీబాదరాయణ మణిత్థ కుమారసింహాః, శ్రీవిక్రమార్క నృపసంసది సంతి చైతే శ్రీకాలతంత్ర కవయస్త్వపరేమ దాద్యాః." తా. సత్యకీర్తి, వరాహమిహిరుడు, శృతసేనుడు, బాదరాయణుడు, మణిత్థుడు, కుమారసింహుడు, కాళిదాసను నేను మొదలగు కాలతంత్రి శాస్త్రిజ్ఞానకవులము విక్రమార్క సభయం దున్నామని భావము. మఱియును "అష్టాయస్యశతాని మండలధరాధీశాస్సభాయాం సదా స్యాఃసంసత్ప్రిబలోగ్రకోటి సుభటాః సత్పండితాష్షోడశాః, దైవజ్ఞా దశషణ్మితాశ్చభిషజో భట్టాస్తథాధాఢినోః వేదజ్ఞారస చంద్రమా విజయతే శ్రీవిక్రమస్సోదిభూః" ఎనిమిదివందల సామంతప్రభువులచేతను, కోటిమంది యుద్ధభటులచేతను, పదునాఱుగురు పండితశ్రేష్ఠులచేతను, పదిమంది జ్యోతిషశాస్త్రివేత్తలచేతను, ఆఱుగురు భైషజ్యశాస్త్రివేత్తలవలనను, అనేకమంది భట్టారకులచేతను, రసచంద్రుడు మొదలగు వేదవిదులచేతను పరివేష్టింపఁబడిన నిండోలగంబు గల విక్రమార్క మహారాజని భావము. ఈశ్రీహర్ష విక్రమార్కు డెట్టివాడనగ- "యోరోమ దేశాధిపతిం శకేశ్వరం జిత్వాగృహీత్వోజ్జయనీం మహాహావే, ఆనీయసంభ్రామ్య ముమోచతం త్వహో సవిక్రమార్క స్సమసహ్య విక్రమః." శకాధిపతి యగు రోమకచక్రవర్తిని యుద్ధమందు జయించి పట్టుకొనివచ్చి యుజ్జయనీపట్టణమందు బడి ద్రిప్పించినయనివార్యపరాక్రమశాలి యని తాత్పర్యము. ఇందువలన పూర్వ మొకప్పుడు ప్రపం

చమంతటి తోపాటు భారతఖండమును సైతము రోమక చక్రవర్తి లేలి యున్న ట్లూహ్యము. ప్రస్తావరోమకచక్రవర్తి శకాధిపతియునై యుం డినటుల తోచుచున్నది. అట్టి శకాధిపతియగు రోమకచక్రవర్తిని జ యించినందుననే విక్రమార్కుడు తనపేర శకమును ప్రతిష్ఠించి శకాధి పతి యాయెను. ఈవిక్రమార్కుడు క్రీస్తుకుముందు 52 సంవత్సరము లకిందట నున్నవాడు. ఈతని ప్రభుస్థానమం దాస్థాన కవిపండిత డై వజ్ఞబిరుదమును వహించియున్నమహాకవి కాళిదాసు తా నారంభిం చిన జ్యోతిర్విదాభరణమందు శ్లో. "వర్షైస్సింధురదర్శ నాంబరగుణైః యా తేకకాసమ్మితే (3068) మానే మాధవ సంజ్ఞికేచ విహితో గ్రంథ క్రియోపక్రమం, నానాకాల విధానశాస్త్ర గదిత జ్ఞానం విలోక్యాద రాత్ దూర్జేగ్రంథసమాప్తిరత్ర విహితో జ్యోతిర్విదాం ప్రీతయే." అని కలియుగాబ్దములు 3068 గల కాలమందీ గ్రంథమును వ్రాసితి నని చెప్పికొని యున్నందున నాకాల మిప్పటికి 1947 సంవత్సరము లై నదనియు క్రీస్తుకుముందు 34 సంవత్సరముల నాటిదనియు తెలియం దగియున్నది. కాళిదాసునకు సమకాలికుడగు వరాహ మిహిరుడును నప్పటి వాడనియే సిద్ధాంతమైనది:—

ఈకాళిదాసు రఘువంశాది కావ్యములకును శాకుంతలాది నా టకములకును కర్తయగు మహాకవి కాళిదాసు కాడని కొంతమంది చెప్పుచున్నారు. జ్యోతిర్విదాభరణమునందు శ్లో. "కావ్యత్రియం సు మతి కృద్రఘువంశపూర్వం పూర్వంతతస్మృతిహితం శృతికర్మవాదం, జ్యోతిర్విదాభరణకాల విధానశాస్త్రం శ్రీ కాళిదాసకవితో హితతో బభూవ" అని వ్రాసికొనియున్నాడు. అప్పటి రఘువంశాది కావ్యత్రి యమును, శృతికర్మవాదమును, జ్యోతిర్విదాభరణమును మాత్రమే వ్రాసియున్నట్లు కాళిదాసు చెప్పుకొనియున్నాడు. శాకుంతలాది నా టకముల వ్రాసియున్నట్లు కాన్పించదు. తరువాత వ్రాసియుండ వచ్చును. అతడేయే గ్రంథముల రచించిన నేమి? యేకాళిదాసైననే మి? తాను వరాహమిహిరాదులకు సమకాలికుడ ననియు మాళవశక కర్త యగు శ్రీహర్ష విక్రమార్కునికడ నాస్థానపండితుండ ననియు వ్రాసియున్నాడు. కావున నాకాలము క్రీస్తుశకమునకు ముందు మున్నది

నాలుగు సంవత్సరములని గ్రహించవలెను. కాళిదాసు జ్యోతిర్విదాభరణము రచించునప్పటికి తారుణ్య దశయందును వరాహమిహిరుడు వార్ధక్యదశయందు నుండియుందురు. కాళిదాసు జ్యోతిర్విదాభరణము రచించుటకు ముందు తొమ్మిది సంవత్సరముల క్రిందట వరాహ మిహిరుడు చనిపోయిన ట్లనేక నిదర్శనము లున్నవి. గ్రంథవిస్తర భీతిచే వ్రాయంజాలనైతిని. వరాహమిహిరుడు కపిత్థకాశ్రమమున సూర్యు నారాధించి తదనుగ్రహమున జ్యోతిషవిద్య నభ్యసించితి నని చెప్పికొనుచున్న బడాయీల నటువెనుక గ్రీకు దేశమునకుపోయి యచ్చటి గణితశాస్త్ర రహస్యములను తెలిసికొని తనపేర సిద్ధాంతశాస్త్రమును రచియించిన ఆర్యభటుడు; వరాహ మిహిరుడు గ్రీకు దేశమునకుపోయి యచ్చట నెవరికడ గణితరహస్యము లభ్యసించెనో! యీ వృత్తమును వెల్లడించెను. గ్రీకుదేశమునందు అయోనియాయను నొక ప్రదేశము కలదు. దాని నరబ్బులు యునాన్ దేశమనియు, హిందువులు యవనదేశమనియుం జెప్పెదరు. వరాహమిహిరు డా యవనదేశమునకుబోయి యచ్చట బెక్కు హోరాగణిత శాస్త్ర రహస్యముల నభ్యసించినా డనుట కీతండు రచించిన బృహజ్జాతకము, బృహద్వారాహ సంహితలం దనేక దృష్టాంతము లగుపడుచున్నవి.

## గ్రంథప్రశంస.

వరాహ మిహిరుడు బృహజ్జాతకమునందు గ్రీకుభాషాపదముల నుపయోగించి యున్నాడు. అవి యెవ్వి యనిన.—హోరా- ద్రేక్కాణము అను రాశిభాగ నామములును, క్రియ - తాబురి - జితుమ - తేయ - పాథోన - జూక - కౌర్పి - తౌక్షిక - అకోకేర - యను రాసుల నామములును, దుశ్చిక్య - హిబుక - ద్యూన - మేషూరణ - రిప్ప- యను స్థానసంజ్ఞానామములును, త్రికోణ - కంటక - పణఫర - ఆపోక్లిమ - అను భావసంజ్ఞానామములును, హేళి - ఆర - ఆవనేయ - హేమ్న - ఇజ్య - ఆస్ఫుజిత్ - కోణ - అగుః అనియెడు గ్రహనామములును, వాశి - వేశి - అనఫా - సునఫా - దురుధురా - కేమద్రుమ - అను యోగాంతరనామములును, ద్యుత - జ్యౌ - మర - యను నామములును ఇట్లు 40 పదములు గ్రీకుభాషాపదములనే వాడి యున్నాడు. తదనంతర హోరికులు సైత మాపదములను తమతమ గ్రంథ

ములయం దుపయోగించియున్నారు. హోరయనునది రాశ్యర్థమగు రెండున్నరగడియలకాలమునకు పేరు. దీనిని యవనులు హోర్ అని వ్రాయుచు నుచ్చారణయందు అవర్ అని పల్కుచున్నారు. ఇదియే గడియారపు కాలమై యున్నది. వరాహమిహిరుడు బృహజ్జాతకమందు హోరాశబ్ద నిరూపణ విషయమై అహోరాత్రయను శబ్దముయొక్క ఆద్యంతవర్ణములగు అ - త్ర - యను వానిని తొలగించినయెడల హోరాశబ్దము శేషించుననియు, అహోరాత్రాత్మకమగు కాలఫలమును దెలుపునదియే హోర యనబడుననియు, గాన నీశాస్త్రమునకు హోరాశాస్త్రమను పేరు కలిగినదనియు నత్యుక్తిని సాధించియున్నాడు. ఈ గ్రంథము నీతం డిరువది యాఱధ్యాయములుగ భాగించి జాతక శాస్త్రమునకు గావలసిన సకల విషయములను సంగ్రహముగ విశదీకరించియున్నాడు. ఇందు లేని విషయము లే హోరాశాస్త్రములందును గానంబడవు. ఈ గ్రంథము నవాంశగణితసాధ్యమగు ఫలములుగలదగుటవలన నవాంశగణితశాస్త్రము నభ్యసింపక జెప్పసాహసించు ఫలము లెవ్వియును సరిపడవు. ఈ గ్రంథప్రకారము ఫలముల జెప్పుటకనియే నవాంశ గణిత మను మూలసూత్రగ్రంథము నొకదానిని సైతము వరాహమిహిరుడు రచించియున్నాడు. అది యీభరతఖండమునం దుత్కల దేశమునందు దప్ప మఱియెచ్చోటను వాడుకయం దున్నట్టులగు పడదు. ఓఢ్రదేశమందు మాత్రము బ్రతిహోరికున కీనవాంశగణిత మత్యంతానుష్ఠేయమై యున్నది. పూరీ - గంజాము - బరహంపురము - సంబలీపురము మొదలైనయోఢ్రదేశపు జిల్లాలయందుండెడు జ్యోతిష్కులీబృహజ్జాతక ప్రకారము చెప్పెడు ఫలము లత్యద్భుతావహములై యుంటున్నవి. వారు మన జాతకముజూడకయే యాకృతిని జూచి రాశ్యంశ చక్రములను వ్రాయుటయు ననుభవసిద్ధముగ భూత భవిష్య త్ఫలములను జెప్పుటయు నే ననేక మారులు కనివినియున్నాను. కావున బృహజ్జాతకమును బఠించ దొరకొను వారు నవాంశ గణితము నేర్చుకొనుట కర్తవ్యాంశము. ఈ గ్రంథమందు లగ్న - రవి - చంద్రుల బలాబలముల ననుసరించి బలాధికమైనదానిదశ ప్రథమదశగను - కేంద్ర - పణ

ఫలాపాక్షేమములయందున్న గ్రహముల బలాబలముల ననుసరించి త క్కినదశలును అటులనే యంతర్దశలును కల్పింపబడి యున్నవి. ఇవిసా ధించుటకును నవాంశగణితమే తెలిసియుండవలయును. పరాశరపద్ధతి- జైమినీపద్ధతి - కాలచక్రపద్ధతి - మానసాగరపద్ధతి - తాజకపద్ధతి - నాడీపద్ధతి - గౌరీజాతకపద్ధతి - వేదాంగజ్యోతిషపద్ధతి - గౌతమ పద్ధతి - కాళిదాసపద్ధతి - వృద్ధయవనపద్ధతి - బృహజ్జాతకపద్ధతి యను పది రెండుపద్ధతులలోను దశాక్రమ మొకదాని కొకటి భేదించియు న్నది. ద్వాదశభావ రాశి చక్రము వేదాంగజ్యోతిషమందు మాత్రి మే భేదపడియున్నదిగాని, తక్కిన పదునొకండు పద్ధతులలో నొక్క తీరుగనే యున్నది. వరాహమిహిరుడు బృహజ్జాతకమునం దచ్చట చ్చట రాహు కేతువుల బ్రస్తావించియున్నాడు కాని ఫలాకాంక్షలో వారి పేరెత్తుకొనలేదు. వరాహమిహిరుడుక్రీ - శ - అయిదవశతాబ్దము లోని వాడనియు, హిందూజ్యోతిష శాస్త్రములలో బృహజ్జాతక మాద్య మనియు కొందఱు నవీనజ్ఞానులు చెప్పుచుందురు. అందుకు వైరుధ్య ముగ బృహజ్జాతక ముపసంహారాధ్యాయమునందు శ్లో. "ఆదిత్యదా సతన యస్తదవాప్తబోధః కాపిత్థకే సవితృలబ్ధవరప్రసాదః, ఆవంతికో మునిమతాన్యవలోక్య సమ్యగ్ఘోరాంవరాహ మిహిరోరుచిరాంచకా ర." అని వరాహమిహిరుడే వ్రాసికొనియున్నాడు అనగా అనేకు లగు ప్రాచీనమునుల మతములను చక్కగ దెలిసికొని యీబృహజ్జాతక మును రచించితినని చెప్పికొని యుండుటవలనను ఇతర ఋషులనామ ముల నచ్చటచ్చట స్మరించి యుండుటవలనను కౌటిల్యుడని భట్టోత్ప లునిచే జెప్పంబడిన చంద్రగుప్తుని మంత్రియగు విష్ణుగుప్తునిని, సమ కాలికుడును ధృవనాడి యను జ్యోతిష గ్రంథకర్తయునగు సత్యకీర్తి - లేక - సత్యాచార్యుడను వానిని బృహజ్జాతకమం దనేకస్థలములలో చేర్కొని యుండుటవలనను బృహజ్జాతకమునకన్న బూర్వ మనేక జ్యోతిష శాస్త్రములున్న వని దూఢియగుచున్నది. అపూర్వములగు వేదాంగ జ్యోతిషము గౌరీజ్యోతిషము కాలచక్రజ్యోతిషము లను నవి బృహజ్జాతకమునకన్న ప్రాచీన గ్రంథము లనుటకు వాని యందు యావనభాషా పదముల సంపర్కము లేకున్కియు, వేదాంగ జ్యో తిషమందు భావచక్ర పద్ధతి ద్వాదశరాశి చక్రము ననుసరించి



శ్రీరస్తు.

# బృహజ్జాతకము

## సాంధ్ర తాత్పర్యము.



### సంజ్ఞాధ్యాయము.

మూ. మూర్తిత్వే పరికల్పిత శ్శశిభృతో వర్త్మా పునర్జన్మనా
మాత్మేత్యాత్మవిదాం క్రతుశ్చ యజతాం భర్తామరజ్యోతిషామ్,
లోకానాం ప్రళయోద్భవస్థితి విభు శ్చానేకధా యః శ్రుతౌ
వాచం నస్సదదాత్వనేక కిరణ స్త్రైలోక్య దీపో రవిః. 1

తాత్పర్యము. శ్రీమత్సూర్యాంశ సంభూతుఁడగు వరాహమిహిరాచార్యుఁడు బృహజ్జాతకం బనెడు హోరాశాస్త్రంబును రచియింపఁబూని, తారచించు గ్రంథంబునకు నెట్టి భంగము కల్గకుండునట్లు లోకత్రయ ప్రకాశుండగు సూర్యుని, "మూర్తిత్వే" అను శ్లోకముచేత నాదియందుఁ బ్రార్థించు చున్నాఁడు. ఎట్లనఁగ:—

"సూర్యో జలం మహీ వాయు ర్వహ్ని రాకాశ మేవచ,
యాయజూకశ్చ సోమశ్చ రుద్రాదీనాంతు మూర్తయః." అను వచనప్రకారము, "మూర్తిత్వే" అనుశ్లోకము చెప్పుటచేత, శివుని యష్టమూర్తులయం దొకమూర్తియై యొప్పుచున్నవాఁడును, పునర్జన్మంబు లేకుండంగోరి పోవు వారికి మార్గంబై యుండువాఁడును,

ఆత్మవేత్తలైన యోగీశ్వరులకు సచ్చిదానంద రూపుఁడై యాత్మ్మయై యొప్పువాఁడును, ఉదిత హోమములైన సోమయాజులకు యజ్ఞస్వరూపుఁడైనవాఁడును, అనేకములైన కిరణములుగల్గి మూఁడు లోకంబులకుఁ బ్రకాశుఁడై, దేవతలకును, గ్రహంబులకును, నక్షత్రంబులకును ప్రభువైన వాఁడును, భూర్భువాది లోకములయొక్క నాశోత్పత్తిస్థితులకుఁ గర్త యైనట్టి వాఁడును, వేదమునందు ననేక ప్రకారంబులుగఁ జెప్పఁబడు వాఁడును, నగుసూర్యుఁడు మాకు వాగ్విభూతి నొసంగుఁ గాత.

మూ. భూయోభిః పటుబుద్ధిభిః పటుధియాం హోరా ఫలజ్ఞప్తయే
శబ్దన్యాయ సమన్వితేషు బహుశ శ్శాస్త్రేషు దృష్టేష్వపి,
హోరా తంత్ర మహార్ణవ ప్రతరణే భగ్నోద్యమానా మహం
స్వల్పం వృత్తవిచిత్ర మర్థ బహుళం శాస్త్రప్లవం ప్రారభే. 2

తా. చతుర ప్రజ్ఞులగు ననేకులు వ్యాకరణ తర్కములతోఁగూడిన శాస్త్రంబులు, పలుమారు చూచుచుండినను, హోరాశాస్త్రమనెడు గొప్పసముద్రము దాఁటుటయందు భగ్నమగునుత్సాహము గల్గిన చతురబుద్ధి గలవారికిఁ బూర్వ ఫల వ్యంజకంబైన హోరాఫలమును దెలిసికొనుటకుఁ బూర్వ శాస్త్రములవలె, అనఁగాఁ బూర్వము యవనేశ్వరుఁడు మున్నగువారు చెప్పిన హోరాశాస్త్రంబులకంటె నేఁజెప్పెడు బృహజ్జాతకమునందు గ్రంథ బాహుళ్యములేక, అర్థబాహుళ్యముతో శార్దూల విక్రీడితాది నానావిధ వృత్తంబులచేత విచిత్రంబుగ బృహజ్జాతక శాస్త్రం బనెడి తెప్పను జేయ నారంభించుచున్నాను.

మూ. హోరే త్యహోరాత్ర వికల్ప మేకే
వాంఛంతి పూర్వాపర వర్ణ లోపాత్,
కర్మార్జితం పూర్వ భవే సదాది
య త్తస్య పంక్తిం సమభి వ్యనక్తిం. 3

తా. హోరాశాస్త్రంబునకుఁ బూర్వజన్మ కర్మజ్ఞానము ఫల
పని అక్షరద్వయ లోపముచేత శబ్ద వ్యుత్పత్తి చేయుచున్నాఁడు.

కొందఱు, అహోరాత్ర జనిత ఫల వికల్పమును, హోరయని చెప్పు చున్నారు. అదెట్లనఁగ:— అహోరాత్ర శబ్దము యొక్క పూర్వ వర్ణమైన 'అ' కారమును, పరవర్ణమైన 'త్ర' కారంబును లోపించు టంజేసి హోరాయని అక్షరద్వయము శేషించు చున్నది. కాఁబట్టి హోరా శబ్దముచేత నహోరాత్ర ఫల వ్యంజకంబైన హోరాశాస్త్రము చెప్పఁబడుచున్నది. ఆ హోరాశాస్త్రమునకుం బ్రయోజన మేమనిన, పూర్వ జన్మమునందు శుభాశుభ మిశ్రరూపమైన యేకర్మాకర్మంబు లార్జింపఁ బడెనో, అట్టి మిశ్రరూపమైన కర్మపాకంబును దెలియఁ జేయుచున్నది.

ఇందుకు లఘుజాతకమునందు:—శ్లో. "య దుపచితమన్య జన్మని శుభాశుభం తస్య జన్మనః ప_క్తిం, వ్యంజయతి శాస్త్రమేత త్తమసి ద్రవ్యాణి దీప ఇవ."

మూ. కాలాంగాని వరాంగ మాననమురో హృత్క్రోడ వాసో భృతో
వ_స్తిర్వ్యంజనమూరు జానుయుగళే జంఘేతతోంఽఘ్రిద్వయమ్,
మేషాశ్వి ప్రథమాన వర్క్ష చరణా శ్చక్ర స్థితా రాశయో
రాశి క్షేత్ర గృహర్క్ష భాని భవనం చైకార్థ సంప్రత్యయాః. 4

తా. హోరాశాస్త్రవ్యవహార సిద్ధంబై, మేషాది రాసుల కుఁగాల పురుషుని శిరస్సు మొదలగు నంగవిభాగమును జెప్పుచు న్నాఁడు. అశ్విన్యాది ౨౭ నక్షత్రములకు నక్షత్ర మొక్కొకటికి నాల్గు పాదము లగుటంజేసి, అశ్విన్యాది కృ_త్తిక ప్రథమ పాదము వఱకుఁ దొమ్మిది పాదంబులై, మేషరాశి యగుచున్నది. ఇదే ప్రకారముగ మేషాది ద్వాదశ రాసు లేర్పడుచున్నవి. కాఁబట్టి (ఆ రాసులయందు కాలపురుషునకు మేషరాశి శిరస్సు, వృషభము ముఖంబు, మిథు నము ఉదరము, కర్కాటకము హృదయము, సింహము కడుపు, కన్య నడుము, తుల నాభి లింగ మధ్యప్రదేశము, వృశ్చికము లింగము, ధనస్సు తొడలు, మకరము మోఁకాళ్లు, కుంభము పిక్కలు, మీనము పాదంబులు.) ఇందుకుఁ బ్రయోజనంబెట్లనః— జన్మ కాలంబునం దుఁ బాపగ్రహాక్రాంత మైనరాశి కాలపురుషునియొక్క యేయం

గమునం దుండునో, ఆయంగంబు నందు నుపఘాతంబును, శుభ గ్రహాక్రాంతరాశి యేయంగమునం దుండునో, ఆయంగంబునకుఁ బుష్టియుఁ గల్గుననియు. ఇందులకు, శ్లో. "కాల నరస్యావయవాన్ పురుషాణాం కల్పయే త్ప్రసవ కాలే, సదసద్గ్రహ సంయోగా త్పుష్టా స్సోపద్రవా శ్చేతి." అను సారావళి శ్లోక ముదాహరణముగ నున్నది. "రాశి క్షేత్ర గృహర్క్ష భానిభవనం" అని చెప్పఁబడి యుండుటచేత, రాశి, క్షేత్రము, గృహము, ఋక్షము, భము, భవనము, ఈ యాఱుశబ్దము లేకార్థజ్ఞాపకరాశీసంజ్ఞ లని తెలియఁ దగినది.

ఉపా. మత్స్యౌ ఘటీ నృ మిథునం సగదం సవీణం
చాపీ నరోశ్వ జఘనో మకరో మృగాస్యః,
తౌలీ ససస్యదహనా ప్లవగాచ కన్యా
శేషా స్స్వనామ సదృశా స్స్వచరాశ్చ సర్వే. 5

తా. రాసుల స్వరూపంబులం జెప్పఁబడినది. ఎట్లన:— అన్యోన్య పుచ్ఛాభిముఖమైన మత్స్యద్వయము మీనరాశి, భుజంబునందు నుత్తకుండను దాల్చినపురుషుండు కుంభరాశి, గదను ధరించిన పురుషుఁడును వీణియ ధరించిన స్త్రీయునుగల ద్వంద్వము మిథునరాశి, గుఱ్ఱపు పిరుదులువంటి పిరుదులు గలిగి విల్లునుదాల్చిన మనుష్యుఁడు ధనుస్సు, మృగము ముఖమువంటి ముఖంబుగలిగిన మొసలివంటిది మకరరాశి, త్రాసును ధరించిన పురుషుఁడు తులారాశి, సస్యమును దీపంబును జేతధరించినదై తెప్పపై నుండెడిది కన్యారాశి, మేకవంటి రూపము గలది మేషము, వృషభాకారము గలది వృషభము, ఎండ్రకాయ వంటి ఆకారము గలది కర్కాటకము, సింగమువంటి రూపముగలది సింహము, తేలువంటి యాకారముగలది వృశ్చికము, ఇట్లు తమ విహార స్థానముల యందు సంచరించునవి. ఇందులకు యవనేశ్వరునిచే వ్రాయఁబడిన శ్లోకంబు లుదాహరించు చున్నాను. [గ్రం.

శ్లో. "ఆద్యోఽస్మృతో మేషసమానమూర్తిః కాలస్యమూర్ధా గదితః పురా సోజా వికాసం చర కందరాద్రిస్తేనాగ్ని ధాత్వాకరరత్నభూమిః. ౧

వృషాకృతిస్తు ప్రథితో ద్వితీయః సవక్త్ర కంఠాయతనం విధాతుః,
వనాద్రిసానుద్విప గోకులానాం కృషీవలానా మధివాస భూమిః. ౨
వీణాగదాభృన్మిథునం తృతీయః ప్రజాపతే స్స్కంధభుజాంస దేశః,
ప్రణర్త కోద్గాయక శిల్పక స్త్రీ క్రీడారతి ర్ద్యూత విహార భూమిః. ౩
కర్కః కుళీరాకృత రంబుసంస్థో వక్షః ప్రదేశో విహితశ్చ ధాతుః,
కేదారవాపీ పులినాని తస్య దేవాంగనా రమ్య విహార భూమిః. ౪
సింహశ్చశైలేహృదయప్రదేశం ప్రజాపతేః పంచమమాహు రార్యాః,
తస్యాటవీ దుర్గ గుహా వనాద్రివ్యాధావనీ దుర్గ వన ప్రదేశః. ౫
ప్రదీపికాం గృహ్య కరేణ కన్యా నౌస్థాజలే షష్ఠ మితి బ్రువంతి,
కలార్థ ధీరా జఠరం విధాతుః సశాద్వల స్త్రీరతి శిల్ప భూమిః. ౬
వీధ్యాం తులా పణ్యధరో మనుష్యః స్థితస్య నాభీ కటివస్తి దేశే,
శుల్కార్థవీధ్యాపణ పత్త నాధ్వసార్థాధివాసోన్నత సస్య భూమిః. ౭
శ్వభ్రేష్టమో వృశ్చిక విగ్రహస్తు ప్రోక్తః ప్రభో ర్మేఢ్రగుదప్రదేశః,
గుహా బిల శ్వభ్ర దివాత్మగుప్తి ర్వల్మీక కీటా జగ రాహిభూమిః.
ధన్వీమనుష్యో హయ పశ్చిమూర్ధ స్తమాహురూరూ భువనప్రణేతుః,
సమస్థిత వ్యస్త సమస్త వాజిశూరాస్త్ర భృద్యజ్ఞ రథాశ్చభూమిః.
మృగార్ధ పూర్వో మకరోంబుచారీ జానుప్రదేశంతము శంతిధాతుః,
నదీ వనారణ్య సరస్యనూపశ్వభ్రాదివాసో దశమః ప్రదిష్టః. ౧౦
స్కంధేతురిక్తః పురుషస్యకుంభో జంఘేత మేకాదశ మాహు రార్యాః,
తస్యోదకాధార కుసస్య పక్షి స్త్రీ శౌండికద్యూత నివాస భూమిః.
జలేతు మీన ద్వయమత్స్యరాశిః కాలస్యపాదౌ విహితౌ వరిష్ఠౌ,
సపుణ్య దేవ ద్విజ తీర్థ భూమిః నదీ సముద్రాంబు ధరాధివాసః.

అనియు; జీవశర్మ,

మేషో మేషాకారో రమతే జలపంక వర్జితే దేశే,
కటు తిక్త విటప భూవక్రా కంటక విష మోన్నతేచ సదా”

అనియుఁ జెప్పియున్నారు. పైఁజెప్పఁబడిన శ్లోకములచేత చోరా ద్యపహృత ద్రవ్యాదు లుండెడు చోట్లెఱుంగ వచ్చు నని తెలియనగు.

మూ. క్షితిజ సిత జ్ఞ చంద్ర రవి సౌమ్య సితావనిజాః
సురగురు మంద సౌరి గురవశ్చ గృహాంశక పాః,
అజ మృగ తౌళి చంద్ర భవనాది నవాంశవిధిః
భవన సమాంశకాధి పతయః స్వగృహా త్క్రమశః. 6

తా. మేషాది ద్వాదశ రాసులకును మేషాది నవాంశలకును, కుజాది గ్రహంబు లధిపతు లగుచున్నారు. క్రమాలంకారం బగు నీశ్లోకము వలన మేష రాశి మొదలు, మీనరాశి వఱకు నంగారకుఁడు మొదలు, గురువు వఱకుం జూచుకొనఁగ, నాయా రాసులకు నాయాగ్రహంబు లధిపతు లగుదురు. మేషమునకు నంగారకుఁడును, వృషభమునకు శుక్రుఁడును, మిథునమునకు బుధుఁడును, కర్కాటకము నకుఁ జంద్రుఁడును, సింహంబునకు సూర్యుఁడును, కన్యకు బుధుఁడును, తులకు శుక్రుఁడును, వృశ్చికంబునకు నంగారకుఁడును, ధనుస్సుకు గురుఁడును, మకరకుంభంబులకు శనియును, మీనంబునకు గురువును, అధిపతులు.

నవాంశములెట్లనఁగ:—

ఒక్కొక రాశిని దొమ్మిది భాగములుచేసి, యేభాగము నకు శిశు జనన సమయ మేర్పడునో, ఆభాగ మేరాశి యగునో, ఆరా శ్యధిపతి యేగ్రహం బగునో, అట్టి గ్రహము నవాంశాధిపతి యని తెలి యఁ దగినది. "అజ మృగ తౌళి చంద్ర భవనాది నవాంశ విధిః" అని యుండుటంజేసి "ఆది నవాంశవిధిః" అనఁగా, ఆదిశబ్దము మేష రాశి కర్థమగుటవలన, మేషము, మకరము, తుల, కర్కాటకము, ఈనా ల్గు రాసులు నవాంశకు మొదటి రాసులు గనుక; శ్లో. "మేషసింహ ధనుషి ష్వజాదయ స్తౌళి కుంభ మిథునే తులాదయః, కన్యకా మృగ

  

వృషే మృగాదయః మీన కర్క్యలిషు కర్కటాదయః" అను శ్లోకము రీతి, మేష సింహ ధనుస్సులకు మేషాదిగను, తులా కుంభ మిథునములకుఁ దులాదిగను, కన్యామకర వృషభంబులకు మకరాదిగను, మీన కర్కట వృశ్చికంబులకుఁ గర్కాటకము మొదలుగను, గణన చేసి నవాంశ లగ్నమును నవాంశాధిపతిని నెఱుంగవలయును. "ఉదాహరణము:— ఒక శిశువు మేషలగ్నమునందు జనింపఁగా, నాలగ్నమునందు జనన కాలమునకు నెన్నిగడియలు చెల్లినవో, మిగతయెన్నిగడియలు నిల్చినవో, లగ్నము తొమ్మిది భాగములు చేయ వలసినప్రకారము జననకాలంబునకు నెన్నవ భాగ మేర్పడునో, అనఁగా మొదటి భాగమైనచో మేష కుజ నవాంశ యనియు, రెండవ భాగమైన వృషభ శుక్రనవాంశ యనియు, మూఁడవ భాగమైన మిథున బుధ నవాంశ యనియు, నాల్గవ భాగమైనచోఁ గటకచంద్ర నవాంశ యనియు, నైదవ భాగమైన సింహరవి నవాంశ యనియు, నాఱవభాగ మైనఁ గన్యాబుధ నవాంశ యనియు, నేడవ భాగమైనఁ దులాశుక్ర నవాంశ యనియు, నెనిమిదవ భాగమైన వృశ్చిక కుజ నవాంశ యనియుఁ, దొమ్మిదవ భాగమైన ధనుర్గురు నవాంశ యనియు తెలియఁ దగినది.

జన్మ లగ్నము వృషభలగ్నమై జననకాలము మొదటి భాగమైనచోఁ, బైఁజెప్పిన శ్లోకము రీతి నవాంశాది రాశి మకరంబగుటం జేసి మకరశని నవాంశ యనియు, రెండవ భాగమునకుఁ గుంభశని నవాంశ యనియు, మూఁడవ భాగమునకు మీనగురు నవాంశ యనియు ని ట్లెఱుంగునది. జన్మలగ్నము మిథునమైన, నందు మొదటిభాగమునకుఁ దులాశుక్ర నవాంశయనియు, రెండవ భాగమునకు వృశ్చిక కుజ నవాంశ యనియు, నిట్లూహింపఁ దగినది. జన్మలగ్నము కర్కటమై మొదటి భాగమైనఁ గర్కాట చంద్ర నవాంశ యనియు, రెండవ భాగమునకు సింహ రవి నవాంశ యనియు, మూఁడవ భాగమునకుఁ గన్యాబుధ నవాంశ యనియు నెఱుంగ వలయును.

గ్రంథాంతరమునందు :—శ్లో. ''మేష కేసరి ధన్వీనాం మేషాద్యా అంశకా స్మృతాః, వృష కన్యా మృగాణాంచ మకరాద్యా

నవస్మృతాః. తులా మిథున కుంభానాం తులాద్యా నవకీర్తితాః, కర్కటాళి ఝుషానాంచ కర్కటాద్యా నవాంశకాః.” అను శ్లోకము రీతి సులభముగ గ్రహింపఁ దగినది. “భవన సమాంశకాధిపత యః” అని పైశ్లోకమున నుండుటంజేసి ద్వాదశాంశాధిపతు లని యెఱుంగ వలయును. అదెట్లనఁగ:—[జన్మలగ్నమును బంద్రెండు భాగములు చేయఁగా, నేభాగము జన్మకాల లగ్నమగునో, లగ్నాదిగ నన్నవ భాగ రాశ్యధిపతియే ద్వాదశాంశాధిపతి యని తెలియఁ దగినది. మేషమునకు మేషాది మీనాంతముగ, వృషభమునకు వృషభాది మేషము వఱకును, మిథునమునకు మిథునాది వృషభము వఱకును, కటకమునకుఁ గటకాది మిథునము వఱకును, సింహాము నకు సింహాది కర్కటకము వఱకును, ఇట్లు ద్వాదశాధిపతుల నెఱుంగ వలయును.]

మూ. కుజ రవిజ గురు జ్ఞ శుక్ర భాగాః
పవన సమీరణ కౌర్పి జూక లేయాః,
అయుజి యుజితు భే విపర్యస్తాః
శశి భవనాళి ఝుషాంత మృక్షసన్ధిః. 7

తా. లగ్నమును ముప్పది భాగములు చేసి, యేభాగమునకు జన్మకాలలగ్నము గూడునో, ఆభాగాధిపతిని త్రింశాంశాధిపతి యని తెలియఁ దగినది. అదెట్లనఁగా:—విషమరాసు లైన మేష మిథున సింహ తులా ధనుః కుంభములయందుఁ బ్రథమమునఁ గుజునకు నైదు భాగములును, పిదప శనైశ్చరున కైదు భాగములును, ఆవల గురువు కెనిమిది భాగములును, తర్వాత బుధుని కేడు భాగములును, పిదప శుక్రుని కైదు భాగములును, సమరాసు లైన వృషభ కర్కట కన్యా వృశ్చిక మకర మీనములయందు, నాదియందు శుక్రున కైదు భాగములును, తర్వాత బుధున కేడు భాగములును, పిదప గురువు కెనిమిది భాగములును, ఆవల శనికి నైదు భాగములును, పిదప నంగారకుని కైదు భాగములును గల్గుటంజేసి యీ భాగాధిపతులు త్రింశాంశాధిపతు లని యెఱుంగ వలయును. అనఁగా శ్లోకప్రకారము

మొట్టమొదట కుజాది శుక్రుని పర్యంతము (కుజ, పవన, ౫, రవిజ=శని, సమీరణ, ౫, గురు, కౌర్పి, ౮, బుధ, జూక, ౭, శుక్ర, లేయ, ౫) భాగములు సవ్యముగఁ జూచుకొనఁ దగినది. తక్కిన సమరాసులకు నపసవ్యముగ, శుక్రుని మొదలు కుజుని వఱకు భాగములు చూచుకొనఁ దగినది.

"శశి భవనాళి ఝషాంత మృత్ష సన్ధిః" అనుట వలనఁ గర్కట రాశ్యంత నవాంశమును, వృశ్చికరాశ్యంత నవాంశమును, మీనాంత నవాంశమును, రాశి సంధులు నక్షత్ర సంధు లని తెలియఁ దగినది. ఎట్లనఁగః— కర్కటకాంతమైన యాశ్లేషాంతమును, వృశ్చికాంతమైన జ్యేష్ఠాంతమును, మీనాంత మైన రేవత్యంతమును, నక్షత్ర సంధులు. ఈ రాశ్యంత నక్షత్రములు గండాంతము లనఁబడును. ఇందులకు నారదీయమునందు, శ్లో. "కుళీర సింహయోః కీట చాపయోర్మీన మేషయోః, గండాంత మంతరాళం స్యా ద్ఘటి కార్ధం మృతిప్రదం" అనియు, శ్లో. "పూషా శ్విన్యో స్సంధా వురగ మఖా జ్యేష్ఠ మూలయో స్సంధౌ, ఘటికా గండా వ్యాప్తౌ చతస్ర ఇహా పరే పఠితాః." అనియుఁ జెప్పఁబడి యున్నది.

మూ. క్రియ తాబురి జితుమ కుళీర లేయ పాథోన జూకకౌర్ప్యాఖ్యాః,
తౌక్షిక ఆకోకేరో హృద్రోగ శ్చాంత్యభం చేత్థమ్. (8)

తా. ఈశ్లోకమున, వ్యవహారార్థముగఁ బండ్రెండు రాసులకు సంకేత నామములు చెప్పఁబడినవి. శ్లోక మెట్లారంభించి వ్రాయఁబడినదో, యట్ల యొక్కొక్క పదమునకు మేషాది ద్వాదశ రాసుల నామము లని యూహింపవలయును. అదెట్లనఁగః—(౧) క్రియ=మేషము, (౨) తాబురి=వృషభము, (౩) జితుమ=మిథునము, (౪) కుళీర=కర్కటకము, (౫) లేయ=సింహము, (౬) పాథోన=కన్య, (౭) జూక=తుల, (౮) కౌర్పి=వృశ్చికము, (౯) తౌక్షిక=ధనుస్సు, (౧౦) ఆకోకేర=మకరము, (౧౧) హృద్రోగ=కుంభము, (౧౨) అంత్యభం=మీనము. అని తెలియఁదగినది.

మూ. ద్రేక్కాణ హోరా నవభాగ సంజ్ఞా
స్త్రింశాంశక ద్వాదశ సంజ్ఞి తాశ్చ,
క్షేత్రంచ యద్యస్య సతస్య వర్గో
హోరేతి లగ్నం భవనస్య చార్ధమ్. 9

తా. లగ్నమును మూఁడు భాగములు చేయఁగా ద్రేక్కాణములనియు, లగ్నమును రెండు భాగములు చేయఁగ హోర లనియు, లగ్నమును దొమ్మిది పాళ్లు చేయఁగ నవాంశ యనియు, లగ్నమును ముప్పది భాగములు చేయఁగఁ త్రింశాంశ లనియు, లగ్నమును బంౘ్రెండు భాగములు చేయఁగ ద్వాదశాంశ లనియు నిట్లు రాశ్యాది షడ్వర్గసంజ్ఞ లని తెలియఁ దగినది. ఏరాశి యేగ్రహంబునకు సంబంధ మగునో, ఆరాశి ఆగ్రహముయొక్క వర్గ మనియర్థము.

గ్రంథాంతరశ్లోకము:—"త్ర్యాద్యేష్వేషు వికల్పేషు గ్రహస్తిష్ఠన్ సవర్గగః, పరవర్గ గతోప్యేవం గ్రహో భవతి నాన్యథా." అనఁగా లగ్నమును, రాశియందు సగమును, హోరయని చెప్పవలయును.

మూ. గోజాశ్వి కర్కి మిథునా స్సమృగా నిశాఖ్యాః
పృష్ఠోదయా వి మిథునాః కథితా స్త ఏవ,
శీర్షోదయా దినబలాశ్చ భవంతి శేషా
లగ్నం సమే త్యుభయతః పృథురోమ యుగ్మమ్. 10

తా. [మేష వృషభ ధను ర్మిథున కటక మకర రాసులు రాత్రి బలరాసు లనియు, ఈరాసులయందు మిథునము తక్క తక్కినవి పృష్ఠోదయ రాసు లనియు, సింహ కన్య తులా వృశ్చిక కుంభ రాసులు పగటి కాల బలరాసు లనియు, ఈ పగటికాల బలరాసులును మిథునమును శీర్షోదయ రాసులనియు, మీనరా శ్యుభయోదయ రాశియనియుం దెలియఁ దగినది. ఈపృష్ఠోదయ శీర్షోదయ రాసుల విషయము ఛప్పన్న గ్రంథమునఁ జూచుకొన వలయును.]

మూ. క్రూర సౌమ్యః పురుష వనితే తేచరాగ ద్విదేహాః
ప్రాగాదీశాః క్రియ వృష నృయు కర్కటాః స్స త్రికోణాః,
మార్తాం డేంద్వో రయుజి సమభే చంద్ర భాన్వోశ్చ హోరే
ద్రేక్కాణా స్స్యు స్స్వభవన సుత త్రిత్రికోణాధిపానామ్. 11

తా. అనఁగా మేషము క్రూరరాశి యనియు, వృషభము సౌమ్యరాశి యనియు, మిథునము క్రూర మనియు, కర్కటకము సౌమ్య మనియు, సింహము క్రూర మనియు, కన్య సౌమ్య మనియు, తుల క్రూర మనియు, వృశ్చికము సౌమ్యమనియు, ధనుస్సు క్రూర మనియు, మకరము సౌమ్యమనియు, కుంభము క్రూర మనియు, మీనము సౌమ్య మనియు నిట్లు విషమరాసు లాఱును, సమ రాసు లాఱును, క్రూర సౌమ్య రాసు లని యెఱుంగ వలయును. ఈరాసుల యందుఁ బుట్టిన వాండ్రు క్రూర సౌమ్య సంజ్ఞలం బట్టి క్రూర సౌమ్య స్వభావము గల్గి యుందు రని వచింప వలయును. ఇందులకు సత్యాచార్యులవారు. శ్లో. "ఓజేషూత్థాః క్రూరా సౌమ్యాః యుగ్మేషు భవ నేషు" అని చెప్పియున్నారు.

మఱియు విషమ రాసులగు మేష మిథున సింహ తులా ధనుః కుంభము లాఱును బురుష రాసు లనియు, నీరాసుల యందుఁ బుట్టిన వారు తేజోవంతు లగు చుందు రనియు, సమరాసు లగు వృషభ కర్కట కన్యా వృశ్చిక మకర మీనము లాఱును స్త్రీరాసు లనియు, నీరాసుల యందుఁ బుట్టిన వారు తేజోహీను లగుదు రనియును, మఱియు, మేష కర్కట తులా మకరములు చరరాసు లనియు, వృషభ కుంభ వృశ్చిక సింహములు స్థిరరాసు లనియు, మిథున కన్యా ధను ర్మీనములు ద్విస్వభావ రాసు లనియు, ఈ చర, స్థిర ద్విస్వభావ రాసులయందు నేరాశియందుఁ బుట్టినను, నారాశి స్వభావము కల్గి యుందు రని తెలియఁ దగినది. ఇందులకు సత్యాచార్యులవారు "రాశి స్వభావ తుల్యా జాయంతే ప్రకృతయః ప్రసూతానామ్" అని వచించి యున్నారు.

దిక్పతు లెట్లనఁగఁ గోణంబు లగు పంచమ నవమ రాసుల తోఁ గూడి, క్రమంబుగఁ దూర్పుదిశ మొదలు, అనఁగా మేష సింహ ధనుస్సులు పూర్వ దిక్పతు లనియును, వృష కన్యా మకరములు దక్షిణ దిక్పతు లనియు, మిథున తులా కుంభములు పశ్చిమ దిక్పతు లనియును, కర్కట వృశ్చిక మీనము లుత్తర దిక్పతు లనియు నెఱుంగ వలయును. ఇదియునుంగాక "అయుజి సమభే చంద్ర భానో శ్చ హోరే" అనఁగ విషమ రాసులకుఁ బ్రథమహోర సూర్య హోర యనియు, ద్వితీయ హోర చంద్రహోర యనియు, సమరాసులకుఁ బ్రథమహోర చంద్రహోర యనియు, ద్వితీయ హోర సూర్యహోర యనియుఁ దెలియఁ దగినది.

ద్రేక్కాణాధిపతులను జెప్పుచున్నాఁడు:— లగ్న పంచమ నవమాధిపతులు క్రమంబుగఁ బ్రథమ ద్వితీయ తృతీయ ద్రేక్కాణములకు నధిపతు లగుదురు. కాఁబట్టి మేషప్రథమ ద్రేక్కాణమునకు మేషరాశ్యధిపతి యగు నంగారకుఁ డధిపతి యనియు, మేష ద్వితీయ ద్రేక్కాణమునకు మేషాదిగ నైదవ రాశి సింహము గనుక సింహరాశ్యధిపతి యగుసూర్యుఁ డధిపతియనియు, మేషతృతీయ ద్రేక్కాణమునకు మేషాదిగఁ దొమ్మిదవ రాశి ధనుస్సు గనుక ధనురధిపతి యగు గురుం డధిపతియనియు, నిట్లు వృషభ ప్రథమ ద్రేక్కాణమునకు శుక్రుం డధిపతి యనియు, వృషభ ద్వితీయ ద్రేక్కాణమునకు బుధుం డధిపతి యనియు, వృషభ తృతీయ ద్రేక్కాణమునకు శన్యధిపతి యనియు నెఱుంగ వలయు. మిథున ప్రథమ ద్రేక్కాణాధిపతి బుధుం డనియును, మిథున ద్వితీయ ద్రేక్కాణాధిపతి శుక్రుం డనియు, మిథున తృతీయ ద్రేక్కాణాధిపతి శని యనియు నెఱుంగఁ దగినది. కర్కట ప్రథమ ద్రేక్కాణమునకుఁ జంద్రుఁ డధిపతి యనియు, కర్కట ద్వితీయ ద్రేక్కాణమునకు నంగారకుఁ డధిపతి యనియు, కర్కట తృతీయ ద్రేక్కాణమునకు గురుఁ డధిపతి యనియు నెఱుంగ వలయును. సింహ ప్రథమ ద్రేక్కాణాధిపతి సూర్యుఁ డనియు, సింహ ద్వితీయ ద్రేక్కాణమునకు గురుం డధిపతి యనియు, సింహ తృతీయ ద్రేక్కాణాధిపతి కుజుఁ డనియుఁ దెలియఁ దగినది.

కన్య ప్రథమ ద్రేక్కాణమునకు బుధుం డధిపతి యనియు, కన్య ద్వితీయ ద్రేక్కాణమునకు శన్యధిపతియును, కన్య తృతీయ ద్రేక్కాణాధిపతి శుక్రుం డనియు నెఱుంగ వలెను. తుల ప్రథమద్రేక్కాణాధిపతి శుక్రుం డనియు, తులా ద్వితీయ ద్రేక్కాణాధిపతి శని యనియును, తుల తృతీయ ద్రేక్కాణాధిపతి బుధుం డనియు నెఱుంగ వలయును. వృశ్చిక ప్రథమ ద్రేక్కాణాధిపతి కుజుం డనియును, వృశ్చిక ద్వితీయ ద్రేక్కాణాధిపతి గురుం డనియు, వృశ్చిక తృతీయ ద్రేక్కాణాధిపతి చంద్రుం డనియుఁ దెలియఁ దగినది. ధనుస్సునకుఁ బ్రథమ ద్రేక్కాణాధిపతి గురుం డనియు, ద్వితీయ ద్రేక్కాణాధిపతి అంగారకుం డనియు, తృతీయ ద్రేక్కాణాధిపతి సూర్యుఁ డనియు నెఱుంగ వలెను. మకర ప్రథమ ద్రేక్కాణాధిపతి శని యనియు, మకర ద్వితీయ ద్రేక్కాణాధిపతి శుక్రుం డనియు, మకర తృతీయ ద్రేక్కాణాధిపతి బుధుం డనియుఁ దెలియఁ దగినది. కుంభ ప్రథమ ద్రేక్కాణాధిపతి శని యనియు, కుంభ ద్వితీయ ద్రేక్కాణాధిపతి బుధుఁ డనియును, కుంభ తృతీయ ద్రేక్కాణాధిపతి శుక్రుఁ డనియు నెఱుంగ వలయును. మీన ప్రథమ ద్రేక్కాణాధిపతి గురుఁ డనియు, ద్వితీయ ద్రేక్కాణాధిపతి చంద్రుఁ డనియు, మీన తృతీయ ద్రేక్కాణాధిపతి కుజుఁ డనియుఁ దెలియ వలయును. స్వద్రేక్కాణము నందున్న గ్రహములు బలవంతు లనియు నాయుర్భావాది బలము లొసంగుదు రనియు, యోగ ప్రదు లనియు నెఱుంగఁ దగినది.

మఱియు మతాంతరమునందు.—

మూ. కేచిత్తు హోరాం ప్రథమాంభపస్య
వాంఛంతి లాభాధిపతే ర్ద్వితీయామ్,
ద్రేక్కాణ సంజ్ఞా మపి వర్ణయంతి
స్వద్వాద శైకాదశ రాశి పానామ్. 12

తా. కొందఱు, అనఁగా యవనాదులు, మేష ప్రథమహోరకు నంగారకుఁడును, మేష ద్వితీయ హోరకు మేషమునకు లాభ స్థానమగు కుంభాధిపతియగు శనైశ్చరుఁడును అధిపతు లని చెప్పుచున్నా రని

యు, నిదేప్రకారము తక్కిన రాసులకుం దెలియఁదగినదనియు, స్వరాశ్యధిపతికిఁ బ్రథమ ద్రేక్కాణ మనియు, ద్వాదశ రాశ్యధిపతికి ద్వితీయ ద్రేక్కాణమును, లాభాధిపతికిఁ దృతీయ ద్రేక్కాణ మనియు నిట్లు ద్రేక్కాణ సంజ్ఞను జెప్పుచున్నారు.

ఇందులకు సత్యాచార్యుల వారును.— "ఆద్యాచ హోరా భవన స్వపత్యు రేకాదశక్షేత్రపతే ర్ద్వితీయా, స్వద్వాద శైకాదశ రాశి పానాం ద్రేక్కాణ సంజ్ఞాః క్రమశో త్ర చోక్తాః." అని వచించి యుండినను, వరాహమిహిరాచార్యులీహోరా ద్రేక్కాణములు సరిగావని సమ్మతింప లేదని చెప్పుదురు.

శ్లో॥ అజ వృషభ మృగాంగనా కుళీరా
ఝష వణిజౌ చ దివాకరాది తుంగాః,
దశ శిఖి మను యుక్తి థీం ద్రియాంశై
స్త్రి నవక వింశతిభిశ్చ తేస్త నీచాః. 13

తా. ఈశ్లోకమున నుచ్చ నీచాది సంజ్ఞలు చెప్పఁబడినవి. మేషము రవికిని, వృషభము చంద్రునకును, మకరము కుజునకును, కన్య బుధునకును, కర్కటకము గురువునకును, మీనము శుక్రునకును, తుల శనైశ్చరునకు నుచ్చరాసు లని తెలియఁ దగినది. ఈయుచ్చరాసుల యందుఁ బరమోచ్చములు చెప్పఁబడినవి. ఎట్లన. [మేషమునందు రవికి-౧౦-భాగములు పరమోచ్చము. చంద్రునకు వృషభమునందు 3-భాగములు పరమోచ్చము. కుజునకు మకరమునందు-౨౮-భాగములు పరమోచ్చము. బుధునకుఁ గన్యయందు ౧౫-భాగములు పరమోచ్చము. గురువునకుఁ గర్కటకమునందు-౫-భాగములు పరమోచ్చము. శుక్రునకు మీనము నందు-౨౭-భాగములు పరమోచ్చము. శనికిఁ దులయందు-౨౦-భాగములు పరమోచ్చము.] ఈపరమోచ్చ స్థానములు గల గ్రహములకు షష్ఠాష్ట ద్వాదశ లాభస్థానాధిపత్య దోషములు రాకుండినపక్షమున నుత్తమ ఫలము లిత్తు రని తెలియఁ దగినది.

ఇందులకు గార్గి.—"సూచ్చగా రలి శీతాంశూ జనయే తాం నరాధిపం, ఉచ్ఛస్థా ధనిసంఖ్యాతం స్వత్రికోణ గతావపి" అనిచెప్పి యున్నారు. ఈ యుచ్ఛస్థానములకు నేడవ రాసులు నీచ స్థానము లనియు, నదెట్లనఁగ:—సూర్యునకు మేషరాశ్యుచ్ఛము గనుక, ఆమేషరాశికి నేడవరాశి తుల యగుటంజేసి సూర్యునకుఁ దులా రాశి నీచ మనియు, వృషభము చంద్రునకు నుచ్ఛ యగుటంజేసి, ఆవృషభమునకు నేడవరాశి వృశ్చికము గనుక, ఆవృశ్చికము చంద్రునకు నీచ మనియు నిట్లుక్రమంబుగ నెఱుంగ వలయును. పరమోచ్ఛ భాగము లెట్లు చెప్పఁ బడినవో, యట్ల రవికిఁ దులారాశియందు -౧౦- భాగములు పరమనీచము, చంద్రునకు వృశ్చికమునందు-౩- భాగములు పరమ నీచము, కుజునకుఁ గర్కాటమునందు-౨౮-భాగములు పరమనీచము, బుధునకు మీనమునందు-౧౫-భాగములు పరమ నీచము, మకరమునందు గురువుకు-౫-భాగములు పరమనీచము, శుక్రునకుఁ గన్యయందు -౨౭- భాగములు పరమనీచము, శనికి మేషమునందు -౨౦- భాగములు పరమనీచము.

ఇందులకు ఫలము గార్గి.—"అంధం దిగంబరం మూర్ఖం పర పిండోప జీవనం, కురుతా మతి నీచస్థా పురుషం శశి భాస్కరౌ." అనఁగా నీచ స్థానముల యందు గ్రహములు పరమనీచను బొంది పాపాక్రాంతులై యుండిరేని, గార్గిచేఁ జెప్పఁబడిన శ్లోకప్రకారము, గ్రుడ్డి-కుంటి-మూర్ఖత-ఇత్యాది లక్షణములతో జాతకు లుందు రని యర్థము." "దశ శిఖి మనుయుక్," అను సంఖ్యాపదంబులకు నర్థములు. దశ= ౧౦, శిఖి=౩, మనుయుక్=౨౮, తిథి=౧౫, ఇంద్రియ=౫, త్రిణవక= ౨౭, వింశతిభిః=౨౦ అని తెలియఁ దగినది.

వర్గోత్తమా శ్చరగృహాదిషు పూర్వ మధ్య
పర్యంతగా శ్శుభ ఫలా నవభాగ సంజ్ఞాః,
సింహో వృషః ప్రథమ షష్ఠ హయాఙ్గతౌళి
కుంభా స్త్రికోణ భవనాని భవంతి సూర్యాత్. 14

తా. అనఁగా చర రాసు లైన మేష కర్కాట తులా మకరముల యందుఁ బ్రథమ నవాంశ వర్గోత్త మాంశయనియు, స్థిరరాసులైన వృషభ సింహ వృశ్చిక కుంభముల యందు మధ్యమనవాంశమైన నైదవ నవాంశ, వర్గోత్త మాంశ యనియు, ద్విస్స్వభావ రాసులైన మిథునకన్యా ధనుర్మీనముల యందు నంత్య నవాంశ మైన తొమ్మిదవ నవాంశ వర్గోత్తమాంశ యనియు, ఈవర్గోత్త మాంశముల యందు జాతకునకు శుభ ఫలము జరుగు నని యర్థము. మఱియు, సూర్యునకు సింహారాశియును, చంద్రునకు వృషభమును, కుజునకు మేషమును, గురువుకు ధనుస్సును, బుధునకు గన్యయును, శుక్రునకుఁ దులయును, శనికిఁ గుంభమును, మూల త్రికోణములును స్వక్షేత్రోచ్చ రాసులును నగుచున్నవి. ఈవిషయము లఘు జాతకము నందొక విధముగఁ జెప్పఁబడియున్నది. అదెట్లనఁగ.—“ఉచ్చంభాగ త్రితయం వృషఇందోస్స్వత్రికోణ మపరేంశాః, జూకే దశ త్రికోణం వింశతి భాగాః కవేః క్షేత్రం.” అనఁగాఁ జంద్రునకు వృషభము నందు మొదట ౩-భాగము లుచ్చ మనియు, మిగత ౨౭-భాగములు త్రికోణమనియు, శుక్రునకుఁ దులయందు ౧౦ - భాగములు త్రికోణ మనియు, తక్కిన ౨౦ - భాగములు, స్వక్షేత్ర మనియు, “ వింశతి రంశా స్సింహే త్రికోణ మపరే స్వభవన మర్కస్య, కుంభే స్వభం త్రికోణం రవిజస్య రవే ర్యథా సింహే. ” అనఁగా రవికి సింహా రాశియందు ౨౦ - భాగములు త్రికోణ మనియు, మిగత ౧౦ - భాగములు స్వక్షేత్ర మనియు, శనికిఁ గుంభ రాశియందు ౨౦ - భాగములు త్రికోణ మనియు, మిగత ౧౦ - భాగములు స్వక్షేత్ర మనియు, “ మేషే ష్టాదశ భాగా స్త్రికోణ మపరే స్వభవన మార్యస్య, ధనుషి త్రయోదశ శాంశా స్త్రికోణభవనంగురోస్స్వభం శేషాః.” అనఁగాఁ గుజునకు మేషరాశి యందు ౧౮-భాగములు త్రికోణ మనియు, మిగత ౧౨ భాగములు స్వక్షేత్ర మనియు, గురువుకు ధనుస్సున ౧౩ - భాగములు త్రికోణ మనియు, మిగత ౧౭-భాగములు స్వక్షేత్ర మనియు, “కన్యాయా ముచ్చస్స్యా త్తిథిభిః పరైస్త్రికోణ సంజ్ఞాచ, వింశతి భాగా దూర్ధ్వం క్షేత్రం త్రివిధం హి విజ్ఞేయమ్.” అనఁగా బుధునకుఁ గన్యయందు-౧౫-భాగము లుచ్ఛమని

యు, మిగత ౫-భాగములు త్రికోణమనియుఁ, దక్కిన ౧౦-భాగములు స్వక్షేత్ర మనియుఁ జెప్పఁబడి యున్నది. మఱియుఁ గొందఱి మత భేదములు వేఱుగ నున్నవి. అవి యిందు వివరించెదను. సారావళి యందు:—"శ్లో. ద్వాదశభాగా మేషే త్రికోణ మపరే స్వభవన మార్యస్య, దశభాగా జీవస్య త్రికోణ మపరే స్వభం చాపే, శుక్రస్యైవం త్రికోణం తిథయో జూకే పరే స్వరాశిశ్చ." అనఁగా మేషము నందు నంగారకునకు ౧౨-భాగములు త్రికోణ మనియు, మిగత ౧౮-భాగములు స్వక్షేత్ర మనియు, ధనుస్సునందు గురువుకు ౧౦-భాగములు త్రికోణమనియు, మిగత ౨౦-భాగములు స్వక్షేత్ర మనియు, శుక్రునకుఁ దులయందు ౧౫-భాగములు త్రికోణ మనియు, మిగత ౧౫-భాగములు స్వక్షేత్ర మనియు చెప్పఁబడినది. శుక్రునకుమాత్ర మొక గ్రంథమున, "సింహే వింశతి రాదితో గవిపరే సర్వేంశకా స్తుంగతో మేషే ద్వాదశ పంచ యోషితి పరే తుంగా ద్ధయాంగే దశ, జూకే పంచ ఘటేతు వింశతి రమీ మూల త్రికోణా హ్వయా స్స్వార్యాదేః క్రమతో గ్రహాస్యకథితా శ్చైషా స్స్వరాశ్యంశకాః." అనఁగా శుక్రునకుఁ దులయందు ౫-భాగములు మాత్రము మూలత్రికోణ మనియు, మిగత ౨౫-భాగములు స్వక్షేత్రమనియు నిట్లు మాధవ వచన మొండు గానఁబడు చున్నయది. స్వక్షేత్ర మూల త్రికోణోచ్చ రాసులయందు గ్రహములు దోష రహితులై శుభగ్రహ సమాయుక్తులై యుండిరేని వారి దశా భుక్తులయందుఁ గాని ఇతర గ్రహదశలయందుఁ గాని విశేష శుభ ఫల మిచ్చుచున్నా రనియు, జాతకమునకు నిరంతర శుభదాయకులై యుందురనియుఁ దెలియఁ దగినది.

హోరోదయ స్తను కుటుంబ సహోత్థ బంధు
పుత్రారి పత్ని మరణాని శుభాస్పదాయాః,
రిష్ఫాఖ్య మిత్యుపచ యా న్యరి కర్మ లాభ
దుశ్చిక్య సంజ్ఞత గృహాణి ననిత్య మేకే. 15

తా. అనఁగా లగ్నాది ద్వాదశ రాసులకుఁ దన్వాది భావసంజ్ఞలు జెప్పఁ బడినవి. (౧) లగ్నమునకుఁ దనుస్థాన మనియు, (౨) ద్వితీ

యమునకుఁ గుటుంబ స్థాన మనియు, (3) తృతీయమునకు భ్రాతృస్థాన మనియు, (౪) చతుర్థమునకు బంధు మాతృ స్థానము లనియు, (౫) పంచమమునకుఁ బుత్రస్థాన మనియు, (౬) షష్ఠమునకు శత్రుస్థాన మనియు, (౭) సప్తమమునకుఁ గళత్రస్థాన మనియు, (౮) అష్టమమునకు మరణస్థాన మనియు, (౯) నవమమునకు శుభ భాగ్య స్థానమనియు, (౧౦) దశమమునకు నాస్పద మాన స్థాన మనియు, (౧౧) ఏకాదశము నకు నాయ లాభ స్థాన మనియు, (౧౨) ద్వాదశమునకు రిష్ఫ స్థాన మనియు నిట్లు లగ్నాదు లగు తన్వాది రాసులకుఁ బర్యాయ పదము లని తెలియఁ దగినది. ఈస్థానములకు మఱియు ననేక పర్యాయ పద ములు నిఘంటువులందు చూచుకొనఁ దగినది. మఱియు, ౬-౧౦-౧౧-3 స్థానము లుపచయము లనియు, ౧-౨-౪-౫-౭-౮-౯-౧౨-స్థానము లపచయము లనియుం దెలియఁ దగినది.

కల్య స్వ విక్రమ గృహ ప్రతిభా క్షతాని
చిత్తోత్థ రంధ్ర గురు మాన భవ వ్యయాని,
లగ్నా చ్చతుర్థ నిధనే చతురశ్ర సంజ్ఞే
ద్యూనంచ సప్తమ గృహం దశమర్క్ష మాజ్ఞా. 16

తా. లగ్నాది ద్వాదశ భావములకు మఱి కొన్ని సంజ్ఞలు చెప్పఁ బడినవి. అది యెట్లన—లగ్నమునకుఁ గల్య మనియు, ద్వితీయమునకు స్వమనియు, తృతీయమునకు విక్రమ మనియు, చతుర్థమునకు గృహ మనియు, పంచమమునకుఁ బ్రతిభ యనియు, షష్ఠమునకు క్షతమనియు, సప్తమమునకుఁ జిత్తోత్థ మనియు, అష్టమమునకు రంధ్ర మనియు, నవ మమునకు గురు వనియు, దశమమునకు మాన మనియు, ఏకాదశము నకు భవ మనియు, ద్వాదశమునకు వ్యయ మనియు, లగ్నము మొదలు కొని చతుర్థాష్టమములకుఁ జతురశ్రము లనియు, సప్తమమునకు ద్యూన మనియు, దశమమునకు నాజ్ఞా యనియు, నాయా స్థానము లకు వ్యవహార నామము లని తెలియఁ దగినది.

కంటక కేంద్ర చతుష్టయ సంజ్ఞా
స్సప్తమ లగ్న చతుర్థ ఖభానాం,

తేషు యథాభిహితేషు బలాఢ్యాః
కీట నరాంబు చరాః పశవశ్చ. 17

తా. లగ్న చతుర్థ సప్తమదశమ స్థానములకు కంటకంబులనియు, కేంద్రము లనియు, చతుష్టయములనియుఁ ద్రివిధసంజ్ఞలు గలవు. ఈ చెప్పఁబడిన సప్తమ (౭) లగ్న (౧) చతుర్థ (౪) దశమ (౧౦) రాసులు క్రమముగా కీట, నర, అంబుచర, పశువులైనయెడ బలాఢ్యములగును. ఎట్లనఁగ—కీటక రాశియైన వృశ్చికము సప్తమ స్థానమునందును, నర రాసులైన మిథున కన్యా తులా ధనుః పూర్వార్థకుంభములు లగ్నము నందును, జలచర రాసులైన కర్కాట మకరోత్తరార్థ మీనములు చతుర్థ స్థానమునందును, పశురాసులైన మేష వృష సింహ ధను రపరార్థ మకర పూర్వార్థములు దశమ స్థానమునందును బలాఢ్యములు. ఇందులకు గార్గి:—"నృయుక్తులా ఘటా కన్యా పూర్వార్థం చైవ ధన్వినః, లగ్నస్థా బలినో నిత్యమేతేహి నర రాశయః, చతుర్థే కర్కాటో మీనో మకరార్థంచ పశ్చిమం, విజ్ఞేయా బలినో నిత్యమేతేహి జలరాశయః, సప్తమేవృశ్చికఃకీటో బలవాన్ పరికీర్తితః, ధన్వ్యంతార్థాజగో సింహో బలినస్స్వ చతుష్పదాః" అని చెప్పఁబడినది.

కేంద్రాత్పరం పణఫరం పరతస్తు సర్వ
మాపోక్లిమం హిబుక మంబు సుఖంచ వేశ్మ,
జామిత్ర మస్త భవనం సుతభం త్రికోణం
మేషూరణం దశమ మత్రచ కర్మ విద్యాత్. 18

తా. కేంద్రంబులకుఁ బరంబగు రాశి పణఫర మనఁబడును. ఆ రాశికి మీఁదటి రాశి ఆపోక్లిమ మనఁబడును. అనఁగా—౨-౫-౮-౧౧-ఈస్థానములకుఁ బణఫరము లనియు-౩-౬-౯-౧౨-ఈరాసులకు నాపోక్లిమము లనియు, చతుర్థ భావమునకు, హిబుకం, అంబు, సుఖం, వేశ్మ అని పేళ్లును, సప్తమ భావమునకు జామిత్రం, అస్తభవన మనియు, పంచమ భావమునకు సుతభం, త్రికోణ మనియును, దశమమునకు, మేషూరణం, కర్మ మనియుఁ బేళ్లు గలవని తెలియఁ దగినది.

హోరాస్వామి గురుజ్ఞ వీక్షిత యుతా నాన్యైశ్చ వీర్యోత్కటా
కేంద్రస్థా ద్విపదాద యోహ్ని నిశిచ ప్రాప్తేచ సంధ్యాద్వయే,
పూర్వార్థే విషయాదయః కృతగుణా మానం ప్రతీపంచత
ద్దుశ్చిక్యం సహజం తపశ్చ నవమంత్ర్యాద్యం త్రికోణంచ తత్ .19

తా. లగ్నాధిపతిచే నైనను, గురు బుధులచే నైనను, వీక్షింపఁబడి గాని కూడుకొనినఁ గాని, తక్కిన గ్రహములచేతఁ జూడఁబడక కూడక యుండినచో లగ్నము బలాధిక మగుచున్నది. లగ్నాధిపగురు బుధులచేతఁ జూడఁబడుచు నితర గ్రహములతోఁ గూడినను, ఆలగ్నము మధ్యమ బలయుతం బైయుండును. మఱియు లగ్నాధిప గురు బుధ వీక్షణము లేక, యితర గ్రహముల వీక్షణము కల్గియుండినచో నాలగ్నము దుర్బలమై యుండును. ఇందులకు బాదరాయణ వచనములు. "జీవ స్వనాథ శశిజై ర్యుక్తా దృష్టా బలవతీ భవతి శేషై ర్బల హీనా స్యా దేవం మిశ్రైస్తు మధ్య బలా బలహీనా యది సర్వై ర్నవీక్షితా నైవ యుక్తావా. కేంద్ర స్థాతిబలాస్స్యు ర్మధ్య బలాః పణఫ రాశ్రితా జ్ఞేయాః ఆపోక్లిమ గాస్సర్వే హీనబలా రాశయః కథితాః." అనఁగా, కేంద్రస్థాన గతగ్రహములు బలాధికు లనియు, పణఫరముల యందుండు గ్రహములు మధ్యమ బలులనియు, ఆపోక్లిమముల యందుండు గ్రహములు బలహీను లనియు, నివ్విధమునఁ బగలు ద్విపద రాసులును, రాత్రియందుఁ జతుష్పద రాసులును సంధ్యా ద్వయమున గీటరాశి యైన వృశ్చికంబును జలచర రాసులును బలాఢ్యము లైనవి. 'పూర్వార్థే' అనఁగాఁ జక్ర పూర్వార్ధ మైన మేషాదిషట్కమునందు-౫-౬-౭-౮-౯-౧౦-ఈసంఖ్యలు నాలుగింట గుణింపఁబడినవై, మేషాది రాశి షట్కము యొక్క హ్రస్వ దీర్ఘ ప్రమాణ మగుచున్నది. అదెట్లనఁగా:- మేషమునకు-౨౦-వృషభమునకు-౨౪-మిథునమునకు-౨౮-కర్కాటమునకు-3౨-సింహమునకు-3౬-కన్యకు-౪౦- ఈ సంఖ్యలను బదింట గుణించఁగ విఘడియ లగును. ఆమేషాదులకుఁ జెప్పఁబడిన సంఖ్యాషట్కము వ్యత్యస్త మైనదై తులాది మీనాంతరాసులకు విఘడియ లగును. ఇట్లు గుణింపఁగ నేర్పడిన విఘడియలు మీన మేషములకు-౨౦౦-

వృషభ కుంభములకు-౨౪౦-మకర మిథునములకు-౨౮౦-ధనుః కర్కాటములకు-౩౨౦-సింహ వృశ్చికములకు-౩౬౦-తులా కన్యలకు - ౪౦౦- ఈసంఖ్యను-౬౦-తోఁ భాగించిన యెడల గడియలగును. ఇందులకుఁ బ్రయోజన మేమనినః—'కాదివిలగ్న విభక్త భగాత్రః' అని యుండుటజేసి కాలపురుషుని యొక్క అంగము నందు లగ్నము మొదలుకొని యెంచఁగ, దీర్ఘ రాశి యుండిన నంగము దీర్ఘమై యుండును. హ్రస్వరాశి యుండిన నంగము హ్రస్వ మగును. సమరాశి యుండిన నంగము సమము నగునని యర్థము. చోరప్రశ్న యందుఁ గూడఁ జోరుఁడు పోయిన మార్గము దెలియుటకు నుపయోగ మనియుఁ దెలియఁ దగినది. ఇందులకు యవనేశ్వరుని వచనము. "ఏవం ప్రమాణాని గృహాణి బుధ్వా హ్రస్వాని మధ్యాని తథాయతాని, చక్రాంగభేదై స్సదృశీకృతాని మార్గ ప్రమాణాని వికల్పయంతి." అని చెప్పియున్నాఁడు.

రక్త శ్శ్వేత శ్శుకతను నిభః పాటలో ధూమ్ర పాండు
శ్చిత్రః కృష్ణః కనక సదృశః పింగళః కర్బురశ్చ,
బభ్రు స్స్వచ్ఛః ప్రథమ భవనా ద్యేషు వర్ణాః ప్లవత్వం
స్వేశా శాఖ్యం దినకర యుతా ద్బాద్ద్వితీయంచ వేశిః. 20

తా. మేషాది రాసుల వర్ణములు జెప్పఁబడినవి. ఈ శ్లోకమును క్రమముగా మేషాది రాసులకు నన్వయించుకొనిన పక్షమున నర్థము సులభముగ నగుచున్నది. ఎట్లనఁగ—మేషము రక్తవర్ణ మనియు, వృషభము శ్వేత వర్ణమనియు, మిథునము శుక వర్ణమనియు, (అనఁగా ఆకుపచ్చ వన్నెగలది.) కర్కాటము పాటల వర్ణమనియు, (అనఁగా శ్వేత రక్తవర్ణము.) సింహము ధూమ్ర పాండు వర్ణమనియు, (అనఁగాఁ బొగ వన్నెతోఁ గూడిన తెల్పువన్నె గలది.) కన్య చిత్రవర్ణమనియు, తుల నీలవర్ణ మనియు, వృశ్చికము బంగరువంటి వన్నె గలదనియు, ధనుస్సు కపిలవర్ణము గలదనియు, మకరము శుక్ల కపిల వర్ణ మిశ్ర మనియు, కుంభము నల్పుతోఁ గూడిన తెల్పువన్నె గలదనియు, మీనము స్వచ్ఛ వర్ణమనియుఁ దెలియఁ దగినది. మఱియు నేరాశ్యధిపతికి నేదిక్కు చె[illegible]దో యారాశికి నాదిక్కునఁ బ్లవసంజ్ఞ యని యర్థము.

అదెట్లనఁగ—మేషవృశ్చికములకుఁ గుజుం డధిపతి యనియు, నాకుజు నకు దిక్కు దక్షిణము-ఆదక్షిణమునందు మేష వృశ్చికములు ప్లవసంజ్ఞ లనియు, వృషభ తులలకు శుక్రుం డధిపతి యనియు, శుక్రుని దిక్కయిన ఆగ్నేయమునందు వృషభ తులలు ప్లవసంజ్ఞ లనియు, మిథున కన్యలకు బుధుఁ డధిపతి యనియు, ఆబుధుని దిక్కు ఉత్తరంబు గనుక అందు మిథున కన్యలకుఁ బ్లవసంజ్ఞ లనియు, కర్కటమునకుఁ జంద్రుం డధిపతి, దిక్కు వాయవ్యము, అందుఁ గర్కటకము ప్లవ సంజ్ఞ గలదియు, ధను ర్మీనంబులకు గురుం డధిపతి, దిక్కు ఈశాన్యములందు ధను ర్మీనము లకుఁ బ్లవసంజ్ఞ లనియు, మకర కుంభములకు శన్యధిపతి యనియు నాశనికి దిక్కు పశ్చిమమనియు, నందు మకర కుంభములకుఁ బ్లవత్వ మనియు, నెఱుంగఁ దగినది. ఈ ప్లవత్వము వలనఁ బ్రయోజన మేమ నిన. హృత నష్టాది ప్రశ్నల యందుఁ బ్లవత్వ యుతరాశిదిగ్గమన చో రాదులకుఁ జెప్పఁ దగినది. మఱియు సూర్యునితోఁ గూడిన రాశికంటె రెండవ రాశికి వేశియని పేరుగలదు. ఈసంజ్ఞాధ్యాయమునందుఁ జెప్పఁ బడిన సంజ్ఞలు రెండు విధములు.అందు సంజ్ఞా మాత్ర ప్రయోజనములు, సంజ్ఞానురూప ఫల నిర్దేశ ప్రయోజనములు. (౧) సంజ్ఞా మాత్రప్రయో జనము లెవ్వియనిన—లగ్నమునకు హోర యనియు, తృతీయమునకు దుశ్చిక్య మనియు చతుర్థమునకు హిబుక మనియుఁ, బంచమమునకు త్రికోణ మనియు సప్తమమునకు ద్యూన మనియు, నవమమునకుఁ ద్రికోణ మనియు, దశమమునకు మేషూరణ మనియు, ద్వాదశమునకు రిష్ఫ మనియుఁ,జతుర్థాష్టమములకుఁ జతురస్ర మనియు, ద్వితీయ పంచ మాష్ట మైకాదశములకుఁ బణఫర సంజ్ఞ లనియు, లగ్న చతుర్థ సప్త మ దశమములకు కంటకము, కేంద్రము, చతుష్టము అను సంజ్ఞలు గలవనియుఁ దృతీయ షష్ఠ నవమ ద్వాదశములకు నాపోక్లిమ సంజ్ఞ లనియు, నిట్లు సంజ్ఞా మాత్రప్రయోజనములు తెలియఁ దగినవి. (౨) సంజ్ఞానురూప ఫల నిర్దేశ ప్రయోజనము లెవ్వియన—లగ్నమునకుఁ దను వనియుఁ, గల్య మనియు నామములు గావున నాలగ్నమును బట్టి శరీరాయురారోగ్యముల నెఱుంగ వలయును. ద్వితీయమునకుఁ గుటుం బము, స్వము, అను నామములు గావున నాద్వితీయమును ధనములకు-౨౦౦-

ధన విషయముల నెఱుంగ వలయును. తృతీయమునకు సహజము, విక్రమము అనుపేళ్లు గనుక తద్బలాబలములం బట్టి భ్రాతలను బరాక్రమమును పరిశీలింప వలయును. చతుర్థమునకు, బంధు, వేశ్మ, సుఖ, సంజ్ఞలు గలవు గనుక ఆచతుర్థమునుబట్టి యాయా విషయముల నెఱుంగ వలయును. పంచమమునకుఁ బుద్ధి, పుత్త్రి, సంజ్ఞలు గలవు గనుక ఆసంజ్ఞా విషయములం బరిశీలింపఁదగినది. షష్ఠమునకు వ్రణ, శత్రు, రోగసంజ్ఞ లుండుటంజేసి యాభావములం జూచుకొనవలయు. సప్తమమునకు, జామిత్ర, కామ, భార్య, సంజ్ఞ లుండుటచేత నాభావములఁ జూడవలయును. అష్టమమునకు, మరణ, రంధ్రి, సంజ్ఞలు గలవుగావున, 'రంధ్రిమనఁగా పాపము' ఆయా భావముల నన్వేషింపఁ దగినది. నవమమునకు, శుభ, గురు, సుకృతము, తపము, అను నామములు గలవు గనుక, శుభ మనఁగా ధర్మము. గురువనఁగా మాతా పిత్రాదులు, సుకృత మనఁగాఁ బుణ్యము, తప మనఁగా వ్రతాదులు. ఇవి దెలిసికొన వలయును. దశమమునకు నాస్పదము, కర్మము, ఆజ్ఞ, అను నామము లుండుటంజేసి ఆవిషయము లూహింప వలయును. ఏకాదశమునకు, భవము, ఆయము, అని పేళ్లుండుటంబట్టి, భవ మనఁగా, విద్యా గుణ సంప త్ప్రాప్తి; ఆయ మనఁగా నర్థము. కాఁబట్టి యీవిషయము లెఱుంగ వలయును. ద్వాదశమునకు, వ్యయ మని యుండుటంజేసి వ్యయమును జూడఁ దగినది. ౩-౬-౧౦-౧౧-ఈరాసులకు నుపచయమని సంజ్ఞ. ఉపచయ మనఁగా నభివృద్ధి. కనుక ఆ యభివృద్ధిని విచారింపఁ దగినది.

ఇట్లు బృహజ్జాతకగ్రంథమునందుఁ బ్రథమాధ్యాయ మగు సంజ్ఞాధ్యాయము సంపూర్ణము.

---

శ్రీ ర స్తు.

# బృ హ జ్జా త క ము

## గ్రహయోని భేదాధ్యాయము.

మూ. కాలాత్మా దినకృ న్మన స్తుహినగు స్సత్వం కుజో జ్ఞోవచో
జీవో జ్ఞాన సుఖే సితశ్చ మదనో దుఃఖం దినేశాత్మజః,
రాజా నౌ రవి శీతగూ క్షితిసుతో నేతా కుమారో బుధః
సూరి ర్దానవపూజితశ్చ సచివౌ ప్రేష్య స్సహస్రాంశుజః. 1

ప్రథమాధ్యాయము నందుఁ గాలాంగాని వరాంగ మనెడు శ్లోకము చేతఁ గాలపురుషునకు రాశి నక్షత్ర మయ మైన యంగ విభాగము విశదీకరింపఁబడి యుండుటంజేసి యిపుడు తద్రా శ్యధిపతు లైన గ్రహములును,కాలపురుషునకు నాత్మాదు లనియును, జగత్పాల కు లగు రాజాదులు గ్రహమయు లనియును, జెప్పుచున్నాఁడు.

ఎట్లనఁగః—కాలపురుషునకు సూర్యుఁ డాత్మ యనియును, చంద్రుఁడు మన స్సనియును, కుజుఁడు బలమనియును బుధుఁడు వాక్కని యును, గురువు జ్ఞాన సుఖము లనియు శుక్రుఁడు మదనుం డనియు, శని దుఃఖమనియు నిట్లు కాలపురుషునకుఁజెప్పుట వలన, సకల జగత్తునకుం జెప్పిన ట్లయ్యెఁ గనుక జన్మకాలము నందుఁ గాలపురుషునకు నాత్మా దులుగఁ జెప్పఁబడిన గ్రహములు బలవంతులై యుండిరేని జాతకునకు నాత్మాదులు బలవంతములగును, బలహీనులై యుండిరేని జాతకునకు నాత్మాదులు బలహీనములై యుండును. మఱియు సూర్య చంద్రులు రాజులు, అంగారకుఁడు సేనానాయకుఁడు, బుధుఁడు యువరాజు, గురు శుక్రులు మంత్రులు, శనైశ్చరుఁడు సేవకుఁడు, కాఁబట్టి జన్మ కాల మునందుఁగాని ప్రశ్నకాలము నందుఁ గాని రాజాదు లైన, సూర్యా దులు బలవంతులైయుండిరేని తమతమసంజ్ఞకుఁ దగినట్లు కార్యసాధకు

లగుదురు. బలహీనులై యుండిరేని కార్య విఘ్నాయత్తు లగుదురని తెలియఁ దగినది.

హేళి స్సూర్య శ్చంద్రమా శ్శీతరశ్మి
ర్హేమ్నో విడ్ జ్ఞో బోధన శ్చేందుపుత్రః,
ఆరో వక్రః క్రూరదృ క్చావనేయః
కోణో మందః సూర్యపుత్రో౽సితశ్చ. 2

తా. లోక వ్యవహారార్థమై రెండు శ్లోకములచేత నవగ్రహ పర్యాయ నామములు చెప్పఁబడినవి. ఎవ్వియనఁగ—సూర్యునకు, హేళిః, సూర్యః, అనుపేళ్లును; చంద్రునకు, చంద్రమాః, శీతరశ్మిః, అనుపేళ్లును; బుధునకు, హేమ్నః, విట్, జ్ఞః, బోధనః, ఇందుపుత్రః, అనుపేళ్లును; అంగారకునకు, ఆరః, వక్రః, క్రూరదృక్, ఆవనేయః, అనుపేళ్లును; శనికి, మందః, కోణః, సూర్యపుత్రః, అసితః, అనుపేళ్లును గల వని తెలియఁ దగినది.

జీవో౽ంగిరా స్సురగురు ర్వచసాంపతీ జ్యో
శ్శుక్రో భృగు ర్భృగుసుత స్సిత ఆస్ఫుజిచ్చ,
రాహు స్తమో౽గు రసురశ్చ శిఖీతి కేతుః
పర్యాయ మన్య ముపలభ్య వదే చ్చలోకాత్. 3

తా. అనఁగా గురువునకు, జీవః, అంగిరాః, సురగురుః, వచసాంపతిః, ఇజ్యః, అనుపేళ్లును; శుక్రునకు, శుక్రః, భృగుః, భృగుసుతః, సితః, ఆస్ఫుజిత్, అనుపేళ్లును; రాహువునకు, రాహుః, తమః, అగుః, అసురః, అనుపేళ్లును; కేతువునకు, శిఖీ, కేతుః అనుపేళ్లును గల వని యు నన్య నామములు లోక వ్యవహార సిద్ధము లగు నైఘంటికముల వలనఁ దెలిసికొన వలయును.

రక్త శ్శ్యామో భాస్కరో గౌర ఇందు
ర్నాత్యు చ్చాంగో రక్త గౌరశ్చ వక్రః,
దూర్వా శ్యామో జ్ఞో గురు ర్గౌర గాత్రః
శ్యామ శ్శుక్రో భాస్కరిః కృష్ణ దేహః. 4

తా. సూర్యాది గ్రహములకు వర్ణములు చెప్పఁబడినవి. ఎట్లనఁగ—సూర్యుఁడు రక్త శ్యామ మిశ్ర వర్ణముగలవాఁ డనియును, చంద్రుఁడు శ్వేత వర్ణముగలవాఁ డనియు, ఉన్నత శరీరముగాని వాఁడగు కుజుఁడు రక్త గౌర వర్ణుం డనియును, బుధుఁడు, దూర్వాశ్యామవర్ణము (దూర్వాశ్యామః=గరికవంటివన్నె) గలవాఁ డనియును, బృహస్పతి, గౌరగాత్రము(పసుపువన్నె)గల బంగారు వన్నెగలవాఁ డనియును, శుక్రుఁడు శ్వేతవర్ణము గలవాఁ డనియును, శని నీలవర్ణము గలవాఁ డనియును దెలియఁ దగినది. ఇందులకుఁ బ్రయోజన మేమనఁగ:- జన్మకాలమునందు నేగ్రహమునకు బలము గల్గియుండునో, ఆగ్రహముయొక్క వర్ణముతో జాతకుఁ డుండు ననియు, హృత నష్టాది ప్రశ్నల యందుఁ జోరాదులు బలవద్గ్రిహ సమాన వర్ణము లనియు నెఱుంగ వలయును.

వర్ణా స్తామ్ర సితాతిరక్త హరిత వ్యాపీత చిత్రాసితా
వహ్న్యంబ్వగ్నిజకేశవేంద్రశచికా స్సూర్యాది నాథా క్రమాత్,
ప్రాగాద్యా రవి శుక్ర లోహిత తమ స్సౌరీందు విత్సూరయః
క్షీణేందు ర్వర్క మహీసు తార్క తనయాః పాపా బుధ స్తైర్యుతః. 5

గ్రహములకుఁ దామ్రాది వర్ణాధిపత్యమును, అధిదేవతలును, దిగాధిపత్యమును, సౌమ్య పాపత్వమును జెప్పఁబడినవి. ఎట్లనఁగ:—సూర్యుఁడు తామ్ర వర్ణమునకును, జంద్రుఁడు, శ్వేతవర్ణమునకును, కుజుం డతిరక్త వర్ణమునకును, బుధుఁడు పసుపువర్ణమునకును, బృహస్పతి కనకపువర్ణమునకును, శుక్రుఁడు నానావర్ణమునకును, శనైశ్చరుఁడు నీలవర్ణమునకును అధిపతు లని తెలియఁ దగినది. మఱియు సూర్యునకు నగ్ని దేవుండును; చంద్రునకు నుదకమును; అంగారకునకుఁ గుమారస్వామియును; బుధునకు విష్ణువును; బృహస్పతికి దేవేంద్రుఁడును; శుక్రునకు శచీదేవియును; శనికి బ్రహ్మయును అధిదేవత లని తెలియఁ దగినది. ఇందులకు సారావళి శ్లోకము:—"తామ్ర సితాతి రక్త హారిత వ్యాపీత విచిత్రాసితా ఇనాదీనాం పావక జల గుహ కేశవ శక్ర శచీ వేధసః పతయః, పూర్వాది గ్రహదేవాం స్తన్మంత్రై స్సమభి

పూజ్యతామాశాం, కనక గజవాహనాదీన్ ప్రాప్నోతి నృపోరితశ్శీఘ్రం" అని చెప్పఁబడి యున్నది:—మఱియుఁ దూర్పునకు రవియును, ఆగ్నేయమునకు శుక్రుండును, దక్షిణమునకు నంగారకుండును, నిరృతికి రాహువును, పశ్చిమమునకు శనైశ్చరుండును, వాయువ్యమునకుఁ జంద్రుండును, ఉత్తరమునకు బుధుఁడును, ఈశాన్యమునకు గురువును అధిపతు లని తెలియఁదగినది. ఇందులకుఁ బ్రయోజనము. కేంద్రమునందు నేగ్రహ ముండునో యాగ్రహమునకుఁ జెప్పఁబడిన దిక్కున సూతికా గృహ ద్వారమనుటకును, హృత నష్టాదులయందుఁ జోరాదుల గమనము నెఱుంగుటకును, ముఖ్య మని తెలియవలయును. "క్షీణేందు ద్వర్క మహీసు తార్కతనయాః" అనఁగ— కృష్ణపక్షపుఁ జంద్రుఁడును, సూర్యుండును, అంగారకుండును, శనైశ్చరుండును, పాపగ్రహము లనియును; పాపగ్రహములతోఁ గూడిన బుధుఁడును పాపగ్రహమనియు; సంపూర్ణ చంద్రుండును, పాప గ్రహములతోఁ గూడని బుధుండును, గురు శుక్రులును శుభ గ్రహము లనియును; చంద్రుఁడు శుక్లపక్షపు, ప్రతిపత్తు మొదట పదిదినములు మధ్యబలుండును; అందుపైని పది దినములు పూర్ణబలుండును; అందుమీఁదఁ బది దినములు దుర్బలుండును; శుభగ్రహ వీక్షితుం డై యుండిన పక్షమున నెప్పుడు బలవంతుం డై యుండువాఁ డనియు నెఱుంగ వలయును. ఇందులకు యవనేశ్వరుండు "మాసేతు శుక్ల ప్రతిప ప్రవృత్తేః పూర్వే శశీ మధ్యబలో దశాహే, శ్రేష్ఠో ద్వితీయే ల్పబలస్తృతీయే సౌమ్యైశ్చ దృష్టో బలవాన్ సదైవ" అని వచించి యున్నాఁడు. ఇందులకుఁ బ్రయోజన మేమనఁగ—జన్మకాలమునందుఁ బాప గ్రహములు బలవంతులై యుండిరేని జాతకుఁడు పాపచిత్తుఁ డగుననియు, శుభగ్రహములు బలవంతులై యుండిరేని సౌమ్యస్వభావము గలవాఁ డై యుండు ననియు నెఱుంగఁదగినది.

బుధ సూర్యసుతౌ నపుంసకాఖ్యౌ
శశి శుక్రౌ యువతీ నరాశ్చ శేషాః,
శిఖి భూ ఖపయో మరు ద్గణానాం
వశినో భూమిసుతాదయః క్రమేణ.

తా. గ్రహములకుఁ బుం స్త్రీ నపుంసక సంజ్ఞలును, పంచ భూతాధిపత్యమునుం జెప్పఁబడినవి. ఎట్లనఁగ—బుధశనులు నపుంసక గ్రహము లనియు, చంద్ర శుక్రులు స్త్రీ గ్రహములనియు, సూర్య కుజ గురులు పురుష గ్రహము లనియు, మఱియు నితర గ్రంథములయందు రాహు కేతువులనుగూర్చి రాహువు స్త్రీ గ్రహ మనియు, కేతువు నపుంసక గ్రహ మనియును దెలియఁజేసి యున్నారు. మఱి యగ్నికి నంగారకుండును; భూమికి బుధుఁడును; ఆకాశమునకు బృహస్పతియు ను; జలమునకు శుక్రుండును; వాయువుకు శనియును; ముందుగ నగ్నికి సూర్యుండును; జలమునకుఁ జంద్రుండును అధిపతు లని చెప్పఁబడి యున్నది. గనుక, ఈశ్లోకమున సూర్య చంద్రులను గుఱించి చెప్ప లేదు. ఈసంజ్ఞలకుఁ బ్రయోజనము. "ఛాయాం మహాభూత కృతాం చ సర్వే భివ్యంజయంతి స్వదశా మవాప్య." అని దశాఫల మను గ్రంథమునందుఁ జెప్పఁబడి యున్నది.

విప్రాదిత శ్శుక్ర గురూ కుజార్కౌ
శశీ బుధ శ్చే త్యసితోఽంత్య జానాం,
చంద్రార్క జీవా జ్ఞ సితౌ కుజార్కీ
యథాక్రమం సత్త్వ రజ స్తమాంసి. 7

గ్రహములకు బ్రాహ్మణాది వర్ణాధిపత్యమును, సత్వరజ స్తమో గుణ విభాగమును జెప్పఁబడినది. అదెట్లనఁగ:—గురు శుక్రులు బ్రా హ్మణ వర్ణమునకును, అంగారక సూర్యులు క్షత్రియ వర్ణమునకును, చంద్రుఁడు వైశ్య వర్ణమునకును, బుధుఁడు శూద్ర వర్ణమునకును, శనైశ్చరుఁడు సంకరజాతు లగుచండాలాది మాగధాదులకును అధి పతు లగుచున్నారు. మఱియుఁ జంద్ర రవి గురువులు సత్త్వగుణము నకును, బుధ శుక్రులు రజో గుణమునకును, కుజ శనులు తమోగుణ మునకును అధిపతు లగుచున్నారు. యవనేశ్వరుఁడు కుజునకు సత్త్వ గుణాధిపత్య మున్నదని చెప్పినాఁడు. "సత్త్వాధికా భాస్కరభౌమ జీవా, భృగ్వాత్మజో రాజసిక శ్శశీచ శనైశ్చర స్తామసికో బుధస్తు సంయోగతోఽన్యాన్ లభతే విశేషాన్." అని చెప్పినవాఁ డయ్యె.

మఱియు:— "తామసికౌ కుజ సౌరా రాజసికౌ భార్గవ శ్శశిసుతశ్చ, జీవ శశి భాస్కరా స్సాత్వికా గ్రహ ప్రకృతయో నృణామ్." అని సత్యాచార్యుఁడు చెప్పినవాఁ డయ్యె. వరాహమిహిరాచార్యులు సత్యాచార్యుని మతము ననుసరించి యున్నాఁడుగాని యవనేశుని మత మంతగఁ బాటింపలేదు. అయినను గుజునకుఁ దామస గుణమును జెప్పి యుండఁగా, "సత్త్వంకుజః" అనుపదమువలనఁ గుజునకు సత్త్వగుణాధిపత్య ముండుటను బట్టి సత్త్వశబ్దార్థము శౌర్యమని యూహింపఁ దగినది. "యస్మాత్త్విక స్తస్య దయా స్థిరత్వం సత్యార్జిత బ్రాహ్మణ దేవ భక్తిః, రజోధికః కావ్యకళా వ్రతస్త్రీ సంసక్త చిత్తః పురుషోతి శూరః, తమోధికో వంచయితా పరేషాం మూర్ఖోలసః క్రోధ పరోతి నిద్రః" అని సత్త్వాది గుణస్వరూపము జెప్పఁబడినది.

## గ్రహముల స్వరూపములు.

మధు పింగళ దృక్ చతురశ్ర తనుః
పిత్త ప్రకృతి స్సవి తాల్పకచః,
తనువృత్త తను ర్బహువాత కఫః
ప్రాజ్ఞశ్చ శశీ మృదువాక్ శుభదృక్. 8

తా. సూర్య చంద్రుల స్వరూపము జెప్పఁ బడినది. ఎట్లనఁగ సూర్యుఁడు తేనెవంటి కన్నులు గలవాఁడును; పిత్తాధిక స్వభావము గలవాఁడును; చతుష్కోణమై ప్రసారితభుజద్వయ ప్రమాణ సమోచ్ఛ్రాయమైన శరీరము గలవాఁడును; స్వల్ప కేశములు గలవాఁడును అని తెలియఁదగినది. చంద్రుఁడు కృశమై వర్తులమైన దేహము గలవాఁడును; అధిక వాతశ్లేష్మ వ్యామిశ్ర దేహుండును; మంచిబుద్ధి గలవాఁడును; మృదు మధుర వచనములు గలవాఁడును; శ్రేష్ఠమగు చూపులు గలవాఁడును అగును.

క్రూరదృ క్తరుణమూర్తి రుదారః
పైత్తిక స్సుచపలః కృశ మధ్యః,
శ్లిష్ట వాక్సతత హాస్య రుచిర్జ్ఞః
పిత్త మారుత కఫ ప్రకృతిశ్చ. 9

తా. అంగారకుఁడు నిత్య యౌవనయుత శరీరము గలవాఁడును, దాతృత్వము గలవాఁడును, పిత్తాధిక స్వభావముగలవాఁడును, చపల చిత్తుఁడును, సన్నమైన నడుముగలవాఁడు నని తెలియఁ దగినది. బుధుఁడు గద్గదభాషియును, పరిహాస ప్రీతిగలవాఁడును, పిత్త వాతశ్లేష్మములు గలవాఁడును నని యెఱుంగునది.

బృహత్తనుః పింగళ మూర్ధజేక్షణో
బృహస్పతిః శ్రేష్ఠమతిః కఫాత్మకః,
భృగు స్సుఖీ కాంతవపు స్సులోచనః
కఫానిలాత్మా సిత వక్ర మూర్ధజః. 10

తా. గురువు, స్థూలశరీరుండును, స్వర్ణవర్ణపు వెంట్రుకలును కనుదోయి గలవాఁడును, ధర్మబుద్ధి గలవాఁడును, శ్లేష్మాధిక స్వభావము గలవాఁడునని తెలియఁదగినది. శుక్రుఁడు నిత్య సుఖాసక్తుండును, సుందరశరీరము గలవాఁడును, మంచి కన్నులు గలవాఁడును, శ్లేష్మాధిక వాత స్వభావుండును, నల్లనైన వంకర వెంట్రుకలు గలవాఁడునని యెఱుంగ వలయును.

మందోలసః కపిలదృ క్కృశ దీర్ఘ గాత్రః
స్థూల ద్విజః పరుష రోమ కచో నిలాత్మా,
స్నాయ్వ స్థ్య సృ క్త్వగథ శుక్ల వసా స్సమజ్జా
మందార్క చంద్ర బుధ శుక్ర సురేజ్య భౌమాః. 11

తా. శనైశ్చరుఁడు పనులయందు నాలస్యము గలవాఁడును, కపిలవర్ణ నేత్రములు గలవాఁడును, సన్ననైన పొడవగు శరీరము గలవాఁడును, గొప్పదంతములు గలవాఁడును, ముండ్లవలెఁ గఠిన మగు వెంట్రుకలు గలవాఁడును, వాతపిత్త ప్రకృతి గలవాఁడు నని తెలియఁ దగినది. మఱియు శనికి నరము, సూర్యునకు నెముక, చంద్రునకు నెత్తురు, బుధునకుఁ జర్మము, శుక్రునకు రేతస్సు, గురువుకు మెదడు, అంగారకునకు నెముకలో నుండు ధాతు విశేషము బలవత్తరమై యుండును. ఈగ్రహ స్వరూపాది జ్ఞానమునకుఁ బ్రయోజనం బేమనఁగః— జన్మకాలమున నేగ్రహము బలవంతుఁడై యుండునో యాగ్రహ స్వరూ

పమును, నాగ్రహమునకుఁ జెప్పఁబడిన ధాతుసారమును జాతకునకుఁ గల్గి యుండుననియు, హృతనష్టాది ప్రశ్నలయందుఁ జోరాదులు బలవద్గ్రహ ధాతు స్వరూపు లైయుందు రనియు, వ్యాధిప్రశ్నల యందు లగ్నాధిప నవాంశాధిపులబలవత్త్వము వలన నాగ్రహములకుఁ జెప్పఁబడి యుండు వాతశ్లేష్మాది దోషములచేత వ్యాధిపీడ గల్గిన దనియు నెఱుంగునది.

దేవాం బ్వగ్ని విహార కోశ శయన క్షిత్యుత్కరేశాః క్రమా
ద్వస్త్రం స్థూల మభుక్త మగ్నికహతం మధ్యం దృఢం స్ఫాటితం,
తామ్రం స్యాన్మణి హేమ యుక్తి రజతా న్యర్కాచ్చముక్తాయసీ
ద్రేక్కాణై శ్శిశిరాదయ శ్శశిరుచ జ్ఞ గ్వాదషూ దృత్సువా. 12

తా. అనఁగ:— దేవస్థానమునకును, దేవపూజా గృహములకును సూర్యుఁ డధిపతి యనియు, జలసమీపమునకును స్నానశాలకును జంద్రుం డధిపతి యనియు, నగ్ని సమీపమునకును పాకశాలకు నంగారకుం డధిపతి యనియును, క్రీడా గృహమునకు బుధుం డధిపతి యనియు, ధనాగారమునకు బృహస్పతి యనియును, (ధనాగారము= బొక్కసము) శయన గృహమునకు శుక్రుం డధిపతి యనియు, భూమి పరాగ రాశికి శనైశ్చరుఁ డధిపతి యనియును దెలియఁ దగినది. ఇందులకుఁ బ్రయోజన మేమన—జన్మకాలమునందు బలవద్గ్రహ వశమున నాయా గ్రహమునకుం జెప్పఁబడిన స్థానమునందుఁ బ్రసవ ప్రదేశమనియును, హృత నష్టాది ప్రశ్నల యందుఁ జోరుండుగాని చోరుఁ డపహరించిన ద్రవ్య ముండుటఁగాని బలవద్గ్రహ స్థానమునం దుండునని తెలియఁదగినది. మఱియు, సూర్యునకు ముదుగు వస్త్రమును, చంద్రునకుఁ గ్రొత్త వస్త్రమును, అంగారకునకుఁ గాలినవస్త్రమును, బుధునకు నీటిచేఁ దడిపి పిగిలిన వస్త్రమును, బృహస్పతికిఁ గొంత ప్రాఁత దైన వస్త్రమును, శుక్రునకు గట్టివస్త్రమును, శనికిఁ జినిఁగిన వస్త్రమును, ఇట్లు బలవద్గ్రహ వశమున సూతికావస్త్రమును, హృత నష్టాది చింతయందుఁ జోరాది వస్త్రమును దెలియఁదగినది. సూర్యాదులకుఁ దామ్రాదులు ద్రవ్యము లనియు, చంద్రునకు మణులనియు, నంగార

 

కునకు బంగారమనియును బుధునకువిత్తడి కంచు మున్నగునవియనియు, గురువుకు వెండియనియు, శుక్రునకు ముత్యము లనియు, శనికి నినుము సీస మనియు; మఱియు బృహస్పతికి:—"శ్లో. అర్కాది తామ్ర మణి హేమయుక్తి రజతాని మౌక్తికం లోహం, వక్తవ్యం బలవద్భిః స్వస్థానే హేమజీవేపి." అని యీగ్రంథకర్త చేతను, మఱియు, "అర్కస్య తామ్రం మణయో హిమాంశో ర్భౌమస్య హేమేందుసుతస్యయుక్తిః, జీవస్య రౌప్యం స్వగృహే స్థితస్యతస్యైవ హేమోశనసశ్చ ముక్తాః, తీక్ష్ణాంశు దేహ ప్రభవస్య సీసంకృష్ణాయసంచప్రవదంతి సంతః" అని బాదరాయణునిచేతను జెప్పఁబడి యున్నది. మఱియు బలవద్గ్రహవశంబున సూతికాగృహమునందు దీపభాజనాది పరిజ్ఞానమును, హృతనష్టాది ప్రశ్నయందుఁ జోరాది హృతద్రవ్య పరిజ్ఞానమును, జన్మకాలమునందు నేగ్రహము బలవంతమై యుండునో యాగ్రహ దశయందుఁ దదుక్త ధనలాభమును, హీనబలగ్రహ దశయందుఁ దదుక్త ద్రవ్య క్షయమును, ఇత్యాదు లెఱుంగునది. మఱియు, శ, శు, రు, చ, జ్ఞ, గుః—ఈ యాద్యక్షరములకు, "శశురుచజ్ఞగ్వాదిషు—అని చెప్పఁబడి యుండుటంజేసి, శని, శుక్ర, కుజ, చంద్ర, బుధ, గురు లుద్యత్సులగ్నగతు లగుచుండఁగ శిశిరాది షడృతువులం దెలియఁదగినది. శన్యాది ద్రేక్కాణములచే నైనను షడృతువులం దెలియఁ దగినది. లగ్నమున గ్రహమున్నచో, నాగ్రహమును బట్టి ఋతు నిర్ణయము చేయఁ దగినది. గ్రహములేని పక్షమున ద్రేక్కాణాధిపతి వలన ఋతు నిర్ణయము చేయఁదగినది. మఱికొందఱు లగ్నమునందు బహుగ్రహము లుండినచో ద్రేక్కాణాధిపతిచేత ఋతు నిర్ణయము సేయఁ దగినది. ఎట్లనఁగః—లగ్నమున గ్రహము లేనిపక్షమున ద్రేక్కాణాధిపతిశనైశ్చరుం డైనచో శిశిఋతు వనియు, శుక్రుఁడైనేని వసంతఋతు వనియు, అంగారకుం డైన పక్షమున గ్రీష్మర్తు వనియును, చంద్రుం డైనేని వర్షర్తు వనియు, బుధుండైన శరదృతు వనియును, గురువైనచో హేమంతఋతు వనియును, ఇట్లు క్రమముగ నెఱుంగ వలయును. ఇందులకు బాదరాయణుండు, "గ్రీష్మ మథప్రవదంతి కుజార్కా" అని వచించి యుండు ప్రకారము, సూర్యుఁడు లగ్నగతుఁడై

 

ద్రేక్కాణాధిపత్యము గల్గియుండినచో గ్రీష్మర్తువును జెప్పవలె ననియు, నష్టజాతకము నందు ఋతు నిర్దేశమును, ప్రశ్నయందు లాభాలాభములును, కాల పరిజ్ఞానమును దెలియఁ దగినది. మఱియు గ్రహములకు శాఖాధిపత్యము చెప్పఁబడినది. “ఋగథర్వ సామ యజుషా, మధిపా గురు సౌమ్య భౌమ సితాః.” అనఁగా:—గురువు ఋగ్వేదమునకును, బుధుం డథర్వవేదమునకును, నంగారకుఁడు సామవేదమునకును, శుక్రుండు యజుర్వేదమునకును నధిపతులనియు, నిందుచేఁ బ్రయోజనము. బ్రాహ్మణాదిజన్మకాలమునందు నేశాఖాధిపతి బలవంతుఁడై యుండునో, యాశాఖా ధ్యయన శీలుఁడై యుండు నని తెలియఁ దగినది. గ్రహము లనిష్టస్థాన గతులై యున్నప్పుడు తత్తద్గ్రహోక్త శాఖా మంత్ర తంత్రములచేతఁ దత్తద్గ్రహశాంతి చేయుట శ్రేయమని యెంచఁదగినది.

త్రిదశ త్రికోణ చతురశ్ర సప్తమా
నవలోకయంతి చరణాభి వృద్ధితః,
రవిజా మరేజ్య రుధిరాః పరేచయే
క్రమశో భవంతి కిల వీక్షణేధికాః. 13

తా. అనఁగా గ్రహములకు నన్యోన్య దృష్టి స్థానములును, నైసర్గిక దృష్టి బలమును జెప్పఁబడినది. ఏస్థానమునందు నేగ్రహ ముండునో, యాస్థానము మొద లిడుకొని, “త్రిదశ త్రికోణ చతురశ్ర సమాః”—అను స్థానములను జూచుచున్నాఁ డని తెలియఁ దగినది. అనఁగా—తృతీయ దశమ స్థానములను అక్కడనున్న గ్రహములను పాద దృష్టిచేతను, పంచమ నవమముల నక్కడనున్న గ్రహములను అర్ధదృష్టిచేతను, చతురశ్రముల నక్కడనున్న గ్రహములను త్రిపాదదృష్టిచేతను, సప్తమమును అక్కడనున్న గ్రహములను సంపూర్ణదృష్టిచేతను జూచు చున్నారని యర్థము. ఎంతమాత్రపు దృష్టిగలదో యంతమాత్రపు ఫలము గలదని గ్రహబలానుసారముగ నూహింపఁ దగినది. అనఁగా శనైశ్చరుండు తానుండు రాశికి 3, ౧౦ ఇండ్లను పాదదృష్టిచేఁ జూచుచుండు ననియును, గురుపు, తానుండు రాశికి - ౫ - ౯ - ఇండ్లను

అర్ధదృష్టిం జూచుచుండుననియును అంగారకుఁడు దానుండు రాశి ర, ౭ ఇండ్లను త్రిపాదదృష్టిచేఁ జూచుచుండు ననియును, ఈచెప్ప బడిన యిండ్లం జూచుటగాక తానుండు రాశికి నేడవయింటిని సంపూర్ణ దృష్టిం జూచు చుందు రనియు, నితర గ్రహములు తాముండు రాస లకు నేడవయింటిని సంపూర్ణ దృష్టింజూచుచుందు రనియు నెఱుంగ వలయును. ఇందులకు లఘుజాతక సారావళి గ్రంథములయందుండ శ్లోకములు గొన్ని యుదాహరింపఁ బడినవి. లఘుజాతకము:—శ్లో. "దశ మత్తృతీయౌ నవమం పంచమ చతురష్టమాన్ కళత్రంచ, పశ్యంతి పాద వృద్ధ్యా ఫలానిచైవంప్రయచ్ఛంతి." సారావళి:—శ్లో. "సర్వం పశ్యంతి సదా గ్రహా శ్చరణ వృద్ధితస్స ర్వే త్రిదశ త్రికోణచతురశ్ర స_ప్తగతాన్ ఫలం క్రమేణైవమ్" యవనేశ్వరుఁడు:—శ్లో. "ద్వ్యాపశ్చిమౌ షష్ఠ మథ ద్వితీయం సంస్థాన రాశేః పరిహృత్య రాశిమ్, శేషాన్ గ్రహాః పశ్యతి సర్వకాల మిష్టే షుచేషాం విహితా దృగిష్టా, జామిత్రభే దృష్టి ఫలం సమగ్రం స్వపాదుహీనం చతురశ్ర యోశ్చ, త్రికోణయోర్దృష్టి ఫలార్థ మాహు ర్దుశ్చిక్య సంజ్ఞేదశ మేచ పాదం." సారావళి:—శ్లో. "పూర్ణంప శ్యతి రవిజా స్తృతీయ దశ మే త్రికోణమపి జీవః, చతురశ్రం భూమిసుతః సితార్క బుధ హిమకరాః కళత్రంచ." మాధవాచార్యుఁడు:— "సౌరి స్తృతీయ దశమౌ గురుస్త్రికోణం కుజస్తు చతురశ్రం, పశ్యతి సమగ్ర మితరే చరణ వృద్ధ్యాధస_ప్తమం సర్వే." గార్గి:— "దుశ్చిక్య స్వగతాన్ సౌరి స్త్రికోణస్థాన్ బృహస్పతిః, చతు ర్థాష్టమగాన్ భౌమ శ్చైషా స_ప్తమ సంస్థితాన్, భవంతి వీక్షణేనిత్య ముక్తాధిక ఫలాగ్రహాః." అనఁగా సూర్య చంద్ర బుధ శుక్రులకు స_ప్తమ స్థానమును సంపూర్ణ దృష్టిం జూచుటంజేసి సంపూర్ణ దృష్టి యందు నితరగ్రహముల కంటె నధిక ఫల మిచ్చు వారని తెలియఁ దగినది.

అయన క్షణ వాసర ర్తవో మాసోర్థంచ సమాశ్చ భాస్కరం,
కటుక లవణ తి_క్త మిశ్రితా మధురా మ్లౌచ కషాయ ఇత్యపి.

తా. సూర్యాది గ్రహములకు, అయనాది కాలములును కటు కాది రసములును జెప్పఁబడినవి. ఎట్లనఁగ:—సూర్యునకు నాఱునెలలు

ను, చంద్రున కొక ముహూర్తమును, కుజున కొకదినమును, బుధునకు రెండుమాసములును, గురువుకు నొకమాసమును శుక్రునకు నొకపక్షమును, శనికి నొకసంవత్సరమును కాలనిర్ణయ మని తెలియఁ దగినది. ఇందులకుఁ బ్రయోజనము. ప్రశ్నలగ్నమునందు జనన లగ్నమునందు, నేగ్రహముతోఁ గూడినదైన నవాంశ ముదయించు చున్నదో, ఆగ్రహమునకు నెంత కాలము చెప్పఁబడినదో, ఆకాలముపైని శుభాశుభ ఫలములను జెప్పవలె ననియెఱుంగునది. మఱికొంద ఱెంతమాత్రపు సంఖ్యగల నవాంశ ముదయించు చున్నదో, అంతమాత్రపు సంఖ్యగల అయనాది కాల మంశపతివలనం జెప్పఁ దగిన దని వచించు చున్నారు. ఇందులకు మణిత్థుఁడు:—శ్లో. "లగ్నాంశక పతితుల్యాః కాలోలగ్నోధితాంశ పతి తుల్యాః, వక్తవ్యో రిపు విజయే గర్భాధానేథ కార్యసంయోగే." అనఁగా ముందుచెప్పఁబడిన శ్లోకప్రయోజనము నెఱింగించి యున్నాఁడనియర్థము. మఱియుఁ గటుకాది రసములను వివరించుచున్నాఁడు. ఎట్లనఁగ:—సూర్యునకుఁ గారమును, చంద్రునకు నుప్పును, కుజునకుఁ జేదును, బుధునకు షడ్రసమిశ్రమును, గురువుకుఁ దీపును, శుక్రునకుఁ బులుసును, శనికి వగరును చెప్పఁబడినవి. ఇందులకుఁ బ్రయోజన మేమనఁగ—భోజన విషయ మగుప్రశ్నలయందుఁ బ్రశ్నలగ్నగత గ్రహమునకుఁ గాని, తన్నవాంశాధిపతికిఁ గాని చెప్పఁబడిన రసముతోఁ గూడిన భోజనమని తెలియఁ దగినది.

జీవో జీవ బుధౌ సితేందు తనయౌ వ్యర్కా విభౌమాః క్రమా
ద్వీంద్వర్కా వికుజేం ద్వినాశ్చ సుహృదః కేషాంచి దేవంమతమ్,
సత్యోక్తే సుహృద స్త్రికోణ భవనా త్స్వాత్స్వాంత్య ధీధర్మపాః
స్వోచ్చాయు స్సుఖపాః స్వలక్షణ విధే ర్నాన్యే విరోధాదితి. 15

తా. ఈశ్లోకమున, గ్రహములకు మిత్ర శత్రు సమత్వములు చెప్పఁబడినవి. సూర్యునకు బృహస్పతియును, చంద్రునకు గురు బుధులును, కుజునకు శుక్రబుధులును, బుధునకు సూర్యవర్జితములైన యైదు గ్రహములును, గురునకుఁ గుజేతరములైన యైదుగ్రహములును, శుక్రునకుఁ జంద్ర సూర్య వర్జితములైన నాల్గుగ్రహములును, శనికిఁ

గుజ చంద్రసూర్య వర్జితములైన మూఁడుగ్రహములును మిత్రులని యును, తక్కిన గ్రహములు శత్రువు లనియు నర్థము. ఇందులకు యవనేశ్వరుఁడు:—"రవే ర్గురు ర్మిత్ర మతోఽన్యథాన్యే. గురోస్తు భౌమంపరిహృత్య సర్వే, చాంద్రే రసర్కా భృగునందనస్య వ్యర్కేందవో వై సుహృదః ప్రదిష్టాః, భౌమస్య శుక్ర శ్శశిజశ్చమిత్ర మిందో ర్బుధం దేవగురుంచ వింద్యాత్, సౌరస్య మిత్రాణ్యకుజేందు సూర్యా శ్చైషాం రిపూన్ విద్ధి నృణాంచ తద్వత్." అని చెప్పియున్నాఁడు గాని యీపక్షమునందు మిత్ర శత్రుత్వ వ్యవహారమే కాని సమత్వ వ్యవహారములేదు. సత్యాచార్యోక్త హోరాశాస్త్రము నందు గ్రహములకుఁ దనసంబంధ మగు మూలత్రికోణ రాశి మొదలుకొని ద్వితీయద్వాదశ పంచమ నవమాధిపతులును, స్వకీయోచ్చ రాశ్యధిపతియు సప్తమ స్థానాధిపతియుఁ జతుర్థాధిపతియు మిత్రులనఁ బడుదురు. ఈమిత్ర లక్షణ విధికి విరోధముగ నుండుటంజేసి, ఉక్త వ్యతిరిక్త గ్రహములు మిత్రులు కారు. అనఁగా నేస్థానాధిపతులకు మిత్రత్వము చెప్పఁబడినదో, తదితర స్థానాధిపతులు మిత్రులు కారని తాత్పర్యము. ఇందులకు సత్యాచార్యుఁడు:—శ్లో. "సుహృద స్త్రికోణ భవనా ద్గ్రహస్య సుతేభే వ్యయేథ ధనభవనే, స్వజనే నిధనే ధర్మే స్వోచ్చేచ భవంతి నోశేషాః" అని చెప్పియున్నాఁడు. అనఁగ ద్విరాశ్యధిపతి మిత్రుఁ డనియు, నేకరాశ్యధిపతి సముండనియు, అనుక్త రాశ్యధిపతి శత్రువనియు నెఱుంగ వలయును. స్వజన మనఁగాఁ జతుర్థస్థాన మని సంకేతార్థము. ఈప్రకారముగ వక్ష్యమాణ గ్రంథము నందు, "ద్వ్యేకానుక్త భపాన్ సుహృ త్సమ రిపూన్ సంచిత్య నైసర్గికాన్" అని చెప్పఁబడుటంజేసి, ఏకరాశ్యధిపతి సముండని వచించు హేతువు సూర్యచంద్ర వ్యతిరిక్తవిషయ మనియర్థము. అనఁగా సూర్యచంద్రులకు రాశిద్వయాధిపత్యము లేదుకాఁబట్టి, యేకరాశ్యధిపతులైనను మిత్ర సంజ్ఞత్వ మొందినవారని యెఱుంగునది. మఱియు ద్విరాశ్యధిపతి ఉచ్చ రాశ్యధిపతిత్వము వలనఁ ద్రిరాశ్యధిపతిత్వము నొందినప్పటికిని, అట్టిగ్రహము ద్విరాశ్యధిపతి వలె మిత్రసంజ్ఞను బొందును. ఎట్లనఁగ:—సూర్యునకు సింహరాశి మూలత్రికోణమగు

చున్నది. ఆరాశికిఁ బండ్రెండవరాశి కర్కాటక మగుచున్నది. ఆరాశ్యధిపతి చంద్రుఁ డగుచున్నాఁడు. ఆచంద్రుఁ డేకరాశ్యధిపతి యైనను రాశ్యంతరాధిపత్యము లేనివాఁడు, గనుక సూర్యునకు మిత్రుఁ డగుచున్నాఁడు. మఱియు సింహరాశికి నాల్గవరాశి వృశ్చిక మగుచున్నది. తొమ్మిదవ రాశి మేష మగుచున్నది. ఆమేషరాశి సూర్యునకు నుచ్చస్థాన మగుచున్నది. కాఁబట్టి అంగారకుఁడీచెప్పఁబడిన మూఁడు రాసులకు నధిపతియైనను మేషరాశి యొక్కటియ గనుక ద్విరాశ్యధిపతియై సూర్యునకు మిత్రుఁడాయెను. సింహమునకుఁ బంచమాష్టమములు ధను ర్మీనము లగుచున్నవి. ఆరాసులకు బృహస్పతి అధిపతి యగుచున్నాఁడు. ఆగురువు ఉక్తరాశిద్వయాధిపతి యగుటవలన సూర్యునకు మిత్రుం డయ్యె. సింహమునకు ద్వితీ యైకాదశస్థానములు కన్యా మిథునము లగుచున్నవి. ఆరాసులకు బుధుం డధిపతి యగుచున్నాఁడు. కాఁబట్టి సూర్యునకు సముండయ్యె. సింహమునకు షష్ఠసప్తమములు మకర కుంభము లగుచున్నవి. అవి ఉక్తస్థానములు కావు కాఁబట్టి ఆరాసుల కధిపతి యగుశనైశ్చరుఁడు సూర్యునకు శత్రువయ్యె. మఱియు సింహమునకు దశమ తృతీయములు వృషభ తుల లగుచున్నవి. అవి ఉక్తస్థానములు కావు గనుక తదధిపతి యగుశుక్రుఁడు సూర్యునకు శత్రువగుచున్నాఁడు. ఇట్లు సూర్యునకు శత్రుమిత్ర సమత్వములు తెలియఁజేయఁబడియె. మఱి చంద్రునకు వృషభము మూలత్రికోణము; దానికి నాల్గవరాశి సింహము, తత్స్థానాధిపతి సూర్యుఁ డేకరాశ్యధిపతి యైనను రాశ్యంతరాధిపత్యము లేనివాఁ డైనందున, మిత్రుఁ డగుచున్నాఁడు. వృషభమునకు ద్వితీయము మిథునము ; పంచమము కన్య, ఈరాసులకు నధిపతి యగుబుధుఁడు చంద్రునకు మిత్రుఁడయ్యె. వృషభమునకు నేడు పండ్రెం డిండ్లు వృశ్చిక మేషరాసు లగుచున్నవి. ఈరాసులకు నంగారకుఁ డధిపతి యగుచున్నాఁడు. అందు నేడవ యిల్లగు వృశ్చికము అనుక్త స్థాన మగుచున్నది. పండ్రెండవ యిల్లగు మేషము ఉక్తస్థాన మగుచున్నది. కాఁబట్టి, ఉక్తైకరాశ్యధిపతి యగు నంగారకుఁడు చంద్రునకు సముఁ డగుచున్నాఁడు. వృషభమునకు నష్టమైకాదశ స్థానములు ధను ర్మీనము లగుచున్నవి. ఆరాసులకు నధిపతి గురు వగుచున్నాఁడు.

అందు సప్తమ స్థానము మాత్ర ముక్తస్థానము గనుక, ఉక్తైక రాశ్యధిపతి గురువు చంద్రునకు సముండగుచున్నాఁడు. చంద్రునకు వృషభ ముచ్ఛస్థానము. తద్రాశి కొంటవరాశి తుల యగుచున్నది. ఆరాశికి నధిపతి శుక్రుఁడు. అందు నాఱవ రాశ్యనుక్త స్థానము. ఉచ్ఛ ముక్త స్థానము కాఁబట్టి పత్యైక రాశ్యధిపతి యగు శుక్రుఁడు చంద్రునకు సముఁ డగుచున్నాఁడు. మఱియు వృషభమునకు నవమ దశమములు మకర కుంభము లగుచున్నవి. ఆరాసులకు నధిపతి శనైశ్చరుఁడు. అందు దశమ మనుక్త స్థానము గనుక పత్యైక రాశ్యధిపతి యగుశని చంద్రునకు సముం డగుచున్నాఁడు. ఇట్లు తక్కిన గ్రహములకు మిత్ర శత్రు సమము లూహింపఁ దగినవి.

శత్రూ మంద సితౌ సమశ్చ శశిజో మిత్రాణి శేషా రవే
స్తీక్ష్ణాంశు ర్హిమరశ్మిజశ్చ సుహృదౌ శేషాస్సమాః శీతగోః,
జీవేం దూష్ణకరాః కుజస్య సుహృదో జ్ఞోరి స్సితార్కీ సమా
మిత్రే సూర్య సితౌ బుధస్య హిమగు శ్శత్రు స్సమాశ్చాపరే.

తా. అనఁగా వరాహమిహిరాచార్యులవారు పూర్వశ్లోకోక్త సత్యాచార్యుల వారి మతము ననుసరించి మిత్ర శత్రుసమత్వములను మఱల వివరించు చున్నాఁడు. ఎట్లనఁగః—సూర్యునకు శని శుక్రులు శత్రువు లనియును, బుధుఁడు సముండనియును, చంద్ర కుజ గురులు మిత్రులనియును, చంద్రునకు సూర్యుండును, బుధుండును, మిత్రు లనియును, కుజ గురు శుక్ర శనులు సము లనియును, శత్రువులు లేరనియును, అంగారకునకు గురు చంద్ర సూర్యులు మిత్రు లనియును, బుధుఁడు శత్రు వనియును, శుక్ర శనులు సములనియును, బుధునకు రవి శుక్రులు మిత్రు లనియును, చంద్రుఁడు శత్రు వనియును, అంగారక గురు శనులు సములనియుం దెలియునది.

సూరే స్సౌమ్య సితావరీరవిసుతో మధ్యోపరే త్వన్యథా
సౌమ్యార్కే సుహృదౌ సమౌ కుజ గురూ శుక్రస్య శేషావరీ,
శుక్ర జ్ఞౌ సుహృదౌ సమ స్సురగురు స్సౌరస్య చాన్యేరయో
యేప్రోక్తా స్స్వత్రికోణ భాదిషు పున స్తేమీ మయా కీర్తితాః. 17

తా. అనఁగా—బృహస్పతికి శుక్ర బుధులు శత్రువు లనియును, శని సముం డనియును, సూర్య చంద్రాంగారకులు మిత్రులనియును, శుక్రునకు శని బుధులు మిత్రు లనియును, కుజ గురులు సము లని యును, చంద్ర సూర్యులు శత్రు లనియును, శనికి బుధ శుక్రులు మిత్రు లనియును, గురువు సముఁ డనియును, సూర్య చంద్ర కుజులు శత్రువు లనియు నెఱుంగఁ దగినది. ఏగ్రహములు స్వత్రికోణ రాశ్యాదుల యందు సమశత్రు మిత్రములుగఁ జెప్పఁబడినవో, ఆగ్రహములు మఱలఁ జెప్పఁబడినవి.

అన్యోన్యస్య ధన వ్యయాయ సహజ వ్యాపార బంధు స్థితా
స్తత్కాలే సుహృద స్స్వతుంగ భవనే ప్యేకే రయ స్త్వన్యథా,
ద్వ్యేకానుక్త భపాః సుహృత్సమ రిపూః సంచింత్య నైసర్గికాం
స్తత్కాలేచ పునస్తు తా నధిసుహృ న్మిత్రాదిభిః కల్పయేత్. 18

తా. తాత్కాలిక మిత్ర శత్రు సమ భావములు చెప్పఁబడి నవి. ఎట్లనఁగ:—ఒకరి కొకరికి- ౨-౧౨-౧౧-౩-౧౦-౪- ఈస్థానముల యందుండు గ్రహములు జన్మ వివాహ, యాత్రాది కాలములయందు మిత్రు లగుచున్నారు.ఇందులకు యవనేశ్వరుండు,శ్లో. "మూలత్రికోణా ద్ధన ధర్మ బంధుమిత్ర వ్యయస్థాన గతా గ్రహేంద్రాః, తాత్కాలికాస్తే సుహృదో భవంతి స్వోచ్చే చ యో యస్య నికృష్టవీర్యః." అనఁగా ఏ గ్రహముయొక్క యుచ్చరాశియందు నేగ్రహ మున్నదో, ఆగ్రహములు రెండు నన్యోన్య మిత్రులని చెప్పఁబడినవి గనుక యీవిషయమున వరా హమిహిరులు సమ్మతింపలేదు. ఎట్లనఁగా, శ్లో. "తత్కాలేచ దశాయ బంధుసహజ స్వాంత్యేషు మిత్రం స్థితః" అనిలఘుజాతకమునందుఁ జెప్పఁ బడి యుండుటం జేసి, ఏకరాశియందును, పంచమ షష్ఠ సప్త మాష్టమ నవమ స్థానములయందుండు గ్రహములు తాత్కాలిక శత్రులగుచున్నా రు. పూర్వోక్త ప్రకారము ద్విరాశ్యధిపతులును, ఏకరాశ్యధిపతులును, అనుక్త రాశ్యధిపతులు నగు "శత్రూ మంద సితౌ" అను శ్లోక ద్వ యోక్తప్రకారము స్వభావసిద్ధులైనమిత్ర మధ్యస్థశత్రులను దెలిసికొని "అన్యోన్యస్యధనవ్యయాయ సహజ వ్యాపార బంధుస్థితాః" అనుశ్లోక

మునందుఁ జెప్పఁబడిన ప్రకారముగఁ దాత్కాలిక మిత్రశత్రుత్వం దెలిసి కొని యాగ్రహముల నధిమిత్ర మిత్రాది సంజ్ఞలతోఁ గూడిన వారిగఁ జేయఁ దగినది. అదెట్లనిన—నైసర్గిక మిత్రుఁడు తాత్కాలికమిత్రుఁ డైనేని అధిమిత్రుండగును. నైసర్గిక శత్రువు తాత్కాలికశత్రువైనేని అధిశత్రువగును. ఒకవిధమున శత్రువై మఱియొక విధమున మిత్రుఁ డైనేని సముం డగును. ఒకవిధమున శత్రువై వేఱొక విధమున సముం డైనేని శత్రు వగును. ఇందులకు నుదాహరణము. శ్లో. "శత్రు మిత్ర స్సమః ప్రోక్తః సమ శత్రూ రిపు ర్భవేత్, మిత్ర మిత్రోఽధి మిత్రంస్యాచ్ఛత్రు ర్వైరేరధి శత్రుతా." అని లఘుజాతకమునందుఁ జెప్పఁబడినది.

స్వోచ్చ సుహృ త్స్వత్రికోణ నవాంశైః
స్థానబలం స్వగృహోపగతే చ,
దిక్షు బుధాంగిరసౌ రవి భౌమౌ
సూర్యసుత స్సిత శీతకరౌచ. 19

తా. అనఁగ, గ్రహములకు స్థాన దిక్చేష్టా కాలనైసర్గిక బలములైదు విధములు గలవు గనుక, అందు స్థాన దిగ్బలములు జెప్పఁబడినవి. ఎట్లనఁగా—స్వోచ్చ స్థానమునం దుండు గ్రహమును, మిత్ర క్షేత్రమునం దుండు గ్రహమును, మూల త్రికోణము నందుండు గ్రహమును, స్వనవాంశ యందుండు గ్రహమును, స్వక్షేత్రమునం దుండు గ్రహమును, స్థానబలయుక్త గ్రహము లనంబడినవి. మఱియు సింహము సూర్యునకు మూలత్రికోణ స్వక్షేత్రమును చంద్రునకు నుచ్చత్రికోణము వృషభమును, అంగారకునకు మేషము స్వక్షేత్ర త్రికోణమును, బుధునకుఁ గన్య మూల త్రికోణోచ్చ స్వక్షేత్రమును, గురునికి ధనుస్సు త్రికోణ స్వక్షేత్రమును, శుక్రునకుఁ దుల స్వక్షేత్ర మూల త్రికోణమును, శనికి గుంభము మూలత్రికోణ స్వక్షేత్రమును గలవు గనుక వీని అంశ విభాగ మీగ్రంథమునందుఁ జెప్పఁబడి యుండలేదు: కాఁబట్టి ప్రథమాధ్యాయము నందలి ౧౪-వశ్లోక తాత్పర్యమునందు నుదాహరింపఁ బడి యుండుటంజేసి, ఆప్రకారముగ నాయా రాసుల యందు నంశ భేదము దెలియుంగునది. ఇదియునుం గాక, బుధ గురువులు లగ్నము

నందున్నవారలై తూర్పుదిక్కునందు బలవంతు లగుచున్నారు. రవి కుజులు దశమ కేంద్రస్థితులై దక్షిణ దిక్కునందు బలవంతు లగుచున్నారు. శని సప్తమమునందున్నవాఁడై పశ్చిమ దిక్కునందు బలవంతుఁడై యున్నాఁడు. శుక్ర చంద్రులు చతుర్థమునందుండువారలై యుత్తరపు దిక్కునందు బలవంతు లగుచున్నారు. ఏగ్రహ మేస్థానమునందు బలయుక్తమై యుండునట్లు చెప్పఁబడినదో, ఆగ్రహమాస్థానమునకు సప్తమ స్థానమునందు దుర్బలంబగును. ఇది గ్రహముల యుచ్చ నీచ విభాగమునందును, రాసుల దిగ్బల విభాగము నందును, పరిభాష యని తెలియఁదగినది. ఈప్రకారము యవనేశ్వరుఁడు, శ్లో. "గురుర్బుధౌ వా పూర్వ విలగ్న సంస్థా నభస్థల స్థౌచ దివాకరారౌ, సౌరోస్తగ శ్శుక్ర నిశాకరౌతు జలేస్థితావగ్రబలౌ భవేతామ్." అని వచించి యున్నాఁడు.

ఉదగయనే రవి శీతమయూఖౌ
వక్ర సమాగమగాః పరిశేషాః,
విపులకరాయుధి చోత్తర సంస్థా
శ్చేష్టిత వీర్య యుతాః పరికల్ప్యాః. 20

తా. ఉత్తరాయణమునందు మకరాది షట్కమున సూర్య చంద్రులు బలవంతులు. కుజ బుధగురు శుక్ర శనులు వక్రగతులై చంద్రునితోఁగూడినవారలైనను బలవంతులు. సూర్యునితోఁ గూడుటచే నస్తమయము. కుజాదులు పరస్పర సంయోగము వలన యుద్ధము. ఇందులకు విష్ణు చంద్రుని శ్లోకము. "దివసకరేణా స్తమయః సమాగమ శ్శీతరశ్మి సహితానామ్ కుసుతాదీనాం యుద్ధం నిగద్యతే నోన్య యుక్తానామ్." మఱియు విస్తృతము లైన కిరణములు గల్గినవారును బలవంతులు. ఈవిస్తృత కిరణత్వము శీఘ్ర కేంద్రము ద్వితీయ తృతీయ పాదముల యందుండునపుడు గ్రహములకుఁ దఱచుగఁ గల్గుచున్నది. గ్రహయుద్ధమునందు నుత్తరము నందుండు గ్రహములు బలముగలవి. ఈగ్రహ యుద్ధమునందు జయమొంది యుండు గ్రహములు బలాధిక్యముగల వనియర్థము." దక్షిణదిక్స్థః పరుషో వేపథు రప్రాప్తసన్నికృష్టోణుః, అవిరూఢో వికృతో నిష్ప్రభో వివర్ణశ్చ యస్సజితః,

ఉక్త విపరీత లక్షణ సంపన్నో జయగతో వినిర్దిష్టః విపుల స్నిగ్ధో ధృతిమార్గ దక్షిణక్ స్థోపిజయయుక్తః." అనఁగా దక్షిణపు దిక్కున నుండు నపుడు గూడ జయము శుక్రునకుఁ గల్గును గాని యితర గ్రహములకుఁ గలుగదు. ఇందులకుఁ బలిశాచార్యులువారు, "సర్వేజయిన ఉదక్ స్థా దక్షిణదిక్ స్థో జయీశుక్రః" అనఁగ నీరీతి నుండుగ్రహములు చేష్టా బలయుక్తము గలవారని కల్పింపఁ బడినది. ఇదిచేష్టాబలము.

నిశి శశి కుజ సౌరా స్సర్వదా జ్ఞో హ్నిచాన్యే
బహుళ సిత గతాస్స్యుః క్రూర సౌమ్యాః క్రమేణ,
ద్వ్యయన దివస హోరా మాసపైః కాల వీర్యం
శ కు బు గు శు చ రాద్యా వృద్ధితో వీర్యవంతః. 21

తా. కాలనైసర్గికబలము చెప్పఁబడినది. ఎట్లనఁగ:—చంద్రాంగారక శనైశ్చరులు రాత్రి కాలమునందు బలవంతు లనియు, బుధుఁడు సర్వదా బలవంతుఁ డనియును, రవి గురు శుక్రులు పగటి కాలమునందు బలవంతు లనియును, కృష్ణ శుక్ల పక్షముల యందుఁ గ్రమముగఁ బాప గ్రహములు శుభగ్రహములు బలవంతు లనియును, సంవత్సరాధిపతియును, వారాధిపతియును, హోరాధిపతియును, మాసాధిపతియును, బలవంతు లనియర్థము. ఇదికాల బలము. మఱియు నేకాక్షర సంజ్ఞచేత శని కుజ బుధ గురు శుక్ర చంద్ర రవు లుత్తరోత్తర వృద్ధి క్రమమున వీర్య యుతు లగుదు రెట్లనఁగ—శనికంటెఁ గుజుండును, కుజునికంటె బుధుండును, బుధునికంటె గురుండును, గురునికంటె శుక్రుండును, శుక్రునికంటెఁ జంద్రుండును, చంద్రునికంటె సూర్యుండును బలవంతు లనియర్థము. ఇది నైసర్గికబలము. ఈప్రకారము లఘుజాతక గ్రంథమునందు, "మందార సౌమ్య వాక్పతి సిత చంద్రార్కాయథోత్తరంబలినః, నైసర్గిక బలమేత ద్బలసామ్యే స్యాద ధిక్యచింతా." అని చెప్పఁబడి నట్లు స్థాన దిక్చేష్టా కాల నైసర్గికబలము లిదివఱకు "త్రిదశ త్రికోణ చతురశ్రస ప్తగా నవలోకయంతి చరణాభివృద్ధితః" అనుశ్లోకమునందుఁ జెప్పఁబడిన దృగ్బలములతోడ షడ్బలములును జెప్పఁబడినవి. ఈబలములకుఁ బ్రతిఫల మీవరాహమిహిరాచార్యులువారు చెప్పలేదు గనుక లఘుజాతకమునందు మాత్రము,

"బలవా న్మిత్ర స్వగృ హోచ్చ నవాంశ కేక్షిత శుభై శ్చాపి చంద్ర సితౌ స్త్రీక్షేత్రే పురుష క్షేత్రోపగా శ్చైషాః తత్ర శుభదృష్టి ఫలం తావత్, శుభదర్శన బలసహితః పురుషం కుర్యా దనాన్వితం ఖ్యాతం సుభగం ప్రధాన మఖిలం సురూప దేహంచ సౌమ్యంచ, పుం స్త్రీ భవన బలేనచ కరోతి జనపూజితంకలా కుశలం, పురుషం ప్రసన్న చిత్తం కల్యం పరలోక భీతంచ, ఆశా బల సము పేతో నయతి స్వది శం నభశ్చరః పురుషం, నీత్వా వస్త్ర విభూషణ వాహన సౌఖ్యా న్వితం కురుతే, క్వచి ద్రాజ్యం క్వచిత్పూజాం క్వచిద్రవ్యం క్వచి ద్యశః. దదాతి విహగ శ్చిత్రం చేష్టా వీర్య సమన్వితః, వక్రిణస్తు మహావీ ర్యాః శుభ రాజ్య ప్రదా గ్రహాః, పాపా వ్యసనదాః పుంసాం కుర్వం తిచ వృథాటనం. స్వస్థ శరీర సమాగమ సుఖమూ హావ జయ బలేన విదధాతి, శుభ మతులం విహగేంద్రో, రాజ్యంచ వినిర్జి తారాతి రా త్రి దివా బల పూర్ణైర్యా గజ లాభేన శౌర్య పరివృద్ధ్యా, మలిన యతి శత్రు పక్షం భుంజతి లక్ష్మీం నభశ్చరైపురుషః. ద్విగుణంద్విగుణం దద్యు ద్వర్షా ధిప మాస దివస హోరేశాః, కుర్యు ర్వృద్ధ్యా సౌఖ్యం స్వద శాసు ధనంచ కీర్తించ. పక్షబలా ద్రిపు నాశం రత్నాంబర హస్తి సం పదం దద్యుః, స్త్రీ కనక భూమి లాభం కీర్తించ శశాంక ధవళతరాం, సకల బల భార భరితా నిర్మల కరజాల భాసురా స్సతతం, రాజ్యం గ్రహా విదద్యు సౌఖ్యంచ మనోరథాతీతం. ఆచార సౌఖ్య శుభ శౌచ యుతా స్సురూపా స్తేజస్వినః కృత విదో ద్విజ దేవ భక్తాః, సద్వస్త్ర మాల్య ధన భూషణ సంయు తాశ్చ సౌమ్య గ్రహై ర్బల యుక్తైః పురుషా భవంతి. లుబ్ధాః కుకర్మనిరతా నిజకార్యనిష్టాః పాప గ్రహై ర్బలయుక్తై పిశునాః కురూపాః. పుంరాశిషు గ్రహేంద్రై ర్వీరా స్సంగ్రామకాంక్షిణోబలినః, నిస్స్నేహా బహురోగాః క్రూరా మూర్ఖా శ్చ జాయంతే, యువతి భవన స్థితేషుచ మృదవ స్సంగ్రామ భీరవః పురు షాః జల కుసుమ వస్త్ర నిరతాః సౌమ్యాః కలహై స్సుసంయుక్తాః.

ఇట్లు గ్రహయోనిభేదాధ్యాయమను ద్వితీయాధ్యాయము

సంపూర్ణము.

---

శ్రీ ర స్తు.

# బృ హ జ్జా త క ము.

## వియోనిజన్మాధ్యాయము.



మూ. క్రూర గ్రహై స్సుబలిభి ర్విబలైశ్చ సౌమ్యైః
క్లీబే చతుష్టయ గతే తద వేక్షణాద్వా,
చంద్రోపగ ద్విరసభాగ సమాన రూపం
సత్వం వదే ద్యది భవేత్స వియోని సంజ్ఞః.

తా. ఈశ్లోకమునందు నానావిధము లగు నుత్పత్తి స్థానవ
గల తిర్యక్పక్షి మృగాశ్వ మహిష వృషభ శున కాహి మా
స్థావరాదుల యుత్పత్తి విశేషములు వచింపఁ బడినవి. ఇందుఁ బ
ర్థముగాని, ఉత్పన్న జంతు క్షేమాది పరిజ్ఞానార్థమైగాని, యెవ్వ
ప్రశ్న సేయుదురు కాఁబట్టి యట్టి ప్రశ్న సేయువారి వలన జన్మ
మెఱిఁగి వక్ష్యమాణ క్రమమునఁ బరిశీలింపఁగ వియోనిజన్మ నిశ్చ
జ్ఞానము గల్గుచున్నది. కావున నావిషయ మీయధ్యాయమునఁ
దెలియఁ దగినది. ఎట్లనఁగ—చంద్రుఁ డున్న ద్వాదశాంశకు సమా
మగు నాకారముగల జంతువు జనించిన దనియు నాచంద్రుఁ
ద్వాదశాంశము మృగ మేషాది తిర్యగ్జంతు నామము గల్గిన
వియోని జన్మమును జెప్పవలయు ననియు, నట్లు గాని పక్షివ
జెప్పఁగూడ దనియు నెంచఁ దగినది. ఇందులకు నుదాహరణము.
చంద్రుఁడు మేష ద్వాదశాంశమునం దుండెనేని మేఁక గొ
మున్నగు వాని జన్మమును, వృషభ ద్వాదశాంశము నందుం
వృషభ మహిషాది జననమును, కర్కాటక ద్వాదశాంశమునం ద
నేని యెండ్రకాయ మున్నగు వానిజననమును, సింహ ద్వాదశా
ము నందుండెనేని సింహ శార్దూల జంబుక శునక మార్జాలాది జన

ను, వృశ్చిక ద్వాదశాంశము నందుండెనేని సర్ప వృశ్చిక కీటకాది జననమును, ధను ద్వాదశాం శోత్తరార్ధమునం దుండెనేని యశ్వ గర్ద భాది జననమును, మకర ద్వాదశాంశ పూర్వార్ధమునం దుండెనేని మృగ జన్మమును, ఉత్తరార్ధమునందుండెనేని మండూకాది జల జంతు జననమును, మీనము నందుండెనేని చేపలు మున్నగు జలచర జన్మ మును వచింప వలయును. అయిన నేతావన్మాత్రమువలన, ఈవియోని జనన నిశ్చయము వచింపఁ గూడదు. ఏమనఁగ:—"కూర గ్రహై స్సుబలిభిః" అని చెప్పి యుండుటంజేసి, రవి కుజ శనులును, పాపగ్ర హాయుక్త బుధుండును, క్షీణచంద్రుండును, బలవంతు లైయుండి, శుభ గ్రహములు బలహీను లైయుండిరేని, నపుంసక గ్రహము లగు శని బుధులు కేంద్ర స్థానములయం దుండిరేని, ముందుగఁ జెప్పఁబడిన వియోని జన్మమును జెప్పవలయును. ఇది యొక వియోని జన్మయో గము. మఱియుఁ జంద్రుఁడు పూర్వోక్త ప్రకారముగ, వియోని సంజ్ఞ గల ద్వాదశాంశముల యందుండఁగాఁ బాప గ్రహములు బలవం తులై, శుభగ్రహములు బలహీనులై యుండి, యేస్థానమునందైన నుండెడు బుధునిచేఁ గాని, శనిచేతం గాని లగ్నము చూడఁబడుచుండె నేని, వియోనిజన్మమును వచింప వలయు. నిది రెండవయోగము. మఱియు నాచంద్రుఁడు ద్విపద రాశి ద్వాదశాంశమునం దుండి పూ ర్వోక్త యోగము లేక యుండెనేని ద్విపాద జనన మనిచెప్పవలయును. ఇందులకు, "క్రూరై స్సుబల సమేతై ర్విబలై స్సౌమ్యై ర్వియోని భాగగతే, చంద్రే జ్ఞ శనీ కేంద్రే తద్వీక్షితే చోదయే వియోని స్యాత్, మేష శశి తదంశే భాగాది ప్రసవ మాహు రాచార్యాః, గో మహిషాణాం గోంశే నర రూపాణాం తృతీయాంశే, తత్ర చతు ర్థే భాగే కూర్మాదీనాం భవే దుదక జానామ్, వ్యాఘ్రాదీనాం పరతః పరత జ్ఞేయా నరాణాంచ, వణిగంశే నరరూపా వృశ్చిక భాగే తథా భుజం గాద్యాః, ఖర తురగా ద్యా నవమే మృగ శిఖినాం స్యాత్తథా దశమే, జ్ఞేయాశ్చ తత్ర వివిధా వృక్షా స్తృణ జాత యశ్చిత్రాః, ఏకాదశేచ పురుషా జలజా నానావిధా శ్చాంత్యే, శ్వ ప్రభృతీనాం ప్రభవే యావంతో ద్వాదశాంశకా లగ్నే, తావం త్యేవ ప్రవదేత్ పుంస్త్రీ

సంజ్ఞాన్యవత్యాని." అని సారావళి గ్రంథమునందు బాగుగఁ జెప్పఁబడుటంజేసి యీ వియోని జన్మము లూహింప వలయును.

పాపా బలిన స్స్వభాగగాః
పారక్యే విబలాశ్చ శోభనాః,
లగ్నంచ వియోని సంజ్ఞకం
దృష్ట్వా త్రాపి వియోని మాదిశేత్. 2

తా. అనఁగా పాపగ్రహములు బలవంతులై స్వనవాంశమునం దుండి, శుభగ్రహములు బలహీనులై పరకీయ నవాంశల యందుండి రేని, తాత్కాలిక లగ్నమును వియోని సంజ్ఞ గలవానినిగాఁ దెలిసి కొని, "చందోత్రిపగద్విరసభాగధిమానరూపం" అని చెప్పఁబడిన శ్లోక ప్రకారము వియోనిజన్మమును జెప్పఁదగినది.

క్రియ శ్శిరో వక్త్ర గళం వృషోన్యే
పాదాంసకం పృష్ఠ మురోథ పార్శ్వే,
కుక్షి స్త్వపానాం ఘ్రియథ మేఢ్ర ముష్కా
స్ఫి క్పుచ్ఛ మి త్యాహ చతుష్ప దాంగే. 3

అనఁగా నానావిధ యోని జన్మము లగు జంతువులలోఁ జతుష్పా జ్జంతువులు ముఖ్యోపయోగములు గావున, వాని యంగములు రాశి స్వరూపములుగఁ జెప్పఁబడినది. ఎట్లనఁగ—చతుష్పాజ్జంతువులకు మేషము శిరస్సనియును, వృషభము ముఖ కంఠములనియును, మిథునాదులు పాదాది సంజ్ఞ లనియు నెఱుంగ వలయును. అనఁగా—మిథునము ముందఱి కాళ్లు భుజ శిరస్సు లనియును, కర్కాటకము వీఁపనియు, సింహము వక్ష స్సనియు, కన్య రెండు పార్శ్వములనియు, తుల కుక్షి యనియును, వృశ్చికము గుద ప్రదేశ మనియు, ధనుస్సు పశ్చిమ పాదము లనియును, మకరము లింగ మనియును-వృషణము లనియును, కుంభము పిఱుఁదులనియును, మీనము వాల మనియును, ఇట్లు చతుష్పాజ్జంతువుల అవయవముల యందు నిర్ణయింపఁ బడినవి. ఇందుకుఁ గొందఱు రాశివిభాగమును చెప్పుచున్నారు. కాఁబట్టి చతుష్పదగ్రహణ ముపలక్షణార్థము గనుక పక్షు

లకుంగూడ నిదే ప్రకారమని యెఱుంగునది. పక్షులకుఁ బూర్వాపాదార్ధ స్థానమునందుఁ బక్షములను జెప్పవలయును.

లగ్నాంశకా ద్గ్రహ యోగే క్షణాద్వా
వర్ణా న్వదే ద్బల యుక్తా ద్వియోనౌ,
దృష్ట్యా సమానాన్ ప్రవదే త్స్వసంఖ్యయా
రేఖా వదేత్ స్మర సంస్థైశ్చ పృష్ఠే. 4

అనఁగా లగ్నమునందు నే గ్రహ మున్నదో యా గ్రహంబునకు "తామ్ర సితాతిరక్త హరితవ్యాపీత చిత్రాసితా" అను శ్లోకార్థమును బట్టి యేవర్ణము చెప్పఁబడి యున్నదో, యావర్ణమును వియోని జంతువుకుఁ జెప్పవలయు. లగ్నమునందు గ్రహము లేని పక్షంబున లగ్నము నే గ్రహము చూచుచున్నదో, ఆ గ్రహ వర్ణంబును వియోని జంతువుకుఁ జెప్పఁ దగినది. లగ్నము నే గ్రహము గాని చూడకుండినచో, లగ్నమునందు నేరాశి నవాంశ ముదయించుచున్నదో, ఆరాశికిఁ జెప్పఁబడిన "రక్త శ్శ్వేత శ్శుక తనునిభః" అను శ్లోకమునఁ జెప్పఁబడిన ప్రకారము వియోని జంతువుకు వర్ణము చెప్పఁ దగినది. అనేక గ్రహములు లగ్నంబునం దుండిన పక్షమున నా గ్రహములలో బలవ ద్గ్రహ వర్ణము బాహుళ్యముగఁ జెప్పి, బలహీన గ్రహ వర్ణము బలహీనముగఁ జెప్ప వలయును. మఱియు నెన్ని గ్రహములు లగ్నమును జూచుచుండున ట్లేర్పడి యుండునో యన్ని వర్ణములు వియోని జంతువుకు నిర్ణయింపఁ దగినది. ఇదియునుంగాక, లగ్నము గాని, లగ్న నవాంశముగాని, తన్నాథునిచేఁ జూడఁ బడుచుండినను నందుండినను, తద్వర్ణమును జెప్ప వలయును. మఱియు వియోని జంతువు యొక్క యవయవమునందు నే గ్రహ ముండునో యాయంగమునం దా గ్రహ వర్ణమును జెప్పవలయును. సప్తమ స్థానము నందుండు గ్రహముల వలన, వీఁపునందుఁ గల రేఖలను వచింప వలయును. ఇందులకు సారావళి గ్రంథాంతర శ్లోకోదాహరణము. "మేషాదిభి రుదయస్థై రంశై ర్వా గ్రహయుతై శ్చ దృష్టై ర్వా, స్వాంస్వం వర్ణం బ్రూయా ద్గా

త్రే చిహ్నం వ్రణం చాపి, స్వగృహాంశక సంయోగా ద్విద్యా ద్వర్ణాన్ పరాంశకే సూతౌ, సప్తమ సంస్థా కుర్యుః పృష్ఠే రేఖా స్స్వవర్ణ సమాః, వీక్షంతే యావంతో విహోని వర్ణాశ్చ తావంతః, బలహీనో గగన చరః కరోతి వర్ణం విహోనిజం హీనం, పీతం కరోతి జీవ శ్శశీ సితం భార్గవో విచిత్రంచ,రక్తం దినకర రుధిరౌ రవిజః కృష్ణం బుధ శ్శబలం, స్వేరాశౌ పరభాగే పరరాశౌ స్వేనవాంశకే తిష్ఠన్, పశ్యన్ గ్రహో విలగ్నం స్వవర్ణ వర్ణం తదా కురుతే.'' అని వివరించి యున్నది.

ఖగే దృకాణే బల సంయుతేన వా
గ్రహేణ యుక్తే చరభాంశ కోదయే,
బుధాంశకే వా విహగా స్థలాంబుజాః
శనైశ్చ రేంద్వీక్షణ యోగ సంభవాః. 5

పక్షి జన్మ జ్ఞానమునకు సాధనము చెప్పఁబడినది. ఎట్లనఁగ— మిధున ద్వితీయ ద్రేక్కాణమును, సింహ ప్రథమ ద్రేక్కాణమును, తులా ద్వితీయ ద్రేక్కాణమును, కుంభ ప్రథమ ద్రేక్కాణమును, పక్షి ద్రేక్కాణములు గాఁబట్టి, ఈద్రేక్కాణములయం దొకద్రేక్కాణమున, శనిచంద్రు లుండినంగాని చూచినం గాని స్థలమునందును జలమునందును బుట్టిన పక్షులని యెఱుంగ వలయును. మఱియుఁ బక్షి ద్రేక్కాణము శనిసంయుక్తమైనను జూడఁబడినను, మెట్ట యందుండు పక్షి జన్మ మని వచింప వలయును. చంద్రునిచేఁ జూడఁబడినను గూడినను, జలపక్షుల జన్మమని చెప్పదగినది. ఇదిగాక బల సంయుత గ్రహముతోఁడఁ గూడిన చరరాశిగాని చర నవాంశగాని శని సంయుక్తమైనను జూడఁబడినను, స్థల పక్షి జన్మమనం దగినది. చంద్ర యుత దృష్టమైయుండినచో జలపక్షి జననము చెప్పఁదగినది. మఱియు జన్మలగ్నమునందు బుధ నవాంశము లగుమిధున కన్యాంశములలో నొక నవాంశమైయుండి, ఆనవాంశ బలవ ద్గ్రహ సంయుక్తమై, శనియుత సందృష్టమై యుండెనేని స్థలపక్షిజననము వచింప వలయును. చంద్రయుత దృష్టమై యుండెనేని జలపక్షి జనన మని వక్కాణింప వలయును. ఇందులకు:—"విహగోదిత దృక్కాణే గ్రహేణ బలినా యుతేథ చర

భాంశే, బోధాంశేవా విహగాః స్థలాంబుజా శ్చని శశీక్షణా ద్యోగాత్." అని సారావళి గ్రంథమునందుఁ జెప్పఁబడినది.

హోరేందు సూరి రవిభి ర్విబలై స్తరూణాం
తోయే స్థలే తరుభవోంశ కృతః ప్రభేదః,
లగ్నా ద్గ్రహైః స్థల జలర్క్ష పతిస్తు యావాం
స్తావం తఏవ తరవః స్థలి తోయజాతాః. 6

అనఁగా వృక్షోత్పత్తి దెలియుటకు సాధనము చెప్పఁబడినది. ఎట్లనఁగ——చంద్రుఁడును, బృహస్పతియును, సూర్యుండును వీరలు జన్మప్రశ్నలగ్న సమయమునందు బలహీనులై యుండిరేని పృచ్ఛకుఁడు వృక్ష జన్మ ప్రశ్న సేయు చున్నాఁడని చెప్పఁ దగినది. మఱియు నాప్రశ్న భేద మించుక వచింపఁబడినది. జలప్రదేశముగ నుండవచ్చునా? నిర్జల ప్రదేశంబుగ నుండవచ్చునా? చెట్లు మొలచునా? ఇవి నవాంశల వలన నెఱుంగ వలయును. అదెట్లనఁగ:—— జలరాసులైన కర్కాటక మకర పశ్చిమార్థ, మీనముల యందు నొకరాశి నవాంశ ముదయించినచో జలప్రదేశమునందు వృక్షోత్పత్తి యనియును, ఇతర రాశి నవాంశ ముదయించినచో మెట్ట యందు వృక్ష జనితం బనియు నిర్ణయింప వలయును. మఱి యందు సంఖ్యా నిర్ణయం బెట్లనిన.——లగ్న నవాంశము స్థలరాశిగాని, జలరాశిగాని, తదధిపతియగు గ్రహము లగ్నాదిగ నెన్నవ రాశియం దుండునో, ఆసంఖ్యాన్విత వృక్షంబులని యెఱుంగునది. స్థలమునంగాని జలమునంగాని మొలచినవని, స్థల జల రాశి నవాంశాను సారంబుగఁ జెప్పవలయును. ఇక్కడ నవాంశాధిపతి వశంబున వక్ష్యమాణం బగునాయుర్దాయ విధానముచేత ద్వి త్రిగుణత్వముం జెప్పవలయును. ఇందుల కుదాహరణము. "లగ్నార్క జీవ చంద్రై రబలై శ్చేష్టైశ్చ మూల యోనిస్స్యాత్, స్థల జల భవన విభాగా వృక్షాదీనాం ప్రభేద కరాః, స్థల జల యోగో లగ్నా ద్యావతి రాశౌతు తేపి తావంతః, ద్వి త్రిగుణత్వం తేషా మాయుర్దాయ ప్రకారోక్తః." అని సారావళియందుఁ జెప్పఁబడియున్నది.

అంతస్సారాన్ జనయతి రవి ర్దుర్భగాన్ సూర్య సూనుః
క్షీరోపేతాన్ తుహినకరణః కంటకాఢ్యాంశ్చ భౌమః,
వాగీశ జ్ఞౌ సఫల విఫలాన్ పుష్ప వృక్షాంశ్చ శుక్రః
స్నిగ్ధా నిందుః కటుక విటపాన్ భూమిపుత్రోశ్చ భూయః. 7

నవాంశాధిపతుల వలన వృక్షముల విశేషము లెఱుంగు తెఱంగు చెప్పఁబడినది. "సూర్యుఁడు నవాంశాధిపతియైనచో లోపల చేవగల శింశుపాది వృక్షంబులను జనింపఁ జేయును, శనైశ్చరుఁడు నవాంశాధిపతి యైనచో మన శ్చత్తుస్సులకు నప్రియము లగు వృక్షములను పుట్టించు ననియు,చంద్రుఁడు నవాంశాధిపతి యైనచో పాలతోఁ గూడిన చెఱకు మున్నగు వానిని జనింపఁ జేయుననియు, అంగారకుఁడు నవాంశాధిపతి యైనచో ముండ్లతోఁ గూడిన, చండ్ర మొదలగువాని జనింపఁజేయు ననియు, గురు బుధులు నవాంశాధిపతు లైరేని క్రమంబుగ సఫల విఫల వృక్షంబులఁ బుట్టింతు రనియును,శుక్రుఁ డట్లు నవాంశాధిపతి యైనచో మాలతి, చేమంతి; మొదలగు పుష్ప లతాదులను జనింపఁజేయుననియును, అంగారకుఁడు జీడి చెట్టు మున్నగువాని పుట్టించు ననియుఁ,జంద్రుఁడు నవాంశాధిపతి యైనచో దేవదారు వృక్షాదులుదయింపఁ జేయు ననియును, కుజ చంద్రులకు ద్వివిధ వృక్షజనకత్వముం జెప్పుటం జేసి, చంద్రుఁడు నునుపగువృక్షమును, పాలతో నుండు వృక్షమును జనింపఁ జేయుననియును, కుజుఁడు బరుషపుఁ జెట్టును బుట్టించుననియుం జెప్ప వలయును. ఇందులకు నుదాహరణము. "అంతస్సారాన్ వృక్షాన్ భాను ర్దుర్గోద్భవాన్ కరోతి భృశం, క్షీర స్నేహసమేతాన్ శశీ గురుఃఫల సమేతాంశ్చ, కటుకంటకినో రుధిర స్సుదుర్భగాం స్తరణిజ స్తతశ్శుక్రః,కుసుమ ఫల స్నేహయుతాన్ బుధస్తు పతివర్జితాన్ జయేత్" అని సారావళి యందుఁ జెప్పఁబడియున్నది.

శుభోఽశుభర్క్షే రుచిరం కుభూమిజం
కరోతి వృక్షం విపరీత మన్యథా,
పరాంశకే యావతి విచ్యుతస్స్వకా
ద్భవంతి తుల్యా స్తరవ స్తథా విధాః. 8

అనఁగా సదసద్వృక్ష విజ్ఞానమును వృక్షసంఖ్యయును జెప్పఁబడినది. ఎట్లనఁగ—లగ్ననవాంశరాశి, స్థలరాశిగాని జలరాశిగాని యై, తదధిపతి యగు శుభగ్రహము తత్కాలమునఁ బాపగ్రహ రాశియం దుండినచో, మనోహర మగువృక్షము నశుభము లగు స్మశానాదుల యందుఁ బుట్టిన దానినిగఁ జేయును. అట్లు కానిపక్షమునఁ జెప్పుటకుఁ గానియట్ల సేయు ననియును, మఱియు నవాంశాధిపతి అశుభ గ్రహమై తాత్కాలమున, శుభ గ్రహరాశియం దుండినచో, చెడ్డచెట్టయిన నుద్యాన వనమునం బుట్టు ననియుం జెప్పఁ దగినది. నవాంశాధిపతి శుభగ్రహమై శుభరాశియం దుండెనేని, సారవంతమగు భూమి యందు శ్రేష్ఠమగు వృక్షము జనించు నని తెలియఁ దగినది. నవాంశాధిపతి అశుభగ్రహమై అశుభ రాశియం దుండినచోఁ జెడ్డభూమి యందుఁ జెడ్డచెట్టు పుట్టుననియు నాస్థల జల రాశి నవాంశాధిపతియైన గ్రహము స్వనవాంశమున నుండి యెన్నవదైన పరనవాంశమునం దుండునో యన్నిసంఖ్యలు గల తజ్జాతీయము లగువృక్షములు గలవని యర్థము. అనఁగా—నవాం శాధిపతియైన గ్రహము తననవాంశమును విడిచి యెన్నవ సంఖ్యగల పరనవాంశమునం దుండునో యన్నవ సంఖ్య గల వృక్షములు నవాంశరాశి తుల్యముగ స్థలమునంగాని జలమునం గాని మొలచినవని తెలియఁ దగినది. ఈశ్లోకమున రెండువిధములుగ వృక్ష సంఖ్య జెప్పఁబడినది గనుక యిందులకు నుదాహరణము:— "స్వాంశా త్పరాంశ గామిషు యావ త్సంఖ్యా భవంతి తావంతః, స్థలజావా జలజావా తరవః ప్రాక్సంఖ్యయా ప్రవదేత్." అని సారావళి యందుఁ జెప్పఁబడి యున్నది.

ఇట్లు వియోని జన్మాధ్యాయమునందుఁ

దృతీయాధ్యాయము

సంపూర్ణము.

శ్రీ ర స్తు.

# బృ హ జ్జా త క ము

## నిషేకాధ్యాయము.

మూ॥ కుజేందు హేతుః ప్రతిమాసమార్తవం
గతేతు పీడర్క్ష మనుష్ణ దీధితౌ,
అతోన్యథాస్థే శుభ పుం గ్రహేక్షితే
నరేణ సంయోగ ముపైతి కామినీ. 1

తా. ఈనిషేకాధ్యాయమునందు గర్భాధాన కాలవశమున, నేఫలము చెప్ప వలయునో, అందు మొట్టమొదట గర్భాధాన కారణ భూత మగు స్త్రీల ఋతువును, ఆఋతుకాలమున స్త్రీపురుషుల సంయోగములును జెప్పఁబడినవి. ఎట్లనఁగ:—ప్రతిమాసమునందు స్త్రీలకు రజో దర్శనమునకుఁ జంద్ర కుజులు కారణ భూతులైరి. చంద్రుఁడు స్త్రీల యనుపచయ స్థానమును బొంది కుజునిచేఁ జూడఁబడెనేని స్త్రీలకు రజో దర్శనమగుచున్నది. అనఁగా—వంధ్యాతుర వృద్ధా వ్యతిరిక్త లగు స్త్రీలకు జన్మరాశి మొద లనుపచయ స్థానములగు ౧-౨-౪-౫-౭-౮-౯-౧౨-ఇండ్ల యందుఁ జంద్రుఁ డుండి కుజునిచేఁ జూడఁబడెనేని గర్భధారణ హేతు వగు నార్తవము సంభవించుచున్నది. ఇందులకు బాదరాయణుండు, "స్త్రీణాం గతో నుపచయర్క్ష మనుష్ణ రశ్మిస్సందృశ్యతే యది ధరాతనయేన తాసాం, గర్భ గ్రహార్తవ మశంతి తదాన వంధ్యా, వృద్ధాతు రాల్పవయసా మపి చైత దిష్టమ్" అని వచించి యున్నాఁడు. ఇదియునుంగాక. "అనుపచయ రాశి సంస్థే కుముదాకర బాంధవే రుధిర దృష్టే, ప్రతిమాసం యువతీనాం భవతీహ రజోధ్రువం త్వేవమ్, ఇందు ర్జలం కుజోగ్నిర్జల మిశ్రం త్వగ్ని రేవ పిత్తం స్యాత్, ఏవం రక్తే క్షుభితే పిత్తేన రజః ప్రవర్తతే స్త్రీషు, ఏవం యద్ద్రివతి రజో గర్భస్య నిమిత్త మేవ కథితంతత్, ఉపచయ సంస్థే

విఫలం ప్రతిమాసం దర్శనం తస్యాః.'' అని సారావళియందుఁ జెప్పఁబడి యున్నది. కాఁబట్టి చంద్రుఁడు పురుషుని జన్మరాశి మొదలుకొని యుపచయ రాసు లగు ౩-౬-౧౦-౧౧ ఇండ్ల యందుండి, శుభగ్రహమును బురుషగ్రహమును నైన గురువు చేతఁ జూడఁబడెనేని స్త్రీపురుషులకు సంగమముగల్గునని యర్థము. అనఁగాఁ బురుషునిజన్మరాశికి నుపచయము లైన ౩-౬-౧౦-౧౧ ఇండ్లయందుఁ జంద్రుఁ డుండి గురువుచేఁ జూడఁబడెనేని స్త్రీపురుష సంయోగము తప్పక యగుచున్నది. వ్యత్యస్తమైనచో సంయోగము గల్గదని యెఱుంగ వలయును. ఇందులకు నుదాహరణ శ్లోకములు—''పురుషోపచయ గృహస్థో గురుణాయది దృశ్యతే హిమమయూఖః, స్త్రీపూరుష సంయోగం తదావదే దన్యథానైవమ్.'' అని బౌదరాయణులు వచించి యున్నారు. ''ఉపచయ భవనే శశభృ ద్దృష్టో, గురుణా సుహృద్భి రథవాసౌ, పుంసా కరోతి యోగం విశేషత శ్శుక్ర సందృష్టః.'' అని సారావళి గ్రంథమునందును జెప్పఁబడి యున్నది. ఈవిచారము ఋతు స్నానానంతర కాలమునఁ జేయఁ దగినది. మఱి యిందులకు, ''ఋతు విరమే స్నాతాయాం యద్యుపచయ సంస్థిత శ్శశీభవతి, బలినా గురుణా దృష్టో భర్త్రా సహ సంగమశ్చ తదా, రాజపురుషేణ రవిణా విటేన భౌమేన వీక్షితే చంద్రే, సౌమ్యేన చపలమతినా భృగుణా కాంతేన రూపవతా, భృత్యేన సూర్యపుత్త్రేణా యాతి స్త్రీ సుసంయోగం, ఏకైకేన ఫలం స్యా ద్దృష్టే నాన్యైః కుజాదిభిః పాపైః,సర్వై స్స్వగృహా త్యక్త్వైర్గచ్ఛతి వేశ్యాపదం యువతీ'' అని మణిత్థుఁడు వచించి యున్నాఁడు.

యథాస్తరాశి ర్మిథునం సమేతి
తథైవ వాచ్యో మిథున ప్రయోగః,
అస ద్గ్రిహాలోకిత సంయుతైస్తే
స్సరోష ఇష్టై స్సవిలాస హాసః. 2

తా. క్రీడా విధము చెప్పఁబడినది. ఎట్లనఁగ—ఆధాన లగ్నమునకుఁగాని, జన్మలగ్నమునకుఁగాని, ప్రశ్నలగ్నమునకుఁగాని, సప్తమరాశ్యస్తరాశి యనఁబడుటంజేసి ఆరాశి సంజ్ఞగల జంతువు మిథున

కర్మ నే ప్రకారము సల్పుచున్నదో, యా ప్రకారము స్త్రీపురుషుల సంయోగము గల్గునని చెప్పఁదగినది. అనఁగా—లగ్నమునకు సప్తమరాశి మేషమైయుండినచో నామేషము లెట్లు క్రీడించునో యట్లు క్రీడగల్గుననియు, వృషభమయ్యేనేని, గో వృషభము లెట్లు క్రీడించునో యట్లు క్రీడగల్గుననియు, నీప్రకారము ద్విపద చతుష్పదాది రాశ్యనుసారముగ ద్విపదచతుష్పదాది క్రీడలను స్త్రీపురుషులకుం జెప్పవలయును. మఱియు సప్తమ స్థానము పాప గ్రహ దృష్టమై పాపగ్రహ సంయుక్తమై యుండినచో గలహములతోఁ గూడిన సంగమము గల్గు ననియును, శుభగ్రహ దృష్ట్యన్వితమైనపక్షమున విలాసపరిహాసాదులతోఁ గూడిన సురతము గల్గు ననియును, గ్రహదృష్ట్యన్వితము గానట్లయినఁ గలహవిలాసాదులు లేని సంగమము గల్గు ననియును, దెలియఁ దగినది. ఇందుల కుదాహరణము. "ద్విపదాదయో విలగ్నా త్సురతం కుర్వంతి సప్తమే యద్వత్, తద్వత్ స్త్రీ పురుషాణాం గర్భాధానం సమాదేశ్యమ్, అస్తే శుభయుత దృష్టే సరోష కలహం వదే ద్గ్రామ్యం, సౌమ్యైస్సౌమ్యంసురతంవా త్స్యాయన సంప్రయోగికంవాచ్యం." అని సారావళియందుఁ జెప్పఁబడినది.

రవీందు శుక్రావనిజై స్స్వభాగగై
ర్గురౌ త్రికోణోదయ సంస్థితే పివా,
భవ త్యపత్యంహి విబీజినా మిమే
కరాహిమాంశో ర్విదృశా మివాఫలాః. 3

తా. గర్భ సంభవాసంభవముల విధము చెప్పఁబడినది. ఎట్లనఁగ-ఆధాన లగ్న సమయమునఁగాని, ప్రశ్న కాలమునఁగాని, సూర్య చంద్రాంగారక శుక్రు లేకరాశియందు నైనను, స్వనవాంశ గతులై యుండిరేని గర్భము గల్గునని యర్థము. మఱియును, "బలయుక్తౌ స్వగృహాంశే ష్వర్క సితావుపచయర్క్ష గావుంసాం, స్త్రీణాంవా కుజ చంద్రౌ యదా తదా సంభవతి గర్భః." అని లఘుజాతకమునందుఁ జెప్పఁబడి యున్నది గనుక సూర్య చంద్ర శుక్రకుజులు నల్వురును స్వనవాంశ గతులుగాకున్నను, పురుషోపచయ రాశిగతులగు సూర్య శుక్రు లైనను

స్వనవాంశ గతులై యుండిరేని గర్భోత్పత్తి యగునని తెలియఁ దగినది. మఱియు గురువు నవమ పంచమముల యందుఁగాని లగ్నమునం దుఁగాని యుండినచో గర్భోత్పత్తి యగును. ఈచెప్పఁబడిన గర్భసంయోగములు వీర్య హీను లగుస్త్రీ పురుషులకుఁ జంద్రుని కిరణములు గ్రుడ్డివారికి వలె నిష్ఫలం బనియర్థము.

దివాకరేంద్వోః స్మరగా కుజార్కజౌ
గద ప్రదా పుంగవ యోషితో స్తదా,
వ్యయ స్వగా మృత్యుకరౌ యుత స్తథా
తదేక దృష్టో మరణాయు కల్పతే. 4

తా. ఆధాన కాలవశమునఁ బ్రసవ పర్యంతము దంపతులకుఁ గల్గెడు నశుభ ఫలములు జెప్పఁబడినవి. ఎట్లనఁగ:—సూర్య చంద్రులకు నంగారక శనులు సప్తమ స్థానస్థితు లైరేని స్త్రీపురుషులకు రోగములు గల్గునని తెలియఁ దగినది. అనఁగా:—ఆధాన కాలమున నేరాశియందు సూర్యుఁ డుండునో, యారాశికి సప్తమ రాశియందు గర్భ ద్వితీయమాసాధిపతి యైన కుజుఁ డుండినచో, ద్వితీయ మాసమునందు షష్ఠ మాసాధిపతి యైన శని యుండెనేని షష్ఠ మాసమునందుఁ బురుషునకు రోగము గల్గు నని తెలియఁ దగినది. ఆధాన కాలమున నేరాశి యందుఁ జంద్రుఁ డుండునో, ఆరాశికి సప్తమ రాశియందుఁ గుజ శను లుండిరేని పురుషునకుఁ జెప్పఁబడిన విధంబున స్వమాసములయందు స్త్రీకిరోగము గల్గునని యెఱుంగ వలయును. ఆసూర్య చంద్రులకుఁ గుజ శనులలో నొకఁడు పంద్రెండవయింటను, మఱి యొకఁడు రెండవ యింట నుండిరేని స్త్రీ పురుషులకు మరణము గల్గు నని తెలియఁ దగినది. చంద్రునకుఁ బంద్రెండవయింట నొకఁడును రెండవయింట నొకఁడు నుండిరేని వారిలో బలవంతులకుఁ జెప్పఁబడిన మాసమున స్త్రీకి మరణము గల్గును. సూర్యునితో శనికుజులలో నొకనిం గూడియుండి, యొకనిచేఁ జూడఁబడిన పక్షమున నాకుజ శనులయందు నెవఁడు బలవంతుఁడో, వానికిఁ జెప్పం బడిన గర్భ మాసమునందుఁ బురుషునకు మరణము గల్గుననియు, నివ్విధంబునఁ జంద్రుఁడు కుజ శనులయం దొకనితోఁ గూడి, మఱి

యొకనిచేఁ జూడంబడిన నందు బలవంతుని మాసమునందు స్త్రీకి మృత్యువు సంభవించునని యెఱుంగ వలయును.

దివార్క శుక్రౌ పితృ మాతృ సంజ్ఞితౌ
శనైశ్చ రేందూనిశితద్విపర్యయాత్,
పితృవ్య మాతృ ష్వసృ సంజ్ఞితౌచ తా
వధౌజ యుగ్మర్క్ష గతౌ తయో శ్శుభౌ. 5

తా. ఆధానము సేయఁ బడిన గర్భము వలనఁ బితృ మాతృ పితృవ్య మాతృష్వసలకుం గల్గు శుభాశుభముల నెఱుంగు తెఱంగుఁ జెప్పఁ బడినది. ఎట్లనఁగ—పగటి కాలమునందు నాధానము గాని జననముగాని యైనచో, రవి శుక్రులు పితృ మాతృసంజ్ఞలం బొందుదురు. అనఁగా:—పితృకారకుండు సూర్యుం డనియు, మాతృకారకుఁడు శుక్రుం డనియు నెఱుంగునది. రాత్రికాలమునందు నాధానముగాని జన్మంబుగాని యైన పక్షమున శని చంద్రులు పితృ మాతృ సంజ్ఞలం బొందుదురు. అనఁగాఁ బితృకారకుండు శనియును, మాతృకారకుండు చంద్రుండు నని యెఱుంగునది. మఱి యా దివా రాత్రి వ్యత్యయము వలన నా రెండు గ్రహములు పితృవ్య మాతృ ష్వసృ సంజ్ఞము లగును. పితృవ్యు లనఁగాఁ, బినతండ్రియుఁ బెదతండ్రియు ననియర్థము. మాతృష్వస లనఁగఁ, బినతల్లి పెదతల్లి యని యర్థము. ఈసంజ్ఞలకుఁ బ్రయోజన మేమనిన, నాచెప్పఁబడిన రెండేసి గ్రహములు క్రమముగ విషమ సమ రాసులం బొంది, యా పితృ మాతృ పితృవ్య మాతృష్వసలకు శుభఫల మిత్తురని యర్థము. అనఁగా:—సూర్యుఁడు విషమ రాసు లైన మేష మిథున సింహాదుల యందున్న పక్షమున, నాధాన జన్మములు పగటి యందు నైన శిశు జనకునకును, రాత్రియందు నైన పెదతండ్రి పినతండ్రులకును శుభ ఫల మిచ్చు ననియును, శుక్రుఁడు సమ రాసు లగు వృష కర్కాటకాదులయందు నున్నచోఁ బగటి యందైన శిశుమాతకు, రాత్రియందైన వానితల్లి పినతల్లులకును శుభకరుం డగును. శని విషమ రాసు లగు మేష మిథున రాసుల యందున్నవాఁడై, రాత్రియందైన వానితండ్రికిని పగటియందైన వాని పెదతండ్రి పినతం

ద్రులకు శుభకరుం డగును. చంద్రుఁడు సమ రాసులగు వృషభ కర్క-
ట కాదుల యందున్నవాఁడై, రాత్రియం దైన బిడ్డతల్లికిని, పగటి
యం దైన వాని పెదతల్లి పినతల్లులకును శుభప్రదుం డగును. ఈచెప్పఁ
బడిన గ్రహము లుక్తవైపరీత్యముగ నుండినచోఁ బితృమాత్రాదులకు
నశుభ ప్రదు లగుదు రని తెలియఁ దగినది. అనఁగా:—సమరాశి
గతుం డగుసూర్యుఁడు, ఆధానాదులు పగటియందైన తండ్రికిని రాత్రి
యందైనఁ బితృవ్యునకును అశుభ ఫల మొసంగును, విషమ రాశి
గతుం డగుశుక్రుఁడు పగటి యందైనం దల్లికి, రాత్రి యందైనఁ బెద
తల్లి పినతల్లులకును, అశుభుం డగును. సమరాశి గతుం డగు శని
రాత్రియందైనఁ దండ్రికిని పగటియం దైనఁ బితృవ్యునకు నశుభ మొ
సంగును. విషమ రాశి గతుం డగు చంద్రుఁడు రాత్రియందైనఁ దల్లి
కిని పగటి కాలమునందైనఁ బెదతల్లి పినతల్లులకును అశుభుం డగు
నని యెఱుంగ వలయును.

అభిలష ద్విరుద యర్క్షమసద్భి
ర్మరణ మేతి శుభదృష్టి మయాతే,
ఉదయ రాశి సహితేచ యమేస్త్రీ
విగళి తోడుపతి భూసుత దృష్టే. 6

తా. ఆధాన సమయమువలన స్త్రీకి మరణ యోగములు చెప్పఁ
బడినవి. అనఁగా శుభగ్రహములచేతఁ జూడఁ బడక యున్న యాధాన
లగ్నమునకు ద్వాదశ స్థానమునఁ బాప గ్రహము లుండినచోఁ, గర్భి
ణి స్త్రీ మృతి నొందునని యర్థము. ఇందులకు, "అశుభై ర్ద్వాదశ
ర్క్షస్థై శ్శుభ దృష్టి వివర్జితే, ఆధాన లగ్నే మరణం యోషితః ప్రవదే
ద్బుధః" అని గార్గి చెప్పియున్నాఁడు.— "ఉదయర్క్ష మభిలషద్భిః"
అనుట వలన ద్వితీయమునం దున్న పాప గ్రహము లని కొందఱు
తలంతురుగాని యిచ్చట నాశంక గూఁడదు. లగ్నగతుఁడైన శనైశ్చ
రుఁడు క్షీణచంద్రునిచేతను, గుజునిచేతను, జూడఁ బడుచుండినచోఁ,
గర్భిణియగు స్త్రీ మృతి నొందు ననియర్థము.

పాపద్వయ మధ్య సంస్థితౌ
లగ్నేందూ నచ సౌమ్య వీక్షితౌ,
యుగప త్పృథగే వనావదే
న్నారీ గర్భయుతా విపద్యతే. 7

తా. గర్భిణికి మఱియొకమృతయోగమువచింపఁబడినది. ఎట్లనఁగ:—ఆధానలగ్నమును జంద్రుండు నేక కాలమునందుఁ బాప గ్రహములగు నిద్దఱి నడుమ నున్నపుడు శుభగ్రహ వీక్షణము లేనిపక్షమున గర్భిణిస్త్రీ మృతినొందుచున్నదనియర్థము. అనఁగా:—ఆధాన లగ్నము నందుఁ జంద్రుఁడుండి, యొకపాపగ్రహము ద్వాదశమునందును మఱియొక పాపగ్రహము రెండవయింట నుండిన, నాలగ్న చంద్రులు శుభగ్రహములచేఁ జూడఁబడకుండినపక్షమున గర్భిణికి మరణము గల్గునని యెఱుంగవలయును. మఱియు లగ్న మొకరాశి చంద్రుఁ డొకరాశియై, చంద్రుఁడు వేఱుగనుండినను,అందు లగ్నముగాని చంద్రుఁడుగాని పాప గ్రహములనడుమ, శుభగ్రహములచేతఁ జూడఁబడక యుండిన, గర్భిణిస్త్రీ మృతినొందు ననియర్థము. ఇదియునుంగాక లగ్న చంద్రులు పృథగ్రాశి గతులై పాపగ్రహముల నడుమ నున్న నీయోగము గల్గు ననియెఱుంగునది. ఎట్లనఁగ:—లగ్నమునకు మూఁడవయింటఁ జంద్రుండును, ౨-౪-౧౨ఇండ్లఁ బాపగ్రహము లుండిరేని యపుడు లగ్నచంద్రులు బాప గ్రహ మధ్య గతు లగుదురు.కాఁబట్టి లగ్న చంద్రులు శుభదృష్టి హీనులై యుండిరేని మృతి గల్గునని వచింపఁ దగినది. ఈ యోగము గలుగఁ జేసెడుగ్రహముల యందు నేగ్రహము బలాధిక్యముతో నుండునో, ఆగ్రహమునకుఁ జెప్పంబడినగర్భమాసమునందు మరణయోగము సంభవించు ననియర్థము. మఱియు లగ్న చంద్రులు రెండు పాపగ్రహములనడుమనుండినను, బలయుక్తము లగుశుభగ్రహముల చేతఁ జూడఁబడినచో, గర్భిణి రోగపీడితురాలై యుండి మృతి గల్గునని వచింపఁ దగినది. ఇందులకు నుదాహరణము. "పాప మధ్యగతౌ స్యాతాం నచ సద్గ్రిహ వీక్షితౌ, ఏకస్థౌవా పృథక్ స్థౌవా మృతి మాయాతి గర్భిణీ, సౌమ్యైస్తు బలిభి ర్దృష్టా రోగిణీ లగ్న శీతగూ." అని నారదులువచియించి యున్నారు.

సూర్యే శశిన శ్చతుర్థగే
లగ్నాద్వా నిధనాశ్రితే కుజే,
బంధ్వం త్యగయోః కుజార్కయోః
క్షీణేందౌ నిధనాయ పూర్వవత్." 8

తా. మఱియు మూఁడు మరణయోగము లీశ్లోకమునం జెప్పఁబడినవి. ఎట్లనఁగ:—చంద్రుఁ డుండురాశి మొదలుకొని నాల్గవయింట నొకపాప గ్రహముండఁగ, నంగారకుఁ డష్టమస్థానమున నుండినచో నొకయోగము. మఱియు లగ్నము మొదలుకొని నాల్గవయింట నొక పాపగ్రహ ముండి, యష్టమ స్థానమునఁ గుజుఁ డుండినచో నొకయోగము. మఱియు, నాల్గవయింటఁ గుజ సూర్యు లుండినను, పంద్రెండవయింట నుండినను లేక యంగారకుఁడు నాల్గవయింటనుండి, పంద్రెండవయింట సూర్యుఁ డుండినను చంద్రుఁ డక్కాలమున నేరాశియందైన క్షీణత్వ మొందియుండినచో, నొకయోగము. అనఁగా గర్భిణికి మృత్యుయోగ మని యర్థము.

ఉద యాస్తగయోః కుజార్కయో
ర్నిధనం శస్త్రకృతం వదే త్తదా,
మాసాధిపతౌ నిపీడితే
తత్కాలం స్రవణం సమాదిశేత్. 9

తా. ఆధాన లగ్నమును బట్టి గర్భిణికి శస్త్ర నిమిత్తమృతియును గర్భస్రావమును జెప్పఁ బడినవి. కుజ సూర్యులు, ౧-౭-ఇండ్లనుండినచో శస్త్ర హేతుక మగుమృతి గల్గు ననియును, భౌమాదులు గ్రహ యుద్ధమున జయింపఁ బడినవారైనను కేత్వాద్యాదులచేత బీడింపఁ బడినవారైనను, సూర్య చంద్రులు పాపయుత దృష్టులైనను రాహుగ్రస్తులైనను నిపీడితు లనంబడుదురు. కాఁబట్టి యీ విధమున వక్ష్యమాణ గ్రంథమునందుఁ జెప్పఁబడు నిషేకకాలము నందు నిపీడితుఁడై యుండినచో నాగ్రహ మధిపతిగాఁ గల గర్భమాసము నందు గర్భస్రావమును జెప్పవలయును.

 

శశాంక లగ్నోపగతై శ్శుభగ్రహై
స్త్రికోణ జాయార్థ సుఖాస్పద స్థితైః,
తృతీయ లాభర్క్ష గతై రశోభనై
స్సుఖీతు గర్భో రవిణా నిరీక్షితః. 10

తా. అనఁగా:—చంద్రునితోఁగాని లగ్నముతోఁగానిఁగూడినట్టి శుభగ్రహములచేతను, నవమ పంచమ సప్తమ ద్వితీయ చతుర్థ దశమ స్థానముల యందుండు శుభగ్రహముల చేతను, చంద్రునకుఁగాని లగ్నమునకుఁగాని తృతీ యైకాదశములనుండెడు పాపగ్రహములచే నైనను, గర్భముపుష్టిగ నుండుననియు, చంద్రుఁడుగాని లగ్నముగాని సూర్యునిచేఁ జూడఁబడినచో గర్భము పుష్టి కల్గు ననియును, అనఁగా శుభగ్రహములు లగ్నమునుగాని చంద్రునిగాని కూడి యుండినను, చంద్రునకుఁగాని లగ్నమునకుఁగాని ౯-౫-౭-౨-౪-౧౦ ఇండ్లయందు శుభగ్రహము లుండినను, తృతీయైకాదశముల యందుఁ బాప గ్రహము లుండినను, లగ్నమును చంద్రుని సూర్యుఁడు చూచినను, గర్భము పుష్టిగల్గి యుండు ననియును, కొందఱు "రవిణా నిరీక్షితః" అనుచోట "గురుణా నిరీక్షితః" అని చెప్పుచున్నారు గాని అదెంతయు సంప్రదాయార్థముగాదు. "హోరేందుగతై స్సౌమ్యై స్త్రికోణ జాయార్థ సుఖాస్పదస్థైర్వా, పాపై స్త్రిలాభ యాతై స్సుఖీతు గర్భో నిరీక్షితో రవిణా" అని సారావళి గ్రంథమునందు, "రవిణా నిరీక్షితః" అనుదానికిఁ జెప్పఁబడియున్నది.

ఓజర్క్షే పురుషాంశకేషు బలిభి ర్లగ్నార్క గు ర్వింధుభిః
పుంజన్మ ప్రవదే త్సమాంశక గతై ర్యుగ్మేషు తై ర్యోషితః,
గుర్వర్కౌ విషమే నరం శశి సితౌ వక్రశ్చ యుగ్మే స్త్రియం
ద్వ్యంగస్థా బుధ వీక్షణాచ్చ యమళౌ కుర్వంతి పక్షే స్వకే. 11

తా. అనఁగా నిషేకకాలమునంగాని, జన్మకాలమునంగాని ప్రశ్నకాలమునంగాని పుంస్త్రీజన్మముల నెఱుంగు తెఱంగు చెప్పఁబడినది. ఎట్లనఁగ:—బేసిరాసులయిన మేష మిథున సింహ తులా ధనుః కుంభ

ముల యందు బలయుక్తులైన రవి గురు చంద్రులచేతఁ బురుష జననమనియును, సమరాసు లగు వృషభ కర్కాట కన్యా వృశ్చిక మకర మీనములయందు సమరాశి నవాంశలయందు బలయుక్తులైన లగ్నార్క గురు చంద్రులచేత స్త్రీజనన మనియు, నీచెప్పఁబడిన లగ్న గ్రహములు సమరాసులయందుఁ గొన్ని, విషమ రాసులయందుఁ గొన్ని యుండినచో, నధికముగ నేరాశియందు గ్రహము లుండునో, యా రాశి యందు గ్రహ బలాను సారముగ స్త్రీపురుష జననములు నిర్ణయింపఁ దగినది. సమ విషరాసుల యందు సమముగ నుండెనేని బలాధిక్యమును బట్టి పుంస్త్రీ జననమును జెప్ప వలయును. మఱియు బలవంతులగు గురుసూర్యులు బేసిరాశియందు నేనవాంశ యందైన నుండిరేని పురుషుని జనింపఁ జేయుదురు. చంద్ర శుక్ర కుజులు బలయుక్తులై సమ రాశియందు నేనవాంశ యందైన నుండిరేని స్త్రీజనన మగును. ఈగ్రహములు ద్విస్వభావ రాసులయం దుండి బుధునిచేఁ జూడఁబడినచోఁ బురుషస్త్రీ నవాంశలతో నే నవాంశయందుఁ దా ముందురో, ఆపక్షమునందు నమడబిడ్డలను బుట్టింపఁజేయుదురు. అనఁగా మిథున కన్యా ధను ర్మీనంబులు నాల్గింటి యందు మిథున ధనుస్సులు పురుషరాసులు కాఁబట్టి మిథున ధనుర్నవాంశలయందు గురు రవులు బుధునిచేతఁ జూడఁ బడిరేని పురుష శిశువు లమడలుగఁ బుట్టుదురు. కన్యా మీనములు స్త్రీ స్వభావ రాసులు కాఁబట్టి, ఆరాసుల నవాంశలయందుఁ జంద్ర శుక్రాంగారకులు బుధునిచేఁ జూడఁబడినచో, స్త్రీ శిశువు లమడలుగఁ బుట్టుదురు. అనఁగ నిక్కడ ద్విస్వభావ రాసులే చెప్పఁ బడినవిగాని తన్నవాంశలు జెప్పఁబడలేదు. ఇందులకు "బలినౌ విషమేర్కగురూ నరం స్త్రియం సమగృహే కుజేందుసితాః, యమళౌ ద్విశరీరాంశే ష్వింందుజ దృష్టా స్వపక్షసమమ్." అని వరాహమిహిరాచార్యులు లఘుజాతక గ్రంథమునఁ జెప్పినవాఁడు కాఁబట్టి ద్విస్వభావ రాశి నవాంశ లని యర్థము సేయఁబడినది.

విహాయ లగ్నం విషమర్క్ష సంస్థ
స్సౌరోపి పుంజన్మ కరో విలగ్నాత్,

 

ప్రోక్త గ్రహాణా మవలోక్య వీర్యం
వాచ్యః ప్రసూతౌ పురుషోంగనా వా. 12

తా. అనఁగ నీయోగములు లేనియప్పుడు శనైశ్చరుఁడు నిషేక లగ్నమునుగాని ప్రశ్న లగ్నమునుగాని విడిచి విషమస్థానములయందు ననఁగా ౩-౫-౭-౯-౧౧ - ఇండ్లయందు నొకయింట నున్నవాఁడైన చోఁ బురుష జననము నగుచున్నది. ఈచెప్పఁబడిన యోగములు గలుగఁజేసెడు గ్రహముల బలమును విచారించి ప్రసవ సమయము నందుఁ బురుషుఁడుగాని స్త్రీగాని పుట్టునని చెప్పఁదగినది. మఱియు నెపుడేని యీపుం స్త్రీజన్మయోగములు రెండును సంభవించెనేని, అప్పు డేయోగము బలాధిక గ్రహ నిర్మితమైయుండునో, యద్దాని ననుసరించి జన్మమును వచింపఁదగినది.

అన్యోన్యం యది పశ్యత శ్శశి రవీ యద్వార్కి సౌమ్యా వపి
వక్రో వాసమగం దినేశ మసమే చంద్రోదయౌ చేత్ స్థితౌ,
యుగ్మౌజర్క్ష గతావపీందు శశిజౌ భూమ్యాత్మజే నేక్షితౌ
పుంభాగే సిత లగ్న శీతకిరణాః షట్క్లీబయోగాః స్మృతాః. 13

తా. అనఁగా నీశ్లోకమున నపుంసక జనన యోగము జెప్పఁబడినది. ఎట్లనఁగ—చంద్ర సూర్యులు సమవిషమ రాసులయందు, అనఁగ, సమరాశియందుఁ జంద్రుండును, విషమరాశి యందు సూర్యుండు నుండి యొకరినొకరు చూచుకొనుచుండిరేని యొక నపుంసకయోగము. మఱియు శని సమరాశియందును, బుధుఁడు విషమ రాశియందు నుండి యొకరి నొకరు చూచుకొనిరేని రెండవ నపుంసక యోగము. మఱియు నంగారకుఁడు విషమ రాశిగతుఁడై యుండి సమ రాశి గతుఁడైన సూర్యుని చూచినచో, లేక సూర్యుఁ డంగారకుని జూచినచో మూఁడవనపుంసకయోగము. మఱియు లగ్నమును,జంద్ర లగ్నమును, విషమ రాశియందునుండి సమరాశి గతుఁడైన కుజునిచేతఁ జూడఁబడినచో నాల్గవ నపుంసక యోగము. మఱియుఁ జంద్రుఁడు సమరాశియందును, బుధుఁడు విషమరాశియందు నుండినవారలై, కుజునిచేతఁ జూడఁబడినచో నైదవ నపుంసకయోగము. మఱియు శుక్ర

లగ్న చంద్రు లేరాశి యందైనఁ బురుష నవాంశల యందుండిరేని, యీఅవ నపుంసకయోగము. ఇందులకు, "అన్యోన్యం రవి శశినౌ విషమర్క్ష సమర్క్ష గౌ నిరీక్షేతే, ఇందుజ రవి పుత్రౌవా తథైవ గర్భం నపుంసకం కురుతః. వక్రో విషమే సూర్య స్సమగస్త్వేవం పరస్పరా లోకాత్, విషమర్క్షే లగ్నేందూ సమరాశిగతః కుజోవలోకయతి. బుధ చంద్రౌ కుజదృష్టౌ విషమర్క్ష సమర్క్ష గౌ తథైవో క్తౌ, ఓజనవాంశక సంస్థా లగ్నేందుసితా స్తథైవోక్తాః." అని బాదరాయణులు వచించి యున్నారు. కాఁబట్టి యీ క్లిబయోగము లగు నపుంసక యోగము లీఱును ముందు చెప్పఁబడిన స్త్రీపురుష జననయోగములు లేనపుడు చెప్పఁదగినది.

యుగ్మే చంద్ర సితౌ తథౌజ భవనే స్యుర్జ్ఞార జీవోదయా
లగ్నేందూ నృనిరీక్షితౌ చ సమగౌ యుగ్మేషు వా ప్రాణినః,
కుర్యుస్తే మిథునం గ్రహోదయగతాౕ ద్వ్యంగాంశకాౕ పశ్యతి
స్వాంశే జ్ఞే త్రితయం జ్ఞగాంశకవశా ద్వ్యగ్రం త్వమిశ్రైస్సమమ్.14

తా. ఈశ్లోకమున రెండు మూఁడు శిశువులు గల్గెడు యోగములు చెప్పఁబడినవి. ఎట్లనఁగ:—శుక్ర చంద్రులు సమరాశియందును, కుజ బుధ లగ్నగురులు విషమరాశియందును గూడి యుండిరేని యొక మగబిడ్డయు నొకయాఁడుబిడ్డయును గల్గఁ జేయుదురు. మఱియు లగ్న చంద్రులు సమరాశియం దుండి పురుషగ్రహములచేతఁ జూడఁ బడినచో స్త్రీపురుష ద్వంద్వమును గల్గింతురు. మఱియు బుధకుజలగ్న గురువులు సమరాసులయందు బలవంతులై యుండిరేని స్త్రీపురుష ద్వయమును జనింపఁ జేయుదురు. ఇదియునుంగాక మూఁడు శిశువు లను డలుగఁ బుట్టెడు యోగము లెవ్వియనిన:—సకల గ్రహములును లగ్నమును బొందిన ద్విస్వభావ రాశి నవాంశలను అనఁగా ద్విస్వభావరాశి నవాంశలయందున్న గ్రహములను లగ్నమును, స్వనవాంశయందుండు బుధుఁడు చూచిన పక్షమున మూఁడు శిశువులు పుట్టును. ఈ మూఁడు శిశువులతో రెండు శిశువులు బుధుఁ డుండు నవాంశనుబట్టి స్త్రీలనిగాని

పురుషులనిగాని చెప్పవలయును. అనఁగా—బుధుఁడున్న నవాంశము స్త్రీపురుషచిహ్నములలో నేచిహ్నము గలవో, యాచిహ్నముగల శిశువులు రెండును తద్వ్యతిరిక్తచిహ్నముగలశిశు వొక్కటియుఁ బుట్టునని యర్థము. అదెట్లనఁగా:—మిథున నవాంశయందున్న బుధుఁడు ద్విస్వభావరాశి నవాంశలయందున్న గ్రహ లగ్నములం జూచిన నిద్దఱు పురుషులు నొక కన్యయుం బుట్టుదు రనియు, కన్యానవాంశగతుఁడైన బుధుఁడు ద్విస్వభావ నవాంశల యందుండు గ్రహము ల లగ్నమును జూచినచో నిద్దఱు కన్యకలు నొక పురుషుఁడును బుట్టుదు రనియు వచింపవలయును. మఱియు మిథున నవాంశ యందున్న బుధుఁడు మిథున ధను ర్నవాంశల యందున్న గ్రహలగ్నములం జూచినచో మూఁడును బురుష శిశువులే జనింతురు. మఱియుం గన్యా నవాంశ యందున్న బుధుఁడు కన్యా మీన నవాంశల యందున్న గ్రహలగ్నములం జూచినచో మూఁడును స్త్రీశిశువులే జనించును. ఈ విషయమై సారావళి గ్రంథమున "సమరాశౌ శశి సితయో ర్విషమే గురు వక్రసౌమ్య లగ్నేషు, యోగేస్మిౝ గర్భగతం నూనం మిథునంతు విజ్ఞేయం, లగ్నేందూవా సమగా పుంగ్రహ దృష్టౌచ మిథున జన్మకరౌ, ఉదయజ్ఞ వక్ర గురవో బలిన స్సమరాశిగా స్తథైవోక్తాః, ద్విశరీరాంశక యుక్తాౝ గ్రహాౝ విలగ్నంచ పశ్య తీందుసుతః, కన్యాంశే ద్వేకన్యే పురుషశ్చ నిషిచ్యతే గర్భే, మిథునాంశే కన్యైకా ద్వౌ పురుషౌ త్రితయమేవ స్యాత్, మిథున ధనురంశక గతాౝ గ్రహాౝ విలగ్నంచ పశ్య తీందుసుతః, మిథునాంశస్థశ్చ యదా పురుష త్రితయం తదా గర్భే, కన్యా మీనాంశస్థాౝ విహగా నుదయం యువతి భాగగతః, పశ్యతి శీతగుతనయః కన్యా త్రితయం తదా గర్భే" అని చెప్పఁబడినది.

ధనుర్ధర స్యాంత్యగతే విలగ్నే
గ్రహై స్తదంశోపగతై ర్బలిష్ఠైః,
జ్ఞేనార్కిణా వీర్యయుతేన దృష్టే
సంతి ప్రభూతా అపి కోశ సంస్థాః.

తా. గర్భమునఁ బెక్కుపిండములు జనించు యోగము జెప్పఁబడినది. ఎట్లనఁగ:—ధనుస్సుయొక్క యంత్యనవాంశము లగ్నమగుచుండ నాధనుస్సు యొక్క నవాంశము నందున్న బలవంతులైన గ్రహములచేతను, బలవంతుఁడైన బుధునిచేతను శనిచేతను లగ్నము జూడఁ బడినచో ననేకము లగు జరాయువేష్టిత శరీరములు గర్భగతములై యున్నవని తెలియఁ దగినది.

కలిల ఘనాంకురాస్థి చర్మాంగజ చేతనతాః
సిత కుజ సూర్య చంద్రార్కి బుధాః పరతః,
ఉదయప చంద్ర సూర్య నాథాః క్రమశో గదితా
భవతి శుభాశుభంచ మాసాధిపతే స్సదృశమ్. 16

తా. గర్భాధాన కాలము మొదలు ప్రతిమాసమునందును గర్భగత జంతువునకుఁ గల్గెడు స్వభావమును, గర్భ మాసాధిపతులును జెప్పఁబడినవి. ఎట్లనఁగ:—గర్భాధాన కాలము మొదలు ప్రథమ ద్వితీయాది మాసములయందు గర్భమునకుఁ గలిల ఘనతాది స్వభావములు గల్గును. ఆప్రథమాది మాసములకుఁ గ్రమముగ శుక్ర కుజాదు లధిపతులగుదురు. అనఁగా—గర్భ ప్రథమ మాసమునందు శుక్ల శోణిత సంయోగమున బుద్బుదాకార మగు ననియును, ఆమాసమునకు శుక్రుఁ డధిపతి యనియు; రెండవ మాసమునందుఁ గఠిన మగు మాంస మగు ననియు, ఆనెలకు నంగారకుం డధిపతి యనియును; మూఁడవ నెలకు నవయవాంకురము లగుననియు, నానెలకుఁ గురుం డధిపతి యనియు; నాల్గవ నెలయందు నెముకలు గల్గు ననియు, నందులకు సూర్యుం డధిపతి యనియు; నైదవ నెలకుఁ జర్మంబు గల్గుననియు,నందులకుఁ జంద్రుం డధిపతి యనియు; నాఱవ నెలయందు రోమంబు లంకురించు ననియు, నానెలకు శన్యధిపతి యనియు; నేడవ మాసమునందు జ్ఞానేంద్రియములు గల్గును, ఆనెలకుబుధుండధిపతి యనియు; నందుపై నష్టమనవమదశమ మాసములకుఁ గ్రమముగ గర్భాధాన లగ్నాధిపతియును జంద్రసూర్యులు నధిపతు లగుచున్నా రనియు వచింపబడెను. శ్లో. "అశనోద్వేగప్రసవాః పరతో లగ్నేశ చంద్ర సూర్యాణామ్" అని లఘుజాతకము

నందుఁ జెప్పఁబడి యుండుటంజేసి అష్టమ నవమ దశమ మాసముల యందు నశనోద్వేగ ప్రసవములు గల్గును. అనఁగా :—అష్టమ మాసమున గర్భమునందుండు జంతువు, తల్లి తాఁభుజించిన యన్నాదులచేతఁ దృప్తి నొందును. ఆనెలకు గర్భాధాన లగ్నాధిపతి నాథుం డగును, నవమ మాసమునందుఁ బ్రసవోద్వేగము గల్గు నానెలకుఁ జంద్రుఁ డధిపతి యగుచున్నాఁడు. దశమ మాసమునందుఁ బ్రసూతి యగును. ఆనెలకు సూర్యుం డధిపతి యగుచున్నాఁడు. కాఁబట్టి యీశ్లోకమునందు "కలిల ఘనాంకు రాస్థి చర్మాంగజ చేతనతాః, సిత కుజ సూర్య చంద్రార్కి బుధాః పరతః." అని క్రమాలంకారముగ వచించి యున్నాఁడు గనుక ఆప్రకారము చూచుకొనఁగ సులభముగ నర్థమగుచున్నది. ఈశ్లోకమునందు మూఁడవ నెలకు గురుం డధిపతి యని చెప్ప లేదు కాఁబట్టి అయ్యది విచారణీయము. ఈశ్లోకార్థమునుబట్టి యుదాహరణము. "కలిలం ప్రథమే మాసి తన్మాసాధిపతి ర్భృగుః, ద్వితీయ మాసపోభౌమఃగర్భఃపింగాకబీజవత్, గర్భాంకురం తృతీయేస్యా త్తన్మాసాధిపతి ర్గురుః, మజ్జాస్థి సంభవోమాసి చతుర్థేభాస్కరోధిపః, పంచమే మాసి సోమాశ్చేత్వ్ఙ్మేదోరక్త సంభవః, సర్వాంగ సంభవ ష్షష్ఠే తన్మాసాధిపతి శ్శనిః, జ్ఞానేంద్రియ యుతః పశ్చా త్సప్తమే బుధ ఈశ్వరః, భవనే శోష్టమే మాసి క్షుత్తృష్ణా సంభ్రమో భవేత్, ఉద్వేగీ గర్భ సంస్థశ్చ మాసేశో నవమే శశీ, ప్రసూతి ర్దశమే మాసి మాసేశో భాస్కర స్స్మృతః." అనిసారావలియందుఁ జెప్పఁబడినది. "కలిల ఘనాంకు రాస్థి త్వగ్రోమ స్మృతి సముద్భవాః క్రమిశః, మాసేషు శుక్ర కుజ జీవ సూర్య చంద్రార్కి సౌమ్యానాం, అశనోద్వేగప్రసవాః పరతో లగ్నేశ చంద్ర సూర్యాణాం." అని లఘుజాతక గ్రంథమునందుఁ జెప్పఁబడి యున్నది. మఱి యవనేశ్వరుండు ప్రథమ మాసాధిపతికుజుఁ డనియును, ద్వితీయ మాసాధిపతి శుక్రుఁడనియును, "కుజాస్ఫుజిజ్జీవ రవీందు సౌర, శశాంకలగ్నేందు దివాకరాణాం" అని వచించి యున్నాఁడు. గర్భాధాన కాలమున నేమాసాధిపతి యైనగ్రహము, "మాసాధిపతౌ నిపీడితే తత్కాలం స్రవణం సమాదిశేత్" అనిచెప్పి యుండుప్రకారముగ నుల్కాదులచేతఁ బీడింపఁబడి యుండునో, యా మాసము నందు గర్భ

పతనం బగును. ఆమాసాధిపులు నిర్దోషు లైయుండిరేని గర్భమునకుఁ బుష్టిగల్గును. "కలుషైః పీడా పతనం పీడితై ర్నిర్మలై పుష్టిః" అని లఘుజాతక గ్రంథమునందుఁ జెప్పఁబడినది.

త్రికోణగే జ్ఞే విబలై స్తథా పరై
ర్ముఖాంఘ్రి హస్తై ర్ద్విగుణ స్తదా భవేత్,
అవాగ్గ్రహీందావశుభైర్భ సంధిగై
శ్శుభేక్షితశ్చే త్కురుతే గిరం చిరాత్. 17

తా. అధికాంగ మూకాత్యుత్పత్తి యోగములు జెప్పఁబడినవి. ఎట్లనఁగా:—లగ్నమునకు నవమ పంచమముల యందు బుధుఁ డుండి, అన్యగ్రహములు బలహీను లై యుండినచో గర్భస్థుండు ద్విగుణిత ముఖ పాద హస్తుండు నేకోదరుండు నగునని యర్థము. ఇందులకు, "బలహీనై ర్గ్రహై స్సర్వై ర్నవ పంచమగే బుధే, ద్విగుణాంఘ్రి శిరోహస్తో భవ త్యేకోదర స్తథా" అని గార్గివచనమున నున్నది. మఱియు వృషభమునందుఁ జంద్రుఁ డుండఁగాఁ బాపగ్రహములు కర్కట వృశ్చిక మీనముల నంత్య నవాంశములయం దుండినచో, గర్భస్థుఁడు మూఁగవాఁ డగును. శుభగ్రహముల చేతఁ జంద్రుఁడు చూడఁబడెనేని కొంత కాలమునకు మాటలు గల్గుననియుఁ, బాపగ్రహ బలముండినచో మూఁగవాఁడనుటకు సందియము లేదనియుఁ జెప్పఁదగినది. ఇందులకు, "కుళీరాళి ఝషాంతస్థైః పాపై శ్చంద్రే వృషోపగే, మూకః పాపేక్షితే సౌమ్యై శ్చిరేణ లభతే గిరం, మిశ్రదృష్టై ర్యథా వీర్యం ఫలం చోద్య మనీషణా" అని గార్గిచే చెప్పఁబడినది.

సౌమ్యర్క్షాంశే రవిజ రుధిరౌ చేత్సదంతోऽత్ర జాతః
కుబ్జ స్స్వర్క్షే శశిని తనుగే మంద మాహేయ దృష్టే,
పంగు ర్మీనే యమ శశి కుజై ర్వీక్షితే లగ్న సంస్థే
సంధౌ పాపే శశిని చ జడ స్స్యాన్న చే త్సౌమ్య దృష్టః. 18

దంత సహిత శిశుజన్మమును, కుబ్జ పంగు జడ జన్మమును నగు యోగములు చెప్పఁబడినవి. ఎట్లనఁగ:—మిథునకన్య నవాంశలయందుఁ గుజశను లుండిరేని, తల్లికడుపున నుండి పుట్టునపుడు దంతములతోఁ డఁ

బుట్టుననియర్థము. అనఁగాఁ గుజ శను లేరాశియందైన బుధనవాంశలగు మిథున కన్యానవాంశలయందుఁగాని మిథునకన్యారాసుల యందుఁగాని యుండినచో గర్భస్థుఁడు దంతములం గూడి పుట్టు నని యెంచఁ దగినది. చంద్రుఁడు స్వక్షేత్రమును, తత్కాలలగ్నమును నగు కర్కాటక రాశి యం దుండి శని కుజులచేతఁ జూడఁబడినచోఁ, బొట్టిచేతులు కాళ్లుగల గుజ్జువాఁ డగు నని తలంచ వలయును. మఱియు మీనము లగ్నంబై శని చంద్ర కుజులచేతఁ జూడఁబడు చుండినను, లేక యామీనమున నాచం ద్రార్క శను లుండినను, గర్భస్థుఁడు కుంటివాఁ డగు నని వచింపఁ దగి నది. మఱియుఁ జంద్రుండును, పాపగ్రహమును, కర్కాటక వృశ్చిక మీనముల నంత్య నవాంశములం దుండినచోఁ జెవిటివాఁ డగు నని చెప్పఁ దగినది. ఈ యోగములు గలుగఁజేయు గ్రహము లు శుభగ్రహ ములచేతఁ జూడఁ బడకుండిన పక్షమున నీచెప్పఁబడిన ఫలంబులు సంపూ ర్ణముగ నగు ననియును, బలవచ్ఛుభగ్రహములచేతఁ జూడఁబడినచో నీచెప్పఁబడిన ఫలము జరుగదనియును వచింప వలయును.

సౌరశశాంక దివాకర దృష్టే
వామనకో మకరాంత్య విలగ్నే,
ధీ నవ మోదయగైశ్చ దృకాణైః
పాపయుతై రభుజాంఘ్రి శిరాస్యాత్. 19

తా. హీనాంగ జనన యోగములు జెప్పఁబడినవి. మకరరాశ్యం త్యనవాంశము లగ్నంబై శని చంద్ర సూర్యులచేతఁ జూడఁబడినచో గర్భ మున నున్న శిశువు పొట్టిగ నుండిపుట్టును. "ధీ నవ మోదయగైశ్చ దృకాణైః" అనఁగా "ద్రేక్కాణాః ప్రథమ పంచమ నవమానాం" అని చెప్పఁబడి యున్నది కాఁబట్టి లగ్నమునందు ద్వితీయ ద్రేక్కాణము పంచమ రాశియైనది (ద్రేక్కాణము=ద్వితీయ ద్రేక్కాణము) ఈద్రే క్కాణము గర్భాధాన లగ్నంబై, రవి శని వ్యతిరిక్తమైన పాపగ్ర హము కుజుఁడు కాఁబట్టి ఆకుజుఁడందుండి శనిచంద్ర రవులచేతఁ జూడఁ బడినచో, గర్భమునందు భుజహీనుఁడు జనించు ననియును, తృతీయ ద్రేక్కాణము నవమరాశిసంబంధ మైనది గనుక నవమ ద్రేక్కాణ

మనఁగాఁ దృతీయ ద్రేక్కాణము, ఈతృతీయ ద్రేక్కాణమునందుఁ గుజుఁ డుండి శని చంద్ర సూర్యులచేతఁ జూడఁబడినచోఁ గర్భమునందు పాదహీనుఁడు జనించు ననియు, లగ్న ద్రేక్కాణము లగ్న రాశి సంబంధ మైనది కాఁబట్టి, ఆలగ్న ప్రథమ ద్రేక్కాణము నందు నంగారకుఁ డుండి శని చంద్ర సూర్యులచేతఁ జూడఁబడినచో గర్భమునందు శిరోహీనుండు జనించుననియును, ఈరీతి కొందఱు దైవజ్ఞులు వ్యాఖ్యానము చేసి యున్నారు. మఱికొందఱు, శని చంద్రార్క దృష్టి లేనప్పటికి నీ చెప్పఁబడిన ద్రేక్కాణములు పాపగ్రహ యుక్తములైనఁ బూర్వోక్త ప్రకారము, భుజ పాద శిరో హీనులు జనింతురని చెప్పుచున్నారు. మఱి కొందరు ద్రేక్కాణముల మూఁటియందు నేద్రేక్కాణముగాని పాపగ్రహ యుతమై శని చంద్ర రవి దృష్టమై యుండెనేని పూర్వోక్త ప్రకారమంగహీనులు జనింతు రని వచించి యున్నారు. మఱికొందఱు లగ్న పంచమ నవమ రాసుల యందుఁ బ్రథమ ద్రేక్కాణములు మూఁడును బాపగ్రహ యుక్తము లై యుండినచో భుజ హీనుండును, ద్వితీయ ద్రేక్కాణములు మూఁడును పాప యుక్తము లై యుండెనేని పాదహీనుండును, దృతీయ ద్రేక్కాణములు మూఁడును పాపగ్రహ యుక్తము లై యుండినచో శిరోహీనుండును బుట్టుననియుఁ జెప్పుదురు. మఱి కొంద ఱభిప్రాయ మెట్టి దనఁగా:—నిషేక కాలమునఁ బంచమ రాశియందు నేద్రేక్కాణమైనను గుజసంయుక్తమై శని చంద్ర సూర్య దృష్టంబై యుండెనేని భుజహీనుండును, నవమ రాశియందు నేద్రేక్కాణమైనను గుజ యుక్తమై శని చంద్ర సూర్య దృష్టమై యుండెనేని పాదహీనుం డగు ననియును, లగ్నమునందు నేద్రేక్కాణమైనను, కుజ సంయుక్తమై శని చంద్ర రవి వీక్షణము గల్గియుండినచో శిరోహీనుం డగుననియుఁ జెప్పి యున్నారు. ఇందులకు నుదాహరణము. "లగ్నే ద్రేక్కాణగో భౌమః సౌర సూర్యేందు వీక్షితః, కుర్యాద్విశిరసం తద్వత్పంచమే బాహువర్జితం, విపదం నవమస్థానే యది సౌమ్యైర్న వీక్షితః." అని గార్గిచే జెప్పఁబడినది. "భౌమయుతో ద్రేక్కాణ స్త్రికోణలగ్నేషు భేషు సందృష్టః, విభుజాంఘ్రి మస్తక స్స్యాచ్ఛని రవి చంద్రై ర్వదే ద్గర్భే." అని గార్గి చేతను సారావళియందును జెప్పఁబడినది. పూర్వో

క్త యోగముల యందు శుభగ్రహ దృష్టి యున్న నీచెప్పఁబడిన ఫలములు గలుగవని నిర్ణయింప వలసినది.

రవి శశి యుతే సింహలగ్నే కుజార్కి నిరీక్షితే
నయన రహిత స్సౌమ్యా సౌమ్యే స్సబుద్బుద లోచనః,
వ్యయ గృహ గతశ్చంద్రో వామం హినస్త్య పరం రవి
స్త్వశుభగదితా యోగాయాప్యా భవంతి శుభేక్షితాః. 20

తా. అంధాది జనన యోగములు చెప్పఁబడినవి. సింహము నిషేకలగ్నమై సూర్య చంద్రులతోఁగూడి కుజ శనులచేతఁ జూడఁబడినచో రెండుకన్నులు లేనివాఁడుగఁ బుట్టుననియును,ఆసింహము సూర్యునితోఁ గూడి కుజ శనులచేతఁ జూడఁబడెనేని కుడికన్ను లేనివాఁ డగుననియును, ఆసింహము చంద్రునితోఁ గూడి కుజ శనులచేతఁ జూడఁబడిన, నెడమ కన్ను లేనివాఁ డగుననియును, ఆసింహము సూర్య చంద్రులతోఁ గూడి శుభ పాపగ్రహములచేతఁ జూడఁ బడినచోఁ బూఁగన్నులు గలవాఁ డగుననియు, ఆసింహమునందు రవి యొక్కఁడయుండి శుభపాపగ్రహ వీక్షణము గల్గినవాఁడైనఁ గుడికన్ను పూఁగన్నగు ననియును, ఆసింహమునఁ జంద్రుఁ డొక్కఁడ యుండి శుభపాపగ్రహ వీక్షణము కల్గినవాఁడైనచో నెడమకన్ను పూఁగన్నగు ననియును, మఱియుఁ జంద్రుఁడు ఆధాన లగ్నమునకుఁగాని జన్మలగ్నమునకుఁగాని పంద్రెండవ యింట నుండినచో నెడమకన్ను చెడిపోవు ననియును, సూర్యుఁ డుండినచోఁ గుడికన్ను చెడిపోవు ననియును జెప్పఁ దగినది. ఇందులకు "వక్ర శ్శనిర్వా వ్యయ గోక్షిహంతా వామం కుజో దక్షిణ మక్షి సౌరిః, వ్యయే రవీందూ యుగప త్పృథగ్వా నేత్రే హరే తామపసవ్య సవ్యే" అని బాదరాయణుండు వచించి యున్నాఁడు. అశుభగ్రహ సంయోగ వీక్షణ సంభూతములైనయోగములు ఫలము నిచ్చునెడ నేసమయమునఁ జెప్పఁబడిన ఫలము లాసమయమున, సంపూర్ణముగఁ గలుగక కాలాంతరమునఁ గొంచెము ఫలసూచక మగు ననియు యోచింపఁ దగినది.

తత్కాల ఇందు సహితో ద్విరసాంశ కోయ
స్తత్తుల్యరాశి సహితే పురత శ్శశాంకే,
యావానుదేతి దినరాత్రి సమాన భాగే
తావ ద్గతే దిన నిశోః ప్రవదంతి జన్మ. 21

తా. గర్భాధాన కాలము వలనఁగాని ప్రశ్న కాలము వలనఁగాని ప్రసవకాలము నెఱుంగు తెఱంగుం జెప్పఁబడినది. అనఁగా నాధాన కాలమునందైనను, ప్రశ్న కాలము నందైనను, చంద్రుఁ డుండు రాశి యందు నెన్నవ ద్వాదశాంశ యందుండునో, మేషరాశి మొదలుకొని యన్నవ రాశియందుఁ జంద్రుఁ డుండఁగా దశమ మాసము నందుఁ బ్రసవ మగునని వచించవలెను. ఇందులకు, "యస్మిన్ ద్వాదశ భాగే గర్భాధానే వ్యవస్థిత శ్చంద్రః, తత్తుల్యర్క్షే ప్రసవో గర్భస్య సమాదిశేత్." అని సారావళి గ్రంథమునఁ జెప్పఁబడినది. మఱియు నీయభిప్రాయమునఁ గొందఱు "గర్భాధానాది కాలములయందుఁ జంద్రుఁడు తానుండు రాశియందు నెన్నవ ద్వాదశాంశయందుండునో ఆద్వాదశాంశము మొదలుకొని, అన్నవ సంఖ్య గల పై రాశి యేది యో, ఆరాశి యందుఁ జంద్రుఁ డుండఁగాఁ బ్రసవము చెప్పఁ దగిన దని వచించు చున్నారు కాఁబట్టి యిదియుఁ జూడఁదగినది. ఇందులకు, "యావత్సంఖ్యే ద్వాదశాంశే శీతరశ్మి ర్వ్యవస్థితం, తత్సంఖ్యో యస్తతోరాశి ర్జన్మేందా తద్గతే వదేత్." అని గార్గియు జెప్పియున్నాఁడు. మఱియు దివా రాత్రులకు సమానమైనరాసుల త్రింశద్భాగ మెన్నవది యుదయించు చున్నదో, దివా రాత్రుల యందు నన్ని గడియలు పోవు చుండఁగాఁ బ్రసవమును జెప్పుచున్నారు. అనఁగా మేష వృషభ మిథున కర్కాటక ధను ర్మకర రాసులు రాత్రి బలములును తక్కిన రాసులు దివా బలములును అని పూర్వము చెప్పఁబడి యున్నది. కాఁబట్టి యందు నాధాన లగ్నముగాని ప్రశ్నలగ్నముగాని దివా బల రాశి యైనచోఁ బగలు బ్రసవ మగుననియు, రాత్రి బలరాశియైనచో రాత్రి ప్రసవ మగుననియుం జెప్పఁదగినది. మఱి యా దివాబల లగ్నము నందు నెన్ని త్రింశాంశములు గతించిన పిదప నాధానముగాని ప్రశ్న

గాని చేయఁబడునో యన్ని గడియలు గడచిన పిదపఁ బగటియందుఁ బ్రసవ మనియు, రాత్రి బలలగ్నమునందు నెన్ని త్రింశాంశలు గడచిన పిదప నాధాన ప్రశ్న చేయఁబడునో, యన్ని గడియలు గడచిన పిదప రాత్రియందుఁ బ్రసవ మనియుఁ జెప్పఁ దగినది. ఇందులకు, "తత్కాలే దివస నిశా సంజ్ఞేసము దేతి రాశి భాగోదయః, యావా నుదయస్యాంశ స్తావా న్వాచ్యో దినస్య రాత్రేర్వా, ఇత్యాధానా త్ప్రథమం సూతేః కాలం సునిశ్చితం కృత్వా, జాతక విహితంచ విధిం విచింతయే త్తత్రగణితజ్ఞః." అని సారావళి గ్రంథమునఁ జెప్పఁబడినది. ఈ విషయము శాస్త్రాభిమానముగల బుద్ధిమంతులు బాగుగ గణితము చేసి చూచి చెప్పినచో ఫలము దృఢముగ నేర్పడును.

ఉదయతి మృదుభాంశే సప్తమస్థేచ మందే
యదిభవతి నిషేక స్సూతి రబ్ద త్రయేణ,
శశిని తు విధిరేష ద్వాదశేబ్దే ప్రకుర్యా
న్నిగదిత మిహ చింత్యం సూతి కాలేపి యుక్త్యా. 22

తా. గర్భము ధరించిన పిదప మూఁడు సంవత్సరములకును, పండ్రెండు సంవత్సరములకును ప్రసవము గల్గెడు యోగము లీశ్లోకమునఁ జెప్పఁబడినవి. ఎట్లనఁగా:—ఏలగ్నము నందైనను శన్యంశ లగు మకర కుంభ నవాంశల యందు గర్భాధానమై, ఆలగ్నమునకు నేడవ యింట శని యుండినచో మూఁడేండ్లకుఁ బ్రసవ మగు ననియు, మఱియు నేలగ్నమునందైనను గర్కాటక నవాంశ యందు గర్భాధానమై ఆలగ్నమునకు నేడవ యింటఁ జంద్రుఁ డుండినచోఁ బండ్రెండేండ్లకుఁ బ్రసవ మగుననియుఁ జెప్పఁ దగినది. ఈ నిషేకాధ్యాయమునందు నాధాన కాలమువలన నేయే యోగమునకు నేయేఫలము చెప్పఁ బడినదో, ఆయా యోగమునకు నాయా ఫలము జన్మకాలము వలనఁ బ్రశ్న కాలము వలనఁ జెప్పవలయును.

ఇట్లు బృహజ్జాతకమునందు నిషేకాధ్యాయ మనెడు
చతుర్థాధ్యాయము సంపూర్ణము.

---

శ్రీ ర స్తు.



# బృహజ్జాతకము.

## జన్మకాల లక్షణాధ్యాయము.



పితుర్జాతః పరోక్షస్య లగ్న మిందావపశ్యతి,
విదేశస్థస్య చరభే మధ్యాద్భ్రష్టే దివాకరే. 1

తా. జననకాలము నందుఁ దండ్రి దగ్గఱ లేకుండెడు యోగములు రెండు శ్లోకముల యందుఁ జెప్పఁబడినవి. ఎట్లనఁగా:— చంద్రుఁడు ప్రసవ లగ్నమును జూడకుండినచోఁ బుట్టినజాతకుఁడు తండ్రి దగ్గఱ లేకుండు నపుడు పుట్టె నని చెప్పవలయును. మఱియు సూర్యుఁడు (మధ్య=దశమస్థానము.) దశమ స్థానము కంటెఁ గ్రిందనుండి చరరాశి యందు, అనఁగా నవ మాష్టమ స్థానముల యందుండఁగాఁ జంద్రుఁడు లగ్నమును జూడకుండెనేని తండ్రి దేశాంతరమునం దుండఁగ జాతకుఁడు పుట్టినవాఁడని తెలియఁదగినది. మఱియుఁ జంద్రుఁడు లగ్నమును జూడక, లగ్నమునకు నవమాష్టమములు చరరాసులై యుండి అందు సూర్యుఁ డుండినచోఁ బుట్టినవాని తండ్రి విదేశమున నుండు నని తాత్పర్యము. మఱియు లగ్నమును చంద్రుఁడు చూడక, లగ్నమునకు నవమాష్టమములు స్థిరరాసులై యుండి యందు సూర్యుఁడుండినచోఁ బుత్త్రోత్పత్తి కాలమునఁ దండ్రి, స్వదేశ పరదేశ మధ్యమార్గమునం దుండు నని చెప్పఁదగినది. ఇందులకు "హోరామవీక్షమాణే పితరి పరోక్షస్థితే శశిని జాతః, మేషూరణ చ్యుతేవా చతేరభేభానౌ విదేశగతః" అని సారావళి గ్రంథమునం జెప్పఁబడినది.

ఉదయస్థేపివా మందే కుజే వాస్తం సమాగతే,
స్థితేవాంతః క్షపానాథే శశాంకసుత శుక్రయోః. 2

శనైశ్చరుండు లగ్నమున నుండినచో జాతకుఁడు తండ్రి దగ్గఱ లేనికాలమునఁ బుట్టిన వాఁడని వచింప వలయును. అట్లు కాని

పక్షమున నంగారకుఁడు సప్తమ స్థానమున నుండినచోఁ బుట్టినవాఁడు తండ్రి దగ్గఱలేని కాలమునఁ జనించినట్లు చెప్పఁ దగినది. మఱియుఁ జంద్రుఁడు బుధ శుక్రుల నడుమ నుండఁగా జనించినవాని తండ్రి పరోక్షమునందుండెనని వచింప వలయును. బుధ శుక్రులలో నొక్కఁడు చంద్రునకుఁ బండ్రెండవ యింటను, మఱియొకఁడు రెండవ యింట నుండినను, ఒకరాశియందె నడుమఁ జంద్రుఁడును, ఆద్యంతమ్ముల యందు బుధ శుక్రులు నుండినఁ జంద్రుఁడు బుధ శుక్ర మధ్యస్థుఁ డగును. ఈ మూఁడుయోగముల యందుఁ జంద్రుఁడు లగ్నమును జూడక యుండవలయు నఁట. ఇందులకు, ''చంద్రే లగ్న మపశ్యతి మధ్యేవా సౌమ్య శుక్రయో శ్చంద్రే, జన్మ పరోక్షస్య పితుర్య మోదయేవా కుజే చాస్తే.'' అని లఘుజాతకమునం దీవిషయముం గూర్చి చెప్పఁబడినది.

శశాంకే పాపలగ్నే వా వృశ్చికే శ త్రిభాగగే,
శుభై స్స్వాయస్థితై ర్జాత స్సర్ప స్త ద్వేష్టితో౽పివా. 3

ఈశ్లోకమున సర్పజనన యోగమును, సర్ప వేష్టిత జంతు జనన యోగమును జెప్పఁబడినవి. ఎట్లనఁగా:—అంగారకుని ద్రేక్కాణము నందుఁ జంద్రుఁ డుండఁగా ౨-౧౧-ఇండ్లయం దున్నట్టి శుభగ్రహము లవలన సర్పము జనించు నని యర్థము. అనఁగా, మేష ప్రథమ ద్రేక్కాణము, కర్కాట ద్వితీయ ద్రేక్కాణము, సింహ తృతీయ ద్రేక్కాణము, వృశ్చిక ప్రథమ ద్రేక్కాణము, ధను ర్ద్వితీయ ద్రేక్కాణము, మీన తృతీయ ద్రేక్కాణము.ఇవి యంగారకుని ద్రేక్కాణములు కాఁబట్టి, ఈద్రేక్కాణములలో నొక ద్రేక్కాణమునందుఁ జంద్రుఁ డుండి లగ్నమునకు ౨-౧౧-ఇండ్లయందు శుభగ్రహము లుండినచో సర్పము పుట్టు నని చెప్పఁదగినది. మఱియుఁ బాపగ్రహ లగ్నములయందు మేషప్రథమ ద్రేక్కాణమునఁ జంద్రుఁడు క్షీణత్వమునొంది యుండు నపుడు, కర్కాటక ద్వితీయ ద్రేక్కాణము, సింహ ద్వితీయ ద్రేక్కాణము, వృశ్చిక ప్రథమ ద్రేక్కాణము. ఇవి కుజద్రేక్కాణములు కాఁబట్టి, ఈద్రేక్కాణముల యందు నొక ద్రేక్కాణము లగ్నగతమై, యాలగ్నమునకు ౨-౧౧-ఇండ్లయందు శుభగ్రహము లుండినచో జనించిన

జంతువు సర్పముచేతఁ జుట్టఁబడినదై యుండునని యెఱుంగ వలయును. ఇందులకు, "భౌమ ద్రేక్కాణ భాగేచ సౌమ్యైరాయ ధన స్థితైః,సర్ప స్తద్వేష్టిత స్తద్వ త్పాపలగ్నే వినిర్దిశేత్." అని గార్గి వచనమున దెలియఁ బడుచున్నది.

చతుష్పద గతే భానౌ శేషై ర్వీర్యసమన్వితైః,
ద్వితనుస్థైశ్చ యమళౌ భవతః కోశ వేష్టితౌ. 4

తా. ఒక కోశముచేఁ జుట్టఁబడిన జంతుద్వయజననము జెప్పఁబడినది.ఎట్లనఁగ:— సూర్యుఁడు చతుష్పద రాసులైన మేష సింహ వృషభ ధను రపరార్థ మకరపూర్వార్థములలో నొకరాశి యందుండఁగాఁ దక్కిన గ్రహములు బలవంతులై, ద్విస్వభావ రాసులయం దుండిరేని యొక జరాయు వేష్టితము లగు రెండు జంతువులు పుట్టుచున్నవని తెలియఁ దగినది.

ఛాగ సింహ వృషే లగ్నే తత్ స్థే సౌరే ధవా కుజే,
రాశ్యంశ సదృశే గాత్రే జాయతే నాళవేష్టితః. 5

తా. అనఁగా నీశ్లోకమున నాళవేష్టిత జననయోగము చెప్పఁబడినది. ఎట్లనఁగ:— మేషసింహ వృషభములయందు నొకరాశి జన్మలగ్నమైనచో, నాలగ్నమున నంగారకుండు గాని, శనైశ్చరుండునుగాని యుండిరేని, అట్టికాలమున జనించిన శిశువు, లగ్నమునందు నేనవాంశ ముదయించునో, ఆనవాంశ యేరాశి సంబంధమగునో, ఆరాశికి సమాన మైన యవయవమునందు నాభినాళముచేతఁ జుట్టఁబడిన దై యుండునని యెఱుంగ వలయును. ఈవిషయమై "సింహాజ గోభి రుదయే సూతౌ నాళేన వేష్టితో జంతుః, లగ్నే కుజే ధసౌరీ రాశ్యంశ సమాన గాత్రేషు" అని సారావళియందుఁ జెప్పఁబడి యున్నది.

సలగ్న మిందుంచ గురు ర్నిరీక్షతే
నవా శశాంకం రవిణా సమాగతమ్,
సపాప కోర్కేణ యుతో ధవా శశీ
పరేణ జాతం ప్రవదంతి నిశ్చయాత్. 6

తా. ఈశ్లోకమున జారుని వలనఁ బుట్టిన జాతకుని తెలియం గెఱుంగువిధము జెప్పఁబడినది. ఎట్లనఁగా:—జన్మలగ్నమునుగాని చంద్రునిగాని గురువు చూడకుండెనేని నిర్ణయముగ జారునివలనఁ బుట్టినజాతకుండని చెప్పఁదగినది. లగ్న చంద్రులు బృహస్పతి నవాంశయందుండినచో జారజాతకుఁ డని వచింపఁగూడదు. ఈయర్థమునకు, "అజీవ భాగేష్వనవీక్షితేవా జీవేధ చంద్రేణ విలగ్నభేవా, వాచ్యం పరోద్భూత మితి బ్రువంతి వాచ్యో జనేనాధ బలావలోకాత్" అని యవనేశుండు చెప్పియున్నాఁడు. మఱియు సూర్యునితోడఁ గూడియున్న చంద్రుని, అనఁగా నేకరాశి గతులైన సూర్య చంద్రులను గురువు చూడకుండెనేని, అట్టి కాలమున జనించిన వాఁడు జారజుం డగును. అట్లు కానిపక్షమునఁ జంద్రుఁడు కుజునితోను శనితోను గూడినవాఁడై రవితోఁ జేరినను జూడఁబడినను జారజాతుం డగును. అయితే చంద్రుఁడు గురుక్షేత్రమునందుగాని తద్ద్రేక్కాణ నవాంశ ద్వాదశాంశల యందుఁగాని యితర రాశియందుఁగాని గురు సంయుక్తుఁడైనచో జార సంజాతుండు కాఁడని చెప్పఁదగినది. ఇందులకు, "గురు క్షేత్రగతే చంద్రే తద్యుక్తే వాన్యరాశిగే, తద్ద్రేక్కాణే తదంశేవా నపరైర్జాత ఇష్యతే." అని గార్గిచేఁ జెప్పఁబడినది. కొంద ఱీమూఁడవ యోగమునందు గురుదృష్టి లేకుండవలయు ననియు, గురుదృష్టి యుండినచో జారయోగమును వచింపఁ గూడ దనియు నెఱుంగఁ దగినది. మఱియు సారావళియందు, "పశ్యతి నగురు శ్శశినం లగ్నంచ దివాకరం సేందుం, పాప యుతౌ వా సూర్యాచంద్రమసౌచ యది జార జాతస్స్యాత్" అని బాగుగఁ జెప్పఁబడి యున్నది. భట్టోత్పలుం డనువ్యాఖ్యాత, ఏకరాశి గతు లగు సూర్య చంద్రులు ఇతర పాపగ్రహ యుక్తులైయుండిరేని గురువుచేఁ జూడఁబడని వారైనను జారయోగము గల్గునని చెప్పినాఁడు.

క్రూరర్క్ష గతావశోభనౌ
సూర్యాద్ద్యూన నవాత్మజ స్థితౌ,
బద్ధస్తు పితా విదేశగః
స్వేవా రాశి వశా దథోపతి. 7

తా. జనన కాలమును బట్టి జాతకుని తండ్రికి బంధన యోగము జెప్పఁబడినది. ఎట్లనిన:—క్రూర రాసులగు మేష సింహ వృశ్చిక మకర కుంభములను క్షీణచంద్రుఁడు పొందియుండఁగాఁ గర్కాటకమున బుధుండు పాపయుక్తుఁడై యుండినచో, అనఁగాఁ గన్యా మిథునములను శని కుజులుగూడి సూర్యుఁ డుండుస్థానమునకు-౭-౫-౫-ఇండ్ల నుండినచో సూర్యాధిష్ఠిత రాశివలన జనకుండు దేశాంతరస్థుఁడైకాని స్వదేశమునంగాని మార్గమునందుఁగాని కట్టఁబడిన వాఁడగును. అనఁగా సూర్యుఁడు చరరాశి గతుఁడై యుండెనేని దేశాంతరము నందును స్థిరరాశిగతుఁడై యుండెనేని స్వదేశమునను ద్విస్వభావ రాశిగతుఁడై యుండెనేని మార్గమునందును బంధనప్రాప్తుఁ డగునని యర్థము.

పూర్ణే శశిని స్వరాశిగే
సౌమ్యే లగ్నగతే శుభే సుఖే,
లగ్నే జలజేస్తగేపివా
చంద్రే పోతగతా ప్రసూయతే. 8

తా. ఓడయందుఁ బ్రసవ మగువిధము జెప్పఁబడినది. ఎట్లనిన—సంపూర్ణ చంద్రుఁడు స్వక్షేత్రమున నుండఁగా, బుధుఁడు లగ్నగతుఁడై, చతుర్థ కేంద్రంబున గురు వుండినచో, గర్భిణి యోడయందుఁ బ్రసవించు నని యర్థము. బుధునకుఁ జతుర్థమునందుఁ జంద్రుఁ డుండఁడు గనుక యిక్కడ శుభశబ్దము వలన గురువని వచింపవలెను. ఇది యొక యోగము. మఱియు జలరాసు లగుకర్కాట మకరోత్తరార్థ మీనముల యందు నొకరాశి లగ్నం బగుచుండఁగాఁ జంద్రుఁడు ౭-౫ ఇండ్లయం దుండినచో నోడయందుఁ బ్రసవమని చెప్పఁ దగినది.

ఆప్యోదయ మాప్యగ శ్శశీ
సంపూర్ణ స్తమ వేక్షతే థవా,
మేషూరణ బంధు లగ్నగః
స్యాత్సూతి స్సలిలే నసంశయః. 9

తా. ఉదక సమీపమునం బ్రసవ యోగములు దెల్పఁబడినవి. ఎట్లనఁగ:—జలరాశి లగ్నమై చంద్రుఁడు జలరాశి యందుండెనేని

యుదక సమీపమునందుఁ బ్రసవ మగునని సందియములేదని వచింప వలయును. అట్లు కాని యెడ, నేరాశి యందైనను బూర్ణ చంద్రుఁడు, ఆజలరాశియైన లగ్నమును జూచెనేని యుదక సమీపమున బ్రసవము చెప్పఁ దగినది. మఱియు జలరాశి లగ్నమై ౪-౧౦ ఇండ్లయందు నొక చోట నుండెనేని జలసమీపమునఁ బ్రసవము చెప్పఁ దగినది. ఇందు లకు, "సలిల భలగ్నే చంద్రో జలరాశిం వీక్షతే ధవా పూర్ణః, ప్రసవం సలిలే వింద్యా ద్బంధూభయ దశమగశ్చ యదా." అని సారావళి యందుఁ జెప్పఁ బడినది.

ఉద యోడుపయో ర్వ్యయస్థితే
గుప్త్యాం పాప నిరీక్షితే యమే,
అళి కర్కి యుతే విలగ్నగే
సౌరే శీతకరే క్షితే వటే. 10

తా. అనఁగాఁ గారాగృహము నందును, భూరంధ్రము నందును, ప్రసవ మగు యోగములు చెప్పఁబడినవి. ఎట్లనఁగ:—లగ్న చంద్రులకుఁ బండ్రెండవ యింట నున్నట్టి శనైశ్చరుఁడు పాపగ్రహ ముల చేతఁ జూడఁ బడినచోఁ జెఱసాల యందుఁ బ్రసవము చెప్పఁదగి నది. మఱియు శనైశ్చరుండు వృశ్చిక కర్కాటక రాసులయందుండిన ను లగ్నమున నుండినను, చంద్రునిచేతఁ జూడఁబడెనేని గుంటయందుఁ బ్రసవము చెప్పఁదగినది. ఇది హృత నష్టాదిప్రశ్నలయందు నుపయుక్త మగుచుండును.

మందేజ్య గతే విలగ్నగే
బుధ సూర్యేందు నిరీక్షితే క్రమాత్,
క్రీడాభవనం సురాలయం
ప్రసవే సోషర భూమి మాదిశేత్. 11

తా. అనఁగాఁ గ్రీడాగృహము నందుఁగాని, దేవాలయమునం గాని, ఊషర భూమి యందుగాని ప్రసవ మగు యోగములు దెల్పఁ బడినవి. జలరాశి గతుఁడైన శనైశ్చరుఁడు లగ్నమును బొందినవాఁడై బుధ రవి చంద్రులచేతఁ జూడఁబడె నేని క్రీడాభవ నాదిస్థలముల యం

దుఁ బ్రసవము చెప్పఁ దగినది. మఱియు సూర్యునిచేతఁ జూడఁబడినచో దేవాలయము నందును, చంద్రునిచేఁ జూడఁబడెనేని యూషర భూప్రదేశము నందును, ప్రసవము చెప్పఁ దగినది. ఇది హృత నష్టాదులయందును సురత ప్రశ్నయందు నుపయుక్తముగ నుండును.

> నృలగ్నగం ప్రేక్ష్య కుజః శ్మశానే
> రమ్యే సితేందూ గురు రగ్ని హోత్రే,
> రవి ర్న రేంద్రామర గోకులేషు
> శిల్పాల్యలయే జ్ఞః ప్రసవం కరోతి. 12

తా. శ్మశానమునందును, రమ్య ప్రదేశము నందును, వహ్నిశాలాదుల యందును, ప్రసవ మగు తెఱంగు చెప్పఁబడినది. నరరాసులగు మిథున కన్యా తులా ధన్వి పూర్వార్థ కుంభముల యందొక లగ్నమును బొంది యుండు శనైశ్చరుని కుజుఁడు చూచినచో, శ్మశానము నందుఁ బ్రసవ మగు నని యర్థము. మఱి యానర రాశియందుండు శనిని శుక్ర చంద్రులు చూచిరేని రమణీయ గృహమునఁ బ్రసవమని యెఱుంగ వలయును. గురువు చూచెనేని అగ్నిశాల యందును, సూర్యుఁడు చూచినచో రాజగృహ దేవాలయ గోశాల యందును, బుధుఁడు చూచిన శిల్పాల్యలయమునందును, బ్రసవము చెప్పఁ దగినది. ఇందులకు, "కుజేనదృష్టే రవిజే శ్మశానం బుధేన శిల్పాలయ మిత్యుశంతి, సూర్యేక్షితే గోనృప దేవవాసే శుక్రేందుజాభ్యాం రమణీయ దేశే." అని బాదరాయణ వచనమున్నది. ఇది హృత నష్టాది ప్రశ్నల యందును సురత ప్రశ్నలయందు నుపయుక్తం బగు చున్నయది.

> రాశ్యంశ సమాన గోచరే మార్గే జన్మచరే స్థిరే గృహే,
> స్వర్క్షాంశ గతే స్వమందిరే బలయోగాత్ఫల మంశ కర్షయోః. 13

తా. ఈ శ్లోకమునం బ్రసవదేశము తెఱంగు చెప్పఁబడినది. లగ్నమునకును నవాంశకును సమాన విషయమైన మార్గాదుల యందుఁ బ్రసవము చెప్పఁ దగినది. ఎట్లనఁగ—ప్రథమాధ్యాయమునందు నైదవ శ్లోకము నందు నుదహరింపఁబడిన, "ఆద్య స్మృతో మేష

సమాన మూర్తిః కాలస్య మూర్ధా గదితః పురాణైః, సోజా వికాసం చర కందరాద్రి స్తేనాగ్ని ఘాతాద్వాకర రత్నభూమిః." ఈ శ్లోకముచేత నేయే రాశికి నేయేసంచార ప్రదేశంబులు చెప్పఁబడి యున్నవో, ఆయా రాశి లగ్న నవాంశల వలన నాయాప్రదేశముల యందుఁ బ్రసవము చెప్పఁ దగినది. మఱియు లగ్నరాశిగాని తన్నవాంశ రాశిగాని చరమై యుండెనేని యారాశి సంచార మార్గప్రదేశంబునను, స్థిరరాశి యైయుండినచో, నారాశి సంచార ప్రదేశమున నున్న గృహమునందును, ద్విస్వభావరాశియైయుండెనేని, ఆరాశి సంచార ప్రదేశమున నున్న గృహాబహిర్వేదిక యందును ప్రసవము చెప్పఁ దగినది. మఱియుఁ జర రాశి లగ్నమై, ఆలగ్న రాశి నవాంశ ముదయించినచో, స్వగృహ మార్గంబునను, స్థిరరాశి లగ్నమై యాలగ్నరాశి నవాంశమే యుదయించెనేని స్వగృహమునందును, ద్విస్వభావరాశి లగ్నమై ఆ లగ్న రాశినవాంశమే యుదయించినచోఁ దన యింటివాకిట తిన్నెమీఁదను బ్రసవము చెప్పఁదగినది. ఇచ్చట, "రాశ్యంశ సమాన గోచరే" అని లగ్నవాంశలు సామాన్యముగఁ జెప్పఁబడినవిగదా! అందుఁ బ్రసవ దేశమును లగ్నరాశిని బట్టి చెప్పవలయునా? లేక నవాంశరాశిని బట్టి వచింప వలయునా? అని సందియము కల్గునని, అందులకు, నవాంశ రాసుల బలయోగము వలనఁ బ్రసవ స్థాన జ్ఞాన రూప ఫలములు అనఁగా లగ్నరాశి నవాంశలలో నెద్ది బలయుక్తంబై యుండునో, ఆరాశి సంచార ప్రదేశమునందుఁ బూర్వోక్త ప్రకారముగాఁ బ్రసవ మును జెప్పఁదగినది. ఇందులకు, "భవనాంశ సదృశ దేశే ప్రసవో జ్ఞేయ స్సదా త్ర యువతీనాం, మిశ్ర గృహాంశే వర్త్మని స్థిరరాశ్యంశే తథా స్వగృహే, స్వాధిపయుతే విలగ్నే స్వగృహే న్యస్మిక్ తథాన్యథా ప్రసవః" అని సారావళియందుఁ జెప్పఁబడి యున్నది.

ఆరార్కజయో స్త్రికోణగే చంద్రేఽస్తేచ విసృజ్య తేంబయా,
దృష్టే మరరాజమంత్రిణా దీర్ఘాయు స్సుఖభాక్చ సస్మృతః. 14

తా. తల్లిచే విడువఁబడిన నితరుల వలనఁ బెంపఁబడిన శిశు యోగములు రెండు చెప్పఁబడినది. ఎట్లనఁగ—చంద్రుఁ డైనను, సూర్యుఁ

డైన నొక రాశియందు నుండు శని కుజులకు ౯ - ౫ - ఇండ్లయందు నెందేని యుండఁగా జనించిన శిశువు తల్లిచేత విడువఁబడు ననియర్థము. మఱి యీయోగమునందే, చంద్రుఁడుగాని సూర్యుఁడుగాని గురువు చేతఁ జూడఁబడుచుండఁగాఁ బుట్టిన శిశువు తల్లిచే విడువంబడియు నన్యులచేతఁ జిక్కి చిరాయువుతో వృద్ధి నొందు ననియర్థము. కొందఱు, “చంద్రేస్తేచ విసృజ్య తేంబయా” యని పఠించి చంద్రుఁ డేకరాశిగత కుజ శనులకు నవమ పంచమముల యందుఁగాని సప్తమము నందుఁగాని యుండెనేని తల్లిచేత విడువంబడు నని చెప్పుచున్నారు. ఇయ్యది యోచింపఁ దగినది.

పాపేక్షితే తుహినగా వుదయే కుజేస్తే
త్యక్తో వినశ్యతి కుజార్కజయో స్తథాయే,
సౌమ్యేపి పశ్యతి తథావిధ హస్తమేతి
సౌమ్యేతరేషు పరహస్తగతో ప్యనాయుః. 15

తా. తల్లిచే విడువఁబడిన శిశునాశము చెప్పఁబడినది. ఎట్లనఁగా—శన్యంగారకులలో నొకనిచేఁ జూడఁబడిన చంద్రుఁడు లగ్నము నందుండి సప్తమమున నంగారకుఁ డుండెనేని తల్లిచేత విడువఁబడి, శిశువు మృతి నొందునని యర్థము. ఆప్రకారము లగ్నము నందుండు చంద్రుఁడు సూర్యునిచేతఁ జూడఁబడు చుండఁగ నేకాదశ స్థానమునం గుజ శను లుండిరేని తల్లిచేత శిశువు విడువంబడి నశించు నని చెప్పఁ దగినది. మఱి యిదేప్రకారము చంద్రుఁడు లగ్నమునందును గుజుండు సప్తమమున నుండఁగా నొకశుభగ్రహము చంద్రుని చూచినచోఁ బుట్టిన శిశువు తల్లిచేత విడువఁబడి ఆచూచు నట్టి శుభగ్రహ వర్ణములలో నే వర్ణము గలదో, ఆవర్ణముగల వారిచేతఁ జిక్కి బ్రతికి యుండునని యర్థము. మఱి యీచెప్పఁబడిన యోగమునందుఁ జంద్రుని శుభ పాప గ్రహములు చూచిరేని, ఆ గ్రహములయందు బలయుక్త గ్రహ మేజాతి గలదో యాజాతి గలవారిచేతఁ జిక్కియు నాయువు లేక నశించు ననియర్థము. ఈ యోగములయందు, “దృష్టేమర రాజమంత్రిణౌ దీర్ఘాయు స్సుఖభాక్చ సస్మృతః” అని పూర్వము చెప్పినరీతిగ బలయు

క్షేంద్రస్థాన గురువు లగ్నమును జూచెనేని యాజాతి హస్తగతం బగుశిశు దీర్ఘాయువుతో నుండు నని తెలియఁ దగినది. ఇందులకు, "ప్రియ పాపైర్లగ్నష్ఠే శ్శశిని విలగ్నే కుజేస్తగే త్యక్తః, లగ్నాచ్చ లాభగత యోర్విసుధాసుత మందయో రేవం, పశ్యతి సౌమ్యే బలవాన్యాద్య గ్రస్తాంతి తాదృశో జాతం, శుభ పాప గ్రహ దృష్టే పరై ర్గృహీత స్యసామ్రియతే, సర్వే ష్వేతేషు యదా యోగేషు శశీ సురేజ్య స దృష్టః, భవతి తదా దీర్ఘాయు ర్హస్తగత స్సర్వేషు." అని సారావ యందుఁ జెప్పఁబడి యున్నది.

పితృ మాతృ గృహేషు తద్బలా
త్తరు సాలాదిషు నీచగై శ్శుభైః,
యది నైకగతై స్తు వీక్షితౌ
లగ్నేందూ విజనే ప్రసూయతే. 1

తా. మాతాపితల గృహముల యందుఁ బ్రసవ మగువిధ మీశ్లోకమునఁ జెప్పఁబడినది. ఎట్లనఁగ— చతుర్థాధ్యాయమునందు "దివార్క శుక్రౌ పితృమాతృ సంజ్ఞితౌ" అను శ్లోకమునఁ జెప్పబడిన పితృ మాత్రాది సంజ్ఞలుగల గ్రహములచేతఁ దల్లి మొదలగు వారియిండ్లఁ బ్రసవమును జెప్పఁ దగినది. అనఁగాఁ బగలు సూర్యుఁడును రాత్రి శనైశ్చరుండును బలవంతులై యుండిరేని పితృ గృహమునను, పగలు శుక్రుఁడును రాత్రి చంద్రుఁడును బలవంతులై యుండిరేని మాతృ గృహమునను, పగలు శనైశ్చరుండును రాత్రి సూర్యుఁడును బలవంతులై యుండిరేని పినతండ్రి పెత్తండ్రి మేనత్త మొదలగువారి యిండ్లయందును, పగలు చంద్రుఁడును రాత్రి శుక్రుఁడును బలవంతులైయుండిరేని పినతల్లి పెదతల్లి మేనమామ మొదలైనవారి గృహముల నెందైన బ్రసవము చెప్పఁదగినది. మఱియు శుభగ్రహములు నీచస్థానముల యందుండిరేని వృక్ష ప్రాకార సమీపములయందుఁ బ్రసవింతు రనియును, ఆదిశబ్దముచేత నదీ కూపాది సమీప ప్రదేశములయందుఁ బ్రసవింతు రనియు, నేకరాశి స్థితు లగుచుండి నీచ నొందిన శుభగ్రహములచేత లగ్నచంద్రులు చూడఁబడ కుండిరేని జన

శూన్య ప్రదేశమునందుఁ బ్రసవింతు రనియు, నేకరాశి గతులగు బహుశుభ గ్రహములచేత లగ్నచంద్రులు చూడఁబడుచుండిరేని జన యుక్త ప్రదేశమునందుఁ బ్రసవింతురనియుఁ జెప్పఁదగినది. ఇందులకు, "పితృ మాతృ గ్రహంబల తత్తత్స్వజన గృహేషు బలయోగాత్, ప్రాకార తరు నదీషుచ సూతి ర్నిచాశ్రితై స్సామ్యైః. నేకుంతే లగ్నేందూయ ద్యేకస్థా గ్రహాస్త దాటవ్యామ్" అని సారావళియందుఁ జెప్పఁబడినది.

మంద ర్త్రాంశే శశిని హిబుకే మంద దృష్టే బ్జగేవా
తద్యుక్తేవా తమసి శయనం నీచ సంస్థైశ్చ భూమహా,
యద్వ దాశ్రిశి ర్వ్రిజతి హరిజం గర్భమోక్షస్తు తద్వ
త్స్వాపై శ్చందాశ్రిత్ స్మర సుఖ గ్తైః క్లేశ మాహు ర్జనన్యాః.

తా. ఈ శ్లోకమున నంధకా రానంధకారముల యందుఁ బ్రసవించు యోగములు చెప్పఁబడినవి. మఱియు జనన కాలముల యందు శీర్షా ద్యుదయ ప్రకారమును, మాతకు గష్టప్రసవ విష యమును జెప్పఁబడినది. ఎట్లనఁగ:—చంద్రుం డేరాశి యందైనను శనినవాంశము లగు మకర కుంభ నవాంశలయం దుండెనేని, అంధ కారమునందు సూతికా శయన మనియు, మఱియు లగ్న చతుర్థము నందుఁ జంద్రుఁ డున్నచో నంధకారమునందు సూతికా శయన మని యు, మఱియుఁ జంద్రుఁ డేరాశియందైన నుండి శనిచేతఁ జూడఁబడె నేని యంధకారమునందు సూతికా శయన మనియు, మఱి యబ్జ రాసు లగు కర్కాట మీనంబులం దేరాశియం దైనఁ గర్కాట నవాంశయం దుఁ గాని మీన నవాంశయందుఁగాని యుండెనేని యంధకారమునందు సూతికా శయన మనియు, మఱియుఁ జంద్రుఁడు శనితోఁగూడి యుండి నను అంధకారమునందు సూతికా శయన మనియుఁ జెప్పఁదగినది. కాబట్టి ఈప్రకారము నిషేకకాలమునందు నీయోగములు గల్గియుండె నేని యంధకారమునందు శయనము గల్గునని వచింప వలయును. ఇందు నీయోగంబులు చెప్పినప్పటికిని అనుభవమునందుఁ జంద్రుఁడు సూర్యు నిచేతఁ జూడఁబడు చుండినచో నంధకారమునందు నీయోగము గల్గు

నని చెప్ప వలయును. ఇందులకు, ''సౌరాంశకస్థే శశిని ప్రలగ్నే జలే జలాఖ్యాంశక మాశ్రితేన, స్వాంశస్థితే కేంద్ర గతేర్క జేవాజాతస్తమిసే్రి యది వార్కదృష్టః.'' అని యవనేశ్వరుఁడు చెప్పియున్నాఁడు కాఁబట్టి యీ యోగములు బాగుగఁ జూడవలయును. మఱియు బలవంతుఁ డగుసూర్యుఁ డంగారకునిచేతఁ జూడఁబడు చుండినచో దీపసహిత గృహమునందు సూతికా శయన మని వచింప వలయును. ఇందులకు, ''బలవతి సూర్యే దృష్టే బహు ప్రదీపా ధరాకుపుత్రేణ, అన్యైర్వ్యపగత వీర్యై స్సూతౌ జ్యోతిస్మృణై ర్భవతి, సౌరాంశేథ జలాంశే చంద్రేర్కజ సంయుతే ధవాహిబుకే, తద్దృష్ట్వా కుర్యాత్తమసి ప్రసవం నసందేహః.'' అని సారావళి గ్రంథంబునఁ జెప్పఁబడియున్నది. మఱియు నీచస్థానములయందుండు గ్రహములచేతఁ దృణాస్తృతమగు భూమియందు సూతికాశయన మని చెప్పఁదగినది. మఱి కొందఱు చంద్రుఁడు లగ్నమునందుఁగాని చతుర్థమునందుఁగాని నీచస్థానమునందుఁగాని యుండినచో భూమియందు శయన మనిచెప్పవలయును. ఇందులకు, ''నీచస్థై ర్భూశయనం చంద్రే వ్యథవా సుఖే విలగ్నే వా.'' అని సారావళియందుఁ జెప్పఁబడినది. మఱియుఁ బ్రసవ లగ్నరాశి యేప్రకారముగా నుదయమును బొందు చున్నదో ఆ ప్రకారముగఁ బ్రసవము చెప్పఁదగినది. అదెట్లనఁగ:— శీర్షోదయరాశి ప్రసవ లగ్నమాయెనేని ముందు శిర ముదయ మగు ననియుఁ, బృష్ఠోదయరాశి ప్రసవ లగ్న మైనచో శిశు వధోముఖమై పాద పురస్సరమై పృష్ఠమును జూపుచు నుదయం బగుననియు, నుభయోదయ రాశి లగ్నమైనచో శిశువు హస్త పురస్సరమై యుదయ మగు ననియుం జెప్పఁదగినది. ఇందులకు, '' శీర్షోదయే విలగ్నే మూర్ధ్నా ప్రసవోన్యథోదయే చరణైః, ఉభయోదయేచ హస్తే శుభదృష్టే శోభ నోన్యథాకష్టః'' అని సారావళియందుఁ జెప్పఁబడినది. కొందఱిట్లు చెప్పుచున్నారు. ఎట్లనఁగ:— లగ్నాధిపతిగాని, నవాంశపతిగాని, లగ్నగత గ్రహముగాని వక్రించి యుండిన పక్షమున నపు డుక్త వైపరీత్యముగ గర్భమోచన మనిచెప్పుచున్నారు. ఇందులకు, ''లగ్నాధి పేంశక పతౌ

లగ్నస్థే వక్రితే గ్రహే పృథవా, విపరీత గతో మోక్షో వాచ్యో గర్భస్యసంక్లేశః" అని మణిత్థుఁడు వచించి యున్నాఁడు. మఱియుఁ జంద్రుఁడున్న స్థానము మొదలుకొని ౭-౮-వయిండ్లయందుఁ బాప గ్రహముల చేత మాతకుఁ గష్టము గల్గునని వచింపవలయును. ఇందులకు సారావళియందు, "క్లేశో మాతుః క్రూరై ర్బంధ్వస్తగతై శ్శశాంక యుక్తైర్వా"అని చెప్పఁబడి యున్నది గనుక చంద్రునకు నెక్కువగఁ బాప గ్రహముల చూపు గల్గియుండినచోఁ దల్లికి మిక్కిలి కష్టము గల్గి ప్రసవించు నని వచింప వలయును.

స్నేహ శ్శశాంకా దుదయాచ్చ వర్తి
ర్దీపోర్క యుక్తర్క్ష వశాచ్చ రాద్యః,
ద్వారంచ తద్వాస్తుని కేంద్ర సంస్థై
ర్జ్ఞేయం గ్రహై ర్వీర్య సమన్వితై ర్వా. 18

తా. అనఁగా నీశ్లోకమునందు సూతికా గృహమునం దుంచఁబడిన దీప భాజనములోని తైలపూర్ణాపూర్ణత్వంబును, వత్తియొక్క దీర్ఘ హ్రస్వత్వంబును, వత్తికిఁ గలరంగును, దీపపాత్ర ముండెడు ప్రదేశమును, దీప స్థిత్యాదులును, సూతికాగృహద్వారనిర్ణయంబును జెప్పఁబడి యున్నది. ఎట్లనఁగ:—స్నేహమనఁగా నిచ్చట ఘృత తైలాదుల కర్థము. కాఁబట్టి జన్మకాలమునఁ జంద్రుఁడు తానుండు రాశియందు మొదట నుండినచో దీప పాత్రమునందుఁ దైలము నిండి యుండునని యర్థము. రాశి మధ్యమునం దుండెనేని దీప పాత్రమునఁ దైలము సగముగ నుండునని యర్థము. రాశ్యంతమున నాచంద్రుఁ డుండినచో దీప పాత్రయందుఁ దైలము లేదని యర్థము. ఇందులకుఁ గొందఱు, జన్మకాలమునందుఁ జంద్రుఁడు సంపూర్ణుఁడై యుండెనేని తైలము సంపూర్ణముగ నుండుననియు, నర్ధచంద్రుఁడై యుండెనేని తైల మర్ధముగ నుండుననియు, క్షీణచంద్రుఁడై యుండెనేని తైలము క్షీణించి యుండుననియుఁ జెప్పవలె నని యనుచున్నారు. ఇందులకు, "దీపః పూర్ణః పూర్ణే శశిని క్షీణే క్షయస్తు తైలస్య" అని సారావళియందుఁ జెప్పఁ

బడి యున్నది. ఇయ్యది నిర్ణీతార్థమైనపక్షమున నమావాస్యయందుఁ బుట్టినవారు అనఁగాఁ జీకటియందుఁ బుట్టిన వారని చెప్పవలసివచ్చును. అది ప్రసిద్ధము కాఁబట్టి పూర్వము చెప్పిన ప్రకారము తైల పూర్ణాపూర్ణత్వమును నిర్ణయించుట యుక్తము. మఱియు లగ్నమువలన వత్తిని నిర్ణయింపఁ దగినది. అదెట్లనఁగా:— ప్రసవ లగ్నారంభమునందైనచో దీపమునందు వత్తి నపుడ, వేయఁ బడిన దనియు, లగ్న మధ్యమునందైన వత్తి సగము కాలిపోయిన దనియు, లగ్నాంతము నందైన వత్తియైపోయిన దనియుఁ జెప్పఁ దగినది. ఇందులకు, "యావల్లగ్న మతీతం వర్తి ర్దగ్ధాతు తావతీభవతి" అని సారావళియందుఁ జెప్పఁ బడియున్నది. కొందఱు లగ్న మేవర్ణము గలదో యావర్ణము గల వత్తి యుండునని చెప్ప వలసినదని యందురు. ఇందులకు, "లగ్నస్య యోత్రవర్ణో నిర్దిష్ట స్తేన వర్తి రాదేశ్యా" అని మణిత్థుఁడు చెప్పి యున్నాఁడు. మఱియు సూర్యుఁ డుండురాశి వలన దీపమును జెప్పఁ దగిన దెట్లనఁగ :— సూర్యుఁడు చరరాశి యందుండెనేని దీపము కదలు చుండు ననియు, స్థిరరాశి యందుండెనేని కదల కుండు ననియు, ద్విస్వభావ రాశియం దుండెనేని దీపము డోలాయమానముగఁ గదలు చుండు ననియును జెప్పవలయును. మఱికొందఱు సూర్యుం డేరాశి యందుండునో యారాశికి, "ప్రాగాదీశాః క్రియ వృష నృయు కర్కటా స్త్రిత్రికోణాః" అని చెప్పఁబడి యుండు శ్లోకమునందు నేదిక్కు జెప్పఁబడి యుండునో, ఆదిక్కుగ దీప ముండు నని చెప్పవలయు నని యందురు. మఱికొందఱు సూర్యుఁడు భ్రమణ వశంబున నెనిమిది జాము లెనిమిది దిక్కుల యందుఁ దిరుగు చుండును గాఁబట్టి, ఆరీతిగ సూర్యుం డేదిక్కున నుండునో యాదిక్కున దీప ముండు ననియుఁ జెప్పవలె నని యందురు. ఇందులకు, "ద్వాదశ భాగ విభక్తే వాసగృహే వ్యవస్థితే సహస్రాంశౌ, దీప శ్చర స్థిరాదిషు తత్రైవ వాచ్యః ప్రసవ కాలే" అని సారావళి గ్రంథమునఁ జెప్పఁబడినది. కాఁబట్టి యిచ్చట సూతికా గృహమును బండ్రెండు విధములుగ విభజించి మేషము మొదలుగ గణన చేయఁగా, సూర్యరాశి యెచ్చట నుండునో, యాస్థానమునందు దీప ముండు నని యర్థము. ఇదియునుం గాక సూర్యుఁ

డు బలవంతుం డగుచు, ననఁగా మేషమునఁగాని సింహమునఁగాని రవియుండి అంగారకునిచేతఁ జూడఁబడినచో ననేక దీపములనియుఁ, గుజ వ్యతిరిక్త బలహీన గ్రహములచేతఁ జూడఁ బడెనేని తృణజ్యోతి యనియుఁ జెప్పఁదగినది. ఇందులకు, "బలినా దృష్టే భానౌ బహూ ప్రదీపా స్స్వదేత్కుపుత్రేణ, అన్యై ర్వ్యపగత వీర్యై స్స్యాతౌ జ్యోతి స్తృణై ర్భవతి" అని లఘుజాతకమునఁ జెప్పఁబడి యున్నది. మఱి యాసూతికా గృహమున ద్వారము కేంద్ర స్థానముల యందుండు బల గ్రహముల వలనఁ దెలియఁ దగినది. అనఁగా "ప్రాగాద్యాం రవిశుక్ర లోహిత తమ స్సౌరేందు విట్సూరయః" అను శ్లోకమునందు రవి శుక్రాదులు ప్రాగా ద్యష్ట దిక్కులకు నధిపతు లని చెప్పఁబడి యున్నదిగదా? అట్లు కేంద్రమునందు నేగ్రహ ముండునో, యాగ్రహ దిక్కున, సూతికా గృహ ద్వారమని తెలియఁ దగినది. అనేక గ్రహములు కేంద్రములయం దుండినచో నందు నేగ్రహము బలాధిక మైయుండునో యాగ్రహ దిక్కునఁ గవాటముండు నని యర్థము. అనేక గ్రహములు బల యుక్తములై కేంద్రములయం దుండెనేని, యెన్ని గ్రహము లట్లుండునో యన్ని ద్వారము లని తెలియఁ దగినది. మఱియుఁ గేంద్రముల యందు గ్రహములు లేకుండినచో, "ప్రాగాది గృహాః క్రియాదయో ద్వే ద్వే కోణగతా ద్విమూర్తయః" అను ప్రకారముగా లగ్నరాశి దిశయందు సూతికా గృహ ద్వారం బెఱుంగునది. ఈవిషయమునకు, "ద్వారం వాస్తుని కేంద్రోపగతా ద్గ్రహా దసతివా విలగ్నర్క్షాత్" అని లఘుజాతకమునందుఁ జెప్పఁబడి యున్నది. కొందఱు, "వీర్య సమన్వితైర్వా" అని వేఱుగ విభజించి కేంద్రము గ్రహశూన్యం బై యుండినఁ, దత్కాలము నందు సకల గ్రహములలో నేగ్రహము బలాధిక మై యుండునో, ఆగ్రహమును బట్టి గృహ ద్వారము నిర్ణయింపవలెనని చెప్పుచున్నారు. ఇది యొకమార్గ మని తలంప వలయును.

జీర్ణం సంస్కృత మర్కజే క్షితిసుతే దగ్ధం నవంశీతగౌ
కాష్టాద్యం సదృఢం రవౌ శశిసుతే తన్నైకశిల్ప్యుద్భవం,

 

రమ్యం చిత్రయుతం నవంచ భృగుజే జీవేదృఢం మందిరం
చక్రస్థైశ్చ యథోపదేశ రచనం సామంత పూర్వాన్ వదేత్. 19

తా. సూతికా గ్రహలక్షణ మీశ్లోకమునం జెప్పఁబడినది. ఎట్లనఁగా:—వీర్య సమన్విత శబ్ద మీ శ్లోకమునకుఁ దెచ్చుకొని యర్థము నెఱుంగ వలయును. సకల గ్రహముల కంటె శని వీర్య సమన్వితుఁడై, అనఁగా బలవంతుఁడై యుండెనేని సూతికా గృహము మిక్కిలి పురాతన మగుటంజేసి మఱల బాగుగఁ గట్టఁబడిన దనియు, నంగారకుండు బలవంతుఁడై యుండెనేని యొక ప్రక్కనఁ గాలినట్టి మందిరమనియుఁ, జంద్రుఁడు బలవంతుఁడై యుండెనేని నూతన గృహమనియు, "సంవర్ధతాం చంద్రమ సోప లిప్తం" అని యవనేశ్వరుఁడు వచించియున్నాఁడు. కాఁబట్టి, శుక్లపక్షమునందుఁ జంద్రుఁడు బలవంతుఁడై యుండెనేని వ్రాయఁబడిన దనియు, సూర్యుఁడు బలవంతుఁడై యుండెనేని కొయ్యలు మెండుగ గల దృఢ మైనదియును, బుధుఁడు బలవంతుఁ డై యుండెనేని బహువిధ శిల్పులచేత రచింపఁ బడిన దనియు, శుక్రుఁడు బలవంతుఁ డై యుండినచో సుందర మందిరం బనియుం జిత్రములతోఁగూడి యుండు ననియు, గురుండు బలవంతుఁ డై యుండినచోఁ జిరకాలముగ నుండు దృఢ మైన గృహం బనియుఁ జెప్పఁ దగినది. మఱియు, సకల గ్రహముల కంటె బలాధికం బైన గ్రహమును బట్టి సూతికా గృహ లక్షణము చెప్పఁ దగిన దని యున్నది గదా? అట్లా సూతికా గృహమునకుఁ బూర్వ పశ్చిమ దక్షిణోత్తర ముల యం దుండు గృహము సామంత గృహ మనంబడును. కాఁబట్టి సూతికా గృహ లక్షణము గలుగఁజేయు గ్రహము మొదలుకొని ద్వాదశ రాశ్యాత్మక మగు రాశి చక్రమును నాల్గు భాగములుగ విభజించి, అందు సూతికాగృహలక్షణమును గలుగఁ జేయు గ్రహముండు రాశి మొదలుకొని ప్రథమ భాగమునందుండు నితర గృహములచేత సూతికా గృహమునకుఁ దూర్పు టిల్లును, ద్వితీయ భాగగత గ్రహములచేత దక్షిణపు టిల్లును, తృతీయ భాగ గత గ్రహములచేతఁ బడమటిల్లును, చతుర్థ భాగ గత గ్రహములచేత నుత్తరపు టిల్లుం

జెప్ప వలయును. ఈవిషయమై, "భవన గ్రహ సంయోగైః ప్రతి వేశ్మాని చింత నీయాని, దేవాల యాంబు పావక కోశ విహారా ద్యవ స్కర స్థానం, నిద్రా గృహంచ భాస్కర శశి కుజ గురు భార్గ వార్కి బుధ యోగాత్" అని సారావళి యందుఁ జెప్పఁ బడి యున్నది. అయిన నిచ్చటఁ జెప్పఁబడని విషయ మొక్కంతయీగ్రంథకర్త వలన లఘుజాతకమునందుఁ జెప్పఁ బడినది. అది ద్విభూమిక, త్రిభూమిక, ద్విశాల, త్రిశాలాది నిర్ణయము. గావున నాప్రకారము చూడఁదగినది. అదెట్లనిన:—"గురు రుచ్చే దశమస్థో ద్విత్రి చతు ర్భూమికం కరోతి గృహం, ధనుషి సబలే త్రిశాలం ద్విశాల మన్యేషు యమలేషు" అని యున్నది. అనఁగా గురువు తన యుచ్చరాశియగు కర్కాటకమునందుఁ బరమోచ్చ భాగచ్యుతుఁడై యుండి లగ్నమునకు దశమస్థుఁ డయ్యేనేని సూతికాగృహము రెండంతస్తులుగల మిద్దెయనియుఁ, బరమోచ్చ భాగమునకుఁ గ్రింద నుండెనేని మూఁ డంతస్తులు గలదనియుఁ, బర మోచ్చ భాగమునం దుండెనేని నాల్గంతస్తులు గలదనియు, ధను ర్లగ్న మునందు గురువు బలవంతుఁడై యుండెనేని సూతికా గృహము త్రిశాల మనియు, ద్విస్వభావ రాసులైన మిథున కన్యా మీనముల యందు గురువు లగ్నమునకు దశమస్థుఁడై యుండెనేని ద్విశాల మనియుఁ జెప్ప వలయు నని లఘుజాతకమునందు వరాహ మిహి రాచార్యులు వచించి యున్నారు.

> మేష కుళీర తులాళి ఘటైః ప్రా
> గుత్తరతో గురు సౌమ్య గృహేషు,
> పశ్చిమ తశ్చ వృషేణ నివాసో
> దక్షిణ భాగ కరౌ మృగ సింహౌ. 20

తా. ఈశ్లోకమున లోఁగిట సూతికా గృహ ముండు దిశను దెలియు తెఱంగుఁ జెప్పఁ బడినది. మేష కర్కాటక తులా వృశ్చిక కుంభ ములలో నొకటి జన్మలగ్న మైనచోఁ గట్టఁబడిన యింటఁ దూర్పునఁ బురిటిల్లనియు, గురురాసు లగు ధనుర్మీనములును, బుధరాసు లగు కన్యా మిథునములును, ఈనాల్గు రాసులయం దొకటి జన్మలగ్న మైన

చో నుత్తరపు దిశయందుఁ బురిటిల్లనియు, వృషభము జన్మలగ్నమయ్యెనేని పడమర దిశను బురిటి ల్లనియు, మకర సింహములలో నొకటి జన్మలగ్న మైనచో దక్షిణపు దిశయందుఁ బురిటి ల్లనియుఁ జెప్పవలయును. ఆయా రాసుల యంశ లైనను ఆయాదిశల యందు సూతికా గృహ ముండు నని వచింప వలయును.

ప్రాచ్యాది గృహే క్రియాదయో
ద్వౌద్వౌ కోణ గతా ద్విమూర్తయః,
శయ్యా స్వపివాస్తు వద్వదే
త్పాదై ష్షట్ త్రినవాంత్య సంస్థితైః. 21

తా. సూతికా గృహమునం గల శయన స్థలము నెఱుంగు తెఱంగుఁ జెప్పఁబడినది. ఎట్లనఁగా:—సూతికా గృహమునఁ బ్రాగాద్యష్ట దిక్కుల యందును మేషాది రాసు లగు రెండేసి చర స్థిర రాసులు ప్రాగ్దక్షిణ పశ్చి మోత్తర దిగ్గతములును, ద్విస్వభావ రాసులాగ్నేయ నిర్రుతి దిగ్గతములును అగుచున్నవి. అనఁగాఁ బ్రసవలగ్నము మేష వృషభములయం దొకటి యయ్యేనేని పురిటింటం దూర్పు దిశయందును, మిథునం బైన నాగ్నేయముననును, కర్కటసింహములయం దొకటి యైన దక్షిణమునందును, కన్యారాశి యైనచో నైర్రుతముననును, తులా వృశ్చికంబులయం దొకటి యైనఁ బశ్చిమముననును, ధన స్సాయెనేని వాయవ్యమునందును, మకర కుంభములలో నొకటి యైన నుత్తరముననును, మీనం బైన నీశాన్యముననును బురిటింట సూతికా శయనం బని వచింప వలయును. మంచము నందును, శయన గృహమునకు జెప్పినట్లు చెప్పవలయును. అయినను, ౩-౬-౯-౧౨-వ యిండ్లఁ గలరాసులవలన మంచమునకుఁ బాదంబులం జెప్పఁదగినది. అనఁగా నేరాశి ప్రసవ లగ్నం బగునో యారాశి దిశను శిరోభాగంబుగ నేర్పఱచి, ఆలగ్నము మొదలుకొని తృతీయరాశి మంచపుఁ బూర్వ పాదములలో దక్షిణ పాదమును, పండ్రెండవ రాశి వామ పాదమును, మంచపుఁ బశ్చిమపాదములలో నాఱవ రాశి దక్షిణపాదమును, నవమరాశి వామ పాదమును, లగ్న తృతీయము

లు మంచపు శిరోభాగములును, చతుర్థ పంచమములు మంచపు దక్షిణభాగమును, సప్తమాష్టమములు పాదాంత భాగములును, దశమైకాదశములు వామభాగమును, ఇట్లు మంచపుఁ బాదాదులయందు రాసులను విభజింప వలయును. ఇందులకుఁ బ్రయోజనం బేమనఁగ:— మంచము యొక్క యేభాగమునందు ద్విస్వభావ రాసు లున్నవో, ఆభాగమునందు మంచము వంగియుండు ననియు, నేభాగమునందుఁ బాపగ్రహము లున్నవో, ఆభాగమునందు మంచమునకుఁ దత్తుల్యోపఘాతము గల్గియుండు ననియు నెఱుంగ వచ్చును. అయితే ద్విస్వభావ రాసులు శుభ గ్రహములతోఁ గూడి యుండిగాని, శుభ గ్రహములచేఁ జూడఁబడు చుండిగాని యుండెనేని తదుక్త ప్రకారము మంచపు భాగమునందు వంగియుండ దనియుఁ, బాపగ్రహములు స్వోచ్చ స్వత్రికోణ స్వక్షేత్ర మిత్రక్షేత్రాది స్థానముల యందు నుండెనేని తత్తుల్యోప ఘాతము కల్గియుండ దనియుం జెప్పఁ దగినది. ఇందులకు, "వినతత్వం యమళక్షైః క్రూరై స్తత్తుల్య ఉపఘాతః, షట్త్రి నవాంత్యాః పాదాః పర్యంకాంగాని రాశయ శ్శేషాః, పర్యంక స్థిత భవనే యుత విహగ సమాని తత్ర చిహ్నాని, ఆస్తరణానిచ వింద్యా చ్ఛుభదృష్టి యుతాని దైవజ్ఞం" అని లఘుజాతక గ్రంథమునందుఁ జెప్పఁ బడినది. ఈప్రకారము సురత ప్రశ్నయందు మంచపు పాద లక్షణమును స్త్రీపురుషుల నఖదంతక్షతాదిచిహ్నములం జెప్పవచ్చు నని ప్రయోజనము.

చంద్ర లగ్నాంతర గతై ర్గ్రహై స్స్యురుప సూతికాః,
బహి రంతశ్చ చక్రార్థే దృశ్యాదృ శ్యేన్యథా పరే. 22

తా. సూతికా రక్షణార్థంబై తత్సమీపమున నుండు స్త్రీల సంఖ్యను దెలియఁ జేయఁ బడినది. "చంద్ర లగ్నాంతర గతై ర్గ్రహైః" అనఁగా, జన్మలగ్నమునకును, జంద్రునకు నడుమ నుండు గ్రహ సంఖ్యచేత సూతికా సమీపమునం దుండెడుస్త్రీలను జెప్పఁ దగినది. మఱియు, వాండ్రజాతి వయోరూపాదులు లగ్నచంద్ర మధ్యగ్రహముల వలనం దెలియఁ దగినది. ఎట్లనఁగ, "విప్రాదిత శ్శుక్రౌ భృగూ" అను వాక్యములచేతను, "బాలా బుధ శశి భౌమాః" ఇత్యాది

వాక్యములచేత వయస్సును, "రక్త శ్యామల" అను వాక్యముల చేత వర్ణములను; "మధుపింగళ దృ గిత్యాది వాక్యములచేత రూపమును దెలియఁ దగినది. ఇందులకు, "శశి లగ్న వివరయుక్తా గ్రహాతుర్య శ్చోప సూతికా వాచ్యాః, అనుదిత చక్రార్థయుక్తై రంత ర్బహి రన్యథా త్వేకే, లక్షణ రూప విభూషణ యోగా స్తాసాంశుభై ర్యోగాత్, క్రూరై ర్విరూప దేహా లక్షణ హీనా స్సరాద్ర మలినాశ్చ, మిశ్రై ర్మధ్యమ రూపా బల సహితై స్సర్వమేత దవధార్యం." అని సారావళి గ్రంథమునందు విశదీకరించి యున్నది. మఱియు, "లగ్న చంద్రాంతర గత గ్రహాసం ఖ్యోప సూతికాః, శుభై పుణ్య స్త్రియో వాచ్యాః క్రూరై శ్చ విధవా స్తథా." అని లఘుజాతకమునందుఁ జెప్పఁబడినది. కాఁబట్టి పురిటింట నుప సూతికలలోఁ బుణ్యస్త్రీ లింద అనియు, విధవస్త్రీ లింద అనియుం దెలియఁదగినది. "బహి రంతశ్చ చక్రార్థే" అని చెప్పఁబడి యుండుటంజేసి దృశ్య చక్రార్థమునందు నెన్నిగ్రహము లుండునో యందఱు స్త్రీలు సూతికాగృహమున నుందు రని యర్థము. కొందఱు దృశ్య చక్రార్థమునం దెన్ని గ్రహము లుండునో యందఱు స్త్రీలు పురిటింట నుందు రనియు, నదృశ్యచక్రార్థమునం దెన్నిగ్రహము లుండునో యందఱు స్త్రీలు పురిటింటి బయట నుందురని యర్థము చెప్పుదురు. ఈయర్థమునకు, "ఉద యోడుప మధ్యస్థై గ్రహై స్స్యురుప సూతికా స్తత్ర, ఉద గర్థస్థై ర్బాహ్యే దక్షిణార్ధై రంతరే జ్ఞేయాః" అని జీవశర్మగారు చెప్పియున్నారు. ఇదే ప్రకారము, "శశి లగ్నాంతర సంస్థ గ్రహ తుల్యా శ్చోపసూతికా వాచ్యాః, ఉద గర్థై భ్యంతర గా బాహ్య శ్చక్రస్య దృశ్యార్థే" అని లఘుజాతమునందుఁ జెప్పఁబడి యున్నది.

లగ్న నవాంశప తుల్య తనుస్స్యా
ద్వీ యుత గ్రహ తుల్య తనుర్వా,
చంద్ర సమేత నవాంశ సవర్ణః
కాదివి లగ్న విభక్తభ గాత్రః. 23

తా. పుట్టిన శిశు స్వరూపాదుల నెఱుంగు తెఱంగుఁ జెప్పఁబడి నది. జన్మకాల లగ్న నవాంశ రాశి బలయుక్తంబై యుండినచోఁ దద ధిపతి గ్రహ సమాన శరీరుండును, నవాంశ రాశిబలహీనంబై యుం డెనేని అన్ని గ్రహములయందు నే గ్రహము బలాధిక్యముతో నుండునో తత్సమాన శరీరము గల్గి యుండు ననియు, "మధు పింగళ దృ క్చతు రశ్ర తనుః" అను శ్లోకార్థమునుబట్టి గ్రహస్వరూపములం బుట్టిన శిశు వుకుఁ జెప్పవలె ననియు, "చంద్ర సమేత నవాంశక వర్ణః" అను శ్లోకార్థముం బట్టి, అనఁగా జన్మకాలమునందుఁ జంద్రుఁ డేనవాంశయం దుండునో యానవాం శాధిపతి యైన గ్రహమునకు సమానం బగు వర్ణము గలది యనియు, "రక్తశ్యామో భాస్కరో గౌర ఇందుః" ఇత్యాద్యుక్తగ్రహ వర్ణములను శిశువునకుఁ జెప్పవలయు ననియు నీవ ర్ణాదులను జాతి కుల దేశముల నెఱింగి చెప్పవలయు ననియు నర్థము. ఇందులకు, "బలిన స్సదృశీ మూర్తిర్బుధ్వా జాతి కుల దేశాన్" అని శిరము మొదలగు నవయవ ములయందు హ్రస్వ దీర్ఘ సమత్వములం దెలియు క్రమం బెట్టు లనిన:—"కాదివిలగ్న విభక్తభ గాత్రః" అనఁగా శిరము మొదలుగ లగ్నాది ద్వాదశ భావములచేత నేర్పఱుపఁ బడిన యవయవములు గలది యని నిర్ణయింప వలెను. అనఁగా గాలాంగాని వరాంగమను శ్లోకమునందు మేషాది క్రమముగ నంగవిభాగము చెప్పఁ బడియుండుటంజేసి, ఇక్కడ లగ్నాది క్రమముగ నా శ్లోకమునఁ జెప్పిన ప్రకారముగ నంగవిభాగము చేయఁదగినది. అనఁగా జన్మకాల లగ్నము శిరస్సు, ద్వితీయము ముఖము, తృతీయము వక్షస్థలము, చతుర్థము హృ దయము, పంచమము కడుపు, షష్ఠము కటిప్రదేశము, సప్తమము నాభి లింగ మధ్య ప్రదేశము, అష్టమము మేఢ్రము, నవమము తొడలు, దశమము మోకాళ్లు, ఏకాదశమము పిక్కలు, ద్వాదశము పాదములు ఈ ప్రకారముగ నేర్పఱచి, "పూర్వార్థే విషయాదయః కృతగుణాః" అను శ్లోకమునం జెప్పఁబడిన ప్రకారము రాసుల హ్రస్వ దీర్ఘత్వముల నెఱింగి యేరాశి యే యంగమునందున్నదో యారాశి దీర్ఘరాశియైన నాయంగ ము నిడుపుగ నుండు ననియు, హ్రస్వరాశి యైన నాయంగము హ్రస్వ ముగనుండు ననియు, దీర్ఘరాశ్యధిపతి గ్రహయుక్తం బైన నాయంగము

మూదయించినచో నాలగ్నాదులు వస్త్యావ ద్యవయవములయందు విభజింపఁ దగినది. అదెట్లనఁగా, లగ్నము నాభికిని మేఢ్రమునకును మధ్య ప్రదేశం బనంబడును. ద్వితీయ ద్వాదశమములు మేఢ్ర గుద ప్రదేశములు. అందు ద్వితీయము కుడి శిశ్న గుదము లనియు, ద్వాదశ మెడమ శిశ్నగుదము లనియు నెంచఁదగినది. తృతీ యైకాదశములు వృషణము లనంబడును. అందుఁదృతీయము కుడి వృషణం బనియు,ఏకాదశమం బెడమ వృషణం బనియు నెఱుంగ వలయును. చతుర్థ దశమములు తొడ లనంబడును. అందుఁ జతుర్థము కుడి తొడ యనియు, దశమ మెడమ తొడయనియు నెఱుంగ వలయును. పంచమ నవమములు మోకా ళ్లనంబడును. అందుఁ బంచమము కుడిమోకా లనియు, నవమ మెడమ మోకా లనియుం దెలియఁ దగినది. షష్ఠాష్టమములు పిక్క లనంబడును. అందు షష్ఠము కుడి పిక్కయనియు, అష్టమ మెడమ పిక్కయనియుం దెలియఁ దగినది. సప్తమం బంఘ్రి ద్వయం బనంబడును. (అంఘ్రి = పాదము) ఈప్రకారము నాభ్యథ స్థి తావయ విభాగము చేయఁదగినది. ఇందులకు, "కగ్రీన వస్తి ప్రముఖాః కులాద్రి శైలాగ సంఖ్యా స్త్రివిధా దృకాణైః, క్రమేణ కాలాయవవాః ప్రదిష్టాః సవ్యాపసవ్యై స్సహ లగ్న భాగాత్, మూర్ధా లోచన కర్ణ గంధవహనా గండౌ హనూ చాననం గ్రీవా స్కంధ భుజంతు పార్శ్వ హృదయ క్రోడాని నాభిః పునః, వస్తి ర్లింగ గుదేచ ముష్క యుగళం చోరద్వయం జానునీ జంఘే పాద యుగం విలగ్న భవనాత్ పార్శ్వద్వయే కల్పితాః" అని జ్యోతిష కృష్ణులు వచించియున్నారు.

తస్మిన్ పాప యుతే వ్రణం శుభయుతే దృష్టేచ లక్ష్మాదిశే
త్స్వర్క్షాంశే స్థిర సంయుతేచ సహజ స్స్యాదన్యథా గంతుకః,
మందే శానిల జోగ్ని శస్త్ర విషజో భౌమే బుధే భూ భవ
స్సూ ర్యేకాష్ట చతుష్పదేన హిమగౌ శృగ్యబ్జజో న్యై శ్శుభమ్.

తా. ఈశ్లోకమునం బూర్వోక్తం బగు నంగభాగములకుఁ బ్రయోజనము చెప్పఁబడినది. ఎట్లనిన:— పూర్వశ్లోకమున లగ్న ప్రథమ ద్రేక్కాణమునందుఁ బుట్టిన వానికి శిరంబు మొదలగు నంగ

ములయందును, ద్వితీయ ద్రేక్కాణము నందుఁ బుట్టిన వానికిఁ గంఠా ద్యవయవములయందును, తృతీయ ద్రేక్కాణమునందుఁ బుట్టిన వానికి నాభ్యధో భాగస్థి తావయవముల యందును, లగ్నాది ద్వాదశ రాసులును విభజించి యుండుటం బట్టి, అందు నేరాశి యేయంగమునం దున్నదో, ఆరాశి పాప గ్రహాక్రాంతం బైయుండినచో నాయంగమునందు గ్రహ దశాంతర్దశల యందు వ్రణము కల్గు నని వచింపఁ దగినది. (వ్రణము=కురుపు) ఆవ్రణమశకాదులం గలుగఁ జేసెడు పాపగ్రహము స్వక్షేత్రమునం దైనను, స్వనవాంశము నం దైన నుండి, ఆరాశి స్థిరరాశి యై యుండెనేని కురుపులు మొదలగునవి జన్మకాలముతోడఁబుట్టినవై యుండునని వచింపఁ దగినది. అట్లు కానిపక్షమునఁ జరరాసులగు పరరాశి పరనవాంశముల యందుండెనేని కురుపులు మొదలగునవి యొకానొక నిమిత్తంబున నాయాగ్రహ దశాంతర్దశల యందు సంభవించు నని వచింప వలయును. మఱియుఁ బూర్వోక్త ప్రకారముగ వ్రణమశకాదులు గలుగఁ జేయువాఁడు శనైశ్చరుం డైనచో, ఱాతిదెబ్బలచేతఁగాని, వాతవ్యాధి వలనఁగాని వ్రణమశకాదులు కల్గునని చెప్పఁదగినది. కుజుఁ డైనచో నిప్పువలనఁగాని కత్తి వలనఁగాని సర్పాది విషజంతువుల వలనఁగాని వ్రణమశకాదులు సంభవించునని వచింప వలయును. పాప గ్రహయుక్తుఁ డగు బుధుఁడయ్యెనేని, మెట్టనుండి గుంతం బడుటయును, లేక నేలయందఁ జారి పడుటయును, మట్టిచేత దెబ్బలు తగులుటయును గల్గు నని వచింప వలయును. సూర్యుం డైనచోఁ గట్టె దెబ్బగాని, చతుష్పాజ్జంతువుల వలనఁగాని, కోరలుగల జంతువు వలనఁగాని పీడ కల్గునని చెప్పఁ దగినది. క్షీణచంద్రుఁ డయ్యెనేని కొమ్ములుగల జంతువు వలనగాని వ్రణమశకాదులు కల్గునని చెప్పఁ దగినది. అన్యగ్రహములగు పూర్ణచంద్ర గురు శుక్రుల చేతఁ బీడలు గల్గవనియు, దృఢగాత్రత్వాదులు సంభవించు నని నిర్ణయింపఁ దగినది.

సమనుపతితా యస్మిన్ భాగే త్రయ స్సబుధా గ్రహా భవతి
నియమా త్తస్యావాప్తిః శుభే ష్వశుభేషువా,
వ్రణకృ దశుభః షష్ఠే దేహే తనోర్భ సమాశ్రితే
తిలక మశకకృ ద్దృష్ట స్సౌమ్యై ర్యుతశ్చ సలక్ష్మవాన్.

తా. అనఁగా నీశ్లోకంబునఁ గొన్ని వ్రణాదియోగంబులు చెప్పఁబడినవి. ఏభాగమునందు మూఁడు గ్రహములు బుధ సహితములై యున్నవో అవి శుభగ్రహము లైనను పాప గ్రహము లైనను ఆభాగమునందు నుండెడు నవయవమునందు నిశ్చయముగ వ్రణము కలుగుచున్నదనియర్థము. అనఁగా శరీరమున దక్షిణ భాగము నందుఁగాని వామ భాగము నందుఁ గాని మూఁడు గ్రహములును బుధుఁడును గూడ నాలుగు గ్రహము లుండెనేని అవి శుభగ్రహము లైనను పాప గ్రహము లైనను, ఆగ్రహములలో నెయ్యది బలాధికముగ నుండునో, ఆగ్రహ దశా కాలమునందుఁ దానున్న యవయవమునందు వ్రణము నిశ్చయముగఁ గల్గు నని తలంప వలయును. మఱియు, "సమను పతితా యస్మిన్ గాత్రే" అనిపఠించి యేయంగము నందు బుధ సహితము లగు మూఁడు గ్రహము లుండునో, ఆయంగము నందు వ్రణము గల్గునని వచించెదరు. అయ్యది విచారణీయము. మఱియు లగ్నమునకు నాఱవ యింటఁ బాప గ్రహము లుండెనేని తా నున్న రాశిచేత నాశ్రయింపఁ బడియున్నట్టి యంగము నందు వ్రణము గల్గు నని తెలియం దగినది. మఱి యిచ్చటఁ బూర్వ శ్లోకమున, "స్వర్క్షాంశే స్థిర సంయుతశ్చ సహజ స్స్యా దన్యథా గంతుకః" అను శ్లోక పాదము ననువర్తింపఁ దగినది. ఎట్లనఁగా, లగ్నమునకు నాఱవ యింటఁ బాప గ్రహముండెనేని లగ్నాది యాఱవరాశి, "కాలాంగా" అను శ్లోకోక్త ప్రకారముగ నేయంగము నందుండునో, ఆయంగము నందు వ్రణము కల్గు నని తెలియఁ దగినది. ఆపాప గ్రహము స్థిరరాశి యందు స్వక్షేత్ర స్వనవాంశల యం దుండెనేని జన్మముతోడ వ్రణమును గల్గునని చెప్పఁ దగినది. మఱియుఁ జరరాశి యందుఁ బరక్షేత్ర పర నవాంశల యందు నుండెనేని, ఆగ్రహ దశాకాలము నందు వ్రణము గలుగు నని వచింపఁ దగినది. ఆయాఱవ యింటఁ గల పాప గ్రహము శుభ గ్రహముల చేతం జూడఁ బడు చుండినచోఁ బూర్వోక్త ప్రకారముగఁ దిలక మశకాదులు గల్గునని నిర్ణయింప వలయును. (తిలకము =నల్లమచ్చ, మశకము=తెల్లమచ్చ) మఱి యా యాఱవ యింట నున్న పాప గ్రహము శుభ గ్రహములతోడఁ గూడి యుండినచో జాత

కునకుఁ బూర్వోక్త ప్రకారముగ నంగముల యందు రోమ నిచయాది చిహ్నములు గల్గి యుండు నని నిర్ణయింపఁబడినది.

ఇట్లు బృహజ్జాతకమున జన్మకాల లక్షణాధ్యాయము
సంపూర్ణము.

---

## బా లా రి ష్టా ధ్యా య ము.

సంధ్యాయాం హిమ దీధితి హోరా
పాపై ర్భాంత గతై ర్నిధనాయ,
ప్రత్యేకం శశి పాప సమేతైః
కేంద్రై ర్వా సవినాశ ముపైతి. 1

తా. బాలారిష్టము లేకుండ నెఱింగి యాయుర్దాయ విచారము చేయఁ దగినది. కాఁబట్టి, యీ బాలారిష్టాధ్యాయమున రెం డరిష్ట యోగము లీశ్లోకమునఁ జెప్పఁబడినవి. "సంధ్యాయాం" అనఁగా సంధ్యాకాలము దివారాత్రములకు సంధికాలము గనుక దీని వివరణము సంహితయందు, "అర్ధాస్తమయా సంధ్యా వ్యక్తీ భూతా న తారకా, యావత్ తేజః పరిభాతి ముఖా ద్భానో రర్ధోదయో యావత్" అని చెప్పఁబడి నది. అనఁగా సాయం సమయాన సూర్య మండలము యొక్క యర్ధాస్తమయ సమయము మొదలుకొని నక్షత్ర ప్రకాశ పర్యంతము సాయం సంధ్య యనియు, ప్రాతఃకాలమున నొకరి ముఖ మొకరికిం గన్పట్టకుండు సమయము మొదలు సూర్యమండలము యొక్క యర్ధోదయ పర్యంతము ప్రాత స్సంధ్య యనియు నీవచ నాభిప్రాయము. ఈయర్ధ ప్రకారము భరద్వాజ సంహితయందు, "ఉదయాత్ ప్రాక్తనీ సంధ్యా ఘటికా ద్వయ ముచ్యతే, సాయం సంధ్యా ద్విఘటికా హ్యస్తా దుపరి భాస్వతః" అని చెప్పఁబడి యున్నది. అనఁగా సూర్యోదయమునకు ముందు రెండు గడియలు ప్రాతస్సంధ్య యనియు, సూ ర్యాస్తమయమునకు వెనుక రెండు గడియలు సాయం సంధ్య యనియు నర్థము. ఇట్టి సంధ్యాకాలమునందుఁ జంద్ర హోర

రాసుల యంత్య నవాంశను బొందిన పాప గ్రహములచేత శిశు మరణము గల్గునని యర్థము. అనఁగా సంధ్యాకాలము నందలి చంద్ర హోర జనన కాలం బగుచుఁ బాప గ్రహము లేరాసుల యందైన నంత్య నవాంశల యందుండె నేని శిశువు మరణించు నని చెప్పఁ దగినది. ఇది యొక యోగము. మఱియు, వేఱుగఁ జంద్ర పాప గ్రహములతోఁగూడిన కేంద్ర స్థానములచేత జనించిన శిశువు మరణము నొందు నని తెలియం దగినది. అనఁగా-౧-౪-౭-౧౦- ఇండ్ల యందుఁ బ్రత్యేకముగ మూఁడు పాప గ్రహములును, చంద్రుఁ డొక్కొక్క స్థానమునం దొకఁడై యుండెనేని శిశువు బ్రతుక దని యర్థము. "కేంద్రేషు సర్వేషు చ చంద్ర పాపై ర్వ్యస్తేషు జాతో యమలోక మేతి" అని సారావళి గ్రంథమునం దీవిషయమును గూర్చి చెప్పఁబడినది. మఱియు "మృత్యుః ప్రత్యేకస్థే కేంద్రేషు శశాంక పాపైశ్చ" అని యవనేశ్వరుఁడు వచించి యున్నాఁడు. కాఁబట్టి యీవిషయము రోగ ప్రశ్నల యందు నుపయుక్తం బగుచున్నది.

చక్రస్య పూర్వాపర భాగ గేషు
క్రూరేషు సౌమ్యేషుచ కీటలగ్నే,
క్షిప్రం వినాశం సముపైతి జాతః
పాపై ర్విల గ్నాస్తమయాఽభితశ్చ. 2

తా. ఈశ్లోకంబున నింకను రెండు బాలారిష్ట యోగంబులు వచింపఁ బడినవి. ఎట్లనఁగా:—లగ్నమునం దెన్ని భాగములు చెల్లినవో యన్ని భాగములను దశమ మందు విడిచి చెల్లవలసిన వెన్ని భాగములో అన్ని భాగములు దశమమందును, ఏకాదశ ద్వాదశ లగ్న ద్వితీయ తృతీయములను, చతుర్థ మందు లగ్నమునం దెన్ని భాగములు చెల్లినవో యన్ని భాగములు పర్యంతము చక్ర పూర్వార్ధ మనం బడును. చతుర్థ మందు మిగిలిన భాగములును, పంచమషష్ఠ సప్త మాష్టమ నవమంబులును దశమమునందు లగ్నమునం దెన్ని భాగములు చెల్లినవో యన్ని భాగంబుల పర్యంతమును చక్రోత్తరార్ధ మనంబడును. ఈవిషయమై, "త్రిరాశి సహితం లగ్నం పూర్వార్థం

షడ్భి రన్వితం, పశ్చార్ధం శిష్ట మర్ధంస్యా చ్చక్ర పూర్వాపరే క్రమా
త్" అని బాదరాయణులు వచించి యున్నారు. కాఁబట్టి పాప
గ్రహములు పూర్వార్ధము నందును, శుభ గ్రహము లుత్తరార్ధము
నందు నుండఁగా, వృశ్చిక లగ్నము నందుంగాని కర్కాటక లగ్నము
నందుఁగాని జనించిన శిశువు శీఘ్రముగ మరణించు నని వచింప వల
యును. ఇక్కడ కీటశబ్దము వలన, వృశ్చిక కర్కాటక లగ్నము లని
తెలియం దగినది. ఇందులకు, "పూర్వాపరగై రశుభై స్సౌమ్యై రళి
కర్కటే లగ్నే, జాతస్య శిశో ర్మరణం సద్యః కథయంతి యవనేంద్రాః"
అని బాదరాయణ వచనమునఁ దెలియఁ బడుచున్నది. మఱియు,
"చక్రస్య పూర్వభాగే పాపా సౌమ్యా స్తథోత్త రార్ధేచ, వృశ్చిక
లగ్నే జాతా గతాయుషో మృత్రయోగేస్యుః" అని యవనేశుని
వచనం బొకండు గానంబడుచున్నది. ఈశ్లోకమున వృశ్చిక లగ్నము
ను మాత్రము దెల్పియున్నాఁడు. అయినను గర్కాటక లగ్నమును
గూడ నిర్ణయింప వలయునని యర్థము. మఱియు లగ్నమునకును,
సప్తమ స్థానమునకును, పార్శ్వముల యందుఁ బాప గ్రహము
లుండినచో శిశువు శీఘ్రంబుగ మృతి నొందు నని యర్థము. అనఁగా
లగ్నమునకు ద్వితీయ ద్వాదశ ములయందుఁగాని షష్ఠాష్టమములయం
దుఁగాని పాప గ్రహములు శుభ గ్రహయుక్తము గాకుండెనేని
శిశువు మృతి గల్గునని వచింప వలయును. ఇందులకు, "లగ్నా ద్ద్వా
దశ ధనగైః పాపై ర్మ్రియతేచ రంధ్ర రిపు సంస్థైః, శుభ సంపర్క
మయాతై ర్నాసే షష్ఠేష్టమే వాపి." అని దేవశర్మ వచించి యున్నాఁడు.
ఇట్లు, "గ్రహేషు లగ్నాభిముఖేషు సర్వే ష్వవాప్త వీర్యేషు స్వవర్గగే
షు" అని భట్టోత్పలుని వలనఁ జెప్పఁబడి యున్నది. కాఁబట్టి లగ్నాభి
ముఖములును, అస్తాభిముఖములును అని యర్థము. పంక్రెండవ యింట
నుండు గ్రహము లగ్నాభి ముఖమును, ఆఱవ యింట నుండు గ్రహ
మస్తాభిముఖమును గాఁబట్టి షష్ఠ ద్వాదశముల యందుఁ బాప
గ్రహము లుండఁగాఁ బుట్టిన శిశువు నశించు నని తెలియఁ దగినది.
కొందఱు ద్వితీయమునందుండు గ్రహము లగ్నాభి ముఖమును, అష్టమ

మందుండు గ్రహ మస్తాభి ముఖమును గాఁబట్టి పాప గ్రహములు ద్వితీయాష్టమములయం దుండెనేని బాలారిష్ట మని చెప్పుచున్నారు. ఈయర్థమునకు, "రిపు వ్యయగతైః పాపై ర్యదివా ధన మృత్యుగైః, లగ్నేవా పాప మధ్యస్థే ద్యూనేవా మృత్యు మాప్నుయాత్" అని గార్గిచేతఁ జెప్పఁ బడి యుండుటంజేసి పాటింపఁ దగినది.

పాపా వుదయాస్త గతౌ క్రూరేణ యుతశ్చ శశీ,
దృష్టశ్చ శుభై ర్నయదా మృత్యుశ్చ భవే దచిరాత్. 3

తా. మఱియొక యరిష్టయోగము జెప్పఁబడినది. ఎట్లనఁగా, సప్తమమందు నొక పాపగ్రహమును, లగ్నమునం దొకపాప గ్రహమునుండి, యేరాశి యందైన నుండెడు చంద్రుఁడు పాపగ్రహములతోడఁ గూడి శుభగ్రహములచేతఁ జూడఁ బడక యుండినచో శిశువుకు శీఘ్రముగ మృత్యువు కల్గునని వచింపఁ దగినది, ఇందు విశేషార్థ మెట్లనఁగా శనైశ్చరుం డెందుఁగాని యుండి చంద్రుని చూచినచో బాలారిష్టము కల్గు చున్నదని యెంచఁ దగినది.

క్షీణే హిమగౌ వ్యయగే పాపై రుద యాష్టమగైః,
కేంద్రేషు శుభాశ్చ నచే త్క్షిప్రం నిధనం ప్రవదేత్. 4

తా. లగ్నమునకుఁ బంౘ్రెండవ యింట క్షీణచంద్రుఁడు ౧-౮-ఇండ్లఁ బాప గ్రహము లుండి కేంద్రములయందు శుభ గ్రహము లేకుండినచో, శిశుమృతి చెప్పఁ దగినది. కొందఱు లగ్నాష్టమస్థానములం బాప గ్రహములు లేకుండినను బాలారిష్టము చెప్పఁ దగినదని చెప్పుచున్నారు. ఎట్లనఁగాఁ బంౘ్రెండవ యింటఁ జంద్రుఁడు బలహీనుఁడైయుండి శని కుజులచేఁ జూడఁబడుచు నెనిమిదవ యింటఁ బాపగ్రహములు లేకుండినచో బాలారిష్టము నిశ్చయముగ నగుచున్నది. కేంద్రముల యందు శుభగ్రహములు లేక పాప గ్రహములు బలీయులై లగ్నాష్టమములయందుండు చంద్రుఁడు వ్యయ స్థానమున నుండినచో నరిష్టయోగము వచింపఁ దగినది. ఇందులకు "క్షీణేచంద్రే వ్యయగతైః పాపై రష్టమలగ్నగైః, కేంద్ర బాహ్యగతై స్సౌమ్యై ర్జాతస్య

నిధనం భవేత్." అని గార్గిచేఁ జెప్పఁబడి యున్నది గనుక యీయరిష్టయోగములు బాగుగఁ బరిశీలించి వచింపఁ దగినది.

క్రూర సంయుత శ్శశీ స్మరాంత్య మృత్యు లగ్నగః,
కంటకా ద్బహి శ్శుభై రవీక్షితశ్చ మృత్యుదః. 5

తా. పాప గ్రహములతోఁ గూడిన చంద్రుఁడు సప్తమ ద్వాదశాష్టమ జన్మలగ్నంబులలో నొక స్థానము నందున్నవాఁడై, కేంద్ర వ్యతిరిక్త స్థానముల యందున్నట్టి శుభ గ్రహములచేత జూడఁబడక యుండినచో శిశువుకు మరణము నిశ్చయ మని వచింపఁ దగినది. ఇందులకు, "వ్యయాష్ట సప్తోదయగే శశాంకే పాపై స్సమేతే శుభదృష్టిహీనే, కేంద్రేషు సౌమ్యగ్రహ వర్జితేషు, జాతస్య సద్యః కురుతే ప్రణాశం." అని సారావళిగ్రంథమునందుఁ జెప్పఁబడినది కాఁబట్టి శుభగ్రహములు కేంద్రస్థానముల యందు బలీయులై యుండిరేని ముందు చెప్పిన యరిష్టయోగము కల్గదని యర్థము.

శశి న్యరి వినాశగే నిధన మాశు పాపేక్షితే
శుభైరథ సమాష్టకం దళ మతశ్చ మిశ్రై స్స్థితిః,
అసద్భి రవలోకితే బలిభి రత్ర మాసం శుభే
కళత్ర సహితేచ పాప విజితే విలగ్నాధిపే. 6

తా. అరిష్టకాల పరిమితి జెప్పఁబడినది. ఎట్లనఁగ:— చంద్రుఁడు షష్ఠాష్టమముల యందుండి పాప గ్రహములచేఁ జూడఁబడకుండినచో నొక మాసమునకు జనించిన శిశువుకు మరణమని చెప్పఁ దగినది. ఇందులకు, "వర్షేణ షష్ఠాష్టమగ శ్శశాంకో నిహంతి మాసా దశుభై శ్చ దృష్టః, అర్థాష్టకా త్కేవల సౌమ్య దృష్టో మిశ్రైరీక్షితో వర్ష చతుష్ట యేన." అని సారావళియందుఁ జెప్పఁబడి యున్నది. కాఁబట్టి లగ్నమునకు షష్ఠాష్టమములఁ జంద్రుఁ డుండి శుభగ్రహముచేఁ జూడఁబడక యుండెనేని పుట్టిన శిశు వెనిమిదేండ్ల వఱకు జీవించి యుండు నని వచించ వలయును. మఱియు లగ్నమునకు షష్ఠాష్టమములయందుండు చంద్రుఁడు శుభాశుభ గ్రహములచేతఁ జూడఁబడినచో నాలు గేండ్ల వఱకు జీవించు నని వచింప వలయును. మఱియు షష్ఠాష్టమముల

యందుండు చంద్రుఁడు పాపక్షేత్రముల యందుండి పాప గ్రహ యుత దృష్టుఁ డైనచోఁ బుట్టినపుడాశిశువు మరణించు నని చెప్పఁ దగినది. మఱియుఁ జంద్రుఁడు పాప క్షేత్రములయందు శుభగ్రహములతోఁ గూడి యుండినను, షష్ఠాష్టమ స్థానములు శుభగ్రహరాసులై యందు నుండినను మరణము కల్గదని నిశ్చయముగ వచింపఁ దగినది. ఇందులకు, "లగ్నా చ్ఛశీ నైధన గో శుభర్క్షే షష్ఠే ధవాప్యార నిరీక్షితశ్చ, సర్వాయు రాహంతి శుభై రదృష్ట స్తదీక్షితో ద్వాష్టక పర్యయేణ" అని యవనేశుఁడు వచించి యున్నాఁడు. మఱియు షష్ఠాష్టమ గతుం డగు చంద్రుండే గ్రహముచేతం జూడం బడక యుండినచో నరిష్టయోగము లేదని భట్టోత్పల వ్యాఖ్యానమునం జెప్పఁబడినది. అయిన నీ యర్థము సారావళిని యనుసరించి యుండలేదు గనుక యోచింపఁ దగినది. ఇందునఁగూర్చి, "వర్షేణ షష్ఠాష్టమగ శ్శశాంకో నిహంతి మాసా దశుభైశ్చ దృష్టః" అని సారావళి యందును, శ్లో. "వర్షాన్మ్రియతే చంద్రే షష్ఠాష్టమ సంస్థితే విలగ్నర్క్షాత్, సద్యః క్రూరై ర్దృష్టః సౌమ్యై రద్వాష్టకా చ్చైవ." అని దేవకీర్తిచేతను జెప్పఁబడి యున్నది. ఇందులో షష్ఠాష్టమ స్థానముల యందుండు చంద్రుఁ డేగ్రహము చేతం గాని చూడఁబడ కుండెనేని యొక సంవత్సరము వఱకును, పాప గ్రహములచేతఁ జూడఁబడెనేని యొక నెలకును బాలారిష్టము సంభవించు నని వచింపఁ దగిన దని యేర్పడు చున్నది. ఇందులకు మఱి యొక గ్రంథము నందు నీవిషయమై, "పక్షే సితే భవతి జన్మ యది క్షపాయాం కృష్ణేథవా హని శుభాశుభ దృశ్యమానః, తచ్చంద్రమా రిపు వినాశ గతోపి యత్నా దాప త్సురక్షతి పితేవ శిశుం నహంతి." అని మాండవ్యముని వచించి యున్నారు. అనఁగా శుక్లపక్షపు రాత్రి యందును గృష్ణపక్షపుఁ బగటి యందును జనించిన శిశువును జంద్రుఁడు షష్ఠాష్టమముల యందుండు వాఁడైనను శుభాశుభగ్రహములచేతఁ జూడఁబడెనేని, ఆపదలయందుఁ దండ్రివలె రక్షించు నని చెప్పఁబడినది. కాఁబట్టి యీయరిష్టము శుక్లపక్షపుఁ బగటియందును గృష్ణపక్షపు రాత్రియందును బుట్టిన వారికి సంభవించు నని తలంప వలయును. మఱియు షష్ఠాష్టమములయందు శుభగ్రహము లుండి బలవంతు

లగు పాప గ్రహములచేతఁ జూడఁబడినచో, జనించిన శిశు వొక మాసమువఱకు జీవించు నని చెప్పఁదగినది. మఱియు షష్ఠాష్టమ ములయందుండు శుభగ్రహము మఱియొక శుభగ్రహముచేతఁ జూడఁబడెనేని అరిష్టదోషము లేదని తెలియఁ దగినది. యీ విషయమై, "శశివత్సౌమ్యాః పాపై ర్వక్రిభి రాలోకితా నశుభ దృష్టాః, మాసేన మరణదాస్యుః పాప జితో లగ్న పశ్చాసే." అని దేవకీర్తి చెప్పియున్నారు. మఱియు, "సౌమ్యా షష్ఠాష్టమగాః క్రూరై ర్వక్రోప సంగతై ర్దృష్టాః, మాసే నమృత్యు దాస్తే యది నశుభై స్తత్ర సంధృష్టాః" అని గ్రంథాంతరమున నున్నది. కాఁబట్టి లగ్నాధిపతి పాప గ్రహములచేత యుద్ధమునందు గెలువఁబడిన వాఁడై సప్తమస్థానము నందుండఁగా, జనించిన శిశు వొక మాసమునకు మీఱి బ్రదుకదని వచింప వలయును. గ్రహయుద్ధమునందు జయాపజయ లక్షణము ముందుగఁ జెప్పియుండుటం జేసి చూచుకొనందగినది.

లగ్నే క్షీణేశశిని నిధనం రంధ్ర కేంద్రేషు పాపైః
పాపాంతస్థే నిధన హిబుక ద్యూన యుక్తేచ చంద్రే,
ఏవం లగ్నే భవతి మదన చ్ఛిద్ర సంస్థైశ్చ పాపై
ర్మాత్రాసార్థం యదిచ నశుభై ర్వీక్షిత శ్శక్తి మద్భిః. 7

తా. ఈ శ్లోకమునఁ బూర్వార్ధమున నాల్గు బాలారిష్టములు నుత్తరార్ధమునందు మాతృసహిత శిశుమరణ యోగమును జెప్పఁబడినవి. ఎట్లనఁగా:—క్షీణచంద్రుఁడు జన్మ లగ్నమునందు నుండఁగాఁ గేంద్రస్థానముల యందును రంధ్రస్థానమునందును (రంధ్రము=ఎనిమిదవరాశి) పాపగ్రహము లుండినేని వారి చూపు శిశువుకు మరణ మిచ్చు నని తెలియం దగినది. మఱియు నష్టమ చతుర్థ సప్తమములలో నొక్కెడఁ జంద్రుఁడు పాపగ్రహమధ్యగతుఁడై యుండినచో శిశువుకు మరణము గల్గు నని వచింప వలయును. అనఁగాఁ జంద్రుఁ డష్టమమున నుండి పాపద్వయ మధ్యగతుఁ డగుట, చంద్రుఁడు చతుర్థమున నుండి పాప ద్వయ మధ్యగతుఁ డగుట, చంద్రుఁడు సప్తమమందుండి పాపగ్రహద్వయ మధ్య గతుఁ డగుట, ఈ నాల్గు బాలారిష్ట

యోగములు చెప్పఁబడినవి. ఇదే ప్రకారము లగ్నమునందుఁ జంద్రుఁడు పాపద్వయ మధ్యగతుఁడై యుండి బలవంతు లగు శుభ గ్రహము లచేతఁ జూడఁబడక యుండినచో, సప్త మాష్టమముల యందుండు పాపగ్రహములచేతఁ జంద్రుఁడు చూడఁబడినచో, లేక చూడఁబడక వ్యయస్థానస్థిత చంద్రునకు శనిపీడణంబుకల్గి చంద్రదశ జననకాల మున సంభవించినను మాతయు శిశువును నశింతు రని వచింప వల యును. చంద్రుఁడు శుభ గ్రహములచేతఁ జూడఁబడు చుండెనేని శిశు వుకు మాత్రమే మరణము సంభవించునని తెలియఁ దగినది. బల యుక్తు లగు శుభగ్రహములచేతఁ జంద్రుఁడు చూడఁబడు చుండినచో మాత కును శిశువుకును వ్యాధికల్గును గాని మరణము కల్గదని చెప్పఁ దగినది.

రాశ్యంతగే సద్భి రవీక్ష్య మాణే
చంద్రే త్రికోణోప గతైశ్చ పాపైః,
ప్రాణైః ప్రయా త్యాశు శిశు ర్వియోగ
మస్తే తు పాపై స్తుహిమాంశు లగ్నే. 8

తా. చంద్రుఁ డేరాశి యందైన నంత్య నవాంశ యగు నవమ నవాంశను బొంది, శుభగ్రహములచేతఁ జూడఁబడ కుండినచోఁ బంచమ నవమములంబొందియున్న పాప గ్రహములచేత శిశువు మృతి నొందు నని యర్థము. చంద్రుఁడు లగ్నమునం దుండఁగా, సప్తమము నందున్నట్టి పాప గ్రహములచేత శిశువు మృతి నొందు నని తెలియం దగినది, (తుహినాంశు లగ్నము = కర్కాటక) మని కొందఱు తలం చెదరు అది యుక్త మనవలయు నదెట్లనఁగ, "ఉదయ గతో వా చంద్ర స్సప్తమ రాశిస్థితైః పాపైః" అని లఘు జాతకము నందుఁ జెప్పఁబడి యున్నది కాఁబట్టి యుక్త మని తలంప వలయును.

అశుభ సహితే గ్రస్తే చంద్రే కుజే నిధనాశ్రితే
జనని సుతయో ర్మృత్యు ర్లగ్నే రవౌతు సశస్త్రజః,
ఉదయతి రవౌ శీతాంశౌవా త్రికోణ వినాశగై
ర్నిధన మశుభై ర్వీర్యోపేతై శ్శుభై ర్నయు తేక్షి తే. 9

తా. ఈశ్లోకమున గ్రహణకాలస్థిత బాలారిష్ట దోషములు గొన్ని చెప్పఁబడిన వదెట్లనఁగ, పాపగ్రహ మగుశనితోఁ గూడినట్టి చంద్రుఁడులగ్నగతుఁడై రాహుగ్రస్తుఁడైన, అష్టమమునందుండు నంగారకునిచేతఁ దల్లికిని బిడ్డకును మరణము గల్గునని తెలియఁ దగినది. ఇది చంద్రగ్రహణకాలజనితారిష్ట యోగము. మఱియు సూర్యుఁ డిదే ప్రకారము జన్మలగ్నము నందుండి శని బుధులలో నొకనితోఁ గూడి రాహుగ్రస్తుఁ డగుచుండఁగా నంగారకుఁ డష్టమస్థానమునం దుండెనేని తల్లికిని బిడ్డకును మరణము కల్గునని తెలియవలయును. అనఁగా శస్త్రి పీడవలన మరణము గల్గునని తెలియఁ దగినది. ఇది సూర్యగ్రహణ కాలజనితారిష్టయోగము. "అశుభసహితే" అనఁగాఁ జంద్ర గ్రహణ కాలమునందు లగ్నగతుఁ డగు చంద్రునితో సూర్యుఁడు చేరఁడు.సూర్యునిసమీపమునం దుండెడు బుధుఁడును గూడఁడు గనుక పాపగ్రహములతోఁ గూడని బుధుఁడు పాపిగాఁడు. అష్టమ స్థానమునం దుండు నంగారకుని గూడఁడు కాఁబట్టి శనితోఁ గూడిన చంద్రుం డని చెప్పఁబడెను. మఱియు సూర్యగ్రహణకాలమునందు లగ్నగతుఁ డగుసూర్యునితో నష్టమ స్థానమునం దుండు నంగారకుఁడు కూడఁడు కాఁబట్టి సూర్యునితోఁ గూడుటవలన బుధుం డశుభుం డగుచున్నాఁడు గనుక శని బుధులతోఁ గూడినట్టి సూర్యుం డని వచింపఁ బడెను.

మఱియు బలయుక్త శుభగ్రహములతోడం గూడకయును జూడఁబడకయునుండెడు సూర్యుఁడుగాని చంద్రుఁడుగాని లగ్నగతుఁడగుచుండఁగా ౯-౫-౮-ఇండ్లయందుండు పాప గ్రహములచేత మరణము కల్గునని యెఱుంగ వలయును. ఇందులకు, "పాపా స్త్రికోణాష్టమగా విసౌమ్యా శ్చంద్రే తనౌ భాస్వతివా క్షయాయ" అని దేవ శర్మచేఁ జెప్పఁబడినది. ఇట్లు సూర్యుఁడుగాని చంద్రుఁడుగాని బలవచ్ఛుభ గ్రహ యుత దృష్టుఁ డై యుండినచో మరణము కల్గదని తెలియఁ దగినది.

అసిత రవి శశాంక భూమిజై
ర్వ్యయ నవ మోదయ నైధ నాశ్రితైః,

భవతి మరణ మాశు దేహినాం
యది బలినా గురుణా నవీక్షితాః. 10

తా. మఱియొక బాలారిష్టయోగము చెప్పఁబడినది. ఎట్లనఁగ:—లగ్నమునకుఁ బండ్రెండవయింట శనైశ్చరుండును, తొమ్మిదవయింట సూర్యుండును, లగ్నమునందుఁ జంద్రుండును, ఎనిమిదవ యింట నంగారకుండును, బృహస్పతిచేతఁ జూడఁబడ కుండిరేని శిశువుకు మరణము గల్గుచున్న దని తెలియఁ దగినది. మఱియు నాబృహస్పతి శన్యాదులలో నొకని చూచి యొక్కని జూడక యుండినను, ఈ గురువు బలహీనుఁడై శన్యాదుల నందఱం జూచినను, కొంత కాలము గడచిన పిదప శిశువుకు మరణము కలుగు నని నిశ్చయముగ వచింపవలయును. మఱియు లగ్నమునకు నైదవయింట గురుండు బలియుఁడై యుండి శన్యాదులం జూచినచో శిశువుకు మరణము కల్గదని వచింప వలయును. ఇదియునుంగాక యీ విషయమై విశేషార్థమెట్లనిన:—గురువును, శుక్రుఁడును, బుధుఁడును నిర్దోషులై ౯-౧౦-౫-౪-౧- ఇండ్ల నుండి పాపగ్రహములచేఁ జూడబడక యుండినను గురు శుక్ర బుధులు ౯-౧౦-౫-౪-౧- ఇండ్లఁ బాప క్షేత్రము లగుచుండి యాక్షేత్రముల యందుఁ బడినను, శిశువుకు మరణము కల్గదని వచింపవలయును. మఱియు లగ్నమునకు శని బలీయుఁడై యేరాశి యందైననుండి గురువుచేఁ జూడఁబడు చుండినచో బాలారిష్ట మొకింతయుండును మరణము కల్గక బాధించి పిదప శుభ మగునని వచింప వలయును.

సుత మదన నవాంత్య లగ్న రంధ్రే
ష్వశుభయుతో మరణాయ శీతరశ్మిః,
భృగుసుత శశిపుత్త్ర పూజ్యై
ర్యది బలభి ర్నయుతోవలోకితో వా. 11

తా. ఈ శ్లోకమునందు విశేషార్థముగ నాలుఁ బాలారిష్ట యోగములు చెప్పఁబడినవి. ఎట్లనఁగఁ, బాపగ్రహముతోఁ గూడినట్టి క్షీణచంద్రుఁడు ౫-౭-౯-౧౨-౮- ఇండ్ల యందుండి బలవంతులగు శుక్ర బుధ గురువులయం దొకనితోడ నైనం గూడక చూడఁబడక యుండినచో

శిశువుకు మరణము కల్గునని తలంప వలయును. మఱియుఁ జంద్రుఁ డై దవయింట శుక్ర గురు బుధులచేఁ జూడఁబడక కూడక యుండుట యొక యోగము. ఏడవ యింట నీరీతి నుండుట యొక యోగము. నవమమం దుండుట యొక యోగము. పండ్రెండవ యింట నుండుట యొక యోగము. లగ్నము నందుండుట యొక యోగము. అష్టమమునం దుండుట యొక యోగము. ఈచెప్పఁబడిన యోగకర్త యగు క్షీణచంద్రునకు శుక్ర బుధ గురువులయందు బలయుక్తమైన నొకగ్రహము యొక్క సంయోగముగాని చూపుగాని కల్గియుండెనేని బాలారిష్టము లేదని తెలియఁ దగినది. ఇందులకు, "ధనాస్త వ్యయ లగ్న త్రికోణగాః క్షీణచంద్ర సంయుక్తాః, పాపా బలిన శ్శుభ రదృశ్యా మానాగ తాయుషం కుర్యుః." అని చెప్పఁబడినది గనుక యీయరిష్ట యోగము క్షీణచంద్రుఁడు మాత్రము కలుగఁజేయు నని తెలియఁ దగినది.

భౌమే విలగ్నే శుభ దైరదృష్టే
షష్ఠేష్టమే వార్కసు తేన యుక్తే,
తావస్త సంస్థా శుభదృష్టి హీనా
జాతస్య సద్యః కురు తే ప్రణాశమ్. 12

తా. అంగారకుండు శుభ గ్రహములతోఁ గూడక చూడఁబడక, జన్మలగ్నమునం దుండఁగా, శనైశ్చరుండు ౬ - ౮ - ఇండ్లలో నెందేని యుండినను, కుజ శనులు సప్తమమునందు శుభగ్రహముల చేతఁ జూడఁ బడని వారై యుండినను శిశువుకు సద్యోమరణము కల్గు నని నిర్ణయింపఁ దగినది. సద్యోమరణమనఁగా పుట్టినపుడ మరణ మనియర్థము.

యోగేస్థానం గతవతి బలిన
శ్చంద్రే స్వంవాతను గృహ మథవా,
పాపైర్దృష్టే బలవతి మరణం
వర్ష స్యాంతే కిలమునిగదితమ్. 13

తా. అరిష్ట యోగంబులకుఁ గాల నిర్ణయము చెప్పఁబడక యుండు యోగమున జన్మించిన శిశువుకు నరిష్టకాలము చంద్రసంచా

రమును బట్టి చెప్పఁబడినది. ఎట్లనఁగ—అరిష్ట యోగకర్తృ గ్రహముల యందు బలయుక్త గ్రహము జన్మకాలమునందు నేరాశియం దుండు నో, ఆరాశిని చంద్రుఁడు బహు పాపగ్రహ దృష్టుఁడై బలవంతుఁడై యొక సంవత్సరములోఁగ నెపుడు పొందుచున్నాఁడో యపుడుగాని, మఱియు జన్మకాలమునందుఁ జంద్రుఁడు తానుండు రాశిని బహు పాప గ్రహ దృష్టుఁడై బలవంతుఁడై యొక సంవత్సరమునకు లోఁగ నెపుడు పొందుచున్నాఁడో యపుడుగాని, జన్మలగ్న రాశిని, ఉక్త విశేషణ విశిష్టుఁడైన చంద్రుఁ డెపుడు పొందుచున్నాఁడో, యపుడుగాని, శిశు వుకు మరణము గల్గునని తలంప వలయును. ఈయర్థమునకు, "బల గ్రహ స్థానగతే శశాంకే జన్మాగతేవా తను మాగతేవా, సమగ్ర వీర్యే బహు పాప దృష్టే వర్షా త్పురా మృత్యు రనుక్త కాలే." అని జ్యో తిష కృష్ణీయమునందుఁ జెప్పఁబడి యున్నది. ఇచ్చట యొక సంవత్సర మునకు లోఁగ నరిష్టము గల్గునని చెప్పఁబడి యున్నదిగాని, మాస దివ సాది కాలములు నిర్ణయముగఁ జెప్పఁబడలేదు గనుక, బలవద్గ్రహ వశంబున, "అయన క్షణ వాసరర్త వే" త్యాది శ్లోకోక్త ప్రకారముగ మాస, దివస, కాలములం దెలియఁ దగినది. ఈయధ్యాయమునందుఁ జెప్పఁబడని పితృ మాత్రా ద్యరిష్టములు తెలియుటకు గ్రంథాంతర వచనములు కొన్ని యిచ్చట వ్రాయఁబడినవి. ఈయరిష్టములు జన్మ కాలపు ద్రేక్కాణములచేతను, చంద్రాక్రాంత నక్షత్రములచేతను, చంద్రాక్రాంత నవాంశలచేతను, జన్మకాలగ్రహగతులచేతను సంభ వించు చున్నవి. కాఁబట్టి యీవిషయము బాగుగ యోచించి ఫలము వచింప వలయు. "లగ్నే దృకాణా ని గళాహి పక్షి పాశాన్వితా స్స్వామిభి రవ్య దృష్టాః, క్రూరాశ్రితా మృత్యు కరాః ప్రసూతౌ, సంవ త్సరై స్సప్తభి రేవ సత్యమ్." "అభుక్త మూల సంభవం పరిత్యజే చ్ఛ బాలకం, సమాష్టకం పితాతథానతన్ముఖం విలోకయేత్, తదాద్య పాదకే పితా జన వ్యథో ద్వితీయకే, ధనక్షయ స్తృతీయకే చతుర్థకే శుభా వహాః, ప్రతీపమంత్య పాదతః ఫలం తదేవ సార్పభే, తదుక్తదోష శాంతయే విధేయ మత్ర శాంతికం. పితృజన్మని యాజాతా తే హన్యు శ్చ తథాపితౄన్, మాతృ జన్మని యాజాతా మాతౄణాం ఘాతుకాః

స్త్రియః, పుష్యేకర్కటకే జాతో జలేశే పితృ మృత్యుకృత్, పుత్రో జాతో యది స్త్రీచే న్మాతరంచ జిఘాంసతి. త్వాష్ట్రేచ తిష్యేచ తథైవ తోయే కన్యా కుళీరోదయ చాపలగ్నే, శుభగ్రహాః పశ్యతిచే న్నహన్యా త్పితౄంశ్చ మాతౄంశ్చ సుతంచ మాతులం. చాపే కర్కటకేచ షష్ఠభవనే సింహాంశకస్థే విధౌ తాతోంబా వనితాం శకేచ పృథుకో జూకాంశకే మాతులః, కౌర్ప్యంశోప గతే నమేతి మరణం కేచిలాళ్యంశకే ప్రోక్తాంశం శుభమాహు రుక్త భవనే ష్వేవం వినాశం క్రమాత్." అని ఇత్యాది వచనములచేత ద్రేక్కాణారిష్టములును, నక్షత్రారిష్ట చంద్రాధిష్ఠిత నవాంశారిష్టములును దెలియఁదగినది. "సప్తాష్ట లగ్న వ్యయగే శశాంకే క్రూరేణ యుక్తే శుభ దృష్టి హీనే, సౌమ్యైర్విహీనేషుచ కంటకేషు కృతాంతదంష్ట్రాంతరగః ప్రసూతః, తాతాంబికా సోదర మాతులాశ్చ మాతామహ స్తత్సదృశశ్చ సూనుః, సూర్యాది ఖేటాః క్రమశః ప్రదిష్టా స్త్రికోణ గాస్తేపిచతం నిహన్యుః" అని గ్రహారిష్టములం దెలియఁదగినది. గ్రంథ విస్తర భీతిచే నీయరిష్టములింకను వ్రాయక విరమింపఁబడినవి.

## అరిష్టభంగములు.

ఈ యరిష్టాధ్యాయమునఁ జెప్పఁబడిన యరిష్టయోగములకు భంగము లనేకము లున్నవి కాఁబట్టి యీయోగముల యందుఁ బుట్టిన వా రనేకులు జీవించి యున్నారు. ఈ విషయమై శ్రీదేవకీర్త్యాదులు వచించిన వచనముల నిందుఁ గొన్ని పొందుపఱచెదను. ఎట్లనఁగ:— "సర్వాని మానతి బలస్ఫుర దంశు జాలోలగ్న స్థితః ప్రశమయే త్సుర రాజమంత్రీ, ఏకో బహూని దురితాని సుదుస్తరాణి భక్త్యా ప్రయుక్త ఇవ చక్రధరే ప్రణామః" అనఁగాఁ బ్రకాశమానాంశు జాలుం డగు బృహస్పతి బలాన్వితుఁడై లగ్నమునందు నుండినచో, శ్రియఃపతి విషయమై భక్తితోఁ జేయఁబడిన వందనము దుస్తరము లగు పాపముల నెట్లు హరించునో యట్లు సర్వారిష్టములు నశించు నని యర్థము.

లగ్నాధిపోతి బలవా నశుభై రదృష్టః
కేంద్ర స్థితై శ్శుభఖగై రవలోక్యమానః, 13

మృత్యుం విధూయ విదధాతి సుదీర్ఘ మాయుః
సార్థం గుణై ర్బహుభి రూర్జిత యాచ లక్ష్మ్యా. 14

తా. అనఁగా లగ్నాధిపతి పాపగ్రహములచేతఁ జూడఁబడక బలాన్వితుఁడై కేంద్రములయందుండు శుభగ్రహములచేతఁ జూడఁబడుచుండెనేని మృత్యువుం బోఁగొట్టి సద్గుణ సంపద్విశేషములతో దీర్ఘాయువులను గలుగజేయునని యర్థము.

లగ్నా దష్టమ వర్త్యపి గురు బుధ శుక్ర దృకాణగ శ్చంద్రః,
మృత్యు ప్రాప్తం సుతమపి పరి రక్షత్యేష నిర్వ్యాజమ్. 15

తా. అనఁగాఁ జంద్రుఁడు జన్మ లగ్నమునకు నష్టమ స్థానమున నుండినను గురు బుధ శుక్ర ద్రేక్కాణములయందు నెందేని యుండిన, శిశువుకు నరిష్టదోషముం దొలఁగించి రక్షించుననియర్థము.

చంద్ర స్సంపూర్ణ తను స్సౌమ్యర్క్ష గత స్థిత శ్శుభ స్యాంతః,
ప్రకరో త్యరిష్ట భంగం విశేషత శ్శుక్ర సందృష్టః. 16

తా. అనఁగాఁ బూర్ణచంద్రుఁడు శుభగ్రహముల నడుమను శుభక్షేత్రగతుండై యుండినచో నెట్టి యరిష్టముగాని సంభవించదనియు శుక్రునిచేఁ జూడఁబడు చుండెనేని నిర్దోషమనియు నర్థము.

బుధ భార్గవ జీవానా మేకతమః కేంద్ర మాగతో బలవాన్,
యద్యపి క్రూర సహాయ స్సద్యోఽరిష్ట స్యభంగాయ. 17

తా. శుక్ర బుధ గురువుల యందొకండు బలాన్వితుఁడై ౧-౪-౭-౧౦-ఇండ్ల నుండి, పాపగ్రహ యుతుండై యుండినను బాలారిష్ట పరిహార మగునని యర్థము.

రిపు భవనతోఽపి శశీ గురు సిత చంద్రాత్మజ దృకాణస్థః,
గరుడ ఇవ భోగి దష్టం పరిరక్షత్యేష నిర్వ్యాజం. 18

తా. అనఁగా, చంద్రుఁడు షష్ఠ స్థానమున నుండినను గురు బుధ శుక్ర ద్రేక్కాణ గతుండయ్యేనేని, గరుడుఁడు సర్పదష్టుం డగువాని నెట్లు రక్షించునో యట్లు నిష్కపటముగ రక్షించునని యర్థము.

సౌమ్య ద్వయాంతర గత స్సంపూర్ణ స్నిగ్ధ మండల శ్శశభృత్,
నిశ్శే షారిష్ట హంతా భుజగ లోకస్య గరుడ ఇవ. 19

తా. పూర్ణచంద్రుఁడు రెండు శుభగ్రహముల నడుమ నుండినచో సర్ప సమూహమునకు గరుత్మంతునివలె సకల బాలారిష్ట పరిహార మగు నని యర్థము.

శశభృతి పూర్ణ శరీరే శుక్లేకృష్ణే నిశాభవే ద్దివసే,
రిపు నిధనస్థే రిష్టం ప్రభవతి నైవాత్ర జాతస్య. 20

తా. షష్ఠాష్టమముల యందు సంపూర్ణ చంద్రుఁడైయుండి శుక్లపక్షపు రాత్రియందును కృష్ణపక్షపుఁ బగటియందును బుట్టినబాలుని కరిష్టము సంభవింప దని యర్థము.

ప్రస్ఫురిత కిరణ జాలే సుధామయ మండలే విలోకయతి,
సురమంత్రిణి కేంద్రగతే సర్వారిష్టం శమం యాతి. 21

తా. గురువు కేంద్రమునం దుండి సంపూర్ణ చంద్రుఁడు లగ్నమును జూచు చుండినచో సర్వారిష్ట నివారణ మగునని యర్థము.

సౌమ్య భవనోపయాతా స్సౌమ్యాంశక సౌమ్య దృక్కాణాః,
గురు చంద్ర కావ్య శశిజా సర్వేరిష్ట స్యహంతారః. 22

తా. అనఁగా శుభక్షేత్ర శుభనవాంశ శుభద్రేక్కాణములం బొంది యున్నట్టి గురు చంద్ర శుక్ర బుధులు సర్వారిష్టమును బరిహారము సేయుదు రని యర్థము.

పాపాయది శుభవర్గే సౌమ్యై ర్దృష్టా శ్శుభాంశ వర్గస్థైః,
నిఘ్నంతి తదారిష్టం పతిం విరక్తా యథా యువతిః. 23

తా. పాపగ్రహములు శుభ షడ్వర్గముల యందుండఁగా శుభాంశ వర్గస్థము లగు శుభగ్రహములచేతఁ జూడఁబడినచోఁ బ్రియములేని స్త్రీ, తనభర్త నెట్లు హింసించునో, యట్ల సర్వారిష్టముల నివృత్తిఁ జేయునని యర్థము.

తాత్కాలే యది విజయీ శుభగ్రహ శ్శుభ నిరీక్షితో వశ్యం,
నాశయతి సర్వరిష్టం మారుత ఇవ పాదపాన్ ప్రబలః. 24

తా. జన్మకాలము నందు నేదైన నొక శుభగ్రహము యుద్ధమునందు జయము నొంది శుభగ్రహముచేతఁ జూడఁబడు చుండెనేని ప్రబల వాయువు వృక్షములం బడఁ ద్రోయు నట్లు సర్వారిష్టముల నివారించు నని యర్థము. కాఁబట్టి తొల్లింటి వారిచేత నిట్లు బాలారిష్టాది దోషములకు భంగములు చెప్పఁబడినవి. జన్మకాలమునందు నరిష్ట యోగకారకగ్రహముల యొక్కయు, నరిష్ట భంగ కారక గ్రహములయొక్కయు బలాబలములను పాటించి యరిష్ట యోగ కారక గ్రహములు బలాధికు లైయుండిరేని శిశువునకు నరిష్టములు గల్గు ననియు, అరిష్ట భంగ కారక గ్రహములు బలాధికు లైయుండినచో శిశువు జీవించు ననియు, ద్వివిధ గ్రహములు సమాన బల యుతు లైయుండెనేని యరిష్ట యోగమే ఫలకారి యగు ననియుం దెలియఁ దగినది. ఈవిషయమై, "శుభాశుభత్వంచ హితాహితత్వం తుంగాది నీచాస్తమయాశ్రితత్వం, రిష్టేశ భంగేశ్వర యోర్విచింత్య సమాన వర్గస్య సమాన వర్గాత్. రిష్టేశ ఖేటస్య బలోత్కటత్వం చేద్రిష్ట కర్తృర్హితదా త్వరిష్టం, భంగం ప్రభోశ్చే దథరిష్ట భంగ స్సమాన తాయా మపి కష్టమేన." అని శ్రీపతిచేతఁ జెప్పఁబడినది. కాఁబట్టి యీబాలారిష్టాధ్యాయమును బాగుగఁ జూచి ఫలము చెప్పుటగాక గ్రహాధి దేవతారాధనలును జేయించినచో శుభము నాయువును గల్గును. మఱియు బాలారిష్ట పరిహారమునకు దుర్గారాధనమును లేక మృత్యుంజ యారాధనమును మంత్ర యామిళోక్త ప్రకారము జప హోమ తర్పణాదులు యథావిధిగఁ జేయించుటచేతను బాలారిష్ట దోషము తొలంగు నని మంత్రజ్ఞులును దైవజ్ఞులును వచించియున్నారు.

ఇట్లు బృహజ్జాతకమునందు బాలారిష్టాధ్యాయము సంపూర్ణము.

---

## ఆయుర్దాయాధ్యాయము.

మయ యవన మణిత్థ శక్తి పూర్వై
ర్దివస కరాదిషు వత్సరాః ప్రదిష్టాః,
నవ తిథి విష యాశ్వి భూత రుద్రా
దశ సహితా దశభి స్స్వతుంగ భేషు. 1

తా. ఈగ్రంథ కర్త యీయధ్యాయమున నాయుర్నిర్ణయము, మయ, యవన, మణిత్థ, పరాశరాదుల మతముల ననుసరించి సూర్యాది గ్రహపరమాయుఃప్రమాణ సంవత్సరములను దెలియఁ జెప్పుచున్నాఁడు. సూర్యోపాసనాలబ్ధ జ్యోతి శ్శాస్త్రి పారంగతుం డగుమయుం డను దానవుండును, యవనేశ్వరుం డనుమ్లేచ్ఛప్రభువును, మణిత్థుం డను నొక దైవజ్ఞశిఖామణియును, శక్తికుమారుఁ డగుపరాశరులును, వీరలు జ్యోతిశ్శాస్త్ర పారంగతు లగుటంజేసి శాస్త్ర సంప్రదాయము వదలక వారి మతము లిట్లు దెల్పియున్నారు. ఎట్లనఁగ:—తమ పరమోచ్చ భాగముల యందున్న సూర్యాది గ్రహములచేత, నవతిథి విషయాశ్వి భూత రుద్రా దశ సహితాదశభి స్స్వతుంగగేషు, అనఁగా, దశభిస్సహితాః=పదితోఁగూడిన, (నవ=౯), (తిథి=౧౫), (విషయ=౫), (అశ్వి=౨),(భూత=౫),(రుద్ర=౧౧),(దశ=౧౦) ఈసంఖ్యలు గల సంవత్సరములు వచింపఁబడినవి. అనఁగా నవాది సంఖ్యలయందుఁ బ్రతిసంఖ్యకును పదిపది వంతునఁ జేర్చి మొత్తము చేయఁ దగినది. కాఁబట్టి యట్లు చేయఁగ నేర్పడిన సంవత్సరములయాయువును సూర్యాదులు తమతమ పరమోచ్చ భాగముల యందున్న వారలై యొసంగుదురని వచించిరి. ఉదా:—రవికి ౧౯ సంవత్సరము లనియు, చంద్రునకు ౨౫ సంవత్సరములనియు, అంగారకునకు ౧౫ సంవత్సరములనియు, బుధునకు ౧౨ సంవత్సరము లనియు, బృహస్పతికి ౧౫ సంవత్సరము లనియు, శుక్రునకు ౨౧ సంవత్సరము లనియు, శనికి ౨౦ సంవత్సరములనియు నిట్లు సూర్యాది గ్రహములు పరమోచ్చ భాగమున నుండునపుడిచ్చెడు పరమాయుః ప్రమాణసంవత్సరాలని తెలియఁ దగినది.

నీచే చార్థం హ్రసతి హితత శ్చాంతరస్థేనుపాతో
హోరాత్వంశ ప్రతిమ మపరే రాశి తుల్యం వదంతి,
హిత్వా వక్రం రిపుగృహ గతై ర్హీయతే స్వత్రి భాగః
సూర్యోచ్ఛిన్న ద్యుతిషుచ దళం ప్రోజ్ఝ్య శుక్రార్కపుత్రౌ. 2

తా. ఈశ్లోకమునం బరమ నీచాంశములయందున్న సూర్యాదిగ్రహము లిచ్చెడు ఆయుర్దాయమును లగ్నాయుర్దాయ నిర్ణయ ప్రకారమును, శత్రుక్షేత్ర హరణమును, మూఢ హరణమును దెలియఁజేయఁబడినవి.

ఎట్లనఁగాః-సూర్యాది గ్రహములు పరమనీచాంశములయందుండిరేని, ముందుగఁ జెప్పఁబడిన యాయు ర్వత్సరములలో సగము నశించుచున్నది. ఇట్లు నశింపఁగా శేషించిన సంవత్సరములు, సూర్యునకు సంవత్సరాలు ౯, నెలలు ౬ అగుచున్నవి. చంద్రునకు సంవత్సరాలు ౧౨, నెలలు ౬ అగుచున్నవి. కుజునకు సంవత్సరాలు ౭, నెలలు ౬ అగుచున్నవి. బుధునకు సంవత్సరాలు ౬ అగుచున్నవి. గురువుకు సంవత్సరాలు ౭, నెలలు ౬ అగుచున్నవి. శుక్రునకు సంవత్సరాలు ౧౦, నెలలు ౬ అగుచున్నవి. శనికి సంవత్సరాలు ౧౦ అగుచున్నవి. పిదప నాపరమోచ్చ పరమనీచాంశలకు నడుమ గ్రహ ముండినచోఁ త్రైరాశికముచేత నాయుః ప్రమాణము నిర్ణయము చేయఁ దగినది. అదెట్లనఁగ:—సకల గ్రహములకుఁ బరమోచ్చ పరమనీచాంశల నడుమ నాఱురాసు లున్నవి. కాఁబట్టి యొకరాశికి ముప్పది భాగములు, ఒకభాగమునకు నరువది లిప్తలు ఒకలిప్తకు నరువది విలిప్తలు గనుక యీప్రకారముగ నాయాఱు రాసులను లిప్తలు చేయఁగ ౧౦౮౦౦ లిప్త లగుచున్నవి. ఇట్లు రాసులను లిప్తలుచేసి గ్రహముచేతఁ దన పరమోచ్చాంశకంటె నధికముగ. భుక్తమై యుండెనేని యపుడు పరమోచ్చ భాగము వఱకుఁ ద్రోసివేసి శేషమును లిప్తలు గావింప వలయును. తన పరమనీచాంశ కంటె నధికముగ భుక్తమై యుండెనేని యపుడు పరమ నీచభాగము వరకుం ద్రోసివేసి శేషమును లిప్తలుచేయవలయు నాలిప్తలకు గ్రహ భుక్త లిప్తాగణ మని సంజ్ఞ. ఆగ్రహమునకే, పరమ నీచాంశ యందుఁ జెప్పఁబడిన యాయుః ప్రమాణ సంవత్సరములను మాసములు చేయఁ దగినది. ఇవ్విధము చేయఁగఁ బరమ నీచాంశ గతు లగు సూర్యాదుల కేర్పడిన మాసములు.

| రవికి నెలలు | చంద్రునకు నెలలు | కుజునకు నెలలు | బుధునకు నెలలు | గురువుకు నెలలు | శుక్రునకు నెలలు | శనికి నెలలు |
|---|---|---|---|---|---|---|
| ౧౧౪ | ౧౫౦ | ౯౦ | ౭౨ | ౯౦ | ౧౨౬ | ౧౨౦ |

ఇట్లు భగణార్ధ లిప్తలు ౧౦౮౦౦కి ౧౧౪-నెలలు వచ్చినచో గ్రహభుక్తలిప్త లిన్నింటి కెన్ని నెలలు వచ్చునని త్రైరాశికముచేత లెక్క తేర్పఁబడవలయును. ఇందులకు త్రైరాశి సూత్రము. "ప్రమాణమిచ్ఛాచ సమానజాతీ ఆద్యంతయోః స్థః ఫల మన్య జాతిః, మధ్యే తదిచ్ఛా హతమాద్య హృత్స్యా దిచ్ఛాఫలం వ్యస్త విధి ర్విలోమే." అని లీలావతి గ్రంథమునందుఁ జెప్పఁబడినది. ప్రమాణమును, ఇచ్ఛయును, సమాన జాతులు గావున, మొట్టమొదట ప్రమాణసంఖ్యయును, కట్టకడ నిచ్ఛాసంఖ్యయు నుంచఁ దగినది. ఫల మన్యజాతి గావున నడుమ నుంచఁ దగినది. ఇందు నిచ్ఛచేత ఫలమును గుణించి, ప్రమాణముచేత విభజింపఁగ ఫల మేర్పడును. వ్యత్యయము నొందునపు డిచ్ఛచేతఁ బ్రమాణమును గుణించి ఫలముచేత విభజింపఁగ ఫలము లభించు నని సూత్రతాత్పర్యము. ప్రకృతము ప్రమాణ భగణార్ధ లిప్తలు ఇచ్ఛ గ్రహ భుక్తి లిప్తలు, ఫలము గ్రహ పరమనీచ మాసాలు. ఇట్లుంచుకొని త్రైరాశిక గణితము చేయఁదగినది. ఇందుల కుదాహరణము. సూర్యుఁడు వృషభమునందు ౧౩ భాగములు మీఁద ౪౮ లిప్తలనతిక్రమించి ౪౯-వ లిప్తయందుండఁగా నెన్ని సంవత్సరముల నిచ్చుననఁగా, సూర్యునకు మేషరాశియందు దశమభాగము పరమోచ్చము గనుక, అదివఱకుఁ ద్రోసివేసి ౧౧-వ భాగము మొదలుకొని వృషభమునందు సూర్యుఁ డున్న లిప్తవఱకు గణింపఁగ సూర్యభుక్త లిప్తలు ౨౦౨౮ అగుచున్నవి.

| ప్రమాణము. | ఫలము. | ఇచ్ఛ. | |
|---|---|---|---|
| భగణార్ధలిప్తలు | రవిపరమనీచ (౧౦౮౦౦) మాసములు | రవిభుక్త (౧౧౪) లిప్తలు | ౨౦౨౮ |

ఇచ్చట యిచ్ఛా సంఖ్యయగు ౨౦౨౮ చేత ఫల సంఖ్యయగు ౧౧౪ ను గుణింపఁగ ౨౩౧౧౯౨ యగుచున్నది. ఈసంఖ్యను భగణార్ధ లిప్తా సంఖ్యయగు ౧౦౮౦౦ చేత విభజింపఁగ వచ్చిన ౨౧ మాసములగు శేషము ౪౩౯౨ను ౩౦ తో గుణించఁగ వచ్చిన ౧౩౧౭౬౦ ని

భగణార్ధ లిప్తాసంఖ్యయగు. ౧౦౮౦౦చేత భాగింపఁగ లబ్ధము ౧౨ దినములగును. శేషము ౨౧౬౦ ని ౬౦ తోఁ గుణించఁగ వచ్చిన ౧౨౯౬౦౦ను భగణార్ధ లిప్తాసంఖ్యయగు ౧౦౮౦౦ చేత భాగింపఁగవచ్చిన ౧౨ గడియలగును. శేషము-౦-శేషమున్న పక్షమున ౬౦ తో గుణించి ౧౦౮౦౦ చేత భాగింపఁగ విఘడియ లేర్పడును. ఇట్లేర్పడిన సంవత్సరము ౧, మాసములు ౯, దినములు ౧౨, గడియలు ౧౨, ఈసంఖ్యను, పరమోచ్చస్థానగత రవి పరమాయుఃప్రమాణ వత్సరములు ౧౯ పందొమ్మిదింటఁ ద్రోసివేయఁగ మిగిలిన సంవత్సరాలు ౧౭, మాసాలు ౨, దిన ౧౭, ఘడి ౪౮. ఇది పరమోచ్చభాగమును విడిచి నీచమునకుం బోవుచు, రాశి ౧ భా ౧౩ లి ౪౮ భుక్తము గావించి యున్న సూర్యుఁ డిచ్చెడు ఆయుఃప్రమాణమని తెలియఁ దగినది. పరమనీచాంశ యగు తులా దశమభాగమున నుండి స్వోచ్చకుఁ బోవుచు వృశ్చికమునందు ౪౨౯-వ లిప్తయం దున్నట్టిసూర్యునకు నీప్రకారముగానే గణితము చేయఁగ సంవత్సరము ౧, మాసములు ౯, దిన ౧౨, గడియలు ౧౨, ఏర్పడును. ఈసంఖ్యను పరమనీచస్థానగతుఁడగు సూర్యునకుం జెప్పియుండు సంవత్సరములు ౯ మాసములు ౬ తోఁ జేర్చి మొత్తము సేయఁగా నేర్పడెడు సంవత్సరాలు ౧౧, మాసాలు ౩, దిన ౧౨, ఘడి ౧౨, పరమనీచమునుండి స్వోచ్చమునకుఁ బోవుచు రాశి ౭ భా ౧౩ లి ౪౮, భుక్తముగావించి యున్న సూర్యుని ఆయుఃప్రమాణ కాలమని తెలియం దగినది. ఇవ్విధముగ నన్య గ్రహములకు ననుపాతాయుర్దాయము నిర్ణయింపఁ దగినది. లఘూపాయముచేత ననుపాతాయు రానయనక్రమము. ఇష్టమగు గ్రహమునకు రాశ్యాదిలిప్తాంతము లెక్క యేర్పరచి యందుఁ బూర్వోక్త మగు నుచ్చ ధ్రువకమును ద్రోసివేసి శేష ముంచుకొనఁ దగినది. గ్రహము పరమోచ్చ భాగమునకు లోఁగ నున్నయెడ నుచ్చ ధ్రువకము పోదు కాఁబట్టి యపుడు ౧౨ రాసులఁ గూడి యందు నుచ్చ ధ్రువకమునుద్రోసివేసి శేష ముంచుకొనందగినది. ఆశేషము ౬ రాసులకుఁ దక్కువగ నుండెనేని దానిని ౧౨ రాసులలోఁ ద్రోసివేసి తచ్ఛేష ముంచుకొనం దగినది. ఆఱురాసులకు నధికముగ నుండినచో నదియే యుంచుకొనఁ దగినది. ఈరీతిగ

నేర్పడిన దాని రాశ్యాది విలిప్తాంతముగఁ బెట్టుకొని తద్గ్రహ పరమాయుర్వర్షములచేతఁ బ్రత్యేకముగగుణించి విలిప్తాస్థానమును ౬౦ తోఁ బాలుగొనఁగ నాలబ్ధమును లిప్తాస్థానము నందుం గూడి యాలిప్తాస్థానమును ౬౦ తోఁ బాలుకొని యాలబ్ధమును భాగస్థానము నందుం గూడి యాభాగ స్థానమును ౩౦ తోఁ బాలుగొని యాలబ్ధమును రాశి స్థానమునందుం గూడి, యారాశి స్థానమును పంద్రెండింట పాలుగొనఁగా వచ్చిన లబ్ధము భగణ స్థానమగును. అభగణ స్థానము సంవత్సరములు, రాశి శేషము మాసములు, భాగశేషము దినములు, లిప్తాశేషము గడియలు, విలిప్తా శేషము విఘడియలు. ఇట్లు సూర్యాది గ్రహముల యాయుః ప్రమాణ మేర్పడును. ఈవిషయమై, "స్వోచ్చ శుద్ధో గ్రహః శోధ్య ష్షడ్రాశ్యూనో భమండలాత్, స్వపిండ గుణితో భక్తో భాదిమానేన వత్సరాః" అని సారావళి యందుఁ జెప్పఁ బడియున్నది. ఇందులకు నుదాహరణము. సూర్యునకు మేషాది రాశి ౧ - భాగ, ౧౩ లిప్త, ౪౮ విలిప్త, ౦ చెల్లియుండెనేని మేషము నందలి పరమోచ్చభాగము వఱకు భాగము ౧౦ తోసివేయఁగా శేషము ౧-౩-౪౮-౦ ఇదియాఱురాసులకుఁ దక్కువుగ నున్నది గనుక పంద్రెండు రాసులం జేర్చుకొని, అందు ౧-౩-౪౮-౦ త్రోయవలసినది. ఇట్లు చేయఁగా నిల్చిన ౧౦ - ౨౬ - ౧౨ - ౦ ను సూర్యుని పరమోచ్చాయుఃప్రమాణ సంవత్సర సంఖ్యయైన ౧౯ - ౧౯ - ౧౯ పందొమ్మిది చేతఁ బ్రత్యేకముగ గుణించినచో వచ్చిన మొత్తము ౧౯౦-౪౯౪-౨౨౮-౦ ఇది పూర్వోక్త ప్రకారము స్వచ్ఛేదముల చేతఁ బాలుగొనఁగా వచ్చిన సంవత్సరములు, ౧౨ మా, ౨ దిన, ౧౨ ఘడియలు, ౪౮ వి, ౦ మఱియొక యుదాహరణము. సూర్యునిచేత మేషరాశి ౦ భా, ౭ లి, ౫ వి,౫ భుక్తము లైయుండెనేని యుచ్చధ్రువకము త్రోసి వేయుటకు పోదు కాఁబట్టి పంద్రెండు రాసులను గూడుకొని, ౧౨-౭-౫-౫ లో నుచ్చధ్రువక భాగములు పదిం ద్రోయఁగ నిలిచిన ౧౧-౨౭-౫-౫ ను పరమోచ్చ గత సూర్యుని పరమాయుః ప్రమాణ సంఖ్య యగు, ౧౯-౧౯-౧౯-౧౯ చేతఁ బ్రత్యేకముగ గుణించి స్వచ్ఛేదములచేతఁ బాలుకొనఁగా వచ్చిన సంవత్సరాలు, ౧౮

మాస, ౧౦ దిన, ౧౩ ఘడి, ౩౬ విఘ, ౩౫ ఇట్లు సూర్యునకు నుదాహరణ మీయఁబడినది. తక్కిన గ్రహములకు నిట్లూహింపఁ దగినది. లగ్నాయుర్దాయ క్రమ మెట్లనఁగ:— లగ్నము వఱకున్న మేషాది రాసులను విడిచి లగ్నమునందుఁ జెల్లిన భాగాదులను లిప్తలు గావించి, యాలిప్తల నొక నవాంశకు ౨౦౦ లిప్తలు గనుక, ౨౦౦ చేతఁబాలు గొనఁగ వచ్చిన లబ్ధము గతనవాంశ సంఖ్యయగును. ఇన్నెన్ని నవాంశలు గతము లైయుండునో యన్ని సంవత్సరము లగును. మిగిలిన లిప్తలను ౧౨ చే గుణించి ౨౦౦ తో భాగింపఁగ లబ్ధము మాసము లగును. ఆ శేషమును ౩౦ యింటగుణించి ౨౦౦ చే భాగింపఁగ లబ్ధము దినములగును. ఆ శేషమును ౬౦ తో గుణించి ౨౦౦ చేతఁ బాల్గొనఁగ లబ్ధము ఘడియ లగును. ఆ శేషమును ౬౦ తో గుణించి ౨౦౦ చేభాగింప లబ్ధము విఘటిక లగును. ఇట్లు లగ్నాయుర్దాయము చేయఁ దగినది. కొందఱు మేషము మొదలుకొని లగ్నము వఱకు లెక్కింపఁగ, లగ్నముగాక యెన్నియగునో యన్ని లగ్నాయుర్దాయ సంవత్సరము లగుననియు పిదప లగ్నమునందు భుక్తభాగాదులను లిప్తలుచేసి ౧౨ తోగుణించి రాశి లిప్తలైన ౧౮౦౦ చేతఁ బాల్గొనఁగ లబ్ధము మాసములగును. శేషమును ౩౦ ట గుణించి ౧౮౦౦ చేతఁ బాల్గొనగ లబ్ధము దినము లగును. శేషమును ౬౦ ట గుణించి ౧౮౦౦ చేతఁబాల్గొనగ లబ్ధము గడియలగు ననియు నందురు. ఇందులకు, "లగ్నరాశి సమాంశాబ్దాః మాసాద్యా ననుపాతతః,లగ్నాయు ర్దాయ మిచ్ఛంతి హోరాశాస్త్రవిశారదాః." అని మణిత్థుఁడు వచించి యున్నాఁడు. కొందఱు నవాంశాధిపతి బలవంతుఁ డైయుండె నేని నవాంశ సమముగను, లగ్న రాశ్యధిపతి బలవంతుఁడై యుండెనేని రాశి తుల్యముగాను లగ్నాయుర్దాయమును జెప్పుచున్నారు. ఈవిషయమై, "లగ్నాయుర్భాంశ తుల్యంస్యా దంతరే చానుపాతతః, తత్పదే బల సంయుక్తే రాశి తుల్యం తు భాధిపే" అని సారావళియందుఁ జెప్పఁబడినది. గనుక, వక్రించి యున్న గ్రహముగాక తక్కిన గ్రహములు శత్రుక్షేత్రగతము లై యుండెనేని తమ యాయు ర్వర్షములలో మూఁడవ పాలి వర్షములును హరించు ననియు, వక్రించి యున్న గ్రహము శత్రుక్షేత్రము

నందున్నప్పటికిని హరింపఁ జాల దనియెఱుంగ వలయు. నిందులకు ననేకు లగు దైవజ్ఞశిఖామణులు సమ్మతించి యున్నా రనుటకు, “వక్రి చారం వినాత్ర్యంశం శత్రురాశౌ హరేద్గ్రహః” అని గ్రంథాంతరమునఁ జెప్పఁబడినది. మఱియును గొందఱు కుజుని తక్క, తక్కినవారు శత్రుక్షేత్ర గతులై తమ యాయుర్దాయమునం దృతీయాంశమును హరించు ననియు, శత్రుక్షేత్ర గతుఁడైనను దృతీయాంశమును హరింపఁ జాలఁ డనియు వచించు చున్నారు. ఈవిషయమై, “భూమ్యాః పుత్రం వర్జయిత్వా భస్తాహన్యు స్స్వస్వా దాయుషస్తే త్రిభాగం” అని బాదరాయణులచేఁ జెప్పఁబడినది. కాఁబట్టి శుక్ర శనులు విడిచి తక్కినవారు, అస్తంగతు లగుచుండఁగాఁ దమ యాయుర్వర్షములయందు సగము హరింపఁ బడును. ఇందులకు, “అస్తం యాతౌ స్సర్వ ఏవార్ధ హానిం కుర్యుర్హిత్వా దైత్యపూజార్క పుత్రౌ” అని బాదరాయణులచేతఁ జెప్పఁబడినది.

సర్వార్ధ త్రిచరణ పంచ షష్ఠ భాగాః
క్షీయంతే వ్యయ భవనాద సత్సువామమ్,
సత్స్వర్ధం ప్రహసతి తత్రైక రాశిగానా
మేకోంశం హరతి బలీ తథాహసత్యః. 3

తా. చక్ర పాత హరణ మనఁగా వ్యయాది హరణములం జెప్పఁబడినది. అదెట్లనఁగ:—లగ్నమునకుఁ బండ్రెండవ యింటఁ బాపగ్రహముండెనేని యాగ్రహముయొక్క యాయువు సర్వము క్షీణించును. ఏకాదశము నందుఁ బాపగ్రహ ముండెనేని యాగ్రహముయొక్క యాయువున నర్ధము క్షీణించును. దశమమునందుఁ బాపగ్రహ ముండెనేని మూఁడవ పాలాయువు నశించును. నవమమునందుఁ బాపగ్రహ ముండెనేని నాల్గవ పాలాయువు నశించును. అష్టమమునందుఁ బాపగ్రహ ముండెనేని యైదవ పాలాయువు క్షీణించును. సప్తమమునందుఁ బాపగ్రహ ముండెనేని తనయాయుర్దాయమునం దర్ధము నశించును. ఇట్లు వ్యయాది స్థానముల యందు శుభగ్రహము లుండెనేని పాపగ్రహములకు హరణమునందు సగము క్షీణించును. అదెట్లనిన, శుభగ్రహము

లగ్నమునకు ద్వాదశమునం దుండెనేని యా గ్రహాయుర్దాయమునందు సగము హరించును. ఏకాదశమునం దుండెనేని నాల్గవ భాగ మాయువు హరించును. దశమమునం దుండెనేని యాఱవపాలు హరించును. నవమమునందుండెనేని యెనిమిదవ పాలాయువు హరించును. అష్టమము నందుండెనేని దశమాంశ మాయువు హరించును. సప్తమమునం దుండె నేని ద్వాదశాంశాయువు హరించును. కాఁబట్టి శుభగ్రహములుగాని పాపగ్రహములుగాని యీవ్యయాది స్థానములలో నొకస్థానమునందు రెండుమూఁడు గ్రహము లుండెనేని వారి యందు బలవంతుఁడైన యొక్కడ, యా స్థానమునందుఁ దనకుఁ జెప్పఁబడిన హరణాంశమును హరించును. ఇతర గ్రహములు హరింప వని సత్యాచార్యులు వచించి యున్నారనుఁట. ఈవిషయము వరాహ మిహిరాచార్యులవారికి సమ్మతమగుటంజేసి యిట్లు గ్రంథావలోకనము చేయువారు బాగుగఁ జూచి ఫలము వచింప వలయును.

సార్థోది తోదిత నవాంశ హతా త్సమస్తా
ద్భాగోష్ట యుక్త శతసంఖ్య ముపైతి నాశం,
క్రూరే విలగ్న సహితే విధినా త్వనేన
సౌమ్యే క్షితే దళమతః ప్రళయం ప్రయాతి. 4

తా. ఈశ్లోకమునఁ బాప గ్రహము జన్మలగ్నమునం దుండి నచో నందువలన నాయుర్దా యాంశమును హరించు విధము జెప్పఁ బడినది. అదెట్లనిన, లగ్నమునందుఁ బాపగ్రహము లగు రవి కుజ శనులయందు నొకం డుండఁగా, అర్థోదితనవాంశ సహితము లగు గత నవాంశలచేత గుణింపఁబడిన, లగ్నాయు స్సహిత మయిన సర్వ గ్రహ దత్తాయుః పిండములచేత నష్ట యుక్తమైన శతసంఖ్య గల్గు నట్లు భాగించఁగా వచ్చిన యట్టి వర్షాదులు నాశము నొందు నని యర్థము. అనఁగా, మేషము మొదలుకొని తత్కాల లగ్నము వఱకు లిప్తలు చేసి వానిని నవాంశ లిప్తా ప్రమాణమగు ౨౦౦ చేతఁ భాగ్లోనఁగ లబ్ధ మెన్ని వచ్చునో యన్ని నవాంశలు రాశిచక్రమునందు గత నవాంశల గును. దీని యందు వర్తమాన నవాంశకుగా నొకటి గూడితే, అది

సార్థోదితోదిత నవాంశసమూహమగును. దీనిచేత లగ్నాయుస్సహితమగు సర్వగ్రహదత్తాయుస్సును గుణించి ౧౦౮ చేతఁ బాలుగొనఁగ లబ్ధములైన వర్షాదులను లగ్నమునం దున్న పాప గ్రహము హరించును. గాఁబట్టి, ఆవర్షాదులను సర్వగ్రహదత్తాయుః పిండమునం ద్రోసివేయఁగ శేషము క్రూరోదయహరణ శుద్ధమైనయాయుః పిండమగును. ఈప్రకారముగ నాయాగ్రహములకుఁ బ్రత్యేకముగ నంశహరణ మొనర్చినచో నాయా గ్రహదశావర్షాదు లేర్పడును. కొందఱు సార్థోదితోదిత నవాంశమన్నప్పుడు మేషాది రాసులను ద్రోసివేసి లగ్నమునందు గత భాగములను లిప్తలుచేసి యాలిప్తలను ౨౦౦ చేత భాగింపఁగా లబ్ధము గతనవాంశ లగును. అందు వర్తమాన నవాంశకై యొకటి గూడితే, యది సార్థోదితోదిత నవాంశ సమూహమగును. దీనిచే సర్వగ్రహదత్తాయుః పిండమును గుణించి పూర్వోక్త ప్రకారముగ హరణము చేయువలయు నని వచింతురు. ఇదియునుంగాక, యాలగ్నమునం దున్నట్టి పాప గ్రహము శుభగ్రహముచేతఁ జూడఁబడెనేని యీవిధానముచేత సార్థోదితోదిత నవాంశలచేత గుణించి ౧౦౮ చేత భాగింపఁగ వచ్చినట్టిలబ్ధమునందు సగము నాశన మొందు నని తెలియఁదగినది. లగ్నమునం దొక పాపగ్రహమొక శుభ గ్రహమును గూడియుండెనేని యారెంటిలో నేగ్రహము వర్తమాన నవాంశకు మిక్కిలి సమీపమునం దుండునో, ఆగ్రహమునకుఁ జెప్పిన ప్రకారము, అంశహరణము చేయఁ దగినది. ఇతర గ్రహములకు నంశహరణము చేయఁదగదు. పాప గ్రహములతో నీచోట క్షీణచంద్రుని చేర్పతగదు. ఇందులకు, "సూర్యాంగారక మందే ష్వేకస్మిన్ లగ్నగే భవతి హానిః విధినాత్వనేన సౌమ్యే క్షుతే దళం పాతయేల్లబ్ధమ్" అని బాదరాయణులచేఁ జెప్పఁబడినది.

సమా షష్టి ర్ద్విఘ్నా మనుజ కరిణాం పంచచ నిశా
హయానాం ద్వాత్రింశ త్ఖరకర భయోః పంచక కృతిః,
విరూపా సాత్వాయు ర్వృష మహిష యోర్ద్వా దశ శునాం
స్మృతం బాగాదీనాం దశక సహితా షట్చ పరమమ్.

తా. మనుష్యులయొక్క గజాదులయొక్క పరమాయుః ప్రమాణము జెప్పఁబడినది. ఎట్లనఁగ:— రెంట గుణింపఁబడిన యరువది సంవత్సరములను (పంచనిశాశ్చ=అయిదురాత్రులు) అనఁగా నూట యిరువది సంవత్సరముల మీఁద నైదు దినములు మనుజులకు నేనుంగులకుఁ బరమాయుః ప్రమాణ మగునని తెలియఁ దగినది. గుఱ్ఱములకు ముప్పది రెండు సంవత్సరములు పరమాయువును. గాడిదెలకును, లొట్టియలకు నిరువ దైదేండ్లు పరమాయువును. గోవులకు, నెనుబోఁతులకు నిరువది నాలుగేండ్లు పరమాయువును. కుక్కలకుఁ బండ్రెండేండ్లు పరమాయువును. 'శునాం' అను శబ్దముచేత నఖంబులు గల వ్యాఘ్ర మార్జారా ద్యుపలక్షణార్థము. గాఁబట్టి వానికిని పండ్రెండేండ్లు పరమాయు వని తెలియఁ దగినది. మఱియు మేక కుఱుబోఁతు మొదలగు వానికిఁ బదియాఱు సంవత్సరములు పరమాయువనం దగును. ఇక్కడ నశ్వాదుల పరమాయువును చెప్పుటచే నశ్వాదుల జన్మకాలమును బట్టి యాయుః ప్రమాణ నిర్ణయము చేయుటకు నని తెలియఁ దగినది. అందునకు నశ్వాదుల పరమాయుః ప్రమాణము ననుసరించి త్రైరాశి గణితము చేతఁ బరమోచ్చ గతగ్రహ పరమాయువు నేర్పరుపం దగినది. అదెట్లనఁగా, గ్రహ పరమాయువుచే నశ్వాదుల పరమాయువును గుణించి మనుష్యుల పరమాయువుచేతఁ బాల్గొనఁగ నశ్వాదుల విషయమై, యాయా గ్రహము లిచ్చెడు పరమాయువుం దెలియును. దీనికి నుదాహరణము. సూర్యుని పరమాయు ర్వర్షము లగు ౧౯ చేత నశ్వముయొక్క పరమాయు సంఖ్యయగు ౩౨ ట గుణించినచో ౬౦౮ వచ్చును. దీనిని మనుష్య పరమాయు వగు సంవత్సరాలు ౧౨౦ చేతఁ బాల్గొనఁగ, లబ్ధము సంవత్సరాలు ౫ మాస, ౦ దిన ౨౪ వచ్చును. ఈప్రకారము చంద్రునకు సంవత్సరాలు ౬-౮-౦ కుజునకు ౪-౦-౦ బుధునకు ౩-౨-౧౨ గురువుకు ౪-౦-౦ శుక్రునకు ౫-౭-౬ శనికి ౫-౪-౦ ఇయ్యి దశ్వవిషయమై పరమోచ్చ గతు లగు రవ్యాదు లిచ్చెడు నాయుర్దాయము. ఇట్లు ఖరకరభాదులకును రవ్యాదు లిచ్చెడు నాయుర్దాయము గణితముచేతఁ దెలియఁ దగినది. ఈగ్రహాయుర్దాయమును బట్టి నరులకుఁ దెచ్చిన ప్రకార మాయుర్దాయమును దెచ్చి హారణ

శోధనము చేయఁగ శేషించిన యాయువు నశ్వాదులకుం జెప్పఁ దగినది.

అనిమిష పరమాంశకే విలగ్నే
శశితనయే గవి పంచవర్గ లిప్తే,
భవతి హి పరమాయుషః ప్రమాణం
యది సకలాస్సహితా స్స్వతుంగభే. 6

తా. అనఁగా నేయోగమునం బుట్టినవానికిఁ బరమాయువు సంపూర్ణముగఁ గల్గునో, యాయోగముం జెప్పఁబడినది. ఎట్లనఁగా, మీన రాశి పరమనవాంశయైన తొమ్మిదవ నవాంశ లగ్న మగుచుండఁగా, బుధుఁడు వృషభమునందు నిరువదైదు లిప్తల నతిక్రమించి యుండి బుధ వ్యతిరిక్త గ్రహము లాఱును దమ పరమోచ్చ భాగముల యందు నుండిరేని యిట్టి యోగ సంజాతునకుఁ బరమాయుఃప్రమాణ మగు సంవత్సరాలు. ౧౨౦ మాస, ౦ దిన,౫ అగుననియర్థము. ఇందులకు నుదాహరణము. "లగ్ననవాంశ-౯-రవి-౦-౯-౦-చంద్ర-౧-౨-౦-కుజ-౯-౨౭-౦-బుధ-౧-౦-౨౫-గురు-౩-౪-౦శుక్ర-౧౧-౨౬-౦-శని-౬-౧౯-౦-భుక్తము గావించి యుండఁగాఁ బరమోచ్చ గతులైన రవి చంద్రాంగారక గురు శుక్ర శనులకుఁ బరమాయుః ప్రమాణ సంవత్సరములు. రవికి ౧౯, చంద్రు ౨౫, కుజ ౧౫, గురు ౧౫, శుక్ర ౨౧, శని ౨౦ ఈప్రకార మేర్పడియున్నవి గదా! కాఁబట్టి యాబుధుని కెన్ని సంవత్సరము లనిన బుధుఁడు తన నీచస్థాన మగు మీనరాశి నుండి యుచ్చస్థానమునకుఁ బోవుచు ౧-౦-౨౫ లో నున్నాఁడు గనుక దీని యందు బుధ పరమనీచ ధ్రువకము పోదు. పంద్రెండు రాసులం జేర్చుకొనఁగ నేర్పడిన ౧౩-౦-౨౫ లోఁ బరమనీచ ధ్రువకము ౧౧-౧౫-౦ త్రోసి శేషము ౧-౧౫-౨౫ ను లిప్తలు సేయఁగ ౨౭-౨౫ అగును. దీనిని గమనింపక యుండినచో నిష్ఫల మని చెప్పఁ దగినది.

## త్రైరాశికము.

భగణార్ధ లిప్తలు ౧౦౮౦౦, బుధ పరమనీచ మాసాలు ౭౨, బుధభుక్త లిప్తలు ౨౭౨౫, ఇక్కడ బుధ పరమనీచ మాసము లగు

౭౨ ను, బుధ భుక్త లిప్త లగు ౨౭౨౫ చేత గుణించి భగణార్ధ కి సంఖ్య యగు ౧౦౮౦౦ చేతఁ బాల్గొనఁగ వచ్చిన సంవత్సరాలు మాస ౬, దిన ౫, దీనిని పరమనీచ గత బుధాయు ర్వత్సరములు యందుఁ జేర్పఁగ, సంవత్సరాలు ౭, మాసా, ౬, దిన ౫, బుధాఁ ర్ధాయు మేర్పడుచున్నది. ఇంక వ్యయాది హరణము చేయఁదగిన విట్లనఁగా:— శనైశ్చరుఁడు లగ్నమునకు నెనిమిదవ యింట న్నాఁడు. కాఁబట్టి, తన యాయుస్సంవత్సరములు ౨౦ లోఁ బఁ మాంశ మైన సంవత్సరాలను హరించుచున్నాఁడు. గనుక, హ శుద్ధమగు శనైశ్చరుని సంవత్సరాలు ౧౬ కుజుఁడు లగ్నమున నేకాదశమునం దున్నాఁడు కాఁబట్టి తన యాయుస్సంవత్సరాలు ౧ లో సగమైన సంవత్సరాలు ౭ మాసాలు ౬ ను హరించును, గనుక హ ణ శుద్ధమగు కుజ సంవత్సరాలు ౭, మాస ౬, “హోరాత్వంశ ప్రతిమ అని చెప్పఁబడి యుండుటంజేసి లగ్నమునందు నవము నవాంశయగు వలన లగ్నాయుర్ధాయము సంవత్సరాలు ౯. ఈప్రకారము సూర్యాది లకు స్థిరముగ నేర్పడిన సంవత్సరాలు. రవికి సంవత్సరాలు ౧౯, చంద్రి నకు సంవత్సరాలు ౨౫, కుజునికి సంవత్సరాలు ౭, మా ౬, బుధునకి సంవత్సరాలు ౭, మా ౬, దిన ౫, గురువుకు సంవత్సరాలు ౧౫, శుక్రి నకు సంవత్సరాలు ౨౧, శనికిసంవత్సరాలు౧౬, లగ్నమునకు సంవత్స రాలు. ౯, ఇవన్నియుఁ గూడఁగ, సంవత్సరాలు ౧౨౦, మాసా ౦ దిన ౫ ఏర్పడును. ఇది పరమాయు ర్జీవిత యోగ మనం దగినది.

ఆయుర్దాయం విష్ణు గుప్తోపి చైవం
దేవస్వామీ సిద్ధ సేనశ్చ చక్రే,
దోషశ్చైషాం జాయ తేష్టా వరిష్టం
హిత్వా నాయు ర్వింశతే స్స్యాద ధస్తాత్. 7

తా. అనఁగాఁ బూర్వోక్త పరమాయుర్దాయమునందు దోషము చెప్పఁబడిన దెట్లనఁగ:—పూర్వోక్తప్రకారముగ నాయుర్దాయమును, చాణక్యుఁ డనెడు నామాంతరము గల విష్ణు గుప్తుఁడును, దేవస్వామి యనెడు దైవజ్ఞుండును, సిద్ధసేనుఁ డనెడు గ్రంథకర్తయును

చేసిరి. అదెట్లనఁగా, "పరమోచ్చగతైస్సర్వై ర్మీనే మీనాంశ సంస్థితే లగ్నే, సౌమ్యేవృషగే జాతః పరమాయు ర్జీవతి మనుష్యః." అని విష్ణుగుప్తుం డను చాణుక్యునిచేతఁ జెప్పఁబడియున్నది. మఱియు, "సూర్యాద్యై రుచ్చగతై ర్మీనే మీనాంశ సంస్థితే లగ్నే, సౌమ్యే వృషభం యాతే జాతః పర మాయు రాప్నోతి." అని దేవస్వామిచేఁ జెప్పఁబడినది. ఇదేప్రకారము సిద్ధసేన మయ యవనాదులును వచించి యున్నారు. అయితే యీసిద్ధసేన మయ యవనమణిత్థ పరాశర విష్ణుగుప్త దేవస్వామి మొదలగు వారి మతమునందుఁ బ్రత్యక్ష దోషము కల్గుచున్నది. అదెట్లనఁగ, ఎనిమిది సంవత్సరాలవరకు బాలారిష్టము విడిచి ఇరువది సంవత్సరములవఱకు నాయువు సమాప్తికాదు. వీరుచెప్పిన మార్గమునందు నెనిమిదేండ్లకుపైన నిరువదేండ్లకు లోఁగ నెవ్వరికి నాయువంతము కాదని తెలియుచున్నది. ఈలోఁగ ననేకులు మృతినొందుచున్నారు. కాఁబట్టి ఈ విషయము ప్రత్యక్షదోషముగ దెలియు చున్నది.

యస్మిన్ యోగే పూర్ణమాయుః ప్రదిష్టం
తస్మిన్ ప్రోక్తం చక్రవర్తిత్వమన్యైః,
ప్రత్యక్షోయం తేషు దోషః పరోపి
జీవత్యాయుః పూర్ణ మర్థై ర్వినాపి. 8

తా. పూర్వోక్త గ్రంథ కర్తల మతమునందు మఱియొక దోషము చెప్పఁబడినది. అదెట్లనఁగా, "అనిమిష పరమాంశకే విలగ్నే" అను శ్లోకమునం జెప్పఁబడిన యే యోగమునందు సంపూర్ణమైన యాయువును జెప్పఁబడినదో, యాయోగమునందు, "యది సహితా స్సకలాస్స్వతుంగేషు" అని యాఱు గ్రహములు పరమోచ్చగతము లగును గనుక మఱికొందఱు గ్రంథకర్తలు సార్వభౌమత్వమును గల్గునట్లు చెప్పిరి. అదెట్లనఁగ, "షడ్భి స్స్వ చ్చక్రవర్తీ త్రిభువన మఖిలం శాస్తి సర్వై ర్గ్రహేంద్రైః" అని బాదరాయణులు చెప్పియున్నారు. గనుక ఆఱుగ్రహములు పరమోచ్చగతములై యుండఁగఁ బుట్టినవాఁడు సకల భూమి నేలెడు రాజు గావలెను. ఆఱుగ్ర

హములు పరమోచ్చ గతములుగాకుండినచోఁ బూర్ణాయువు గలదు. దరిద్రుఁ డగును. కాఁబట్టి యీ మయ యవనాదుల యందు నీదోష మొకండు గానంబడుచున్నది. అని యిట్లు వక్ష్యమాణమగు సత్యా చార్యాయుర్దాయమును ముఖ్యముగ నంగీకరింపఁ దలఁచి పూర్వోక్త మైన మయ యవనా ద్యాయుర్దాయము నందు దోషములు చెప్పఁబ డెను. పరాశరాదులు పూర్వోక్త మైన పిండాయుర్దాయమును ముఖ్య ముగఁ జెప్పినారు. భట్టోత్పలుండు, ఈ పరిమతాయుర్దాయము నందుఁ జెప్పఁ బడిన దోషములసంబద్ధములై యుండుటంజేసి యీ రెండు శ్లోకములును వరాహ మిహిరాచార్య ప్రోక్తములు కావని చెప్పి యీదోషములకుఁ బరిహారములం జెప్పియున్నాఁడు. అందు "నాయు ర్వింశతే స్స్వాదధస్తాత్" అని యేనిమిదేండ్లకు మీఁద నిరువదేం డ్లకు లోఁగ నాయువు సమాప్తికల్ల దని చెప్పిన ప్రథమ దోషమునకుఁ బరిహారం బెట్లనిన, "సార్ధోదితోదిత నవాంశ హతాత్సమస్తాద్భాగో ష్టయుక్త శత సంఖ్య ముపైతి నాశమ్" అని చెప్పఁ బడిన ప్రకా రము ఆయా లగ్న నవాంశ వశమునఁ గ్రూరోదయ హరణము చేయఁగ వచ్చెడు నాయుర్దాయమునకు మితిలేదు గనుక, "ఆయుర్వ్విం శతేస్స్యాద ధస్తాత్" అనిన దూషణ మయుక్తము దీనికి నుదాహ రణము. కుంభరాశి ప్రథమ నవాంశ లగ్నమై రవి చంద్ర కుజులు పరమోచ్చమునందును, బుధ గురు శనులు పరమనీచమునందును, అం

| ర | చం | కు | బు | గు | శు | శ | లగ్న |
|---|---|---|---|---|---|---|---|
| ౦ | ౧ | ౧౦ | ౧౧ | ౯ | ౧౧ | ౦ | ౧౦ |
| ౯ | ౨ | ౨౭ | ౧౪ | ౪ | ౨౬ | ౧౯ | ౧ |
| ౦ | ౦ | ౦ | ౦ | ౦ | ౦ | ౦ | ౦ |

గారకుండు కుంభరాశియొక్క ౨౯ వ భాగము నందు నుండఁగ లగ్న మునందుఁ గొంచెముగాని భుక్తము కాలేదు గనుక లగ్నాయుర్దాయము లేదు. పరమోచ్చ గతులును బరమనీచ గతులును నైన వారి యాయు ర్దాయములు తెలిసియున్నది. కుజాయుర్దాయ మేర్పరచు విధమె ట్లనగ, కుజభుక్తి ౧౦-౨౭ యందుఁ గుజ పరమోచ్చధ్రువకము ౯-

౨౮౦ త్రోసివేయఁగ శేషము ౧౦౦ దీనికి లిప్తలు ౧౮౦౦ ఈసంఖ్య ను గుజ పరమనీచ మాస సంఖ్యయగు ౯౦ చేత గుణించి భగణార్ధ లిప్త సంఖ్యయగు ౧౦౮౦౦ చేత భాగింపఁగ వచ్చిన సంవత్సరము ౧, మాస ౩, వీనిని కుజపరమోచ్చ సంవత్సరాలు ౧౫ లోఁ ద్రోసివేయఁగ నేర్పడి న సంవత్సరాలు ౧౩, మాస ౯, ఇది కుజాయుర్దాయము. బృహస్పతి లగ్నమునకుఁ బండ్రెండవ యింట నుండుటచేతఁ దన పరమనీచ సంవ త్సరములు ౭, మాస ౬ లో సగము హరించును గనుక హరణమగు గురు వర్షములు ౭, మాస ౯, ఇట్లాయా గ్రహములకు నేర్పడిన యా యు స్సంవత్సరము లెన్నియనిన, సూర్యునకు ౧౯ సంవత్సరాలు, చంద్రునకు ౨౫ సంవత్సరాలు, కుజునికి ౧౩ సంవత్సరాలు, మా౯-౦, బుధునకు ౬ సంవత్సరాలు, గురువునకు ౩ సంవత్సరాలు, మా ౯-౦, శుక్రునకు ౨౧ సంవత్సరము, శనికి ౧౦ సంవత్సరాలు, లగ్నమునందు నించుకైన భుక్తి కాలేదు గనుక లగ్నాయుర్దాయము లేదు. ఇవ న్నియుం గూడఁగ సంవత్సరాలు ౯౮, మాస ౬, కుజుఁడు లగ్నము నం దుండటంజేసి క్రూరోదయ హరణముసేయఁ దగినది. లగ్నము కుంభ ప్రథమ నవాంశ యైనందు వలన సర్థోదిత నవాంశ సహితము లైన గత నవాంశలు ౯౧ దీనిచేత సర్వగ్రహ దత్తాయుః పిండ సంవ త్సరాలు ౯౮, మాస ౬. ను గుణింపఁగ వచ్చిన ౮౯౬౩ ను అష్టోత్తర శతము ౧౦౮ చేతఁ భాగింపఁగ లబ్ధము సంవత్సరాలు ౮౩ దీనిని సర్వగ్రహ దత్తాయుః పిండమైన సంవత్సరాలు ౯౮ మాస ౬ నందుఁ ద్రోసివేయఁగ నిలిచిన సవత్సరాలు ౧౫, మాస ౬ ను స్థిరముగ నేర్పడు చున్నవి. ఇట్లైనిమిది సంవత్సరములకు మీఁద నిరువది సంవత్సరాల లోఁగ నాయు స్సమాప్తి గల్గు చున్నది. కాఁబట్టి, " నాయు ర్వింశతే స్స్యాదధస్తాత్ " అనిన దూషణ మయుక్తముగ నున్నది. అయితే పాపగ్రహ వర్జిత మగు లగ్నమునందుఁ బుట్టిన వా రనేకులు ౯ ఏండ్లకు పైన నిరువదేండ్లకు లోఁగ మరణ మొందు చున్నారు. గనుక పూర్వోక్త మయ యవనా ద్యుక్తాయుర్దాయము నందు దోషము లేక పోలేదనికొందఱు వచింతురుగాని యది యసర్వ మైనది. అదెట్లనఁగ, ఏగ్రంథకర్త లేరీతిగ నాయుర్దాయముచెప్పి యున్నారో, యాగ్రంథకర్త

 

లనేక విధములగు నపమృత్యు యోగములం జెప్పినవారు. ఆయోగ శ్లోకములు. "షష్ఠాష్టమస్థో రిపు దృష్ట మూర్తిః పాపగ్రహః పాప గృహే యదిస్యాత్, స్వాంత ర్దశాయాం మరణాయ జంతో ర్జ్ఞేయ స్సయుద్ధే విజితో యదాన్యైః, క్రూర దశాయాం క్రూరః ప్రవిశ్య చాంతర్దశాం యదాకురుతే, పుంసాం స్యాత్సం దేహ స్తదారియోగేసద్వై వమహాన్. రవితనయ స్వదశాయాం క్షితిజ స్యాంతర్దశా యదాభవతి, బహుకాలజీవి నామపి మరణం నిస్సంశయం పుంసాం, షష్ఠాష్ట మస్థో రిపు దృష్ట మూర్తిః పాప శ్శుభ స్థానగతే నదృష్టః, స్వాంత ర్దశాయాం ప్రకరోతి మృత్యుంవ్యాధ్యర్థబంధాది పరిక్షయాన్వా." అని బాదరాయణులును, సారావళి గ్రంథకారకుఁడును, యవనేశ్వరుండును వచించి యున్నారుఁ కాఁబట్టి పూర్వోక్త గ్రంథకర్తల మతమునందు నెనిమిది సంవత్సరములకు మీఁద నిరువది సంవత్సరములకులోఁగ నాయుః పూర్తి గల్గును గావున నీదూషణముయుక్తముగాదు. "యస్మిన్ యోగే పూర్ణమాయుః ప్రదిష్టం తస్మిన్ప్రోక్తం చక్రవర్తిత్వ మన్యైః." అని చెప్పఁబడిన రెండవ దోషమునకుఁ బరిహార మెట్లనిన, చక్రవర్తిత్వయోగము లేక యాయువు సంపూర్ణము గల్గు ననుటకు నుదాహరణము. రవి

| రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని | లగ్న |
|---|---|---|---|---|---|---|---|
| ౧ | ౨ | ౧౦ | ౦ | ౪ | ౦ | ౧౦ | ౮ |
| ౧౦ | ౩ | ౨౮ | ౧౫ | ౫ | ౨౭ | ౨౦ | ౨౭ |
| ౦ | ౦ | ౦ | ౦ | ౦ | ౦ | ౦ | ౦ |

వృషభ రాశియందు భాగ ౧౦, చంద్రుఁడు మిథునమునందు భాగ ౩, కుజుఁడు కుంభమునందు భాగ ౨౮-బుధుఁడు మేషమునందు భా ౧౫, గురువు సింహమునందు భా ౫, శుక్రుఁడు మేషమునందు భాగ ౨౭, శని కుంభమునందు భా ౨౦, ఇట్లుండి ధను రంత్య నవాంశము లగ్నగత మగుచుండఁగాఁ, బూర్వోక్త విధానముచేత నాయా గ్రహములకు నేర్పడెడు నాయు ర్వత్సరములు సూర్యునకు ౧౭ సంవత్సరాలు మాస ౬, చంద్రునకు ౨౨ సంవత్సరాలు, మాసాలు ౧౧, కుజునకు సంవ

త్సరాలు ౧౩, మా ౯, బుధునకు సంవత్సరాలు ౭, గురువుకు సంవత్స రాలు ౧౩, మా ౯, శుక్రునకు ౧౯ సంవత్సరాలు, మాస ౩, శనికి సంవత్సరాలు ౧౩, మాస ౪, లగ్నమునకు ౬, మాస ౦, గురువు లగ్నమునకుఁ ద్వాదశమయింట నుండుటంజేసి తన యాయుర్దాయ సంవత్సరాలు ౧౩, మా ౯లో నష్టమాంశంబును హరించును గనుక హరణశుద్ధ మయిన గురుసంవత్సరాలు ౧౨, మా ౦, దిన ౧౨, చంద్రుఁడు సప్తమము నందున్నాఁడు గనుక తన యాయుర్దాయములో నాఱవ యంశమును హరించును. కాఁబట్టి హరణ శుద్ధ చంద్రుని సంవత్సరాలు ౧౯, మాసము ౧, సూర్యునకు బృహస్పతి మిత్రుఁడు, శుక్రుఁడు తాత్కాలిక మిత్రుఁడు గనుక శత్రు క్షేత్ర హరణము లేదు. అంగారకుఁడు శత్రు క్షేత్ర మైన కుంభమునం దున్నవాఁ డైనను "హిత్వా చక్రం రిపుగృహ గతైః క్షీయతే స్వత్రిభాగః." అని చెప్పఁబడుటంజేసి వక్రుఁడనఁగా నంగారకుం డని పేరు. అనేకు లంగారకుని వక్రుఁ డనియు, వచించెదరు. కాఁబట్టి కుజునకు శత్రుక్షేత్ర హరణము లేదు. ఈప్రకారముగ హరణ శుద్ధ మైన నాయుర్వర్షంబులు సూర్యునకు ౧౭-మా ౫-చంద్రునకు ౧౯-సంవత్సరాలు, మా ౧-కుజునకు సంవత్సరాలు ౧౩-మాసా ౯-బుధునకు సంవత్సరాలు ౭-మా-౦-గురువుకు సంవత్సరాలు-౧౨-మా-౦-దిన ౧౨-శుక్రునకు సంవత్సరాలు ౧౯-మాసా ౩-శనికి సంవత్సరాలు ౧౩-మా ౪-లగ్నమునకు సంవత్సరాలు ౬-మా-౦-ఇవన్నియుం గూడఁగా సంవత్సరాలు ౧౦౯-మాసా ౧౦-దిన ౧౨-అగుచున్నది. మీఁదఁ గొంచెము మిగులును. ఇట్లు రాజయోగము లేక యాయుః పూర్ణము గల్గుచున్నది. "హిత్వార్కం సున ఫాన ఫా దురుధురా స్వాంత్యోభయ స్థైగ్రహైః, శీతాంశోః కథితో న్యథాతు బహుభిః కేమ ద్రుమో నైన్యస్త్వసౌ" అని చంద్ర యోగా ధ్యాయము నందుఁ జెప్పఁబడినది. కాఁబట్టి యిది కేమద్రుమ యోగ మనంబడును. "కేమద్రుమే మలిన దుఃఖిత నీచ నిస్స్వాః ప్రేష్యాః ఖలాశ్చ నృపతే రపి వంశ జాతాః" అని కేమద్రుమ యోగ ఫలము చెప్పఁబడినది.. కనుక యోగమునందుఁ బుట్టిన వాఁడు పూర్వోక్త ప్ర

కారముగ దీర్ఘాయుష్మంతుండును, బహు దరిద్రుండును, కష్టపడు వాడును నగుచున్నాఁడు. కాఁబట్టి, "యస్మిన్ యోగే" అని చెప్పఁబడిన రెండవ దూషణమునకు నవకాశము లేదు. ఈ రెండు దోషముల సమంజసములై యుండుటంజేసి యీ రెండుశ్లోకములును వరాహమిహిరాచార్య ప్రోక్తములని తలంపఁ దగినది కాదు. అయితే వరాహమిహిరాచార్యులచే చెప్పఁబడిన మయ యవనాది మతాయుర్దాయమును విడిచి చెప్పఁబోవు సత్యాచార్యుల మతాయుర్దాయము నంగీకరించుట బాగు లేదు. బహుతరాచార్య సమ్మతముగ నున్నదని తెలియఁ జేయుట గాని పూర్వోక్తాయుర్దాయ దూషణార్థము గాదని తెలియఁ దగినది. "జ్యోతిష మాగమశాస్త్రం విప్రతిపత్తౌ నయోగ్య మస్మాకం, స్వయమేవ వికల్ప యితుం కింతు బహూనాం మతం వక్ష్యే" అని వరాహమిహిరాచార్యుల వారి ప్రతిజ్ఞ గనుక గ్రంథమునందు బహు గ్రంథకర్తల మతములు వచింపఁబడి యున్నవని తెలియఁ దగినది.

స్వమతేన కిలాహ జీవ శర్మా
గ్రహదాయం పర మాయుషః స్వరాంశం,
గ్రహముక్త నవాంశ రాశి తుల్యం
బహు సామ్యం సముపైతి సత్యవాక్యమ్. 9

తా. మఱియు జీవశర్మ మతాయుర్దాయమును సత్యాచార్య ప్రోక్తాయుర్దాయమును జెప్పెను. జీవశర్మ యనెడు గ్రంథకర్త తన మతము చేతఁ బరమాయు వగు ౧౨౦-సంవత్సరములు మాస-౦-దిన ౫-గల పరమాయువు యొక్క సప్తమాంశము నొక్కొక్క గ్రహాయుర్దాయముగాను జెప్పెనుగదా? అనఁగాఁ బరమాయువైన సంవత్సరాలు ౧౨౦-దిన ౫-నేడింటఁ బాల్గొనఁగ వచ్చిన సంవత్సరాలు ౧౭-మా-౧-దిన ౨౨-ఘడి ౮-విఘ ౩౪-పరమోచ్చ గత మగు నొక్కొక గ్రహముయొక్క యాయుర్దాయ మగు నని జీవశర్మ చెప్పినవాఁడని తెలియఁ దగినది. ఈగణితము, "స్వోచ్చ శుద్ధో గ్రహః శోధ్య షడ్గ్రాశ్యూనో భమండలాత్, తద్భాగాః క్వాబ్ధి షణ్ణాగా (౮౬౪౧) హతా వేదా

భ్రసాయకైః. (౧౦౮) భక్తాది నాది యల్లబ్ధం తదాయు ర్జీవ శర్మజం, దినైస్తు త్రింశతా మాసా మాసే భ్యో రవి భిస్సమాః.'' అను సీక్రమమునం జేసిన పక్షమున సులభముగ నేర్పడును. ఇందులకు, ''సప్తదశైః (౧౭) కం(౧) ద్వియమా (౨౨) వసవో (౮) వేదాగ్ని యో (౩౪) గ్రహేంద్రాణాం, వర్షా ద్యుచ్చ స్థానాం నీచస్థానా మతో ర్థం స్యాత్. మధ్యేనుపాత తస్స్యాదానయనం శిష్ట మత్ర యత్కించిత్, పిండాయుష ఇవ కార్యం తత్సర్వం గణిత తత్వజ్ఞైః'' అని చెప్పియున్నాఁడు. గనుక పరమనీచమునం దున్నగ్రహమునకు మునుపు చెప్పిన రీతి సగము నశించును. కాఁబట్టి సంవత్సరాలు ౮, మాసాలు ౯, దిన ౨౬, ఘడి ౬, విఘ ౧౭ ఆయు వేర్పడును. గ్రహ ముచ్చనీచము నందు నుండెనేని మొట్టమొదట పిండాయుర్దాయమునఁ జెప్పిన ప్రకారము త్రైరాశికముచేత నాయా గ్రహమునకు నాయు ర్దాయము నిర్ణయింపఁ దగినది. ఆయా గ్రహముల యందు నంగారకుఁడు గాక తక్కిన గ్రహములలో నేగ్రహమైన శత్రుక్షేత్రమునం దుండెనేని తృతీయాంశ హరణము చేయఁదగినది. శుక్ర శనైశ్చరులు గాక తక్కిన గ్రహములలో నేగ్రహ మైన నస్తంగతమై యుండెనేని యర్థాంశ హరణము చేయఁ దగినది. ''సర్వార్ధ త్రిచరణపంచ షష్ఠ భాగాః'' అనిన ప్రకారముగ వ్యయాది హరణము చేయఁ దగినది. క్రూర గ్రహము జన్మ లగ్నమునం దుండెనేని,''సార్థోదితోదిత నవాంశ హతా త్సమస్తాత్'' అని చెప్పిన ప్రకారముగ, గ్రూరోదయ హరణమును జేయఁ దగినది. ఇట్లు జీవశర్మాయుర్దాయమునందును అంశహరణాదు లన్నియుఁ బూర్వోక్త మయ యవనాది మతాను సారముగానే చేయఁ దగినవి. ఇఁక సత్యాచార్య ప్రోక్తాయు ర్దాయ క్రమ మెట్లనిన, ''గ్రహభుక్త నవాంశ రాశి తుల్యమ్'' అనఁగా నొక రాశియందు నేనవాంశ యందు గ్రహముండునో, ఆనవాంశ యేరాశి నవాంశ యగునో యారాశి వఱకు మేషము మొదలుకొని లెక్కింపఁగ నెన్ని యగునో యన్ని సంవత్సరా లాయు వాగ్రహ మిచ్చు ననియర్థము. ఇట్లు గ్రహ భుక్త నవాంశ రాసు లెన్ని యగునో యన్ని సంవత్సరములును వర్తమాన

నవాంశయందు గత లిప్తాదులచేతఁ త్రైరాశికము చేయఁగ వచ్చినన్ని మాస దివసాదులును. ఆయా గ్రహమునకు నాయుః ప్రమాణకాల మగును. ఆ త్రైరాశిక విధానమునుందటి శ్లోకమునందు వరాహమిహి రాచార్యులచేతఁ జెప్పఁబడుచున్నది. యీయర్థమునందు, 'రాశ్యం శక సంయోగాదాయు రిహసమానతో గ్రహో దద్యుః' అని సత్యా చార్య వచనము సత్యము. ఈచెప్పఁబడిన సత్యమతాయుర్దాయము అనేక గ్రంథకర్తలు చెప్పియుండు నాయుర్దాయమునకు సమాన మగు ననుట. అదెట్లనిన, 'ఆయూంషి రాశ్యంశక చారయోగాత్' అని యవనేశ్వరుండును జెప్పియున్నాఁడు. అయితే కొందఱు ఈసత్య యవ నేశుల వచనములకు, ఏరాశి యందు గ్రహ ముండునో యారాశి యందు నెన్ని నవాంశలు భుక్తయులైయుండునో అన్ని సంవత్సరాల నాగ్రహమిచ్చు నని యర్థము చెప్పుదురు. అపు డొక గ్రహమునకుఁ దొమ్మిదిసంవత్సరాలకు పైన నాయుర్దాయ మేర్పడదు. కాఁబట్టి యట్లు వచింపఁ గూడదు. మఱియు, "రాశ్యంశ కళాగుణితా ద్వాదశ నవభి ర్గ్రహస్య భగణేభ్యః ద్వాదశహతావశే షోబ్దమాస దిన నాడికాః. క్రమశః" అని బాదరాయణులచేతఁ జెప్పఁబడినది. కాఁబట్టి యీవచ నానుసారముగ సత్యాచార్య యవనేశ్వర వాక్యంబులకును అర్థము సే యఁదగినది. అట్లర్థముచేయఁగా నేర్పడిన తాత్పర్య మేమనిన ఏరాశి యందైనను మేషనవాంశను భుజించి యున్న గ్రహంబునకు నొకసంవ త్సరంబును, వృషభ నవాంశను భుజించియున్న గ్రహమునకు రెండు సంవత్సరాలు, మిథున నవాంశను భుజించి యున్న గ్రహమునకు మూఁ డు సంవత్సరములును, ఇట్లుత్తరోత్తర రాంశక వృద్ధిచేతఁ బండ్రెండు సంవత్సరముల వరకు నొక్కొక గ్రహమునకు నాయుర్దాయ మేర్పడు చున్నది.

సత్యోక్తే గ్రహ మిష్టం లిప్తీ కృత్వా శతద్వయే నాప్తః,
మండల భాగ విశుద్ధే బ్దా స్స్యు శ్శేషాత్తు మాసాద్యాః. 10

తా. పూర్వ శ్లోకోక్త మగు సత్యమతాయుర్దాయము దెలియఁ జేయఁబడినది. సత్యాచార్య ప్రోక్తాయు ర్దాయానయనము నందుఁ

దన క్లిష్టంబైన గ్రహమును లిప్తలు జేసి యిన్నూటిచేతఁ బాల్గొనఁగ వచ్చిన లబ్ధమును పండ్రెండు చేతఁ బాల్గొనఁగ సంవత్సరము లగును. శేషము వలన మాస దిన ఘటికాదు లేర్పడును. ఉదాహరణము:— తాత్కాలిక గ్రహభుక్త రాశ్యాదులు రా ౧-భా ౮ - లి ౪౫-వీనిని లిప్తలు చేయఁగ వచ్చిన ౨౩౨౫ ను శతద్వయము చేయ, ననఁగా ౨౦౦ చేతఁ బాల్గొనఁగ లబ్ధము ౧౧-దీనిని పండ్రెండింట భాగించుటకుఁ జాలదు కాఁబట్టి యీ ౧౧-ను సంవత్సరము లగును. శేషము ౧౨౫ ను ౧౨ ట గుణింపఁగ నైన ౧౫౦౦-ను ౨౦౦ చేతఁ బాల్గొనఁగ వచ్చిన మాసాలు ౭- శేషము ౧౦౦ను ౩౦-ట గుణించి యామూఁడువేలును ౨౦౦ చేతఁ బాల్గొనఁగ వచ్చిన దినములు ౧౫ శేషము లేదు గనుక గడియలులేవు. ఇట్లు సంవత్సరాలు ౧౧, మాస ౭, దిన ౧౫ వచ్చుచున్నది. ఇందులకు బాదరాయణవచనము. "రాశ్యంశ కళా గుణితా ద్వాదశ నవభిర్గ్రహ స్వభగణేభ్యః." అని చెప్పినట్లు గణితము చేయఁబడినది. అదెట్లనఁగ తాత్కాలిక భుక్తిరాశ్యాదులు రా ౧, భా ౮, లి ౪౫ దీనిని ప్రత్యేకముగఁ బండ్రెండుచేత గుణింపఁగ నైన మొత్తములు ౧౨ - ౯౬ - ౫౪౦ వీనిని మఱల ౯ చే గుణింపఁగ వచ్చిన మొత్తములు ౧౦౮ - ౮౬౪ - ౪౮౬౦ - దీనిలో లిప్తా సంఖ్యయగు ౪౮౬౦ - ని ౬౦ - చేతఁ బాల్గొనఁగ లబ్ధము ౮౧ - శేషము ౦ - ఈ ౮౧ - ని భాగసంఖ్యయగు ౮౬౪ లోఁ జేర్చి యీ ౯౪౫ ను ౩౦ - టఁ బాలుగొనఁగ లబ్ధము ౩౧- శేషము ౧౫ ఈ శేషము దినము లగును. లబ్ధము ౩౧ ని రాశిసంఖ్య యగు ౧౦౮-లోఁ గూడఁగ నైన ౧౩౯-ని ౧౨-టఁ బాల్గొనఁగ లబ్ధము ౧౧ - శేషము ౭-ఇవి మాసము లగును. ఈలబ్ధము ౧౧-ను బండ్రెండింట భాగించుటకుఁ జాలదు గనుక యివియే సంవత్సరము లగును. ఇట్లు సంవత్సరాలు ౧౧-మాస ౭-దిన ౧౫-మునుపువలె వచ్చినది, ఇట్లు యవనేశ్వర సత్యాచార్య బాదరాయణ మతానుసారముగ వరాహమిహిరులచేత నాయుర్దాయ నిర్ణయ క్రమము చెప్పఁబడినది.

స్వతుంగ వక్రోపగతై స్త్రిసంగుణం
ద్విరుత్తమ స్వాంశక భ త్రిభాగగైః,

ఇయాన్వి శేషస్తు భదత్త భాషితే
సమాన మన్య త్ప్రిథమే ప్యుదీరతమ్. 11

తా. ఈ యాయు ర్దాయమునకు సత్యాచార్య మతమునఁ గ్రియా విశేషమును జెప్పఁబడినది. ఎట్లనఁగ, తన యుచ్చస్థానము నొంది యున్నట్టి గ్రహముచేతను వక్రించి యున్నట్టి గ్రహముచేతను, ఈయఁబడిన యాయువు మూఁటితో గుణింపఁ దగినది. మఱియు వర్గో త్తమాంశయం దున్నట్టి గ్రహముచేతను, తన నవాంశయం దున్నట్టి గ్రహముచేతను,స్వక్షేత్రమునం దున్నట్టి గ్రహముచేతను, తన ద్రేక్కాణమునం దున్న గ్రహముచేతను ఈఁబడిన యాయు ర్దాయము రెంటితో గుణింపఁ దగినది. సత్యా చార్యోక్త మగు నీయంశాయు ర్దాయమునందుఁ నీచెప్పఁబడిన "స్వతుంగ వక్రోపగతై స్త్రిసంగుణం ద్విరుత్తమ స్వాంశక భత్రిభాగగైః" అనునది విశేషము. అన్య మగు మయ యవనాది మతముల యందు నాదియందుఁ జెప్పఁబడి యున్న శత్రుక్షేత్ర హరణాది కర్మ యును, అనఁగా నీ సత్యమతాయుర్దాయము నందును పూర్వోక్త ప్రకారమే వక్ర వర్జముగ శత్రుక్షేత్రమునం దున్నట్టి గ్రహమునకుఁ దృతీ యాంశ హరణమును, శుక్ర శని వర్జ ముగ నస్తంగత గ్రహమునకు నర్ధాంశ హరణమును, "సర్వార్ధ త్రిచ రణే" త్యాద్యుక్త మగు వ్యయాది హరణముచేసి యీశ్లోకమునందుఁ జెప్పిన ప్రకారముగ నుచ్చస్థానమునం దున్న గ్రహమునకును, వక్రించి యున్న గ్రహమునకును ఏర్పడిన యాయువును మూఁడింట హెచ్చ గుణింప వలెననియు వర్గోత్తమాంశమునందును, స్వనవాంశయం దును, స్వక్షేత్రమునందును, స్వద్రేక్కాణమునందు నున్నట్టి గ్రహము లకు నేర్పడిన యాయువు నినుమడింప వలయు ననియుం దెలియఁ దగినది.

కింత్వ త్రిభాంశ ప్రతిమం దదాతి
వీర్యాన్వితా రాశి సమంచ హోరా,
క్రూరోదయే చాప చయ స్సనాత్ర
కార్యంచ నాద్యైః ప్రథ మోపదిష్టైః. 12

తా. ముందు చెప్పిన సత్యాచార్యమతమునందు గ్రహాయుర్దాయముం జెప్పి, యింకను లగ్నాయుర్దాయమును, క్రూరోదయ హరణ నిషేధమును జెప్పఁబడినది. ఎట్లనఁగ, ఈసత్యా చార్యోక్తాయుర్దాయమునందు లగ్న నవాంశ రాశి తుల్య వర్షము లిచ్చుచున్నది. అనఁగా లగ్నమునందు నేరాశి నవాంశ జరుగుచున్నదో యారాశికిఁ బూర్వరాసు లన్నిఁటిని మేషరాశి మొదలుకొని యెంచఁగ నెన్నియగునో, యన్ని సంవత్సరములును వర్తమాన నవాంశలను లిప్తలుచేసి యాలిప్తలను ౧౨ ట గుణించి, ౨౦౦ టఁ బాల్గొనఁగ వచ్చినన్ని మాసములును, శేషమును, ౩౦ ట గుణించి, ౨౦౦ ట బాల్గొనఁగ వచ్చిన వన్నిదినములును, ఆ శేషమును ౬౦ట గుణించి ౨౦౦టఁ బాల్గొనఁగ వచ్చిన వన్ని గడియలును లగ్నాయుర్దాయ మగును. ఈలగ్నాయుర్దాయము, "సత్యోక్తే గ్రహ మిష్టం లిప్తీకృత్వా" అని గ్రహములకుఁ జెప్పిన ప్రకారము వచ్చుచున్నది. "వీర్యాన్వితా హోరాస్వామి గురుజ్ఞవీక్షిత యుతా నాన్యైశ్చ వీర్యోత్కటా" అని చెప్పఁబడిన ప్రకార మాలగ్నము బల యుక్త మైయుండెనేని, లగ్న రాశి సమాన వర్షముల నిచ్చుచున్నది. అదెట్లనఁగ, లగ్నరాశికిఁ బూర్వరాసులను మేషరాశి మొదలుకొని లెక్కింపఁగ నెన్ని యగునో, యన్ని సంవత్సరములును, లగ్నమునందు భుక్త భాగాదులను, లిప్తలుచేసి యాలిప్తలను ౧౨ ట గుణించి, ౧౮౦౦ ట పాల్గొనఁగ వచ్చినన్ని మాసములగును. ఆ శేషమును ౩౦ ట గుణించి, ౧౮౦౦ ట పాల్గొనఁగ వచ్చినన్ని దినములును, ఆ శేషము ౬౦ గుణించి, ౧౮౦౦ ట పాలుగొనఁగ వచ్చినన్ని గడియలును లగ్నాయుర్దాయ మగుచున్నది. లగ్నము బలహీనమై యుండెనేని, "భాంశ ప్రతి మం దదాతి" అనిన న్యాయమున నేనవాంశ రాశిసమముగ లగ్నాయుర్దాయము తేఁదగినది. లగ్నమునందుఁ బాప గ్రహ ముండెనేని, "సార్థోదితోదిత నవాంశ హతాత్సమస్తాత్" అని మయ యవనుల మతాయుర్దాయమునందుఁ జెప్పఁబడి యున్నట్టి క్రూరోదయ హరణ మీసత్యాచార్య మతాయుర్దాయమునందు లేదు. మొట్టమొదట చెప్పిన "అబ్దే నవతిథి విష యాశ్వి భూత రుద్రైః" ఇత్యాద్యుక్త మయ యవనా ద్యాయు ర్వత్సరంబుల

చేతను, "గ్రహాదాయం పరమాయుష స్స్వరాశౌ" అని జీవశర్మగారి మతాయుర్వత్సరములచేతను జేయంబడిన త్రైరాశిక మీసత్యాచార్యుల మతాయుర్దాయమునందును లేదు. మఱికొందఱు మొట్ట మొదట చెప్పిన ప్రకారములగు మయ యవనాద్యుక్త వర్షములచేతను, జీవశర్మోక్త వర్షములచేతను ఆయుర్దాయముచేయఁ దగినది కాదనియు, "సత్యోక్తే గ్రహమిష్టం" అనెడు న్యాయమున నాయుర్దాయమును జేయఁదగిన దనియుఁ జెప్పుదురు. అట్లు భట్టోత్పలుండు పూర్వోక్తాయుర్దాయమును నిషేధింప లేదు, పక్షాంతరముగ నంగీకరించి వ్యాఖ్యానము చేసి యున్నాఁడు.

సత్యోపదేశో వరమత్ర కింతు
కుర్వం త్యయోగ్యం బహువ ర్గణాభిః,
ఆచార్య కం త్వత్ర బహుఘ్నతాయా
మేకంతు యద్భూరిత దేవ కార్యమ్. 13

తా. ఇట్లు వరాహమిహిరాచార్యులవారు, మయ మణిత్థాది మతములను, జీవశర్మగారి మతమును, సత్యమతము నుపన్యాసంబొనర్చి, యీ మూఁడు మతములయందు, సత్యాచార్యులవారి మతము నంగీకరించి అందు బహువర్గణలను నిషేధించినవారై, సత్యాచార్యుల వారి మతాయుర్దాయమును గొందఱు పెక్కు గుణనలచేత నయోగ్యమైన దానినిగాఁ జేయు చున్నారనుట. ఎట్లనఁగా, "స్వతుంగ వక్రోపగతై స్త్రిసంగుణం" అను న్యాయమున, స్వోచ్చమునం దున్న గ్రహమునకు నాయుర్దాయమును, త్రిగుణముచేసి, యాగ్రహమే వక్రించి యుండెనేని మఱలఁ ద్రిగుణ మొనర్చి, ఆగ్రహమే స్వక్షేత్రమునం దుండెనేని మఱల ద్రిగుణముచేసి, ఆగ్రహమే స్వనవాంశ యందుండెనేని మఱల ద్విగుణముచేసి, ఆగ్రహమే ద్రేక్కాణమునం దుండెనేని మఱల ద్విగుణముచేసి, ఈప్రకారము సత్యమతాయుర్దాయమును బహుగుణనలచేతఁ జెఱుచు చున్నారని తలంచ వలయును. అయితే యేమిచేయ వలయు ననఁగ, అనేకము లైన ద్విగుణత్వ త్రిగుణత్వములు ప్రాప్తములైనచో, వాని యందు నేది యధిక మైనదో యాగుణన మొక్కటియ

చేయఁదగినది. ఇది పూర్వ గ్రంథ రచనాచార్య సంప్రదాయసిద్ధ మైనది. అదెట్లనఁగ, ఒకగ్రహమునకు స్వక్షేత్ర ద్విగుణత్వమును స్వనవాంశ ద్విగుణత్వమును ప్రాప్తించినచో నొకతూరి ద్విగుణము చేయఁదగినది. ఒకద్విగుణత్వము నొక త్రిగుణత్వమును ప్రాప్తించెనేని, ఆరెంటిలో నధికముగ నున్న త్రిగుణము మాత్రమే చేయఁ దగినది. ఒక గ్రహమునకు రెండు త్రిగుణత్వములు సంభవించెనేని యొక సారి మాత్రమే త్రిగుణము చేయఁదగినది. ఈప్రకారమే చక్రపాత హరణముగాక తక్కిన హరణములలో ననేక విధము లగుహరణములు. ఒక గ్రహమునకు సంభవించెనేని వానిలో నధికమైన హరణ మొకటి మాత్రమే చేయఁ దగినది. అదెట్లనిన, ఈసత్యాచార్య మతమునందును నీచస్థిత గ్రహమునకు, నర్ధాంశ హరణము గలదు గనుక యొక గ్రహము నీచక్షేత్ర గతమును;శత్రుక్షేత్ర గతమును, అస్తంగతమును నై యుండెనేని యొక యర్ధాంశ హరణము మాత్రము చేయఁ దగినది. ఇటు లొక గ్రహమునకుఁ గొన్ని హరణములును, గొన్ని గుణనములును సంభవించెనేని, అందు నధికమైన యొక హరణమును జేసి పిదప నధికమైన నొక గుణనము చేయఁ దగినది. చక్రపాత హరణమును శత్రుక్షేత్రాది హరణము నుచ్చాది గుణమును ప్రాప్తించెనేని మొదట చక్రపాత హరణముచేసి, పిదప శత్రుక్షేత్రాది హరణములలో నధికమైన యొక హరణము చేసి, పిదప నధికమైన గుణనం బొకటి చేయఁదగినది. ఇందులకు, "రాశి తుల్యాంశ సంఖ్యాని గ్రహోవర్షాణి యచ్ఛతి, లగ్నం చేత్సబలం తాని భుక్తరాశి సమానితు, మాసా ద్యానయనం కార్యా, మనుపాతా దతఃపరం, సర్వార్థ త్రి చతుర్ధాంశాన్ వామం పంచ షడంశకాన్, హరంతి పాపా స్సవ్యద్వాయా త్తదర్ధ మితరే గ్రహాః, వ్యయాచ్చక్రాపహానిస్తు కథితే యం తథా ధ్రువమ్, ఏక స్త్వేకర్క్ష గే ష్వేవ కరోతి బలవాన్ గ్రహః, శత్రుక్షేత్ర గతస్త్ర్యంశం నీచేర్ధం సూర్యగస్తథా, హంతి స్వదాయా ద్రవిగా వసి తాదిత్య నందనౌ, నచావని సుతశ్శాంతం శత్రుక్షేత్ర గతస్తథా,ధ్రువాపహానిః కర్తవ్యా తతోన్యా సుబహుష్వపి,ప్రాప్తా స్త్వేకైవ కర్తవ్యా యాసాస్యా త్తాసుమహత్తరా, తతస్తు గుణనా కార్యా స్త్వేకైవ మహతీసకృత్,ద్వాభ్యాం వర్గోత్తమే

స్వాంశే స్వద్రేకాణే స్వకే గృహే, త్రిభి ర్వక్ర గతస్యాథ సోచ్చ రాశి గతస్యచ, గ్రహదాయో భవత్యేవం శోధ్యక్షేపకృతః క్రియః" అని గార్గిచేఁ జెప్పఁబడినది. ఇక్కడ వరాహమిహిరాచార్యులచేత సత్యాచార్య మత మైన అంశాయుర్దాయము ప్రధానముగ నంగీకరింపఁ బడినప్పటికిని మణిత్థాదులు, "విలగ్నభే బలోపేతే శుభదృష్టేంశ సంభవః, రవౌ పిండోద్భవం కుర్యా దితి బ్రూయు శ్చిరం తనాః" అని చెప్పియుండుటంజేసి, జన్మ లగ్నము బలయుక్తమై యుండెనేని అంశాయుర్దాయమును జన్మకాలమునందు సూర్యుఁడు బలాధికుం డై యుండెనేని మరియ యవనా ద్యుక్తమైన పిండాయుర్దాయముం జేయఁ దగినదని భట్టోత్పలుని చేతఁ దెలియఁ జేయఁబడినది. కొందఱీయంశాయుః పిండాయువులను రెంటిని యేర్పఱచి యారెంటిలో నేది యల్పాయువు గలదై యుండునో దాని కడపటి అంతర్దశ మూలదశాధిపతికి మిత్ర గ్రహాంతర్దశ యాయెనేని, ఆపిమ్మట గూడ జీవించుననియు, శత్రుగ్రహాంతర్దశ యాయెనేని యపుడ మరణము గల్గు ననియు, మధ్య గ్రహాంతర్దశ యాయెనేని శరీర పీడ గల్గు ననియుం జెప్పుదురు.

గురు శశి సహితే కుళీర లగ్నే
శశితనయే భృగుజేచ కేంద్ర యాతే,
భవ రిపు సహజోపగైశ్చ శేషై
రమిత మిహాయు రనుక్రమా ద్వినా స్యాత్. 14

తా. అపరిమి తాయు ర్యోగము చెప్పఁబడినది. అదెట్లనఁగ, జన్మలగ్నమైన కర్కాటకము గురు చంద్రులతోఁగూడి యుండఁగా, బుధ శుక్రులు కేంద్ర స్థానముల నుండఁగా-౧౧-౬-౩ ఇండ్ల నున్నట్టి రవి కుజ శనులచేత నీయోగమునందుఁ బుట్టిన వానికి గణిత క్రమ మతిక్రమించి యపరిమితమగు నాయువు కల్గును. కాఁబట్టి యిట్టి యోగమునందుఁ బుట్టిన వానికి నాయుర్దాయ గణనసేయం బనిలేదని తెలియఁదగినది.

ఇట్లు బృహజ్జాతకమునందు నెనిమిదవదగు
నాయుర్దాయాఽధ్యాయము సంపూర్ణము.

---

## దశాంతర్దశాధ్యాయము.





మూ. ఉదయ రవి శశాంక ప్రాణి కేంద్రాది సంస్థాః
ప్రథమ వయసి మధ్యేం త్యేచ దద్యుః ఫలాని,
నహీన ఫల విపాకః కేంద్ర సంస్థాద్య భావే
భవతిహి ఫల పక్తిః పూర్వ మాపోక్లి మేపి. 1

తా. ఈ వరాహమిహిరాచార్యులవారిచే మొట్టమొదటి యధ్యాయమునందుఁ జెప్పఁబడిన ప్రకారము జాతకులకుఁ గల్గు సుఖదుఃఖాదులు దశాంతర్దశలు ఈ యధ్యాయమునందుఁ జెప్పఁబడినవి. అదెట్లనఁగ, లగ్న రవి చంద్రులయందుఁ బ్రబలాధిక గ్రహ దశ ప్రథమ దశయగును. ఆ ప్రథమదశానాథునకు ౧-౪-౭-౧౦ ఈ కేంద్రస్థానములయందును, ౨-౫-౮-౧౧ ఈపణ పర స్థానముల యందును, ౩-౬-౯-౧౨ ఈయాపోక్లిమ స్థానముల యందును, ఉన్నట్టి గ్రహములు క్రమముగఁ బ్రథమ వయస్సు నందును, మధ్య వయస్సునందును, అపర వయస్సు నందును, తమ తమ దశాఫలముల నిచ్చుచుందురు. మఱియుఁ బ్రథమ దశాధిపతికి కేంద్రస్థానములయందు గ్రహములు లేకుండినను బ్రథమ వయస్సునందు ఫలపరిపాకము లేకపోదు. ఫణ పర స్థానములయందు గ్రహములు లేకుండినను మధ్య వయస్సునందు ఫలపరిపాకము లేకపోవుటలేదు. మఱెట్లనిన:— కేంద్ర ఫణపర స్థానములయందు గ్రహము లేకుండినచోఁ బ్రథమ వయస్సునందు నాపోక్లిమ స్థానమునందున్నట్టిగ్రహములకును ఫలపరిపాక మగుచున్నదిగదా? అనఁగా, లగ్నమునకు శరీర మనియు, సూర్యునకు నాత్మ యనియుఁ, జంద్రునకు మన స్సనియు సంజ్ఞలు. కాఁబట్టి, యా సూర్య చంద్ర లగ్నముల యందు లగ్నము బలాధికం బై యుండెనేని యాలగ్నమునకును, సూర్యుఁడు బలాధికుం డై యుండెనేని సూర్యునకును, చంద్రుఁడు బలాధికుం డై యుండెనేని చంద్రునకును, ప్రథమ దశను గల్పించి యాప్రథమ దశానాథునకుఁ గేంద్రముల యందున్నట్టి గ్రహములకు బలాధిక క్రమమున దశలు కల్పింపఁదగినది. పిదపఁ బ్రథ

మ దశాధిపతికి ఫణ పర స్థానముల యందున్న గ్రహములకును బలాధిక గ్రహముదశలు కల్పింపఁ దగినది. ఆవలఁ బ్రథమ దశాధిపతికి నాపోక్లిమ స్థానముల యందున్నట్టి గ్రహములకును బలాధిక క్రమమున దశలు కల్పింపఁ దగినది. కేంద్రస్థానములయందు గ్రహములు లేకుండెనేని ప్రథమ వయస్సునందు ప్రథమ దశానంతరము ఫణపరస్థానములయందున్న గ్రహములకు దశలు కల్పింపఁదగినది. కేంద్రముల యందును ఫణపరముల యందును గ్రహములు లేకుండినచో, నాపోక్లిమ స్థానముల యందున్న గ్రహములకే దశలు కల్పింపదగినది. కేంద్రములయందు నాపోక్లిమ స్థానములయందును గ్రహములుండి పణఫర స్థానముల యందు గ్రహములు లేకుండిన పక్షమునం గేంద్రముల యందుండు గ్రహములకుబలాధిక క్రమమున దశలు కల్పించి పిదప నాపోక్లిమ స్థానముల యందున్నట్టి గ్రహములకు కల్పింపఁదగినది. ఇందులకు, "లగ్నార్క శశాంకానాం యోబలవాం స్తద్దశాభవే త్ప్రథమా, తత్కేంద్ర పణఫర రాపో క్లిమో పగానాం క్రమాచ్ఛేషాః" అని లఘు జాతక గ్రంథమునందుఁ జెప్పఁబడినది.

ఆయుః కృతం యేనహి య త్త్ర దేవ
కల్ప్యా దశా సాప్రబల స్యపూర్వం,
సామ్యే బహూనాం బహువర్ష దస్య
తేషాంచ సామ్యే ప్రథ మోదితస్య. 2

తా. ఈశ్లోకమున దశాకాల ప్రమాణమును, కేంద్రాది స్థానగత గ్రహముల దశాక్రమమును జెప్పఁబడినది. అదెట్లనఁగ, ఆయుర్దాయా ధ్యాయమునందుఁ జెప్పఁబడిన విధముగ, నేగ్రహమునకు శోధ్యక్షేప విశుద్ధ మగునాయు వెంత యేర్పడు చున్నదో, యంత కాలమా గ్రహదశ యని యెఱుంగ వలయును. ఆదశ, బలాధికునకుం బ్రథమ దశయగును. అనఁగా లగ్న రవి చంద్రులలో బలాధికుం డైన వానికిఁ బ్రథమ దశఁ గల్పించి, యాప్రథమ దశాధి పతికిఁ గేంద్రస్థానముల యందు నున్నట్టి గ్రహములలో నధిక బలాధికుఁ డగు గ్రహమునకుం దదనంతర దశను గల్పించి యాగ్రహముకంటెఁ దక్కువ

బలముతోఁ గేంద్ర గతుఁ డగు గ్రహమునకుం దదనంతర దశను గల్పింపఁ దగినది. ఇట్లు కేంద్రస్థానముల యందుండు నట్టి గ్రహముల కందఱకును దశలు కల్పించి పిదప నీవిధముగ పణఫరస్థానముల యం దున్న గ్రహములకును, ఆపోక్లిమ స్థానముల యందున్నట్టి గ్రహములకును బలాధికమున దశలు కల్పింపఁ దగినది. ఆ కేంద్రాది స్థానముల యందున్నట్టి యనేక గ్రహములకు బల సామ్యము గల్గుచుండఁగా, నాగ్రహములయందు నేగ్రహ మాయుర్దాయ సంవత్సరముల నధికముగ నిచ్చునో, యాగ్రహమునకు ముందట దశకల్పింపఁ దగినది. ఆ యాయు ర్దాయ వత్సరములకును సమత్వము గల్గుచుండఁగా నేగ్రహము సూర్యమండలమున నుండి మొదట నుదయించి యుండునో, యాగ్రహమునకు ముందర దశను గల్పింపఁ దగినది. ఇందులకు, "బలీ లగ్నేందు సూర్యాణాం దశా మాద్యాం ప్రయచ్ఛతి, తస్మాత్తతః ప్రయచ్ఛంతి కేంద్రాది స్థాః క్రమేణతు. తత్రాతు బలినః పూర్వం తత్సామ్యే బహు దాయకాః, తత్సామ్యేపి ప్రయచ్ఛంతి యేపూర్వం రవి విచ్యుతాః" అని గార్గిచేఁ జెప్పఁబడినది.

ఏకర్క్ష గోర్ధ మపహృత్య దదాతితుస్వం
త్య్రంశం త్రికోణ గృహగః స్మరగ స్స్వరాంశం,
పాదం ఫలస్య చతురస్ర గతస్సహోరా
స్త్వేవం పరస్పర గతాః పరిపాచ యంతి. 3

తా. ఏర్పడిన మహాదశ యందు నంత ర్దశా పాక క్రమము చెప్పఁబడినది. ఎట్లనఁగా, మూల దశాసంవత్సరముల యందుఁ దత్కాల గ్రహస్థితిని బట్టి ముందు మూలదశాధిపతికి భాగ కల్పన చేసి పిదప మూల దశాధిపతికి వచ్చిన యంతర్దశాసంవత్సరమునకు సమముగ నర్ధాది భాగము లేక రాశ్యాదిగత గ్రహములకుఁ గల్పింప దగినది. మూలదశాధిపతితోఁ గూడ నొక రాశి యందున్నట్టి గ్రహము మూల దశాధిపతి దత్త్రాంతర్దశాకాలములో నర్ధాంశ కాలమును మూలదశా సంవత్సరముల వలన నపహరించి తన దశాఫలము నొసంగును. మూలదశాధిపతికి నవమ పంచమములయం దున్నట్టి గ్రహము మూల

దశాధిపతి దత్తాంతర్దశా కాలములోఁ దృతీయాంశ కాలమును మూల దశా వర్షముల వలన నపహరించి తన దశాఫలము నిచ్చును. మూల దశాధిపతికి సప్తమమున నున్న గ్రహము మూలదశాధిపతికి దత్తాంత ర్దశా కాలములో సప్తమాంశ కాలమును మూలదశా వర్షలముచేత నపహరించి తన దశాఫల మొసంగును. మూల దశాధిపతికిఁ జతుర్థా ష్టమముల యందున్నట్టి గ్రిహము మూలదశాధిపతి దత్తాంత ర్దశాఫల కాలమునందుఁ జతుర్థాంశ కాలమును మూలదశా సంవత్సరముల వలన నపహరించి తనదశాఫలము నిచ్చును.ఇట్లు లగ్నసహితము లగు గ్రిహ ములు. అనఁగా—లగ్నమున గ్రహములు నొకరి కొక్కరు పూర్వో క్తస్థానములయందుండి తమతమ దశాగుణములచేత మూలదశాకాల మును బరిపాకము సేయును.ఏకరాశ్యాదిగత గ్రహముల వలెనే లగ్నము నేకరాశ్యాదిగతమైన దగుచుం బూర్వోక్త భాగముల నపహరించి తనద శాఫలము నిచ్చునని తెలియఁ దగినది. ఈచెప్పఁబడిన స్థానములయందు నేస్థానమునందైన రెండుమూఁడు గ్రహములుండెనేని, యందుబలాధిక మగు నొకగృహమునకే, అంతర్దశా కల్పన చేయఁదగినదిగాని యితర గృహములకుఁ జేయఁదగదు. ఇందులకు,"ఏకర్క్షోపగతా నాంయోభవతి బలాధికో విశేషేణ, ఏక స్సఏవ హర్తా నాన్యే తత్ర స్థితాశ్చ హర్తా రః. ఏకర్క్షగేషు బలవాణ్ భాగహరో మిత్రతో రిపోర్వాపి, మిత్రంచ పుష్కల ఫలం తస్మిణ్ కాలే రిపో రైన్నవమ్" అని యముండును సత్యా చార్యుండును వచించియున్నారు. కాఁబట్టి లగ్నమునకు నంశహారి త్వము గల్గి యుండఁగా నాలగ్నమునందు గ్రహ ముండెనేని, యీాల గ్నగ్రహములలో బలాధిక మగు గ్రహమునకు నంత ర్దశాభాగకల్పన చేయఁ దగినది. మఱి కొంద ఱొకస్థానమునందు నెన్ని గ్రహము లుండునో, యన్ని గ్రహములకు నాస్థానమునందుఁ గల్గి యున్న యొక భాగమునే విభజించి యంతర్దశాకల్పనచేయఁ దగిన దని చెప్పెదరు.

స్థానాన్యథైతాని సవర్ణ యిత్వా
సర్వాణ్యథశ్ఛేద వివర్జితాని,
దశాబ్దపిండే గుణనా యథాంశం
ఛేద స్తదైక్యేన దశా ప్రభేదః. 4

తా. అంతర్దశా విభాగ మొనర్చుటకు గణితము చెప్పఁబడినది. ఎట్లనఁగా:—పూర్వ శ్లోకము నందుఁ జెప్పఁబడిన అర్ధాంశ, తృతీయాంశ, సప్తమాంసాది స్థానములను సమభాగములు చేసి, యందుఁ గ్రిందనున్నట్టి భేదసంఖ్యలను తొలఁగించివేసి మీఁద నున్న సకల స్థానములను వేర్వేఱుగ మూలదశా సంవత్సరాదులచేత గుణించి భేద సంఖ్యా విహీనము లగు మీఁద నున్నట్టి సంఖ్యల నన్నిటి నొక్కటిగఁ గూడి, యా మొత్తముచేతఁ బాల్గొనఁగ నేకరాశ్యాదిగతగ్రహముల నంతర్దశా కాలములు యథాంశముగ వచ్చునని యెఱుంగునది. ఉదా. మూలదశానాథునకుఁ జతురశ్రము లగు చతుర్థాష్టమ స్థానముల యందు గ్రహము లుండి మూలదశాధిపతి యున్నట్టి రాశి యందును త్రికోణ సప్తములయందును గ్రహము లేకయుండఁగ న్యాసము.

| | | |
|---|---|---|
| ౧ | ౧ | ౧ |
| ౧ | ౪ | ౪ |

వీనిని సమచ్ఛేదములు చేయఁగ వీనియందుఁ గ్రింద నుండు భేద సంఖ్యల త్రోసివేయఁగా ౧౬-౪-౪ నిల్చును. ఈసంఖ్యల నొక్కటిగఁగూడిన మొత్తము ౨౪ మూలదశావర్షములు ౬ యీ యాఱుచేతఁ బ్రథమస్థానమునం దున్నట్టి

| | | |
|---|---|---|
| ౧౬ | ౪ | ౪ |
| ౧౬ | ౧౬ | ౧౬ |

౧౬ ను గుణింపఁగా వచ్చిన ౯౬ ను మొట్టమొదట మొత్తముచేసి యున్న ౨౪ చేతఁ బాల్గొనఁగ మూలదశాధిపతికి వచ్చిన అంతర్దశా సంవత్సరములు ౪ మఱల మూలదశావర్షములు ౬ చేత ద్వితీయ స్థానమునం దున్నట్టి ౪ ను గుణింపఁగ వచ్చిన ౨౪ ను మొటమొదట యేకీకృతంబై యున్న ౨౪ చేతఁ బాల్గొనఁగ మూల దశాధిపతికిఁ జతుర్థ స్థానమునం దున్న గ్రహమునకు వచ్చిన యంతర్దశా సంవత్సరము ౧, మఱల మూల దశావర్షములు ౬ తోఁ దృతీయస్థానమునం దున్న ౪ గుణింపఁగ వచ్చిన ౨౪ ను మొదట యేకీకృతంబైన ౨౪ చేతఁ బాల్గొనఁగ మూలదశాధిపతి కష్టమమునం దున్నట్టి గ్రహమునకు వచ్చిన అంతర్దశాసంవత్సరము ౧ ఈ మువ్వురి యంతర్దశాసంవత్సర

ములం గలయఁగూడఁగ నాఱేండ్లగును. ఇవియ మూల దశా సంవత్సర ములు. మఱియొక యుదాహరణము. మూల దశాధిపతికి రూపము ౧ మూల దశాధిపతితోఁ గూడిన యేకరాశి యందుండు గ్రహమునకు రూపార్థము ౨. మూలదశాపతికి త్రికోణ స్థానములైన నవమపంచమములలో నొకస్థానమునందున్న గ్రహమునకు రూప తృతీయాంశము౩. చతురశ్రములగు చతుర్థాష్టమములలోనొక స్థానమునందున్న గ్రహమునకు రూపచతుర్థాంశము ౪ మూలదశాధిపతికి సప్తమస్థానమునందున్నట్టి గ్రహమునకు రూప సప్తమాంశము ౭ వీనికి న్యాసము.

| | | | | |
|---|---|---|---|---|
| ౧ | ౧ | ౧ | ౧ | ౧ |
| ౧ | ౨ | ౩ | ౪ | ౭ |

వీని యందుఁ గ్రింద నున్నట్టి భేద సంఖ్యలను ద్రోసివేయఁగ ౧౬౮-౮౪ ౫౬-౪౨-౨౪ ఉన్నవి. వీనిని గలయఁ గూడఁగ వచ్చిన మొత్తము ౩౭౪. మూల దశావర్షములు ౧౨. ఈ పండ్రెండుచేతఁ బ్రథమసంఖ్య యగు ౧౬౮ ని గుణింపఁగ వచ్చిన ౨౦౧౬ ను మొదట మొత్తముచేసియున్న ౩౭౪ చేతఁ బాల్గొనఁగ మూల దశాధిపతికి వచ్చిన, అంతర్దశా సంవత్సరాలు ౫ మాస ౪ దిన ౨౦ ఘడి ౩౨ విఘడి ౫ మఱల మూల దశాసంవత్సరాలు ౧౨ చేత ద్వితీయ సంఖ్యయగు ౮౪ను గుణించి ఆ ౧౦౦౮ని మొదట మొత్తముచేసి యున్న ౩౭౪ చేతఁ బాల్గొనఁగ మూల దశాధిపతితోఁగూడి యేకరాశి గతంబై యున్న గ్రహమునకు వచ్చిన అంతర్దశాసంవత్సరాలు ౨ మా ౮ దిన ౧౬ ఘడి ౧౬ విఘ ౨ మఱల మూల దశావర్షములు పండ్రెండుచేతఁ దృతీయ సంఖ్యయగు ౫౬ ను గుణించి యా ౬౭౨ ను మొదట మొత్తముచేసియున్న ౩౭౪చేతఁ బాల్గొనఁగ మూలదశాధిపతికిఁ ద్రికోణస్థానమునందున్న గ్రహమునకు వచ్చిన అంతర్దశా సంవత్సరాలు ౧ మా ౯ దిన ౧౬ ఘడి ౫౦ విఘ ౪౧ మఱల మూల దశా సంవత్సరాలు పం

| | | | | |
|---|---|---|---|---|
| ౧౬౮ | ౮౪ | ౫౬ | ౪౨ | ౨౪ |
| ౧౬౮ | ౧౬౮ | ౧౬౮ | ౧౬౮ | ౧౬౮ |

డ్రెండుచేతఁ జతుర్థసంఖ్య యగు ౪౨ ను గుణించి ఆ ౫౦౪ ను మొదట మొత్తము చేసియున్న ౩౭౪ చేతఁ బాల్గానఁగ మూలదశాపతికిఁ జతురశ్రమునందున్న గ్రహమునకువచ్చిన అంతర్దశా సంవత్సరాలు ౧ మా ౪ దిన ౫ ఘ ౮ వి ౧ మఱల మూలదశావర్షములు పండ్రెండుచేత బంచ సంఖ్య యగు ౨౪ ను గుణించి ఆ ౨౮౮ ని పండ్రెండింట గుణించి మాసములు చేసి వానిని మొదట మొత్తముచేసియున్న ౩౭౪ చేతఁ బాల్గానఁగ మూలదశాధిపతికి సప్తమమునందున్నట్టి గ్రిహమునకు వచ్చిన యంతర్దశాసంవత్సరాలు ౦ మా ౯ దిన ౭ ఘడి ౧౩ విఘ ౯ ఇట్లు వచ్చినయంతర్దశాలు వివరణము. మూలదశాధిపతికి...సంవ ౫ మా ౪ దిన ౨౦ ఘ ౩౨ విఘ ౫. ఏకరాశి గ్రిహగతమునకు...సంవ ౨ మా ౮ దిన ౧౦ ఘ ౧౬ విఘ ౨. త్రికోణమున నున్న గ్రిహమునకు సం ౧ మా ౯ ది ౧౬ ఘడి ౫౦ విఘ ౪౧. చతురశ్రిమమున నున్న గ్రిహమునకు సంవ ౧ మా ౪ ది ౫ ఘడి ౮ విఘ ౧. సప్తమమున నున్న గ్రిహమునకు సంవ ౦ మా ౯ ది ౭ ఘడి ౧౩ విఘ ౯ విడువఁ బడిన యల్పశేషము వలన వచ్చినది. విఘ ౨ మొత్తము సం ౧౨ మా ౦ ది - ౦ - ఘ - ౦ - విఘ - ౦ ఇవి మూలదశాసంవత్సరాలు, ఇట్లు తత్తద్గ్రిహస్థితిని బట్టి తత్తద్గ్రిహదశా కాలానుసారముగ నంతర్దశలు విభజింప వలయును. మఱియు నంతర్దశా వర్షా ద్యానయన క్రమమును సులభశైలి మార్గమునఁ బూర్వ వ్యాఖ్యాతలు తెలియఁ జేసిన విధ మెట్లనఁగ.— "రవి ౪౨ రర్థ హాతశ్చేదో హారి ౨౮ స్త్ర్యం శాపహారిణః, సప్తాపహారిణో రూపం ౧౨ చాతు ర్భాగ హృతః కరః. ౨౧ యావం తోపహారం త్యాయు స్తావచ్ఛేదై ర్ధ్వజా ౮౪ న్వితైః, ధ్వజసంఖ్యా ౮౪ హతా పిండ దశా మూల దశోచ్యతే. ద్వి ౨ త్రి ౩ సప్త ౭ చతుర ర్భక్త హృతా దంతర్ద శోచ్యతే." అను నీక్రమహానం దొల్లింటివలె నుదాహరణమే ప్రదర్శింపఁ బడుచున్నది. మూలదశా సంవత్సరాలు ౧౨ ఈసంఖ్యను (ధ్వజహతా ౮౪) చేత గుణింపఁగ వచ్చినది. ౧౦౦౮ అర్థాంశహారి యైన గ్రహమునకు, రవిః ౪౨. తృతీయాంశంబైన గృహమునకు, హారిః ౨౮. సప్తమాంశ హారియైన గ్రహమునకు, రూపం ౧౨ చతుర్థాంశ హారియైన గ్రహమునకు, కరః ౨౧.

వీనిని గూడఁగా వచ్చిన మొత్తము ౧౦౩ ఇందులో, "ధ్వజాన్వితైః" ౮౯ ను గూడఁగా ౧౯౨ అగును. ఈ ౧౯౨ చేత ధ్వజహత మూల దశావర్ష సంఖ్యయగు ౧౦౦౯ ని పాల్గొనఁగా, మూల దశాధిపతికి వచ్చిన యంతర్దశా సంవత్సరాలు ౫ మా ౮ ది ౨౦ ఘడి ౩౨ విఘ ౫ వీనిని "ద్విత్రి సప్త చతు ర్భ క్తః" అనిన విధముగ ౨ రెండుతోఁ బాలుగొనఁగ మూలదశాధిపతితోఁ గూడ నేకరాశి నున్న గ్రహము నకు వచ్చిన అంతర్దశా సంవత్సరాలు ౨ మా ౭ ది ౧౦ ఘ ౧౬ వి ౨ ఆమూల దశాపతి దత్తాం తర్దశావర్షాదుల మూఁడుతోఁ బాల్గొ నఁగఁ ద్రికోణమునం దున్నట్టి గ్రహమునకు వచ్చిన అంత ర్దశాసంవత్స రాలు ౧ మా ౬ దిన ౧౬ ఘ ౫౦ వి ౮౧ ఆమూల దశాంత ర్దశా వర్షాదులనే ౨ట పాల్గొనఁగ సప్తమమునం దున్న గృహమునకు వచ్చిన యంతర్దశా సంవత్సరాలు-౦-మా-౬-ది-౨-ఘడి-౧౩-వి-౬ ఆమూల దశాంత ర్దశా వర్షాదులనే నాలుగింట పాల్గొనఁగఁ జతురశ్రమ మం దున్న గ్రహమునకు వచ్చిన యంతర్దశా సంవత్సరాలు ౧-మా-౮-దిన-౫-ఘ-౭-వి-౧-ఈప్రకారముగ నంత ర్దశా కాల విభాగము చేయఁ దగినది. ఇవ్విధమున యంతర్దశా పాచకు లనేకులు సంభవించిన పక్షమున మొ ట్టమొదట మూల దశాధిపతికి నంత ర్దశ నిచ్చి పిదపఁ బూర్వోక్త దశావిభాగ క్రమమున నాయా గ్రహములకు నంత ర్దశల నీయఁ దగి నది. ఒకా నొక దశా పాచక గ్రహమునకు నంత ర్దశాపాచకత్వము సంభవించక పోయిన పక్షమున నాగ్రహమును విడిచి, ఆమీఁద నేగ్ర హమునకు దశా పాచకత్వము గల్గి యుండునో యాగ్రహమునకు నం త ర్దశ నీయవలయును. మఱికొందఱు మొట్టమొదట మూల దశాధి పతికి నంతర్దశ నిచ్చి పిదప నేకరాశి నున్న గ్రహమునకును, పిదపఁ ద్రికోణస్థిత గ్రహమునకును. అనంతరము చతురశ్రమ మందున్న గ్రహమునకును, పిదప సప్తమందున్న గ్రహమునకును, అంత ర్దశల నిత్తురు; అది యుక్తము గాదు. "ఆదావంతర్దశా పాకోభవత్యేవ దశా పతేః. తతః పరంతు వక్తవ్యం దశాపాత క్రమేణతు." అని గర్గముని చేతఁ జెప్పఁబడినది. కాఁబట్టి దశా విభాగక్రమముననే, అంతర్దశా విభాగము చేయఁ దగినది.

సమ్యగ్బలిన స్స్వతుంగ భాగే
సంపూర్ణా బల వర్జితస్య రిక్తా,
నీచాంశ గతస్య శతృ భాగే
జ్ఞేయా నిష్ట ఫలాదరా ప్రసూతౌ. 5

తా. ఈదశాంతర్దశలయొక్క శుభాశుభ ఫలములఁ జెప్పుటకు ఫలానురూపము లగు కొన్ని సంజ్ఞలు జెప్పఁబడినవి. ఎట్లనఁగ, జన్మ సమయమునందు బాగుగఁ బూర్వోక్తములగు స్థానాది సకల బలము లతోఁ గూడియున్నట్టి తనపరమోచ్చ భాగమునం దున్నట్టి గ్రహదశ సంపూర్ణ దశయనం బడును. పరమోచ్చ గతగ్రహ మితర బలవర్జిత మై యుండినప్పటికిని ఆగ్రహదశను సంపూర్ణదశ యనంబడును. కేవల ముచ్చరాశి యందుండి కించ ద్బలసహితమై యున్న గ్రహదశ పూర్ణ దశ యనంబడును. సంపూర్ణ దశాంతర్దశా కాలములయందు శరీరా రోగ్య ధనసమృద్ధ్యాదులచేతఁ బురుషుం డభివృద్ధి నొందును. పూర్ణ దశయందును నారోగ్య ధనసమృద్ధ్యాదులు గల్గును. స్థానాది బలరహిత మైన గ్రహదశ రిక్తదశయనఁబడును. ఈరిక్త దశ ధననాశము గలుగఁ జేయును. తన నీచాంశను బొందియున్నట్టి శత్రునవాంశ యందున్నట్టి గ్రహదశ యనిష్టదశ యనంబడును. యనిష్ట దశాంతర్దశా కాలముల యందు వ్యాధి ధనక్షయాదులు గల్గును. ఇందులకు, "సర్వైర్బలై రుపేతస్య పరమోచ్చ గతస్యచ, సంపూర్ణాఖ్యా దశాజ్ఞేయా ధనారోగ్య వివర్ధనీ, స్వోచ్చరాశి గతస్యాధకించిద్బల యుతస్యచ, పూర్ణానామ దశా జ్ఞేయాధన వృద్ధి కరీ శుభా, సర్వైర్బలై ర్విహీనస్య నీచరాశి గతస్యచ, రిక్తానామ దశాజ్ఞేయా ధననాశస్య కారిణీ, యస్స్యాత్పరమ నీచస్థసదా చారి నవాంశకే, తస్యా నిష్ట ఫలానామ వ్యాధ్య నర్థ వివర్ధినీ. షష్ఠ దశా వ్యసనకరీమృత్యుంచ కరోతి నైధనస్థ దశా, స్వోచ్చ గతస్య తురా జ్యం స్వక్షేత్రగత స్యసౌఖ్య సంపత్తి." అని గార్గియు బాదరాయణులును వచించియున్నారు.

భ్రష్టస్య తుంగా దవరోహి సంజ్ఞా
మధ్యాభవే త్సానుహ్య దుచ్చభాగే,

ఆరోహిణా నిమ్న పరిచ్యుతస్య
నీచారి భాగే ష్వధ మాభ వేత్సా. 6

తా. మఱికొన్ని దశాంతర్దశలకు సంజ్ఞలు చెప్పఁబడినవి. ఎట్లనఁగ—పర మోచ్చాంశము నుండి విడిచిన గ్రహదశకు అవరోహిణి యను నామముగలదు. ఈదశ కేవల మధమ ఫల మిచ్చును. ఆ యవరోహి దశ యేరాశియందైన మిత్రనవాంశ యందుంగాని, స్వోచ్చ నవాంశ యందుంగాని, స్వనవాంశ యందుఁగాని యున్న గ్రహముచేత నీయఁబడి నట్టులైన నాదశ మధ్య దశ యనంబడును. తన పరమ నీచాంశను దాఁటి పరమోచ్చాంశకు లోఁగ నుండు నాఱు రాసులలో నేరాశి యందైన నున్న గ్రహదశకు నారోహిణి దశ యనంబడును. ఈదశ శ్రేష్ఠ ఫలము నిచ్చును. ఆ యారోహిణి దశ యేరాశి యందైన నీచరాశి నవాంశ యందుంగాని శత్రు నవాంశ యందుఁ గాని యున్నట్టి గ్రహముచేత నీయఁబడినచో నధమ దశ యనం బడును. మొట్టమొదట శత్రునవాంశ స్థిత గ్రహదశ ననిష్ట దశ యని చెప్పఁబడెను. మఱి యా యవరోహి దశ శత్రునవాంశక స్థిత గ్రహ దత్తమై యుండెనేని యశుభ ఫలము నిచ్చును. ఆరోహి దశ శత్రు నవాంశ స్థిత గ్రహ దత్తమై యుండెనేని శుభ ఫలమును స్వల్పముగ నిచ్చును. ఇట్లవరోహిదశ అధమ దశయైన ననిష్టదశ యనంబడును. ఆరోహిదశ ఉచ్చనవాంశ మిత్ర నవాంశస్థిత గ్రహ దత్తంబై మధ్య దశ యైనచో సంపూర్ణ దశయనంబడును. ఇందులకు, "ఉచ్చ నీచాంతరస్థస్య దశాస్యా దవరోహిణీ, తస్యా మల్ప మవాప్నోతి ఫలం క్లేశా చ్ఛుభం నరః. మిత్రోచ్చాత్మాంశక స్థస్య మధ్యా మధ్య ఫలం తుసా, నీచోచ్చ మధ్యగ స్యోక్తా శ్రేష్ఠా చారోహిణీ దశా. సైవాధ మాఖ్యా భవతి నీచ రాశ్యంత గస్యతు, అవరోహిణిచే దధమా భవే త్కష్ట ఫలాతదా. ఆరోహిణీ మధ్యఫలా సంపూర్ణా పరికీర్తితా" అని గార్గిచేఁ జెప్పఁబడినది.

నీచారి భాంశే సమవ స్థితస్య
శస్తే గృహే మిత్ర ఫలా ప్రదిష్టా,

సంజ్ఞానురూపాణి ఫలా న్యథైషాం
దశాసు వక్ష్యామి యథోపయోగమ్. 7

తా. దశాంతర్దశలకు మఱియొక సంజ్ఞ చెప్పఁబడినది. ఎట్లనఁగఁ, బ్రశ స్తము లగు స్వోచ్చ మూల త్రికోణ స్వక్షేత్ర మిత్రక్షేత్రములయందుఁగాని, తన నీచరాశి నవాంశ యందుఁగాని, తనశత్రుగ్రహ రాశి నవాంశయందుఁగాని యున్నట్టి గ్రహదశ "మిశ్రఫలము" అనఁగా శుభాశుభ ఫలముల నిచ్చెడు దశయని చెప్పఁబడినది. అనంతరము సూర్యాది గ్రహముల దశాంతర్దశలయందుఁబేళ్లకు సమానమగు ఫలములను. అనఁగా నేయేదశయందు నేయేఫల మేప్రకారముగ నుపయుక్తమగునో, యాప్రకారముగఁ జెప్పవలెను. సంజ్ఞాను రూపము లనఁగ సంపూర్ణ దశ శ్రేష్ఠ ఫలములను, మిక్కిలి యశుభ ఫలములను, తమ తమ పేళ్లకుందగిన సమములగు ఫలముల నిచ్చు నని యెఱుంగవలయును.

ఉభయేధమ మధ్య పూజితా
ద్రేక్కాణై శ్చరభేషు చోత్క్రమాత్,
అశుభేష్ట సమాఖ్నిరే క్రమా
ద్ధోరాయాః పరికల్పితా దశా. 8

తా. మఱియు లగ్నదశ యందు నుత్తమ మధ్యమాధమ ఫలభేదములుం జెప్పఁబడినవి. ఎట్లనఁగ—లగ్న ప్రథమ ద్వితీయ తృతీయ ద్రేక్కాణములచేత ద్విస్వభావ రాశి లగ్నమునందు నధమ మధ్యమ శ్రేష్ఠఫలము లగుచున్నవి. అనఁగా ద్విస్వభావరాశిలగ్నమై, యందుఁ బ్రథమద్రేక్కాణమైనచో లగ్నదశఅనిష్ట ఫలమొసంగును. ద్వితీయ ద్రేక్కాణమయ్యేనేని మిశ్రఫలం బొసంగును. తృతీయ ద్రేక్కాణమైనచో శ్రేష్ఠఫలముగల్గును. మఱియుం జరరాశిలగ్నమై యందుఁ బ్రథమద్రేక్కాణమైనచో శ్రేష్ఠ ఫలమును, ద్వితీయ ద్రేక్కాణమైన మిశ్రఫలమును, తృతీయద్రేక్కాణమైనచో నధమఫలమును గల్గు నని యెఱుంగవలయును. మఱియు స్థిరరాశి లగ్నమై యందుఁబ్రథమ ద్రేక్కాణమయ్యేనేని యశుభ ఫలమును. ద్వితీయ ద్రేక్కాణమైనచో శుభఫల

మును, తృతీయ ద్రేక్కాణ మైన మిశ్ర ఫలమును గల్గును. ఈవిధముగ లగ్న దశలు కల్పింపఁ బడినవి.

ఏకం ద్వౌ నవ వింశతి ర్ధృతి కృతీ పంచాశ దేషాం క్రమా
చ్చం ద్రార్కేందుజ శుక్ర జీవ దినకృద్దైవా కరీణాం సమాః,
సైర్స్వైస్వైః పుష్ట ఫలాని సర్గ జనితైః పక్తి ర్దశాయాః క్రమా
దంతే లగ్న దశా శుభేతి యవనా నేచ్ఛంతి కేచిత్తథా. 9

తా. గ్రహముల నైసర్గిక దశా కాలములు జెప్పఁబడినవి. అదెట్లనఁగ, క్రమముగ నేకాదివర్షములు చంద్రాది గ్రహములకు నైసర్గిక దశా కాలము లగును. అదెట్లనిన—చంద్రునకొక సంవత్సరమును, అంగారకునకు రెండు సంవత్సరాలును, బుధునకుఁ దొమ్మిది సంవత్సరములును, శుక్రునకు నిరువది సంవత్సరములును, బృహస్పతికిఁ బదునెనిమిది సంవత్సరములును, సూర్యునకు నిరువది సంవత్సరములును, 'దైవాకరి'శనికిఁ నేఁబది సంవత్సరములును. ఇవ్విధముగఁ జంద్రాది గ్రహములకుఁ గ్రమముగ నైసర్గిక దశాసంవత్సరము లగును. ఇట్లు ౧_౨౦ సంవత్సరములు పరమాయు వగును. ఈ నైసర్గిక దశాధిపతులు బలవంతులై యుపచయ స్థానములయం దుండిరేని తమ తమ దశాంతర్దశల యందు శుభ ఫలముల నిత్తు రని తెలియఁ దగినది. బలహీనులై యుపచయస్థానముల యందుండిరేని యశుభ ఫలము నిత్తురని యెఱుంగ వలయును. ఇందులకు, "స్తనోపభోగ శ్శశినో వయఃఖం భౌమస్య విద్యా ద్దశనాను జన్మ, బౌధంతు శిక్షా పరకాల మాహు రమైథునే చ్ఛా లలిత ప్రవృత్తిం, శౌక్రం యువత్వం విధి పూర్వ దృష్ట మామధ్య మాద్దేవ గురో ర్వదంతి, రవే ర్వయో ర్థాత్పర మన్యద స్మాత్సౌరే ర్జరా దుర్బలకాలమాహుః." అని యవనేశునిచేఁ జెప్పఁబడినది. ఈనైసర్గిక దశకుఁ బ్రయోజనమేమనఁగ, పూర్వోక్త దశా పరిపాకము నైసర్గిక దశా జనితములగు తమ తమ సంవత్సరములతోఁ గూడినచో సంపూర్ణ ఫలములుగలదని తెలియ వలయును. అనఁగాఁ బూర్వము చెప్పఁబడినట్టి గ్రహదశయును నైసర్గిక గ్రహ దశయును ఈ రెండు దశల నొక గ్రహమునకే యేకకాలమునందుఁ గూడియుండెనేని

యస్మింత కాలముండునో యంతకాలము ఆ గ్రహదశగాని అంతర్దశగాని సంపూర్ణ మైనట్టిశుభ ఫలము నిచ్చునని తెలియఁ దగినది. ఇందులకు, "ఏకాబ్దిక శ్శశీత్రిబ్దికః కుజో ద్వాదశాబ్దిక స్సౌమ్యః, ద్వాత్రింశ ద్భృగుపుత్రో గురుస్తుకథితశ్చ తస్యార్థం, సప్త త్యబ్ద స్సూర్యో వింశ త్యధిక శ్శనైశ్చరోబ్ద శతః, వయసోంతరాణి చైషాం స్వదశా నైసర్గికః కాలః, స్వంస్వం వయస సదృశం గ్రహా స్సమాసాద్య దేహినాం కాలం, భక్షణపోషణ చేష్టా స్వభావ దాస్స్య ర్యథా సంఖ్యం" అని సత్యాచార్యులచేతఁ జెప్పఁబడినది. మఱియు యవన మతమున లగ్న దశా నైసర్గిక కాల ములు చెప్పఁబడినవి. పూర్వపు యవనులుఁ ఈ ౧౨౦ సంవత్సరములకు మీఁద నాయుష్కాలము గల్గి యున్న పక్షమున అట్టి యంత్యవయస్సునందు లగ్న నైసర్గిక దశయనియు ఆలగ్న దశ శుభకర మైనదనియుఁ జెప్పఁబడినది. అనఁగా నొకానొక యోగమునందు ౧౨౦ సంవత్సరములకుపైన నాయువు గల్గును. కాఁబట్టియట్టి యోగమునందుఁ బుట్టిన వానికి ౧౨౦ సంవత్సరములకు మీఁద నంత్య వయస్సులగ్న నైసర్గిక దశాకాలమని యవనులచేఁ జెప్పఁబడినది. శ్రుతకీర్తిమొదలుగాఁగల కొందఱు గ్రంథకర్తలు ఆప్రకారముగ నంత్య వయస్సునందలి లగ్నదశను శుభకరమైనదానినిగా నిష్టపడరని తెలియవలయును. ఇందులకు, "అంతే లగ్నదశా శుభేతి యవనా నైతద్బహూనాం మతం, తస్మిన్ హీనబలేయతోంత్య సమయే సామ్యాదతో నేష్యతే" అని శ్రుతకీర్తిచేఁజెప్పఁబడినది. అయితే వరాహమిహిరుండు లగ్నదశయందు శుభాశుభత్వములను ద్రేక్కాణ వశమునఁ జెప్పి యున్నాఁడు గాని బలాబల వశమునం జెప్పలేదు. గనుక యవనోక్త ప్రకారముగ నంత్య వయస్సున లగ్న నైసర్గిక దశ శుభఫల మిచ్చునని యెఱుంగ వలయును.

పాకస్వామిని లగ్నగే సుహృదివావర్గేస్య సౌమ్యేపివా
ప్రారబ్ధా శుభదా దశా త్రిదశషల్లాభేషు వా పాకపే,
మిత్రోచ్చోపచయ త్రికోణ మదనే పాకేశ్వర స్యస్థిత
శ్చంద్ర స్సత్ఫలబోధనాని కురుతే పాపాని చాతోన్యథా. 10

తా. దశాంతర్దశలకు మీఁద దశాప్రవేశ కాలమువలనను, తత్కాల గ్రహసంచారము వలనను, దశలయొక్క శుభాశుభత్వము లు జెప్పఁబడినవి. పూర్వోక్త ప్రకారముగ దశాంతర్దశలం దెచ్చి ఆదశాంతర్దశా ప్రవేశకాల సవికల సావనమును, ఆర్యభట సిద్ధాంతోక్త మార్గమున అద్యుగణము వలన స్ఫుటము లగు గ్రహములను దెచ్చి తత్కాల లగ్నస్ఫుటము చేయఁ దగినది. అదెట్లనఁగా:—శ్రీపతి చెప్పిన ప్రకారముగ జన్మకాలకల్యాది సభగణ మధ్య రవియందు దశా వర్షమాస దిన ఘటికా విఘటికలు గూడఁగా ముందటి దశాప్రవేశ కాలభగణాది మధ్య రవి యగును. ఈవిషయమై—"జన్మకాల కలియాత వత్సరోత్పన్న మధ్యమ రవౌ భమండలే, నిక్షిపే దథ దశాది జా సమా మాసవా సరఘటీ వినాడికాః. తాదృశో భవతి భాస్కరో యదా మధ్యమోపర దశాభవే త్తదా" అని శ్రీపతివాక్యమునం జెప్పఁబడినది. 'ఉదా:—జన్మకాల సభగణమధ్యమరవి ౮-౨౯-౨-౧౦ ౬-౪౬-దీని యందు లగ్న మహాదశయందలి లగ్నాంత ర్దశా వర్షాది సంఖ్యయగు ౩-౯-౧-౧౯-౦-ను గూడఁగ లగ్నాంతర్దశాంతిక మధ్యమ రవి ౮-౨౯-౬-౭-౧౦-౧౪-౦ "సాధ్యతే దినఘ నోనుపాతతః ఖేచరాః సవికలా దహర్గణాః" అనిచెప్పిన ప్రకారముగ ననుపాతమున ద్యుగణము దెచ్చెడు క్రమము, ద్యుగణమును యుగ రవి భగణములచేత గుణించి యుగ సావన వాసరములచేతఁ బాల్గొనఁగ భగణాది సూర్యుండు వచ్చును. ఆభగణాది సూర్యుని పెట్టుకొని విపరీతముగ యుగ సావన వాసరములచేత గుణించి యుగ రవి భగణములచేతఁ బాల్గొనఁగ సకల ద్యుగణము వచ్చును. ఈవిషయమై "యుగార్క వర్షై ర్యుగ సౌరసావనైః, ర్యదాద్యు పిండ స్సమ వాప్యతే తదా" అని గ్రంథాంతరమునఁ జెప్పఁబడినది. లగ్నాంతర్దశాంతిక మధ్య రవి ౮-౨౯-౬-౭-౧౦-౧౪-౦ ను ఆర్యభట సిద్ధాంత సావన వాసరములు. "ఖగేషు నగచంద్రాంక సప్తశైల శరేందవః" ౧౪౭౭౯౧౭౪౦౦. దీని చేత గుణించి పలిప్తాస్థానమును ౬౦-ట పాల్గొని లిప్తాస్థానమునందుఁ గూడి, ఆలిప్తాస్థానమును, ౬౦ట పాలుగొని భాగ స్థాన

మునందుఁ గూడి, యాభాగ స్థానము ౩౪ంట పాల్గొని రాశి స్థానము నందుఁ గూడి ఆరాశి స్థానమును పండ్రెంటితోఁ బాలుగొని భగణ స్థానమునందు గూడి, ఆభగణ స్థానమును యుగ రవి భగణము లైన ౪౩_౨౦౦౦౦ చేతఁ బాలుగొనఁగ వచ్చిన లబ్ధము సావన ద్యుగణము. ౧౫౬_౯౩౭౪ శేషమును ౬౦-ట గుణించి రవి భగణముచేతఁ బాలుగొనఁగ గడియలు ౪౫ ఉభయము ద్యుగణము ౧౫౬_౯౩౭౪-౪౫-ఈద్యుగుణము ఘటికలను భగణముచేత గుణించి ఘటికా స్థానమును౬౦-ట నెత్తిమీాది ద్యుగుణమునందుఁగూడి సావన మాసములచేతఁ బాలుగొనఁగ భగణములు వచ్చును. భగణ శేష ఘటికా శేషములను పండ్రెండింట గుణించి ఘటికాశేషమును-౬౦-టబాలుగొనిభగణ శేషమునందుఁ గూడిసావనవాసరములచేతఁ బాలుగొనఁగ రాసులు వచ్చును.తచ్ఛేషములవలన భాగాదులు వచ్చును. భగణ మధ్య రవి ౪_౨౯౬-౭-౧౦-౧౫-౦ స్ఫుట రవి ౭-౧౧-౦ అయనాంశ-౧౧-౧౩-ఇష్ట ఘటికలు ౧౧ తత్కాలోదయ లగ్నము-౧-౭-౨౭-స్ఫుట చంద్రుఁడు-౮-౨-౫౪-స్ఫుట కుజుఁడు-౫-౨౮-౫౦-స్ఫుట బుధుఁడు ౭-౨౬-౫౦-స్ఫుటగురువు-౩-౧౪-౧-స్ఫుట శుక్రుఁడు-౦-౦-౨౮-స్ఫుట శనైశ్చరుఁడు ౯-౧౪-౩-ఈప్రకారముగ సకల గ్రహ దశాంతర్దశా ప్రవేశ కాలములను గ్రహములను లగ్నమును స్ఫుటముచేయఁ దగినది. సావన మానము చేత నాయుర్దాయ దశా విభాగము చేయఁ దగినది. ఇందులకు, "ఆయుర్దాయ విభాగశ్చ ప్రాయశ్చిత్త క్రియా స్తథా, సావనే నైవ కర్తవ్యా స్సత్రాణామ ప్యుపాసనమ్" అని గార్గిచేఁ జెప్పఁబడినది. సావన ప్రమాణము, సూర్యోదయము మొదలు మఱల సూర్యోదయ పర్యంత మొకదినము. అట్టి దినములు-౩౦-కూడిన నొకమాసము. అట్టి మాసములు ౧౨-కూడిన నొకసంవత్సరము. అట్లొక సంవత్సరమునకు-౩౬౦ దినము లగును. ఇట్టి సావన మానముచేత నాయుర్దాయ విభాగము చేయఁ దగినది. ఇందులకు, 'సావనః కథితో మాస స్త్రింశ దుష్ణకరో దయః, త్రైద్వి షష్ట్యాస్తు వర్ష స్స్యా త్రైనైవా యు ర్వికల్పయేత్" అని జీవశర్మగారిచేఁ జెప్పఁబడినది. "పాకస్వామి నీ=దశానాథుఁడు" దశాప్రవేశ లగ్నమునం దుండఁగ నైనను, దశాధి

 

పతికి మిత్రగ్రహము దశాప్రవేశ లగ్నమునం దుండఁగ నైనను (కొందఱు దశాధిపతికి మిత్రక్షేత్రము లగ్న మగుచుండఁగా నైన నని వచింతురు.) ఈదశా నాథుని యేడవ వర్గము లగ్న గతమై యుండఁగ నైనను, శుభగ్రహ దశాప్రవేశ లగ్నమునం దుండఁగ నైనను, దశాధిపతి దశాప్రవేశలగ్నమునకు నుపచయ స్థానము లగు తృతీయదశమ షష్ఠైకాదశములయందుండఁగ నైనను "ప్రారబ్ధ=ప్రారంభించిన" దశ శుభ ఫలముల నిచ్చునని తెలియఁదగినది. ఇందులకు, "దశాపతిర్లగ్నగతో యదిస్యాత్త్రిష డ్దశైకాదశ గశ్చ లగ్నాత్, తత్సప్త వర్గో ప్యథ తత్సుహృద్వాలగ్నే శుభేవాశుభదా దశాసా" అని శ్రీపతిచేఁజెప్పఁబడినది. మహాదశాధిపతికి నధిశత్రువై యున్న గ్రహము అంతర్దశాపతి యయ్యేనేని యనిష్టఫలము నిచ్చునని యెఱుంగ వలయును. అధిమిత్రమైయుండు గ్రహము అంతర్దశాధిపతియయ్యేనేని శుభఫలము నిచ్చునని తెలియఁదగినది. మధ్యమ గ్రహ మంతర్దశాధిపతి యయ్యేనేని యథోక్త ఫలములనే యిచ్చునని తెలియఁదగినది. ఈప్రకారము అంతర్దశలయందును దశాప్రవేశకాలము మొదలు దశావసాన పర్యంతము దశాధిపతి శుభ ఫలముల నీఁజాలఁడని యెఱుంగ వలయు. అదేమనఁగఁ, దత్తత్కాల చంద్రాక్రాంత వశమున నొకదివసమునందు శుభఫలమును, మఱొక దివసమునఁ గష్టఫలము నొసంగును గాఁబట్టి తద్విధము సెప్పఁబడినది. అదెట్లనఁగ, చంద్రుఁడు ప్రతిరాశి యందు సంచరించుచున్న దశానాథుని తత్కాల మిత్రగ్రహరాశియందైన నుచ్చరాశి యందైనను దశాధిపతికి నుపచయస్థానములయిన ౩-౬-౧౧-౧౦-ఇండ్ల యందైనను, నవమ పంచమ స్థానముల యందైనను, సప్తమమునం దైన నున్నవాఁడై అపుడు చంద్రుఁ డున్నరాశి జన్మకాలమునందు నేభావ సంజ్ఞగలదై యుండునో ఆభావము యొక్క శుభఫల ప్రాదుర్భావములను జేయునని యెఱుంగ వలయును. ఈచెప్పిన దానికంటె నితర విధముగ దశానాథునకుఁ దాత్కాలిక శత్రురాశి యందైనను దశాధిపతికి నీచరాశి యందైనను దశాధిపతితోఁ గూడి యేకరాశి యందైనను దశాధిపతికి ౨-౪-౮-౧౨ ఇండ్ల యందొక యింట నైన నున్నట్టి చంద్రుఁడు

శుభదశ యందుఁ గూడ అపుడు చంద్రుఁ డున్న రాశి జన్మకాలము నందు నేభావసంజ్ఞగలదై యుండునో, ఆభావమునకు నశుభఫలముల నిచ్చునని తెలియఁ దగినది. ఇందులకు, "యద్రాశి సంస్థశ్శీతాంశు శ్శుభకృ త్కీర్తితో భవేత్, సరాశి జన్మకాలేతు యోభావ స్తత్కృతం చతత్. శరీరాది కృతం సౌఖ్యం వ క్తవ్యం బలయోగతః, అను క్తరాశి సంస్థస్తుతద్భావా నామశోభనమ్." అని గార్గిచేఁ జెప్పఁబడి నది. ఇట్లుదశా ప్రవేశ కాలమునందు దశాధిపతి యున్నట్టి స్థానము మొ దలుకొని ఈచెప్పిన స్థానముల యందున్న చంద్రుఁ డీఫలము నిచ్చునని తెలియఁ దగినది. ఉచ్చ నీచాదిస్థానస్థిత సూర్యాది గ్రహదశా ఫలముల ను సూచనఁగ దెలియఁ జేయుచున్న గ్రంథాంతర వచనములు కొన్ని యిచ్చట నుదహరింపఁ బడుచున్నవి. "సూర్యః కరోతి నీచే దోష సహస్రం మహావిపులం, శత్రుదశాయాం ధనజం దోషం సదా కురుతే నైధన భాగ ప్రాప్తే ప్యేవం హ్యుచ్చాది శుభదశా వర్జం, మూల త్రికోణగేషు స్వోచ్చేషుచ శుభఫలా సమాదేశ్యా, మిత్రగృహో చ్చాధికఫలధాన్యధనా ప్తించ సతత మిహ కురుతే, చంద్రస్స్వ క్షేత్రాదిషు మూలత్రికోణేచ భాగగే సతతం, నీచ సమస్థాన గత శ్శీ తాంశుః పాప సమఫలః ప్రో క్తః, నైధన రాశి సమేతం వ్యయగం చం ద్రం సదా పరిక్షేప్యేవం, పాపఫలం ప్రబ్రూయా న్నియత మశుభదం సదాచింత్యం, భౌమ స్స్వక్షేత్ర గతః స్వోచ్చేచ కరోతి ధనధాన్యం మిత్ర త్రికోణ కేష్వపి రత్నానాం భాజనం కురుతే, నీచ రిపు స్థానగతో భౌమో నియతం వినాశ మిహ కురుతే, సతతంచ దోష బహుళం కరోతి పురుషం నైధనస్థదశా, సౌమ్య దశాయాం కురుతే బంధన దో షాంశ్చ శత్రు గృహే, నీచ దశాయాం గృహమపి కుష్ఠాది రోగ మష్ట మ గతాయాం, స్వోచ్చదశాయాం రాజ్యం మిత్రగృహే ధాన్యముక్తాది, స్వక్షేత్ర గోపి సౌమ్యః కరోతి ధనధాన్య సంప త్తిం, జీవో మిత్ర దశా యాం కురుతే పురుషస్య వాహనావా ప్తిం, స్వోచ్చ గృహే రాజ్యాదిక ఫలమేత దసంశయం పుంసాం, స్వక్షేత్రగశ్చ కురుతే భూషణ లాభం చ వాహనావా ప్తిం, నీచ దశాయాం బంధం శత్రుగృహే నృపకులా ద్దోషం, ఉదరామయాది రోగాన్ నిధన దశాయాం కరోతి పురుషస్య.

ప్రాప్తో మిత్రగృహం శుక్రో నార్యవాప్తిం కరోతిచ, స్వోచ్చగస్య దశాయాంతు రాజ్యలాభం కరోత్యసౌ, స్వక్షేత్ర గశ్చాపిసదా స్త్రీలాభ రత్నద స్తథా,నీచ శత్రు గృహేచైవ వ్యాధి బంధం తథైవచ, నిధనస్థాతు కురుతే విదేశ గమనం ధ్రువం. శనైశ్చర శ్శత్రు గృహం ప్రయాతః కరోతి దోషం స్వజనాచ్చ దుఃఖం, మైత్రే గృహేవాపి తథోచ్చ రాశౌ కరోతి రాజ్యం బహుమాన యుక్తం. స్వక్షేత్రగ శ్చాపి కరోతి సౌఖ్యం యోషిచ్చ వృద్ధా ధన ధాన్య వృద్ధిం, దశాసు నీచాస్వపి బంధనాది రంధ్రేపి చైవం కురుతే దశాయాం ఏవందశాయాం గృహదోష భావం శుభాశుభం సత్ఫలదం విచార్యం,శుభాదశా మధ్య ఫలా దశాచ సర్వత్ర కాలే నియతం విచింత్యా.”

ప్రారబ్ధా హిమగా దశా స్వగృహగే మానార్థ సౌఖ్యావహా
కాజే దూష యతి స్త్రియం బుధగృహే విద్యాసు హృద్విత్తదా,
దుర్గారణ్య పథాలయే కృషికరీ సింహే సితక్షేఽన్నదా
కుస్త్రీదామృగ కుంభయో ర్గురుగృహే మానార్థ సౌఖ్యావహా.

తా. అంతర్దశా ప్రవేశ కాలమునందుఁ జంద్రుఁ డున్నట్టి రాశిం బట్టి శుభాశుభ ఫలములు చెప్పఁబడినవి. ఎట్లనఁగ, చంద్రుఁడు స్వక్షేత్రమగు కర్కాటకమునం దుండఁగాఁ బ్రవేశించిన—అంతర్దశ, సమ్మానమును, ధనమును, సౌఖ్యమును గలుగఁ జేయును. కుజ క్షేత్రములగు మేష వృశ్చికములలో నొకరాశియందుఁ జంద్రుఁడుం డఁగఁ బ్రవేశించిన యంతర్దశ, భార్యను పురుష సంపర్కాదులచేత దోష యుక్తురాలుగఁజేయును. మిథున కన్యలలో నొకరాశియందుఁ జంద్రుఁడుండఁగ బ్రవేశించిన యంతర్దశ, విద్యయు, మిత్రవర్గమును ధనము నిచ్చును. చంద్రుఁడు సింహరాశి యందుండఁగఁ బ్రవేశించిన యంతర్దశ, దుర్గములయందును, వనములయందును, మార్గములయందును, గృహ సమీపములయందును కృషిని చేయించును. చంద్రుఁడు వృషభ తులల యందుండఁగఁ బ్రవేశించిన యంతర్దశ మృష్టాన్నము గలుగఁజేయును. మకర కుంభములయందుఁ జంద్రుఁడుండఁగ బ్రవేశించిన యంతర్దశ కుత్సిత స్త్రీసౌఖ్యము నిచ్చును. చంద్రుఁడు ధనుర్మీనముల యందుండఁగఁ బ్రవేశించిన యంతర్దశ స

మ్మాన ధనసౌఖ్యముల గలుగఁజేయును. ఈప్రకారము శుభకాలము నందుఁ బ్రవేశించినట్టి శుభదశ అధిక శుభఫలము నిచ్చును. శుభకాల మునందుఁ బ్రవేశించిన అశుభదశ. మధ్యమ ఫలము నిచ్చును, అశుభ కాలమునందుఁ బ్రవేశించిన యశుభదశ యశుభఫలము నిచ్చునని తె లియఁ దగినది.

సౌర్యాం స్వం నఖదంత చర్మ కనక క్రౌర్యాధ్వభూపాహవై
స్తైక్ష్ణ్యం ధైర్య మజస్ర ముద్యమ రతిః ఖ్యాతిః ప్రతాపోన్నతిః,
భార్యాపుత్త్రి ధనారి శస్త్ర హుతభు గ్భూభృద్భవా వ్యాపద
స్త్యాగీ పాప రతి స్స్వభృత్యకలహో హృత్క్రోడపీడామయాః. 12

తా. సూర్య దశాఫల మీశ్లోకమునం జెప్పఁబడినది. ఎట్లనఁగ, సూర్యద శాంత ర్దశలయందు సుగంధ ద్రవ్య విశేషముచేతను, గోళ్ల చేతను, గజదంతములచేతను, వ్యాఘ్రాది చర్మములచేతను, స్వర్ణము చేతను, కఠిన స్వభావ మార్గముచేతను, యుద్ధముచేతను, రాజులచేత ను ధనము గల్గు నని యర్థము. మఱియు నుగ్రస్వభావము, ధీరత్వము నిరతోద్యోగాసక్తియును, శౌర్యమువలనఁ గల్గు శత్రు జయోన్నతి యును, సూర్యుని శుభదశ యందుఁ గల్గును. అశుభదశయందు భార్యాపుత్త్రి ధన శత్రు శస్త్రాగ్నియుధ రాజాగ్నిపీడలు గల్గునని తెలి యఁ దగినది. శుభదశయందు సద్విషయ మూలక దాన కీర్తియును, అశుభ దశయందు దుర్విషయ మూలక ధనవ్యయమును, పాప కార్యా నురక్తియును, స్వభృత్య కలహమును, హృదయమునకు రొమ్ముకుఁ బీడయును, రోగములును గల్గును. ఇవి సూర్యుని యశుభ దశాఫలము లు. మిశ్ర దశయందు శుభాశుభ ఫలములు రెండును గలుగును.

ఇందోః ప్రాప్య దశాఫలాని లభతే మంత్ర ద్విజాత్యుద్భవా
నీక్షుక్షీర వికార వస్త్ర కుసుమ క్రీడా తిలాన్న శ్రమైః,
నిద్రాలస్య మృదు ద్విజామర రతిః స్త్రీ జన్మ మేధావితా
కీర్త్యర్థోపచయ క్షయాచ బలిభి ర్వైరం స్వపక్షేణచ. 13

తా. చంద్రదశ నొంది మంత్ర ప్రయోగముచేతను బ్రాహ్మణు లచేతను సంజనిత మగు ఫలములను బొందును. ఇక్షువికారము లగు గుడ శర్కరాదులు, క్షీరవికార మయిన దధి ఘృతాదులు, వస్త్ర పుష్ప

ములు, క్రీడాదులు, తిలాన్నము మొదలగువానిచేఁ గల్గిన వ్యాయామములచేత శుభ ఫలములు గల్గును. మఱి చంద్రుని యశుభ ఫలము లెవ్వియనిన, నిద్రాలస్యము, నోపికయును, బ్రాహ్మణ సేవయును, దేవతారాధనమును, స్త్రీశిశు జననమును సుబుద్ధి వృద్ధియుం గలుగును. శుభ దశయందుఁ గీర్తి ధనము లభివృద్ధియు, నశుభ దశయందుఁ గీర్తి ధన నాశమును గల్గును. అశుభ దశయందు బలవంతులతోడను, దనపక్షమున నుండువారితోను వైరము గల్గును. మిశ్రదశయందు శుభాశుభ ఫలములు రెండుం గల్గుచుండునని తెలియఁదగినది.

భౌమ స్యారి విమర్ద భూప సహజ క్షితీ త్యా వికాజైర్ధనం
ప్రద్వేష స్సుత మిత్ర దార సహజై ర్విద్వ ద్గురు ద్వేషితా,
తృష్ణా సృగ్జ్వర పిత్త భంగ జనితా రోగాః పరస్త్రీ కృతాః
ప్రీతిః పాపరతై రధర్మ నిరతిః పారుష్య తైక్ష్ణ్యానిచ. 14

తా. కుజదశా ఫలము చెప్పఁ బడినది. అనఁగా నంగారక దశయందు, శత్రుమర్దనము. రాజుల వలన, సహోదర వర్గమువలన, భూమివలన, మేఁకల గొఱ్ఱియల వెంద్రుకల వలన ధనలాభ మగును. అశుభ దశయందుఁ బుత్త్రి మిత్ర కళత్ర భ్రాతృ జనులవలన విరోధములును, మఱి యతిదాహము, రక్తస్రావము, జ్వరము, పిత్తవికారపీడ, అవయవములయందు వ్రణాదులచేతఁ బగలుట పరస్త్రీ వలనఁ గల్గిన వ్యాధియు, అస్త్ర శస్త్ర ఘాతములును గల్గును. మఱియుఁ బాప కార్యా సక్తు లగువారిచేతఁ సమ్మానాది సంతోషములును, అధర్మ కార్యాసక్తియును, వాక్పారుష్యమును, కఠినోగ్ర స్వభావమును, ఇట్లు కలుగును.

సౌధ్యాం దౌత్య సుహృ ద్గురు ద్విజ ధనం విద్వ త్ప్రశంసా యశో
యుక్తి ద్రవ్య సువర్ణ వేసర మహీ సౌభాగ్య సౌఖ్యాప్తయః,
హాస్యో పాసన కౌశలం మతిచయో ధర్మ క్రియా సిద్ధయః
పారుష్య శ్రమ బంధ మానస శుచః పీడాచ ధాతుత్రయాత్. 15

తా. బుధ దశా ఫలమెట్లనిన, బుధ దశయందు దూతకార్యముచేతను, మిత్ర గురు విప్రవర్యులచేతను ధనము గలుగును. మఱియు, విద్వాంసుల వలనఁ బొగడ్తయును, యశస్సును గలుగును.

"యుక్తిద్రవ్య" విత్తళి కంచు మొదలగు నవియును, బంగారును, అశ్వ విశేషమును, భూమియును, సర్వజన ప్రియత్వమును, సౌఖ్యమును గల్గును. మఱియుం బరిహారము నందును, సేవయందును, బుద్ధి వృద్ధియును, ధర్మకార్య సిద్ధులును, చాతుర్యమును, బుధుని శుభదశయందుఁ గలుగును. అశుభదశయందుఁ బాపవ్యమును, ఖేదమును, బంధన మనోదుఃఖములును, వాతఁ పిత్త శ్లేష్మాది వ్యాధియును, వ్యాపారమూలక ధనక్షయమును, ఋణమును గలుగును.

జైవ్యాం మాన గుణోదయో మతిచయః కాంతిః ప్రతాపోన్నతి
ర్మాహాత్మ్యోద్యమ మత్ర చేతి నృపతి స్వాధ్యాయ మంత్రైర్ధనం,
హేమాశ్వాత్మజ కుంజ రాంబర చయః ప్రీతిశ్చ సద్భూమిపైః
సూక్ష్మోహా గహన శ్రమః శ్రవణ రుగ్వైరం విధర్మాశ్రితైః. 16

తా. గురుదశయందు సమ్మానమును, శ్రుతాధ్యయన వినయ శౌర్యాది గుణములును, సద్బుద్ధి వృద్ధియును, తేజస్సును, శత్రుజయమును, శౌర్యౌన్నత్యమును, పరోపకార శీలత్వమును, మహాకార్యోద్యోగమును, మంచి యాలోచనయు, నీతి గ్రంథ వేదపాఠమును, రాజసేవయు, మంత్ర జపమును ఇత్యాదుల వలన ధనలాభము గలుగును. మఱియు బంగారము, గుఱ్ఱములు, పుత్త్రులు, గజములు, దుకూల వస్త్రములు, గుణవంతుఁడగు రాజస్నేహము ఇత్యాదులు కలుగును. అశుభ దశయందు సూక్ష్మమైన, "ఊహాగహన" దుర్జ్ఞేయము లగు తర్క విచారముచేత నైన శ్రమము కల్గును. దీనికి సూక్ష్మ విచార హేతువైన త్రిప్పటలు వలన వృథాశ్రమము గలుగు నని కొందఱు వచింతురు. మఱికొందఱు సూక్ష్మ తర్కవిచారముచే శ్రమముగల్గు నని యందురు. అశుభ దశయందుఁ గర్ణరోగమును, ధర్మ బాహ్యు లగు వారితోడి వైరమును, చతుష్పాజ్జీవ మూలక గండమును, దాస్యమును, అన్యగ్రామ సంచారమును, ఉన్నతాత్పతనమును, అనాచారాసక్తియును, కాలోచితాన్నభోజనమును, పరాపవాదమును, లాభమునకు మించిన ధనవ్యయమును గల్గును.

శౌక్ర్యాం గీత రతి ప్రమోద సురభి ద్రవ్యాన్న పానాంబర
స్త్రీరత్న ద్యుతి మన్మథోప కరణ జ్ఞానేష్ట మిత్రాగమాః,

కౌశల్యం క్రయ విక్రయే కృషినిధి ప్రాప్తి ర్ధన స్త్యాగమో
బృందో ర్వీశ నిషాద ధర్మ రహితై ర్వైరం శుచః స్నేహతః.

తా. శుక్రదశా ఫలము చెప్పఁబడినది. ఈ శుక్రదశయందు గానాసక్తియు, సంతోషము, పరిమళద్రవ్యములు, మృష్టాన్నము, పానము, దివ్యాంబరాభూషణములు, స్త్రీకూటము, కామభోగ సాధనము లగు శయన తాంబూల గంధాదులు, దేహకాంతియు, జ్ఞానము, బంధు మిత్రులు, క్రయవిక్రయముల యందుఁ గౌశల్యము కృషిమూలక నిక్షేప లాభమును, ధనలాభము ఇత్యాదులు కల్గును. అశుభ దశయందు బహుజనులతోను, రాజులతోను, గొప్పవారితోను, కిరాతులతోను, ధర్మరహితులతోను, పరమ నీచగుణ సంపన్నుల తోను, వైరము గల్గి ధనవ్యయమును, రాజదండనాది కష్టమును గల్గును. మఱియు, స్నేహితుల మూలకముగ నధిక కష్టశోకమును గల్గును.

సౌరేం ప్రాప్య ఖరోష్ట్రి పక్షి మహిషీ వృద్ధాంగనా వాప్తయః
శ్రేణీ గ్రామ పురోధికార జనితా పూజా కుధాన్యాగమః,
శ్లేష్మే ర్ష్యానిల కోప మోహ మలిన వ్యాపత్తి తంద్రాశ్రమా
న్భృత్యా పత్య కళత్రి భర్త్సనమపి ప్రాప్నోతి చ వ్యంగతామ్.

తా. శనిదశయందు గర్దభములు, ఉష్ట్రిములు, డేగ మొదలగు పక్షులు, మహిషములు, వృద్ధస్త్రీలు గల్గును. మఱియు సమాన జాతీయ సమూహమును శ్రేణి యనంబడుటంజేసి యాశ్రేణీ జనముల చేతను గ్రామాధికారము చేతను, గౌరవమును గల్గును. "కుధాన్యాగమః" కొఱ్ఱలు, నువ్వులు మొదలగు ధాన్యముల లాభమును, ఇనుము, ప్రత్తి, కంబళ్లు, తైలాదులును లాభ మొసంగును. ఈశనైశ్చరుని యశుభ దశయందు చిత్త వికారమును, లేక వాతశ్లేష్మ వికార రోగాదులును, మత్సరముచేతను, వాతముచేతను, గాలిచేతను, కోపవికారముచేతను, చిత్తభ్రాంతిచేతను, మాలిన్యముచేతను, అధికాపద లొందును. మఱియు మనః క్లేశమును, 'తంద్ర=నిద్రాలస్య మధ్యగ తావస్థ' యని యర్థము. తదవస్థచేతఁ గష్టమును, భృత్య పుత్ర కళత్రములవలనఁ దిరస్కారమును, అంగవైకల్యమును కల్గును.

దశాసు శస్తాసు శుభాని కుర్వం
త్యనిష్ట సంజ్ఞాస్వశుభాని చైవం,
మిశ్రాస్తు మిశ్రాణి దశా ఫలాని
హోరాఫలం లగ్నపతే స్సమానమ్, 19

తా. ఈశ్లోకమునందు శుభాశుభ ఫలములు రెండును జెప్పం బడినవి. ఎట్లనఁగ, ఉపచయ రాశిస్థితులును, నిర్మల మూర్తులును, స్పష్టగతులును నైయున్నట్టి గ్రహముల దశలను శుభములగుచున్నవి. అనుపచయ రాశిస్థితులును, శత్రు నిహతులును, స్వల్ప మూర్తులును నైయున్నట్టి గ్రహముల దశలు నశుభము లగుచున్నవి. సూర్య చంద్రాదులు శుభము లైన దశలయందు శుభ ఫలముల నిత్తురు. అశుభ సంజ్ఞ లగు దశలయందు నశుభ ఫలముల నిత్తురు. శుభాశుభ మిశ్ర దశలయందు శుభాశుభముల నిత్తురు. ఇందులకు, "జన్మ న్యుపచయ భవనే సంస్థితా స్సవ్యగాత్ర సుమూర్తి ధరాః, శ్రేష్ఠం ఫలం విదధ్యు గ్గ్రహాః క్రమా త్స్వాం దశాం ప్రాప్య, అన్యై ర్నిహతా రూక్షా ల్ప మూర్తియో నుపచయర్క్ష సంస్థాశ్చ, స్వదశాభి హితం నేష్టం గ్రహాః ప్రయచ్ఛంతి లోకేషు" అని సత్యాచార్యుల వారిచే జెప్పంబడినది. పిదప లగ్న దశాఫలము లగ్నాధిపతికి సమానమైనది. అదెట్లనఁగ, మేషలగ్నమునకుఁ గుజ దశాఫలమును, వృషభ లగ్నమునకు శుక్ర దశాఫలమును, ఈప్రకారము తక్కిన లగ్నములకుం దెలియఁదగినది. మఱియు, "సుభయోధమ మధ్య పూజితాః" అను శ్లోకమున వచించిన ద్రేక్కాణ వశమున లగ్నదశ శుభదశయైయుండెనేని శుభ ఫలములును, అశుభదశ యైయుండెనేని యశుభ ఫలములును జెప్పఁదగినవి. మునుపు చెప్పఁబడిన దశారిష్టంబులలోఁ గొన్ని భంగములు సారావళియందు, "ప్రవేశే బలవాన్ ఖేట శుభైర్వా సన్నిరీక్షితః, సౌమ్యోధిమిత్ర వర్గ స్థో మృత్యుకృ న్నభవే త్తదా, అంత ర్దశాధి నాథస్య విబలస్య దశా యదా,బలిన స్స్యా త్తదా భంగో నబాధ్యా తస్యచ ధ్రువమ్, యుద్ధేచ విజయీ తస్మిన్ గ్రహయోగే శుభోయది, దశాయాం నభ వేత్కష్టం స్వోచ్చాదిషుచ సంస్థితః." అని చెప్పఁబడినది.

సంజ్ఞాధ్యాయే యస్య యద్ద్రవ్య ముక్తం
కర్మాజీవో యశ్చ యస్యోపదిష్టః,
భావస్థానా లోక యోగోద్భవంచ
తత్తత్సర్వం తస్యయోజ్యం దశాయామ్. 20

తా. ఈదశలుగాక యితరము లగు భావ ఫల దృష్టిఫలాదులు తత్తద్దశలయందు ఫలించునని తెలియఁజేయఁ బడియున్నది. సంజ్ఞా ప్రతిపాదకమగు గ్రహయోనిభేదా ధ్యాయమునందు, "తామ్రంస్యా న్మణి హేమయుక్తి రజతా న్యర్కాచ్చ ముక్తాయసీ" అని యేగ్రహ మునకు నేద్రవ్యము చెప్పఁబడెనో, ఆగ్రహశుభదశయందు నాగ్రహ మునకుం జెప్పఁబడినట్టి ద్రవ్యలాభమును, అశుభ దశయందు నాద్రవ్య నాశనమును గల్గును. ఏగ్రహమునకు, "యశ్చకర్మాజీవ అర్థాప్తిః పితృ జననీ సపత్న మిత్రభాతృ స్త్రీభృతక జనాద్దివాకరాద్యైః" అని చెప్పఁ బడినదో, ఆగ్రహదశాంతర్దశలయందు నాకర్మాజీవ ఫలప్రాప్తి యగు ను. "భావస్థానా లోక యోగోద్భవంచ, శూరస్తబ్ధో వికృత నయ నో నిర్ఘృణో ర్కేతనుస్థే" ఇవి మొదలయిన రాశి ఫలములును, "చంద్రేభూపబుధౌ" ఇవి మొదలగు దృష్టిఫలములును, నాభసయోగ వ్యతి రిక్తములయిన యోగఫలములును, ఆఫలములన్నియు నాగ్రహ దశ యందుయోచింపఁ దగినవి. "ఇతి నిగదితా యోగా స్సార్థం ఫలై రిహ నాభసాని యతఫలదా శ్చింత్యా హ్యేతే సమస్త దశాస్వపి" అని నా భసయోగములు మాత్రము సమస్త దశలయందుఁ దమ ఫలముల నిచ్చుచుండునని తెలియఁ దగినది.

ఛాయాం మహాభూత కృతాంచ సర్వే
భి వ్యంజయంతి స్వదశా మవాప్య,
క్ష్వం బ్వగ్ని వాయ్వం బరజా న్గుణాంశ్చ
నాసాస్యదృక్త్వక్ఛ్రవణాను మేయాన్. 21

తా. జనన కాలము తెలియని పురుషునకు శరీరకాంత్యాదులం బట్టి గ్రహదశా నిర్ణయము చేయు విధమును జెప్పఁబడినది. "శిఖి భూ ఖపయో మరుద్గణానాం వశినో భూమి సుతాదయః క్రమేణ" అని కు జాది గ్రహములకుం గ్రమముగ నగ్ని భూ మ్యాకాశ జల వాయువుల

ను, రవి చంద్రులకు నగ్ని జలములను జెప్పి యుండుటంజేసి సకలగ్రహములును తమ తమ దశంబొంది పృథివ్యాది మహాభూత కృతమగు శరీర కాంతిని ప్రకాశింపఁ జేయుచున్నవి. ఆశరీర కాంతి పృథివ్యాపస్తేజో వాయ్వాకాశముల వలనఁ బుట్టినట్టియు, నాసికా జిహ్వా నేత్ర త్వక్ఛ్రోత్రముల వలనం దెలియఁ దగినట్టి గుణములను బ్రకాశింపఁజేయును. అదెట్లనఁగ, పృథివీ భూతమునకు ఘ్రాణేంద్రియ గ్రాహ్య మగు గంధము గుణము. గాఁబట్టి పురుషుం డెపుడు పృథివీ ఛాయాగుణములు గలవాఁడై యుండునో యపుడు బుధ దశాకాల మని తెలియఁ దగినది. జల భూతమునకు రసనేంద్రియ గ్రాహ్య మగురసము గుణము గనుక పురుషుం డెపుడు మంచి రసపదార్థముల భుజియించుచు జల చ్ఛాయా గుణములు గలవాఁడై యుండునో యపుడు చంద్రశుక్రులలో నొకని దశయని తెలియఁ దగినది. అగ్ని భూతమునకుఁ జక్షురింద్రియ గ్రాహ్యమైన రూపము గనుక పురుషుం డెపుడు మంచిరూపము గలవాఁడై అగ్నిచ్ఛాయా గుణములు గలిగియుండునో యపుడు కుజ రవులలో నొక్కని దశయని యెంచఁ దగినది. వాయు భూతమునకుఁ ద్వగింద్రియ గ్రాహ్య మగు స్పర్శము గుణము గనుక జాతకుఁడు మృదుస్పర్శ గలవాఁడై వాయు చ్ఛాయా గుణములు గల్గియుండునో యపుడు శనిదశా కాలమని గ్రహింపఁదగినది. ఆకాశ భూతమునకు శ్రోత్రేంద్రియ గ్రాహ్య మగు శబ్దము గుణము కాఁబట్టి జనించినవాఁడెపుడు శ్రవణ సుఖముగఁ బల్కుచు నాకాశ చ్ఛాయా గుణములు గలవాఁడై యుండునో యపుడు గురుదశా కాల మని తెలియఁ దగినది. ఛాయాగుణ విశేషములం దెలియు విధ మెట్లనిన, "ఛాయా శుభాశుభ ఫలాని నివేదయంతీ లక్ష్యా మనుష్య పశు పక్షిషు లక్షణజ్ఞైః, తేజో గుణా బహిరపి ప్రవిభాసయంతే దీప ప్రభా స్ఫటిక రత్న ఘట స్థితేవ, స్నిగ్ధ ద్విజత్వఙ్నఖ లోమ కేశ చ్ఛాయా సుగంధాతు మహీ సముత్థా, తుష్ట్యర్థలాభా భ్యుదయాన్ కరోతి ధర్మస్య చాహన్యహని ప్రవృద్ధిమ్" అని పృథివీ ఛాయా గుణములు చెప్పఁబడినవి. "స్నిగ్ధా సితాచ హరి తానయనాభిరామా సౌభాగ్య మార్దవ

సుఖా భ్యుదయాన్ కరోతి, సర్వార్థసిద్ధి జననీ జననీ వచ్ఛా ఫలంతనుభృతాం శుభమాదధాతి" అని జలచ్ఛాయాగుణా బడినవి. "చండా దృష్ట్యా పద్మ హేమాగ్ని వర్ణాయుక్తా హై స్సప్రతాపైః, ఆగ్నే యీతి ప్రాణిషు స్యాజ్జయాం యు వాంఛి తార్థస్య ధత్తే." అని తేజ శ్ఛాయా గుణములు వ "మలిన పరుష కృష్ణా పాప గంధానిలోత్థా జనయతి ధ్యనర్థార్థ నాశమ్" అని వాయుచ్ఛాయా గుణము జేయఁబడినవి. "స్ఫటిక సదృశ రూపా భాగ్యయుక్తా రివ గగనోత్థా శ్రేయసాం స్వచ్ఛ వర్ణా" అని యా కా గుణము తెలుపఁ జేయఁబడినవి.

శుభ ఫలద దశాయాం తాదృగే వాంత రాత్మా
బహుజన యతి పుంసాం సౌఖ్య మర్థాగమంచ,
కథిత ఫల విపాకై స్తర్కయే ద్వర్తమానాం
పరిణ మతిఫలోక్తి స్స్వప్న చింతా స్వవీర్యైః.

తా. ఈచెప్పఁబడిన ఛాయలలో వాయు చ్ఛా ఛ్ఛాయల యందు శుభాశుభ ఫలములు రెండును గలవు భేదమును, అంతరాత్మ స్వరూపము వలనం దెలియు వి ధ నది. అదెట్లనిన, శుభ ఫలముల నిచ్చెడు దశయందు స్సు శుభస్వరూపమై యుండును. అపుడు మహాభూత తఁ దెలియంజేయఁ బడినట్టి గ్రహదశ పురుషులకు బహ సౌఖ్యమును, ధనలాభమును, జనయతికలుగఁజేయును. యందు నశుభ ఫలము జరుగు నని తెలుంగ వల యు యందు మిశ్ర ఫలము జరుగును. ఇందులకు, "శుభాశ నిమిత్తాని స్యురేకతః, ఏకతశ్చ మన శ్శుద్ధి స్త ద్విశుద్ధి అని యాత్రా గ్రంథమునందుఁ జెప్పఁబడి యున్నయది. శుభాశుభ ఫలపరిపాకములచేత వర్తమాన దశ నూహి అనఁగా బురుషుఁ డనుభవించు చుండెడు శుభాశుభ ఫ రించి యాఫలము లేగ్రహదశయందుఁ జెప్పఁబడి యున్న దశయని యూహింప వలెనని యర్థము. ఇట్లు ఛాయా

నంతరాత్మచేత ఫలానుభవముచేత వర్తమాన దశను దెలియవలయును. శుక్రి శుభ దశయందు నిధి ప్రాప్తియును, శని యశుభ దశయందు సంగహీనత్వమును గల్గు ననెడు ఫలము లనుభవమునకుఁ గొందఱకు రాక యుండుటకు హేతువు నెఱింగింపఁబడి యున్నది. బలహీనము లగు గ్రహములచేత ఫలవాక్యము స్వప్న చింతలయందుఁ బరిణమించు చున్నది. అనఁగా నేగ్రహము బలహీన మైయుండునో యాగ్రహమునకుఁ జెప్పఁబడి యున్న ఫలము స్వప్నము నందైనను మనోరథము నందైనను అనుభవింపఁ బడుంగాని ప్రత్యక్షానుభవమునకు రావని తలంపవలయును.

ఏకగ్రహస్య సదృశే ఫలయో ర్విరోధే
నాశం వదే ద్యదధికం పరిపచ్యతే తత్,
నాన్యో గ్రహ స్సదృశ మన్యఫలం హి న స్తి
స్వాంస్వాందశా ముపగతా స్స్వఫల ప్రదాస్యుః. 23

తా. అనఁగా నాభస యోగ ఫలములు తప్ప తక్కిన ఫలముల నాయాగ్రహములు తమ తమ దశలయందు నిచ్చు నని యెఱిఁగింపఁ బడినది. కాఁబట్టి యొక గ్రహ మొక యోగమువలన సువర్ణ మిచ్చువాడును, మఱియొక యోగమువలన సువర్ణము నపహరించువాఁడును నై యుండెనేని అప్పు డాగ్రహము సువర్ణ దానాపహారములు రెండుం జేయఁ జాలఁ డని తలంచవలయును. ఈ రెండు ఫలములయందును నెచ్చు తక్కువలు గల్గియుండెనేని యప్పు డేఫల మధికముగ నుండునో యాఫలము పరిపాకము నొందును. అదెట్లనఁగ, ఒకగ్రహము రెండువిధములుచేత సువర్ణ మొసంగు వాఁడును, మఱి యొక విధముచేత సువర్ణము నపహరించు వాఁడును నై యుండెనేని ఈ రెండు ఫలములయందు సువర్ణ ప్రదత్వ మధికముగ నుండుటంజేసి సువర్ణము నిచ్చునుగాని యపహరింపఁడు. ఇట్లొక గ్రహము రెండువిధములచేత సువర్ణాపహారియు, నొకవిధముచేత సువర్ణ ప్రదుండును నై యుండెనేని సువర్ణాపహారము చేయును. ఈప్రకార మూహింపఁ దగినది. ఒకగ్రహ మొకఫలము నొసంగు వాఁడై యుండఁగా మఱియొక గ్రహము సమానమైన ఫలముగాని, యన్య ఫలము

గాని వ్యర్థము చేయఁడు. మఱియేమనఁగా సకల గ్రహములు తమ దశను బొందిన వారలై తమ తమ ఫలముల నిచ్చుచుందురు. ఒకగ్రహము సువర్ణము నిచ్చువాఁడును, మఱియొక గ్రహము సువర్ణము నపహరించు వాఁడును నై యుండెనేని సువర్ణప్రదగ్రహము దశయందు సువర్ణము నిచ్చు ననియు,సువర్ణాపహారి తన దశయందు సువర్ణము నపహరించు ననియు నెఱుంగవలయును.

ఇట్లు బృహజ్జాతక గ్రంథమునందు
దశాంతర్దశాధ్యాయము సంపూర్ణము.



## అష్టకవర్గాధ్యాయము.

స్వాదర్కః ప్రథమాయ బంధు నిధన ద్వ్యాజ్ఞాతపో
వక్రా త్స్వాదివ తద్వ దేవ రవిజా చ్ఛుక్రాత్ స్మరాం
జీవా ద్ధర్మ సుతాయ శత్రుషు దశ త్ర్యాయారిగ
రేష్వే వాంత్యతపస్సు తేషుచ బుధా ల్లగ్నా త్సబంధ

తా. జన్మకాలమునందు సూర్యాది సప్త గ్రహము చు జేరి యెనిమిదియగుచున్నది.గనుక ఈయెనిమిది యేడునో ఆయారాశి మొదలుకొని చారవశమున రాసులయందుంచుచున్న యొక్కొక్క గ్రహ శుభాశుభ ఫలముల నీ యష్టకమునందుఁ జెప్పఁబూని మొట్టమొదటసూర్యాష్టకవర్గము పురుషుని జన్మకాలమునందు నేగ్రహము ఏరాశియం దుండుమునకు నారాశిస్వస్థాన మనంబడును. సూర్యుఁడు జన్మకాలమునందు రాశి మొదలు ౧-౧౧-౮-౮-౨-౧౦-౯-౭ యందుఁ జారవశమున నున్నవాఁడై శుభ ఫల మిచ్చు ఆస్థానముల యందు నుండక యితర స్థానముల యందుం ఫలమునిచ్చువాఁ డగుచున్నాఁడు. అంగారకుఁ డున్న స్థలు ౧-౧౧-౮-౮-౨-౧౦-౯-౭ స్థానములయందున్నట్టి సూ ఫలము నిచ్చును. శనియున్న స్థానము మొదలు ౧-౧౧-

౯-౭ ఈస్థానముల యందున్న సూర్యుఁడు శుభము నిచ్చును. శుక్రుఁడున్న స్థానము మొదలు ౭-౧౨-౬ ఈ స్థానముల యందున్న సూర్యుఁడు శుభకరుం డగును. గురుఁ డున్న స్థానము మొదలు ౯-౫-౧౧-౬ ఈస్థానముల యందున్న సూర్యుఁడు శుభదుండగును. చంద్రుఁడున్న స్థానము మొదలు ౧౦-౩-౧౧-౬ ఈస్థానముల యందున్న సూర్యుఁడు శుభదుండగును. బుధుఁ డున్న స్థానము మొదలుచంద్రునకుఁ జెప్పఁబడిన స్థానముల యందును ౧౦-౩-౧౧-౬-౧౨-౯-౫ ఈస్థానముల యందు నున్న సూర్యుడు శుభదాయకుం డగును. లగ్నము మొదలు ౧౦-౩-౧౧-౬-౪-౧౨ ఈ స్థానములయందున్న సూర్యుఁడు శుభకరుం డగును. ఇందులకు, ‘‘కేంద్రా యాష్ట ద్వినవ స్వర్కా- స్స్వాదార్కి- భౌమ యోశ్చ శుభః, షట్స ప్తాంత్యేషు సితాత్ షడాయః ధీధర్మ గో జీవాత్, ఉపచయ గోర్కాశ్చంద్రా దుపచయ నవమాంత్యధీయుత స్సౌమ్యాత్, లగ్నా దుపచయ బంధు వ్యవస్థిత శ్శోభనః ప్రోక్తః’’ అని లఘుజాతక శ్లోకమునఁదెలియుచున్నది. ఇది సూర్యాష్టక వర్గము.

లగ్నా త్షట్ త్రి దశాయగ స్సధన ధీ ధర్మేషు చారా చ్ఛశీ
త్సాస్వాస్తాదిషుసాష్ట సప్తసురవేంషట్ త్ర్యాయధీస్థోయమాత్,
ధీత్ర్యాయాష్టమ కంటకేషు శశిజా జ్జీవా ద్వ్యయాయాష్టగః
కేంద్రస్థశ్చ సితా త్తు ధర్మ సుఖ ధీ త్ర్యాయాస్పదానంగగః. 2

తా. చంద్రాష్టక వర్గము చెప్పఁబడినది. చంద్రుఁడు లగ్నము మొదలు ౬-౩-౧౦-౧౧-ఈస్థానములయం దున్నవాఁడైనచో శుభదుం డగును. అంగారకుఁ డున్న స్థానము మొదలు ౬-౩-౧౦-౧౧-౨-౫-౯ ఈస్థానముల యందున్న చంద్రుఁడు శుభదుం డగును. తానున్న స్థానము మొదలు, సప్తమ ప్రథమ సహితంబు లగు నాస్థానములయందు, అనఁగా ౬-౩-౧౦-౧౧-౭-౧ ఈ స్థానంబుల యందున్న చంద్రుఁడు శుభకరుం డగును. సూర్యుఁ డున్న స్థానము మొదలగు అష్టమసప్తమ సహితము లైన ఆలగ్న స్థానముల యందు ననఁగా ౬-౩-౧౦-౧౧-౮-౭ ఈస్థానములయందుఁ జంద్రుఁడు శుభదుం డగును. శనైశ్చరుఁ డున్న స్థానము మొదలు ౬-౩-౧౧-౫ ఈస్థానంబుల యందున్న చంద్రుఁడు

 

శుభప్రదుం డగును. బుధుఁడున్న స్థానము మొదలు ౫-౩-౧౧-౮-౧-౪-౭-౧౦ ఈస్థానములయం దున్న చంద్రుఁడు శుభకరుం డగును. గురువున్న స్థానము మొదలు ౧౨-౧౧-౮-౧-౪-౭-౧౦ ఈస్థానముల యందున్న చంద్రుఁడు శుభప్రదుం డగును. శుక్రుఁ డుండు స్థానము మొదలు ౯-౪-౫-౩-౧౧-౧౦-౭ ఈస్థానములయందున్న చంద్రుఁడు శుభదుం డగును. ఇందులకు, "శశ్యుపచయేషు లగ్నా త్స్వాద్య మునిస్స్వాత్కుజా త్సనవ ధీస్వః, సూర్యా త్సాష్ట స్మరగ స్త్రిషడాయ సుతేషు సూర్య సుతాత్, జ్ఞాత్కేంద్ర త్రిసుతాయాష్టమ గో గురో ర్వ్యయాయాష్ట కేంద్రేషు, త్రీచతు స్సుత నవమ దశ సప్తమాయగ శ్చంద్రమాశ్శుభ శ్శుక్రాత్" అని లఘుజాతకమునందుఁ జెప్పఁబడి యున్నది.

వక్ర స్తూపచయేష్వి నాత్సతనయేష్వాద్యాధి కేషూదయా
చ్చంద్రాద్దిగ్వి ఫలేషు కేంద్ర నిధన ప్రాప్త్యర్థగ స్స్వా చ్ఛుభః,
ధర్మాయాష్టమ కేంద్ర గోర్కతనయాత్ జ్ఞాత్స్వ ట్త్రిధీలాభగః
శుక్రా త్ష డ్వ్యయలాభ మృత్యుషు గురోః కర్మాం త్యలాభారిషు. ౩

తా. అంగార కాష్టక వర్గమును జెప్పఁబడినది. సూర్యుఁ డున్న స్థానము మొదలు ౩-౬-౧౦-౧౧-౫ ఈస్థానములయందున్న కుజుఁడు శుభకరుం డగును. లగ్నము మొదలు ప్రథమస్థానాధికము లగు నుపచయములయందు ననఁగా-౩-౬-౧౦-౧౧-౧ ఈ స్థానములం దున్న కుజుఁడు శుభకరుం డగును. దశమస్థాన రహితములగు నుపచయముల యందు ననఁగాఁ జంద్రుఁడున్న రాశి మొదలు ౩-౬-౧౧ ఈస్థానముల యందున్నట్టి కుజుఁడు శుభకరుం డగును. కుజుఁడు జన్మకాలమునందు దానుండు రాశి మొదలు ౧-౪-౭-౧౦-౮-౧౧-౨ ఈస్థానములం బొందినవాఁడై యుండఁగా శుభకరుం డగును. శనియున్న స్థానము మొదలు ౯-౧౧-౮-౧-౪-౭-౧౦ ఈస్థానముల యందున్నట్టి యంగారకుఁడు శుభప్రదుఁ డగును. బుధుఁడున్న స్థాన మొదలు ౬-౩-౫-౧౧ ఈస్థాముల యందున్నట్టి కుజుఁడు శుభుఁ డగును. శుక్రుఁ డున్న స్థానము మొదలు ౬-౧౨-౧౧-౮ ఈ స్థానముల యందున్న కుజుఁడు శుభుఁ డగును. గురువున్న స్థానము మొదలు ౧౦-౧౨-౧౧-౬ ఈస్థానముల యందున్న కుజుఁడు శుభకరుం డగును.

ద్వ్యైద్వ్యాయాష్ట తప స్సుఖేషు భృగుజా త్స్వత్రాత్మజే ష్విందుజః
సాజ్ఞా స్త్రేషు యమారయో ర్వ్యయ రిపు ప్రాప్త్యష్ట గో వాత్పతేః,
ధర్మాయారి సుత ద్వయేషు సవితు స్స్వాత్సాద్య కర్మత్రిగః
షట్ స్వాయాష్ట సుఖాస్పదేషు హిమగో స్సాద్యేషులగ్నాచ్ఛుభః.

తా. బుధుఁడు శుక్రస్థానము మొదలు, తృతీయ పంచమము లతోఁ గూడిన, అనఁగా శుక్రుఁడున్న స్థానమునకు ౨-౧-౧౧-౮-౯-౪ ౩-౫-ఈ స్థానములయందున్న బుధుఁడు శుభప్రదుం డగును. శని యుండు స్థానమునకును, కుజుఁ డుండు స్థానమునకును ౨-౧-౧౧-౮-౯-౪-౧౦-౭ ఈస్థానముల యందున్న బుధుఁడు శుభప్రదుం డగును. గురు వుండు స్థానమునకు ౧౨-౬-౧౧-౮-ఈస్థానముల యందున్న బుధుఁడు శుభకరుం డగును. సూర్యుఁ డుండు స్థానమునకు ౯-౧౧-౬-౫ ౧౨-ఈస్థానములయం దుండు బుధుఁడు శుభదుం డగును. జన్మకాల మునందుఁ దానున్న రాశికి ౯-౧౧-౬-౫-౧౨-౧-౧౦-౩ ఈస్థానములం బొందిన బుధుఁడు శుభదాయకుం డగును. చంద్రుఁడుండు స్థానము నకు ౬-౨-౧౧-౮-౪-౧౦ ఈస్థానములయందున్న బుధుఁడు శుభ కరుం డగును. లగ్నమునకు ౬-౨-౧౧-౮-౪-౧౦-౧ ఈస్థానములయం దున్నట్టి బుధుఁడు శుభకరుం డగును.

దిక్స్వ ద్వ్యష్టమ దాయ బంధుషు కుజా త్స్వ త్సత్రికే ష్వంగిరాః
సూర్యా త్సత్రి నవేషు ధీ స్వనవ దిగ్భాగారిగో భార్గవాత్,
జాయా యార్థ నవాత్మజేషు హిమగోర్మందా త్త్రిష డ్ధీ వ్యయే
దిగ్ధీ షట్ స్వసుఖాయ పూర్వ నవగోజ్ఞాత్స స్మర శ్చోదయాత్. 5

తా. గుర్వష్టకమునం గుజుఁ డుండు స్థానమునకు ౧౦-౨-౧-౮ ౭-౧౧-౪ ఈస్థానములయందున్న గురువు శుభకరుం డగును. జన్మకా లమునందు గురువు తానున్న రాశికి ౧౦-౨-౧-౮-౭-౧౧-౪-౩ ఈస్థా నములయం దున్నచో శుభప్రదుం డగును. సూర్యుడున్న రాశికి ౧౦-౨-౧-౮-౭-౧౧-౪-౩-౯ ఈస్థానముల యందుండు గురువు శుభదాయ కుం డగును. శుక్రుఁడున్న రాశికి ౫-౨-౯ ౧౦-౧౧-౬ ఈస్థానముల యందున్న గురువు శుభకరుం డగును. చంద్రుఁడున్న రాశికి ౭-౧౧-౨-

౯-౫ ఈస్థానములయం దున్న గురువు శుభదుం డగును. శనియున్న స్థానమునకు ౩-౬-౫-౧-౨ ఈస్థానముల యందున్నట్టి గురువు శుభప్రదుం డగును. బుధుఁడున్న రాశికి ౧౦-౫-౬-౨-౪-౧౧-౧-౯ ఈస్థానముల యందుండు గురువు శుభదాయకుం డగును. లగ్నమునకు ౧౦-౫-౬-౨-౪-౧౧-౧-౯-౭ ఈస్థానముల యందుండు గురువు శుభప్రదుం డగును.

లగ్నాదాసుత లాభ రంధ్ర నవగస్స్వాంత్య శ్చశాంకా త్సితః
స్వాత్సా జ్ఞేషు సుఖ త్రి ధీ నవ దశచ్ఛిద్రా ప్తిగ స్సూర్యజాత్,
రంధ్రాయ వ్యయగో రవే ర్నవ దశ ప్రాప్త్యష్ట ధీస్థో గురో
ర్జ్ఞాద్ధీతార్యాయ నవారిగ స్త్రి నవషట్ పుత్రాగమాం త్యః కుజాత్.

తా. లగ్నము మొదలు ౧-౨-౩-౪-౫-౧౧-౮-౯ ఈస్థానములయం దున్నట్టి శుక్రుఁడు శుభకరుం డగును. చంద్రుఁడున్నస్థానము మొదలు ౧-౨-౩-౪-౫-౧౧-౮-౯-౧౨ ఈస్థానములయం దుండు శుక్రుఁడు శుభదాయకుం డగును. జన్మకాలమునందు శుక్రుఁడు తానుండు రాశికి ౧-౨-౩-౪-౫-౧౧-౮-౯-౧౦ స్థానములనుండినచో శుభప్రదుం డగును. శనియుండు స్థానమునకు ౪-౩-౫-౯-౧౦-౮-౧౧ ఈస్థానముల యందుండు శుక్రుఁడు శుభదాయకుం డగును. సూర్యుఁడున్న స్థానమునకు ౮-౧౧-౧౨ ఈస్థానముల యందున్న శుక్రుఁడు శుభకరుండు నగును. గురుఁ డుండు స్థానమునకు ౯-౧౦-౧౧-౮-౫ ఈస్థానములయం దున్న శుక్రుఁడు శుభకరుం డగును. బుధుఁడున్న రాశికి ౫-౩-౧౧-౯-౬ ఈస్థానములయం దున్నట్టి శుక్రుఁడు శుభకరుం డగును. అంగారకుఁ డున్నట్టి స్థానంబునకు ౩-౯-౬-౫-౧౧-౧౨ ఈస్థానముల యందున్న శుక్రుఁడు శుభకరుం డగును.

మంద స్స్వ త్రిసుతాయ శత్రుషు శుభ స్సజ్ఞాం త్యగో భూమిజా
త్కేంద్రాయాష్ట ధనేష్వినా దుపచయే ష్వాద్యే సుఖే చోదయాత్,
ధర్మాయారి దశాంత్య మృత్యుషు బుధాచ్చంద్రా త్త్రిషల్లాభగః
షష్ఠా యాంత్యగత స్సితా త్సురగురోః ప్రాప్త్యంత్య ధీ శత్రుషు.

తా. శనైశ్చరుఁడు జన్మకాలమునందుఁ దానున్న స్థానమునకు ౩-౫-౧౧-౬ ఈస్థానములయం దుండినచో శుభప్రదుఁ డగును. అంగా

రకుఁ డుండు స్థానమునకు ౩-౫-౧౧-౬-౧౦-౧౨ ఈస్థానములయందున్న శని శుభకరుండగును. సూర్యుఁడుండు స్థానమునకు ౧-౪-౭-౧౦ ౧౧-౮-౨ ఈస్థానముల యందున్నట్టి శని శుభప్రదుం డగును. లగ్నానికి ౩-౬-౧౦-౧౧-౧-౪-ఈస్థానములయందున్న శని శుభకరుం డగును. బుధుఁడున్న రాశికి ౯-౧౧-౬-౧౦-౧౨-౮- ఈ స్థానములయందున్న శని శుభదాయకుం డగును. చంద్రుఁడున్న రాశికి ౩-౬-౧౧ ఈ స్థానములయం దున్నశని శుభప్రదుం డగును. శుక్రుఁడున్న స్థానమునకు ౬-౧౧-౧౨ ఈ స్థానములయం దున్నశని శుభకరుం డగును. గురుఁడున్న స్థానమునకు ౧౧-౧౨-౫-౬ ఈ స్థానములయం దున్నశని శుభదాయకుం డగును.

ఇతి నిగదిత మిష్టం నేష్ట మన్య ద్వి శేషా
దధిక ఫల విపాకం జన్మభా త్తత్ర దద్యుః,
ఉపచయ గృహ మిత్ర స్వోచ్చగైః పుష్ట మిష్టం
త్వపచయ గృహనీ చారాతిగై ర్నేష్ట సంపత్. 8

తా. అష్టకవర్గ ఫల నిర్ణయ క్రమము జెప్పఁబడినది. ఈప్రకారముగఁ జెప్పఁబడిన స్థానములు శుభ ఫల ప్రదము లగును. ఇతర మగు స్థానములు అశుభ ప్రదము లగును. ''స్వాదర్కః ప్రథమాయ బంధు నిధన ద్వ్యాజ్ఞాతపో ద్యూనగః'' అను శ్లోకమునందు నేగ్రహమునకు నేస్థానములు చెప్పఁబడియున్నవో, ఆస్థానముల యందు నాగ్రహము శుభ ఫలదం బగు ననియును, తక్కిన స్థానములయందు నశుభ ఫల ప్రదంబగు ననియును దెలియఁదగినది. జన్మకాలమునందు నేయేస్థానమునందు గ్రహము లుండునో ఆయేడు స్థానములును జన్మలగ్న మొకండును. ఈయెనిమిది స్థానములలో నొక్కొక స్థానము, మొదలు, ఆయష్టక వర్గమునందునిష్టానిష్ట సంశోధనముచేయుట వలన నిష్టానిష్టములలో నేది యధికమై యుండునోయా ఫలపరిపాకమునుగ్రహములిచ్చును. అనఁగా, రాశిచక్రమునందు జన్మకాల గ్రహస్థితినివ్రాసి, ఏగ్రహాష్టక వర్గమునందు నేస్థానములు శుభములని చెప్పఁబడియున్నవో ఆస్థానములయందు (౦) సున్నలును అశుభంబులని చెప్పఁబడి యున్న స్థానముల యందు రేఖలును వ్రాయఁగా నేరాశికి బిందువులు అధికముగ వచ్చునో

ఆరాశియందు గ్రహము శుభఫల ప్రద మగుననియు, నేరాశికి రేఖ లధికముగవచ్చునో ఆరాశియం దాగ్రహ మశుభ ఫలప్రద మగునని యు నెఱుంగవలయును. అదెట్లనఁగ, ఏగ్రహాష్టక వర్గమునందు నేరాశికి నెనిమిదిబిందువులువచ్చునో యాగ్రహ మారాశికి వచ్చినపుడు సంపూర్ణశుభఫల మిచ్చును. ఏడుబిందువు లొకరేఖయు వచ్చినచో బిందు సంఖ్యయందు రేఖాసంఖ్యనుతోసివేయఁగ నాఱుబిందువులు మిగులును గాఁబట్టి ముక్కాలుభాగము శుభఫలం బిచ్చును. ఆఱుబిందువులును రెండురేఖలును వచ్చినచో నాల్గుబిందువులు మిగులును గనుక అర్థఫలం బిచ్చును. అయిదు బిందువులును మూఁడురేఖలును వచ్చినచోఁ గాలుభాగము శుభఫలము నిచ్చును. నాల్గుబిందువులును నాల్గురేఖలును వచ్చెనేని శుభాశుభ ఫలంబులు రెండును గాక మధ్యఫలం బిచ్చునని యర్థము. ఎనిమిది రేఖలు వచ్చెనేని అశుభ ఫలమును సంపూర్ణముగ నిచ్చును. ఏడురేఖలు నొక్క బిందువును వచ్చినచో, ముక్కాలుభాగము అశుభ ఫలము నొసంగును. ఆఱురేఖలును రెండు బిందువులును వచ్చినచో, అర్థభాగము అశుభఫల మిచ్చును. అయిదు రేఖలును మూఁడుబిందువులును వచ్చినచో, పాతికపాలు అశుభ ఫలమును ముప్పాతికపాలు శుభఫలము నిచ్చునని తెలియఁ దగినది. ఉదాహరణము.-"అనిమిష పరమాంశకేవిలగ్న" అని యాయు ర్దాయాధ్యాయమునందుఁ జెప్పబడి యుండు పరమాయు ర్జీవిత యోగమునందుఁ బుట్టినవానికి నంగార కాష్టక వర్గమెట్లనఁగ, జన్మలగ్నం బైన మీనము నందు శుక్రుఁడు, రెండవయింట సూర్యుఁడు, మూఁడవయింట చంద్ర బుధులు, నైదవయింట బృహస్పతియును,ఎనిమిదవయింట శనైశ్చరుం డును, పదనొకొండింట నంగారకుండును, ఈప్రకారముండఁగా గుజాష్టక వర్గంబున మేషమునందు నైదురేఖలును, మూఁడుబిందువులును వచ్చును గనుక రేఖాసంఖ్యలలో బిందుసంఖ్యను ద్రోయఁగా రెండు రేఖలును మిగులును, కాఁబట్టి యంగారకుండు చారవశంబున మేష రాశిగతుం డైనపుడు పాతికపా లశుభ ఫలమునిచ్చునని తెలియఁ దగినది. వృషభమునందు నైదురేఖలును మూఁడుబిందువులును వచ్చును గనుక రేఖాసంఖ్యలో బిందుసంఖ్యను, తోసివేయఁగ రెండురేఖలు

మిగులును, కాఁబట్టి వృషభరాశి గతుఁడైనపుడు పాతికపా లశుభ ఫలము నిచ్చునని తెలియఁదగినది. కర్కాటకమునందు నాల్గు రేఖలు

| | | | |
|---|---|---|---|
| మీనము<br>ల. శు<br>\| \| \| \| \|<br>o o o | మేషము<br>రవి<br>\| \| \| \| \|<br>o o o | వృష,<br>బు. చ.<br>\| \| \| \| \|<br>o o o | మిథు<br>\| \| \| \| \|<br>o o o |
| కుంభ<br>\| \| \| \|<br>o o o o | | | కర్క, గు<br>\| \| \| \|<br>o o o o |
| మక, కు<br>\| \| \|<br>o o o o o | | | సిం.<br>\| \| \|<br>o o o o o |
| ధను<br>\| \| \| \| \| \|<br>o o | వృశ్చి<br>\| \| \| \| \| \| \|<br>o | తుల, శ<br>\| \| \|<br>o o o o o | కన్య<br>\| \| \| \| \| \|<br>o o |

నాల్గుబిందువులు సమముగ వచ్చినవి కాఁబట్టి కర్కాటక రాశి గతుండైనపుడు మధ్యమ ఫలదుం డగును. సింహమునందు నైదుబిందువులు మూఁడురేఖలు వచ్చినవి గనుక బిందుసంఖ్యయందు రేఖాసంఖ్యను తోసివేయఁగా రెండుబిందువులు మిగులును. కాఁబట్టి సింహరాశి గతుండైనపుడు పాతికపాలు శుభఫలము నిచ్చును. కన్యయం దాఱు రేఖలును, రెండుబిందువులును వచ్చినవి గనుక కన్యారాశి గతుండైనపుడు అరపా లశుభ ఫలము నిచ్చును. తులయందు నైదుబిందువులును మూఁడురేఖలును వచ్చినవి గనుక తులారాశి గతుఁడైనపుడు

పాతికపాలు శుభ ఫలము జరుగును. వృశ్చికమునందు నేడు రేఖలు నొకబిందువు వచ్చినవి గనుక వృశ్చిక రాశిగతుండైనపుడు ముప్పాతిక పాలు అశుభ ఫలము నిచ్చును. ధనుస్సునందు నాఱు రేఖలును రెండు బిందువులును వచ్చినవి గనుక ధనుస్సునుఁ బొందినపుడు అరపా లశుభము నిచ్చును. మకరమునందు నైదుబిందువులు మూఁడు రేఖలును వచ్చినవి కాఁబట్టి మకరరాశి గతుఁడైనపుడు పాతికపాలు శుభఫలము నిచ్చును. కుంభమునందు నాల్గు రేఖలును నాల్గుబిందువులు సమముగ వచ్చినవి గనుక కుంభరాశి గతుఁడైనపుడు మధ్యమ ఫలప్రదుం డగును. మీనమునందు నైదు రేఖలును మూఁడుబిందువులును వచ్చినవి గనుక కుజుఁడు మీనరాశి గతుఁడైనపుడు పాతికపా లశుభఫలము నిచ్చును. ఇట్లు సర్వ గ్రహాష్టక వర్గము వలన వచ్చిన, శుభఫలములను అశుభఫలములను మొత్తముచేసి ఆశుభాశుభ ఫలములలో అధికముగ నుండుదాని యందుఁ దక్కువయగుదాని త్రోసి వేయఁగ నేఫల మెంత మిగులునో ఆఫల మంత కలుగునని వచింపఁ దగి నది. ఇందులకు, "ఏకేన యశ్శుభ స్స్యాత్ తద్భి స్థాన్నైస్సపాపదో భవతి, యస్తు చతుర్భిర్నేష్టః సర్వత్ర ఫలకల్పనాత్వేవమ్" అని బాదరాయణులచేఁ జెప్పఁబడినది. ఈయోగమునకే బుధాష్టక వర్గము వ్రాయఁబడుచున్నది. పూర్వోక్త ప్రకారము లగ్నమగు మీనమునందు శుక్రుఁడు, ద్వితీయమగు మేషరాశి యందు సూర్యుండును, తృతీయ మగువృషభ రాశియందు చంద్ర బుధులును, అయిదవ రాశియగుకర్కాటకమున గురువును, అష్టమమగు తులయందు శనియు, నేకాదశస్థానమగు మకరానఁ గుజుండును, ఇట్లుండఁగ బుధాష్టక వర్గ ఫలక్రమం బెట్లనిన, ఈ యోగమునందు మేషమునకు నైదుబిందువులును మూఁడు రేఖలును వచ్చును గనుక బిందుసంఖ్య యందుఁ రేఖాసంఖ్యను ద్రోసి వేయఁగా రెండుబిందువులు మిగులును. కాఁబట్టి యిట్టి యోగమునదుఁ బుట్టినవానికి బుధుఁడు చారవశమున మేషరాశి గతుఁడైనప్పుడు పాతికపాలు శుభ ఫలము నిచ్చును. వృషభమునకు నాల్గుబిందువులును నాల్గు రేఖలును సమముగ వచ్చును గనుక బుధుఁడు వృషభ రాశి గతుఁడైనపుడు శుభాశుభ ఫలముల రెండు నీయఁజాలఁడు. మిథునానికి

నైదుబిందువులును మూఁడురేఖలును వచ్చును గనుక బుధుండు మిథునరాశి గతుఁడైనపుడు పాతికపాలు శుభఫలము నిచ్చును. కర్కాట

| | | | |
|---|---|---|---|
| ల, మీ, శు<br>I I I<br>○ ○ ○ ○ ○ | మే, ర<br>I I I<br>○ ○ ○ ○ ○ | వృష, బు, చ.<br>I I I I<br>○ ○ ○ ○ | మిథు<br>I I I<br>○ ○ ○ ○ ○ |
| కుంభ<br>I I I<br>○ ○ ○ ○ ○ | | | కర్క, కు<br>I I I I<br>○ ○ ○ ○ |
| మక, కు<br>I I I<br>○ ○ ○ ○ ○ | | | సిం<br>I I I<br>○ ○ ○ ○ ○ |
| ధను<br>I I I I<br>○ ○ ○ ○ | వృశ్చి<br>I I I I I<br>○ ○ ○ | తుల, శ<br>I I<br>○ ○ ○ ○ ○ ○ | కన్య<br>I I I I I<br>○ ○ ○ |

కమునకు బిందువులు రేఖలు సమానములుగ నాల్గేసి వచ్చును గనుక బుధుండు కర్కాటకరాశి గతుండైనపుడు శుభాశుభ ఫలముల రెంటి నీఁజాలఁడు. సింహమునకు నైదు బిందువులును మూఁడు రేఖలును వచ్చును గనుక బుధుండు సింహరాశి గతుండైనపుడు పాతికపాలు శుభఫలము నిచ్చుచుండును. కన్యకు నైదు రేఖలును మూఁడుబిందువులును వచ్చును గనుక బుధుండు కన్యారాశి గతుండైనపుడు పాతికపా లశుభఫల మిచ్చుచుండును. తులకు నాఱు బిందువులును రెండు రేఖలును వచ్చును గనుక బుధుండు తులారాశి గతుండైనపుడు అర

పాలశుభ ఫలము నిచ్చుచుండును. వృశ్చికమునకు మూఁడు బిందువులు నైదు రేఖలును వచ్చును గనుక బుధుఁడు వృశ్చికరాశి గతుఁడైనపుడు పాతికపాలశుభ ఫలము నిచ్చుచుండును. ధనుస్సుకు బిందువులును, రేఖలును సమానములుగ నాలుగేసి వచ్చును గనుక ధనుస్సును బొందినపుడు శుభాశుభ ఫలముల నీఁజాలఁడు. మకరానికి నైదుబిందువులు మూఁడు రేఖలును వచ్చును గనుక బుధుఁడు మకరరాశి గతుఁడైనపుడు పాతికపాలశుభ ఫలము నిచ్చుచుండును. కుంభమునకు మూఁడు రేఖలైదుబిందువులు వచ్చును గనుక కుంభరాశిగతుఁ డైనపుడు పాతికపాలు శుభ ఫలప్రదుండగును. మీనరాశి కైదుబిందువులు మూఁడు రేఖలును వచ్చును కాఁబట్టి బుధుఁడు మీనరాశిగతుఁ డైనప్పుడు పాతికపాలు శుభ ఫలము నిచ్చుచుండును. ఈప్రకారముగఁ దక్కిన గ్రహములకు అష్టక వర్గము లూహింపఁ దగినది. అయితే దశాంతర్దశాధ్యాయము నందు "ఏకగ్రహస్య సదృశే ఫలయో ర్విరోధే, నాశం వదే ద్యదధికం పరిపచ్యతే తత్" అని యిదివఱకు వచించి యుండి మఱల "ఇతి నిగదితమిష్టం నేష్ట మన్య ద్విశేషా, దధిక ఫలవిపాకం జన్మభాదత్ర దద్యాః" అని చెప్పుటవలనఁ బౌనరుక్త్యము సంభవించు చున్నదిగదా? అయినను సందియము లేదని వచించు విధమెట్లనఁగ, దశాంతర్దశాధ్యాయమునం దొకగ్రహ మొకకారణమువలన సువర్ణ ప్రదుఁడై యుండి మఱియొక కారణముచేత సువర్ణాపహారి యైనచో నపుడా గ్రహము సువర్ణదానముగాని, సువర్ణాపహరణముగాని చేయఁజాలఁ డనియు నొకగ్రహము రెండుకారణములచేత సువర్ణప్రదుఁ డై యుండి యొక కారణముచేత సువర్ణాపహారి యైనచో నపు డొక కారణమునకుం దగిన సువర్ణదానము చేయు ననియు నిట్లు పరస్పర విరుద్ధములై సమానములై యుండు రెండు ఫలములకును నాశముఁ జెప్పఁబడెను. ఈయష్టక వర్గమునందు నసమానములై యుండినప్పటికిని శుభాశుభత్వముచేతఁ బరస్పర విరుద్ధము లగు రెండు ఫలములు నశించునని చెప్పఁ బడినది. అదెట్లనఁగా, బాదరాయణ యవనేశ్వరాదులు ఆయాగ్రహ మున్నట్టి స్థానము మొదలు ఆయాస్థానముల యందున్న గ్రహము శుభాశుభ ఫలముల నిచ్చునని ప్రత్యేకముగ అష్టకవర్గ ఫలములం జెప్పినారు కాఁ

బట్టి అట్టి శుభాశుభ ఫలములు సమానములు గాకయుండినను నారెండు ఫలములు క్షయించు ననియు నిట్లు కొన్ని శుభఫలములును కొన్ని యశుభ ఫలములును బ్రాప్తించుచుండగ నాశుభాశుభముల యందు నేదధికంబుగ మిగులునో ఆఫలము ప్రాప్తించు ననియుం దెలియఁదగినది, అదెట్లనఁగ, అష్టకవర్గమునం దొకగ్రహము యవనేశ్వరా ద్యుక్త ప్రకారముగ నొకకారణముచేత సువర్ణదాత యైయుండి మఱియొక కారణముచేత రజతాపహారి యయ్యెనేని, ఆఫలంబులకు దానాపహరణాత్మకమైనవిరోధము గల్గియుండుటవలన నాగ్రహము సువర్ణదానంబుగాని, రజతాపహరణంబుగాని చేయఁజాలదు. ఇట్లేస్థానమునందు శుభాధిక్యము కల్గియుండునో ఆస్థానమునందు శుభుండును, ఏస్థానమునందు నశుభాధిక్యము గల్గియుండునో, ఆస్థానమునందు నశుభుండును, ఏస్థానమునందు శుభాశుభ సామ్యము గల్గియుండునో, ఆస్థానమునందు సముండును నగు నని తెలియఁ దగినది. ఈప్రకారముగ అష్టకవర్గమునందు సమానములు గాకయున్న ఫలములకుంగూడ నిష్టానిష్ట శోధనము చెప్పంబడి యుండుటంజేసి పౌనరుక్త్యము లేదని యర్థము. కాఁబట్టి యగదా వరాహమిహిరాచార్యులు అష్టకవర్గ ఫలంబులను వేఱువేఱుగఁ జెప్పక స్థాన సంజ్ఞామాత్రముచేత స్థానమునుబట్టి శుభాశుభత్వముం జెప్పినవాఁడయ్యె. యవనేశ్వరాదులును అష్టకవర్గ ఫలములను ప్రత్యేకముగఁ జెప్పియు, కట్టకడ వరాహమిహిరా చార్యోక్త క్రమమున శుభాశుభఫలములు సమాన సంఖ్యము లైయుండెనేని యారెండు ఫలములును క్షీణించుననియు శుభాశుభఫలములలో నధికము నైయున్నట్టి ఫలము ప్రాప్తించు ననియుం జెప్పియున్నారు. ఇందులకు, "ఫలాష్టవర్గే శుభపాప లబ్ధ్యో సమాన కల్పా వఫలా ప్రదిష్టా, జ్యాయాంస్తు యస్తస్య ఫలం విచార్యం యాత్రా విధానేన్న సముద్భవేచ" అని యవనేశ్వరుండును, "కష్ట శ్రేష్ఠే తుల్య సంఖ్యే ఫలేచే త్స్యాతాం నాశస్తు ఫలయోస్తత్ర వాచ్యః, వాచ్యాపంక్తి ర్వ్యతిరిక్తంతు యత్స్యాత్ స్థానేస్థానే కల్పనీయం ప్రతిష్టా" అని బాదరాయణులును వచించియున్నారు. కాఁబట్టి, "ఉపచయ గృహమిత్ర స్వోచ్చగైః" అనఁగా, లగ్నము మొదలుగాని, చంద్రుఁడుండురాశి మొదలుగాని,

యుపచయ స్థానముల యందును, తన మిత్రక్షేత్రమునందును, స్వోచ్చ స్థానమునందును, స్వక్షేత్ర మూలత్రికోణముల యందును నున్నట్టి గ్రహము అష్టకవర్గమునందు శుభఫలము లిచ్చునట్టి దయ్యేనేని యపు డత్యంత శుభఫలముల నిచ్చును. ఇందులకు, "లగ్నా దుపచయ సంస్థ శ్చంద్రాద్వాస్వగృహ మూల తుంగస్థః, మిత్రక్షేత్ర గతోవా ఫల మతిశయ తం శుభం దద్యాత్." అని దేవకీర్తిచేఁ జెప్పబడినది. "అపచయ గృహానిచారాతిగైః" అనఁగా లగ్నము మొదలుగాని, చంద్రుఁ డున్న రాశి మొదలు కొనిగాని, యపచయ స్థానములయం దును, తన నీచస్థానములయందును, శత్రుక్షేత్ర మునందును నున్నట్టి గ్రహము అష్టక వర్గమునందు శుభఫలము నిచ్చునట్టి దయ్యేనేని శుభఫల సంపదధికముగ నీనేరదు. ఇవ్విధమునం జెప్పుటంజేసి అష్టక వర్గమునందు నశుభఫల మిచ్చెడు గ్రహము అపచయ నీచ శత్రు స్థానములయం దుండెనేని, అధికముగ నశుభఫలము నిచ్చు ననియు, ఉపచయ స్వక్షేత్ర మిత్రక్షేత్ర స్వోచ్చ మూలత్రికోణముల యందుం డెనేని యశుభ ఫలమును స్వల్పముగ నిచ్చుననియు, శుభఫలమిచ్చెడు గ్రహము అపచయ నీచ శత్రుస్థానములయందు నుండెనేని శుభఫలము నల్పముగ నిచ్చు ననియుం దెలియఁ దగినది.

ఇచ్చట నుచ్చనీచాది స్థానగత శుభాశుభ ఫల కల్పన జన్మకాల గ్రహస్థితిని బట్టి చేయఁ దగినది. ఇందులకు, "అపచయ రాశౌ నీచే శత్రు క్షేత్రేచ జన్మకాలే స్యాత్, యస్తు సదద్యా త్పాపం ఫల మతిశ యితం యథాకాలమ్, యస్తు స్వనీచారి గృహోపగో న్యై ర్జితోరి దృ ష్టోల్ప తనుర్వి వర్ణః, సూతావ భూజన్మప తౌ బలస్థే సజన్మగో వంధ్య ఫలో విభక్తః, ఈష త్సుహృ త్స్వోచ్చ భృద్దిష్ట దృష్టోమిత్రర్క్ష జన్మో పచయే బలీయాన్, యోజాతకే భూత్సతు జన్మసంస్థోదద్యా చ్ఛుభం నత్వ శుభో హ్యనిష్టమ్, జన్మ న్యుపచయ భవనోపగా గ్రహా హ్యుపచ యేషు పుష్ట ఫలాః, అపచయ భవనోపేతాః స్థిత్వా స్థానే హ్యపచయా య ఫలకాలే" అని యివ్విధమున దేవకీర్తిచేతను, యవనేశ్వరుని చేతను, సత్యాచార్యులచేతను జెప్పఁబడియున్నది. కాఁబట్టి చంద్ర వ్యతిరిక్త గ్రహములు బలవంతులై యుండిరేని తమకుఁ జెప్పఁబడినటి

శుభాశుభ ఫలముల నధికముగ నిచ్చుననియు, బలహీనులై యుండిరేని యల్ప ఫలము నిత్తు రనియు, చంద్రుఁడు శుభుఁడైనను బలహీనుఁడు నై యుండినేని అశుభ ఫలము నిచ్చునుగాని శుభ ఫలము నియ్యజాలఁ డనియు, బలయుక్తుఁడైనచో శుభ ఫలము నిచ్చు ననియును జెప్పఁ దగినది. ఇందులకు, "పుష్ట మపుష్టం స్వ ఫలం దద్యాత్సబలో బలే నహీనశ్చ, గ్రహా ఇవ సర్వ శ్చంద్రః కష్టఫలో బలవిహీనస్తు" అని దేవకీర్తిచేఁ జెప్పఁబడి యున్నది.

ఇట్లు బృహజ్జాతక గ్రంథమునందు
అష్టకవర్గాధ్యాయం బనునది సంపూర్ణము.

---

## కర్మజీవాధ్యాయము.

అర్థాప్తిః పితృ జననీ సపత్న మిత్ర
భ్రాతృ స్త్రీభృతక జనా ద్దివాకరాద్యైః,
హోరేం ద్వో ర్దశమగతై ర్వికల్పనీయా
భేం ద్వర్కాస్పదపతిగాంశ నాథ వృత్త్యా. 1

తా. ఈయధ్యాయమునందు ధనార్జన మీావిధమునఁ జేయునని యెఱుంగుటకు లగ్న చంద్రులకు దశమస్థానమునం దుండునట్టి సూర్యాది గ్రహములం బట్టి దెలియఁ జేయఁబడినది. అదెట్లనఁగ:—జన్మ లగ్న చంద్రులకు దశమస్థానమునం దుండు సూర్యాది గ్రహములచేతఁ దండ్రి మొదలగు వారివలన ధనప్రాప్తి కల్పింపఁ దగినది. అనఁగా, జన్మలగ్నమున కైనను జన్మకాల చంద్రునికైనను దశమస్థానమునందు సూర్యుఁ డుండెనేని తండ్రివలన ధనము ప్రాప్తించు ననియును, చంద్రుఁడుండెనేని తల్లివలన ధనప్రాప్తి యగుననియు, అంగారకుఁ డుండినచో, "సపత్న=శత్రువులవలన, లేక, జ్ఞాతులవలన" ధనప్రాప్తి యనియును, బుధుఁడుండిన స్నేహితుల మూలక ధనప్రాప్తి యనియును, గురువుండినచోఁ దోడఁబుట్టిన వారివలన ధనలాభ మనియును,

శుక్రుఁ డుండినచో, కళత్రాది స్త్రీల మూలకముగ ధనప్రాప్తి యగు ననియును, శనైశ్చరుఁ డుండెనేని సేవకుల వలన ధనలాభ మనియును వచింప వలయును. మఱియు లగ్నమునకు దశమమునం దొకగ్రహము ను చంద్రునకు దశమమునందు మఱియొక గ్రహము నుండెనేని ఆరెం డు గ్రహములు తమ దశాకాలములయందు ముందు చెప్పఁబడిన వారి మూలకముగ ధనలాభము గలుగఁ జేయు నని తెలియఁ దగినది. లగ్నమునకును, చంద్రునకును, దశమస్థానమునందు ననేక గ్రహము లుండినచో దమ యంతర్దశలయందుఁ బూర్వోక్త ప్రకారముగ ధన లాభము గలుగు నని వచింపఁదగినది. ఇందులకు, ''ఉదయాదిందుతో వాపి యేగ్రహా దశమ స్థితాః, తే సర్వేర్థ ప్రదా జ్ఞేయాః స్వదశాసు యథోదితాః'' అని గార్గిచేఁ జెప్పఁబడినది. మఱియు లగ్నచంద్ర సూర్యులకు దశమ స్థానాధిపతులు ఏనవాంశల యందు నుండెదరో, ఆనవాంశలకు నధిపతులెవ్వరో, వారికి, ''అర్కాంశే తృణకనకొర్ణ భేష జాద్యైః'' అను వక్ష్యమాణ శ్లోకములయందు నేవృత్తులు చెప్పఁబడి యున్నవో, ఆవృత్తులచేత, ధనప్రాప్తి యగునని చెప్పఁదగినది. అం దులకు, ''లగ్నా ర్కామృతభానుభ్యో దశమాధిపతి గ్రహః, యస్మి న్నవాంశే తత్కాలం వర్తతే తస్య యః పతిః, తద్వృత్త్యా ప్రవదేద్వి త్తం జాతస్య బహుపోయది, భవంతి విత్త దాస్తేపి స్వదశాసు వినిశ్చి తాః'' అని గార్గిమునిచేఁ జెప్పఁబడినది.

అర్కాంశే తృణ కనకొర్ణ భేషజాద్యై
శ్చంద్రాంశే కృషి జలజాంగ నాశ్రయాచ్చ,
ధాత్వగ్ని ప్రహరణ సాహసైః కుజాంశే
సౌమ్యాంశే లిపి గణితాది కావ్య శిల్పైః. 2

తా. లగ్నచంద్ర సూర్యులకు దశమస్థానాధిపతియున్న నవాం శము సూర్యాంశ మైనచో, సుగంధద్రవ్యములు, బంగారము మేషాది రోమంబులచే నిర్మిత మగు కంబళాదులు, ఔషధము ఈచెప్పఁబడిన క్రయవిక్రయాదులచేతను, ఆదిశబ్దముచేత వైద్యక్రియా రోగపరిచ ర్యా దులచేతను, ధనప్రాప్తి గల్గు నని వచింపఁ దగినది. తృణము లనఁగా

సస్యాదులచే నైన ప్రసిద్ధ తృణము లనియెంచఁ దగినది. చంద్రాంశ యయ్యెనేని వ్యవసాయము వలనను, శంఖ ముక్తా ప్రవాళాది క్రయ విక్రయముల వలనను, స్త్రీల నాశ్రయించుట వలనను ధనప్రాప్తి వచింప వలయును. అంగారకాంశ మైనచో సువర్ణ రజత తామ్ర కాంస్యాదులును, మనశ్శిలా హరితాళాది ధాతువులును, అనఁగా నిట్టి పదార్థములచేఁ గ్రయవిక్రయ ధనలాభము గల్గునని చెప్పఁదగినది. మఱియు నగ్నిచేఁ జేయు కార్యములచేతను, ఖడ్గ చక్రాద్యాయుధ విక్రయముల చేతను, తద్ధారణముచేతను, మల్లక్రియాదుల చేతను ధనప్రాప్తి చెప్పఁ దగినది. బుధాంశ మైనచో అక్షర విన్యాస గణితశాస్త్ర జ్యోతిశ్శాస్త్ర వ్యాఖ్యాన యంత్ర ప్రయోగ ద్యూత నృత్య కవిత్వములచేతను, చిత్రపటములు పుస్తకములు పుష్పమాలికలు అనువాని చేతను ధనలాభము గల్గునని చెప్పఁదగినది.

జీవాంశే ద్విజ విబుధా కరాది ధర్మైః
కావ్యాంశే మణి రజతాది గోమహిష్యైః,
సౌరాంశే శ్రమవధ భార నీచ శిల్పైః
కర్మేశాధ్యుషిత నవాంశ కర్మసిద్ధిః. 3

తా. లగ్నచంద్ర సూర్యులకు దశమస్థానాధిపతి యున్న నవాంశ బృహస్పతి నవాంశ మైనచో, బ్రాహ్మణులును, దేవతలును, విద్వాంసులును, సువర్ణాంజన గజమాణిక్యాదుల యుత్పత్తి స్థానములును, క్రియావాద జపాదులును, ధర్మ యజ్ఞ దానోపవాస తీర్థయాత్రాదులును, వీనివలన ధనప్రాప్తియును, శుక్ర నవాంశమైనచో, మణి రజతాదుల చేతను, గజ తురగాదుల చేతను, గోమహిష్యాదుల చేతను, ధనప్రాప్తియును, శనైశ్చరాంశ మైనచో, మార్గాయాసము చేతను, మృగపక్ష్యాది జంతు వధచేతను,స్వశరీర తాడనాదులచేతను, భారములు మోయుట చేతను, నీచకార్యములచేతను, ధనప్రాప్తియును గలుగు నని వచింపఁ దగినది. మఱియు లగ్న చంద్ర సూర్యులకు దశమ స్థానాధిపతి చారవశమున నేనవాంశయం దుండునో యా నవాంశ పతి వశమున (అర్కాంశే) అనుశ్లోక ద్వయమున నేయేకర్మములు చెప్పఁబడినవో ఆయా ప్రకారము గలుగు నని యర్థము. మఱి

కొందఱు లగ్నమునకు దశమ స్థానాధిపతి యున్న నవాంశకు నేగ్రహ మధిపతియో, ఆగ్రహ మేకాలమునం దేయేరాశి యందు సంచరించు నో, ఆయాకాలములయందు నాయారాశిం బట్టి పూర్వోక్త వృత్తులు వచింపఁదగినవి. అదెట్లనఁగ, నవాంశాధిపతి ఉచ్చరాశి యందు నుండెనేని తదుక్త వృత్తులయందుఁ బ్రయత్నము లేకయ కార్యానుకూల మగుచుండు ననియు, నీచరాశి యందుండెనేని బహుప్రయత్నముల వలన స్వకీయ పోషణమాత్ర సిద్ధి యగుననియు, పరమోచ్చమందుండినచో సులభముగ విశేషఫల ప్రాప్తి యగు ననియు, పరమనీచ మందుండెనేని కష్టముచే నల్ప ఫల ప్రాప్తి యగు ననియు తెలియఁదగినది. ఇందులకు, "లగ్నకర్మాధిపో యస్మిన్ నవాంశే వర్తతే గ్రహః, చారక్రమేణ తత్తుల్యాం కర్మణాం సిద్ధి మాదిశేత్" అని గార్గి మునిచేఁ జెప్పఁ బడినది అని చెప్పెదరు. మఱికొందఱు దశమ స్థానాధిపతి యున్న నవాంశ రాశి చరరాశియై యుండినచో దూర దేశ గమనము వలనను, స్థిరరాశి యైనచో స్వదేశము నందు నుండుటవలనను, ద్విస్వభావరాశియై యుండెనేని స్వదేశ పరదేశముల వలనను ధనప్రాప్తి కలుగుననివచింతురు.ఇందులకు, "తదధీశే చరభాంశేప్రవాస తోర్థాగమంసుఖం లభతే, స్థిరభాంశకే స్వదేశా దుభయాంశకే సర్వతో ధన ప్రాప్తిః" అనిగ్రంథాంతరమునంజెప్పఁ బడినది. "కర్మేశా ద్వ్యషిత సమాన కర్మసిద్ధిః" అను పాఠమునందుఁ గూడఁ బూర్వోక్త తాత్పర్య మేర్పడు చున్నది.

మిత్రారిస్వగృహగతై ర్గ్రహై స్తతోర్థాం
స్తుంగస్థే బలినిచ భాస్కరే స్వవీర్యాత్,
ఆయస్థై రుదయ ధనాశ్రితైశ్చ సౌమ్యై
స్సంచిత్యంబలసహితై రనేకధా స్వమ్. 4

తా. మిత్ర శత్రు స్వజనాదుల వలన ధనప్రాప్తి కల్గు విషయ మిందుఁ జెప్పఁ బడినది. లగ్నచంద్రులకు దశమ స్థానమున నున్న గ్రహములుగాని, దశమస్థానమునందు గ్రహములు లేకుండెనేని లగ్న చంద్ర సూర్యులకు దశమాధిపతి యున్న నవాంశాధి పతులుగాని,

జన్మకాలమునందు మిత్రశత్రు స్వక్షేత్రముల యందుండిరేని ఆమిత్రా దులవలన అనఁగా మిత్రక్షేత్రమునం దుండెనేని మిత్రుల వలనను, శత్రుక్షేత్రమునం దుండెనేని శత్రువుల వలనను, స్వక్షేత్రమునం దుండెనేని స్వజనుల వలనను ధనప్రాప్తి యగును. జన్మకాలమునందుఁ బూర్వోక్త విధానముచేత ధనప్రదుఁ డగు సూర్యుండు బలవంతుఁడై మేషరాశి యందు నుచ్చస్థితుఁడై యుండినచోఁ దన సామర్థ్యము వలన ధనప్రాప్తి యగును. జన్మకాలమునందు నేకాదశ స్థానమున నున్నట్టియు, లగ్నద్వితీయముల యందున్నట్టియు స్వోచ్చాదిబల సహితము లైనట్టియు శుభగ్రహముల చేత ననేక విధములుగ ధనలాభము విచారింపఁదగినది. అనఁగా నెవ్విధముగ ధనమార్జింపఁ దలంచువాఁడో ఆప్రకారముగ ధనమార్జించు నని తెలియఁ దగినది. ఇందులకు, "ధనదా జన్మసమయే మిత్రారిస్వగృహోపగాః, యస్య తస్య ధనం దద్యాత్ మిత్రారి స్వగృహోద్భవమ్. ధనదో భాస్కరో యస్య తుంగే బల సమన్వితః, భవే జ్జన్మని తస్య స్యా ద్విత్త మాత్మోద్యమార్జితం. లాభార్థ లగ్నగై సౌమ్యైః ర్యేన యేనైవ కర్మణా, ధనార్జనం ప్రార్థయతే తేన యత్నాత్సమశ్నుతే" అని గార్గిమునిచేఁ జెప్పఁబడినది.

ఇట్లు బృహజ్జాతక గ్రంథమునందుఁ
గర్మాజీవాధ్యాయము సంపూర్ణము.

---

## రాజయోగాధ్యాయము.

ప్రాహు ర్యవనా స్స్వతుంగగైః
క్రూరైః క్రూరమతి ర్మహీపతిః,
క్రూరైస్తు న జీవశర్మణః
పక్షే క్షిత్యధిపః ప్రజాయతే. 1

తా. ఈయధ్యాయమునందు రాజయోగమును, యవన జీవశర్మలకుం గల మతభేదములును జెప్పఁబడినవి. అదెట్లనఁగ, మూఁడు మొదలగు గ్రహము లుచ్చరాసుల యందుండఁగా క్షత్రియ వంశమునం

బుట్టినవాఁడు రాజ్యాధిపతి యగునని సకల జాతక గ్రంథములయందుఁ బ్రసిద్ధముగ వచింపఁ బడినది. ఈవిషయమై యవనేశ్వరాదులు 'తమ యుచ్చస్థానముల యందున్నట్టి సూర్య శన్యంగారకులచేతఁ బాపబుద్ధి గలరాజు జనించు' నని చెప్పుచున్నారు. అట్లు చెప్పుటవలన శుభగ్రహము లుచ్చస్థితు లైయుండి రేని సౌమ్య స్వభావము గలవాఁడును, శుభ పాప గ్రహము లుచ్చస్థితులై యుండి రేని సౌమ్య పాప మిశ్రమ స్వభావుండును నగు నని యెంచ వలసియున్నది. ఇందులకు, "పాపైః పాపమతి స్స్వోచ్చగతై రథ ధర్మవాన్ సౌమ్యైః, వ్యామిశ్రై ర్మిశ్రమతిః పృథ్వీశో జాయతే మనుజః" అని యవనేశ్వరునిచేఁ జెప్పఁ బడినది. జీవశర్మగారి మతమునందు నుచ్చస్థానముల యందున్నట్టి పాపగ్రహములచేత రాజ్యాధిపతిగఁ బుట్టఁడని తెలియఁ జేయఁబడినది. అనఁగా, మూఁడు పాపగ్రహము లుచ్చస్థానముల యందుండఁగఁ బుట్టినవాఁడు రాజ్యాధిపతి కానేరఁ డనియు; రాజతుల్యుఁడును, క్రోధ శీలుండును,కలహ ప్రియుండును నగు ననియు జీవశర్మ మతమని తెలియఁ దగినది. ఇందులకు, "పాపై రుచ్చగతై ర్జాతా నభవంతి నృపానరాః, కింతు విత్తాన్వితాస్తే స్యుః క్రోధినః కలహ ప్రియాః" అని జీవశర్మగారు చెప్పియున్నారు. మఱియును, "త్రిప్రభృతిభి రుచ్చస్థైః నృపవంశ భవాభవంతి రాజానః, పంచాదిభి రస్యకులోద్భవాశ్చ తద్వత్త్రికోణ గతైః" అని లఘుజాతకమునందు సామాన్యముగఁ జెప్పఁబడి యుండుటంజేసి వరాహమిహిరాచార్యుల వారికి యవనోక్తమే సమ్మతమని తోఁచెడిని.

వక్రార్క జార్క గురుభి స్సకలై. స్త్రిభిశ్చ
స్వోచ్చేషు షోడశ నృపాః కథి తైక లగ్నే,
ద్వ్యేకాశ్రి తేషుచ తదైక తమే పలగ్నే
స్వక్షేత్రగే శశిని షోడశ భూమిపాస్స్యుః.

తా. శ్రేష్ఠమగు ముప్పది రెండు రాజయోగములు చెప్పఁబడినవి. అనఁగాఁ దమ యుచ్చరాసుల యందు నంగారక శని రవి గురువులు నల్వురుండి అందొకఁ డుండు రాశి జన్మలగ్నముగనుండినచో నాల్గు

రాజయోగము లనియు, వీరిలో ముగ్గు రుచ్చస్థానముల యందుండి అందొకఁ డున్న రాశి జన్మలగ్న మైనచోఁ బండ్రెండు రాజయోగము లగుననియుం దెలియఁ దగినది. ఉదాహరణము.—సూర్యుఁడు మేష రాశి యందును, కర్కాటకమున బృహస్పతియును, శని తులయందును, అంగారకుఁడు మకరమునను ఏరాసుల యందైనఁ దక్కినగ్రహములు నుండఁగా లగ్నము మేషమైనచో నొక యోగము, కర్కాటకమైనచో రెండవ యోగము, తులయయ్యేనేని మూఁడవయోగము, మకరమైనచో నాల్గవ యోగము.

మఱి మూఁడుగ్రహములచే నగు రాజయోగములెట్లనఁగ; మేషమునందు సూర్యుండును, కర్కాటకమునందు గురువును, తులయందు శనియును, ఇట్లుండి లగ్నము మేష మైనచో నొకయోగము. కర్కాటక మగునేని రెండవ యోగము. తులయగు నేని మూఁడవ యోగము. పూర్వోక్త యోగ చతుష్టయంబుతోఁ గూడ నేడు యోగము లని తెలియఁ దగినది. ఇదియునుంగాక, కర్కాటకమునందు బృహస్పతియు, తులయందు శనియు, మకరమునందుఁ గుజుండును, ఇవ్విధంబున గ్రహములుండఁగ లగ్నము కర్కాటకం బైనచో నెనిమిదవ యోగము. తుల యైనఁ దొమ్మిదవది. మకరంబగునేని పది. ఇదిగాక, మేషమునందు రవియు, తులయందు శనియు, మకరమందు నంగారకుండును, ఇవ్విధమున గ్రహము లుండఁగా లగ్నము మేషంబగునేని పదనొకొండవది. తుల యైనం బండ్రెండవది. మకరమాయెనేని పదమూఁడవది. మఱియు మేషమునందు సూర్యుండును, కర్కాటకమున గురువును, మకరమున నంగారకుండును ఈప్రకారముగ గ్రహము లుండఁగ లగ్నము మేషం బైనచోఁ బదనాల్గవ యోగము. కర్కాటకం బైనఁ బదేనవది. మకర మగునేని పదాఱవది. ఈప్రకారముగ నీశ్లోక పూర్వార్థంబున (౧౬) రాజయోగములు చెప్పఁబడినవి. మఱియుఁ జంద్రుఁడు స్వక్షేత్ర మగు కర్కాటకమున నుండఁగా, 'ద్వ్యేకాశ్రితేషు' ఇచ్చట, 'ద్వ్యాశ్రితేషు-ఏకాశ్రితేషు' అని యాశ్రిత శబ్దము ప్రత్యేకముగ సంబంధించును. కాఁబట్టి పూర్వము చెప్పఁబడిన కుజ శని గురువులలో "ద్వ్యాశ్రితేషు" రెండు గ్రహము లుచ్చగతములై

యుండి అందొకఁడు లగ్నమునందు నుండెనేని పండ్రెండు రాజయోగము లగుచున్నవి. 'ఏకాశ్రితేషు' అనఁగాఁ జంద్రుఁడు స్వక్షేత్రమునందు నుండఁగా నొక్కఁడు యుచ్ఛస్థాన గతుఁడై లగ్నమునందుండెనేని నాల్గు రాజ యోగము అగును. అదెట్లనఁగా, మేషమునందు రవియు, కర్కాటకమునందు గురుచంద్రులును, ఇవ్విధంబుగ నుండినచో; లగ్నము మేషమైన నొక రాజయోగము. కర్కాటకం బయినచో రెండవ రాజయోగము. మఱియు మేషమున సూర్యుఁడును, కర్కాటకమునందుఁ జంద్రుఁడును, తులయందు శనియు నుండినచో లగ్నము మేషమైన మూఁడవ రాజయోగము. తులయైన నాల్గవ రాజయోగము. మేషమునందు రవియును, కర్కటకమునఁ జంద్రుఁడును, మకరమున నంగారకుండును ఇవ్విధమున నుండఁగా లగ్నము మేషమగు నేని యైదవ రాజయోగము. మకర మాయెనేని యాఱవ రాజయోగము. కర్కాటకమునందుఁ జంద్ర గురులును, తులయందు శనియు, నిట్లుండఁగా లగ్నము కర్కాటక మైనచో నేడవ రాజయోగము. తులయయ్యేనేని యెనిమిదవ రాజయోగము. కర్కాటకమున గురు చంద్రులును మకరమునఁ గుజుండు నుండినచో లగ్నము కర్కాటక మగు నేని తొమ్మిదవ రాజయోగము. మకర మగు నేని పదవ రాజయోగము. తులయందు శనైశ్చరుండును, మకరమునందు నంగారకుండును, కర్కాటకమునందుఁ జంద్రుఁడు నుండఁగా, లగ్నము తులయగు నేని పదునొకొండవ రాజయోగము. మకరమైనచోఁ బండ్రెండవ రాజయోగము. చంద్రుండు స్వక్షేత్రమునం దుండఁగా నొకగ్రహముచ్ఛస్థాన స్థితమైలగ్నమును బొందుట వలన నేర్పడు యోగము లెవ్వియనఁగా, కర్కాటకమునందుఁ జంద్రుఁడును, మేషమునందు సూర్యుండును ఇవ్విధ మున నుండఁగా లగ్నము మేషమైనచో నొక రాజయోగము. కర్కాటకమునందు గురు చంద్రు లుండఁగా లగ్నము కర్కాటకమైనచో రెండవ రాజయోగము. కర్కాటకమునందుఁ జంద్రుఁడును, తులయందు శనైశ్చరుండును ఇవ్విధ ముండఁగా లగ్నము తులయగు నేని మూఁడవ రాజయోగము. కర్కాటకమునందుఁ జంద్రుఁడును, మకరమున నంగారకుండును ఇవ్విధ ముండఁగా లగ్నము మకర మైనచో నాల్గవ రాజయో

గము. ముందు చెప్పిన పండ్రెండు యోగములతోడఁ గూడ బదునాలు యోగములైనవి. ఇవ్విధమున నుత్తరార్థమునందు, "షోడశ భూమిపాః" అను ౧౬ రాజయోగములును జెప్పఁబడినవి. పూర్వోత్తరార్థముల యందుఁ జెప్పఁబడిన వన్నియుంగూడి ముప్పది రాజయోగములైనవి.

వర్గోత్తమ గతే లగ్నే చంద్రేవా చంద్రవర్జితైః,
చతురాద్యైర్గ్రహైర్దృష్టే నృపా ద్వావింశతి స్స్మృతాః. ౩

తా. మఱియు నలువది నాలుగు రాజయోగములు చెప్పఁబడినవి. ఎట్లనఁగా:—వర్గోత్తమ నవాంశను బొందియున్నట్టి జన్మలగ్నముగాని, వర్గోత్తమాంశను బొందియున్నట్టి చంద్రుఁడుగాని, చంద్రవ్యతిరిక్తములగు నాలుగు గ్రహములచే నైనను (ఆదిశబ్దము వలన నైదాఱు గ్రహములని యర్థము) చూడఁబడుచుండఁగా నిరువది రెండు రాజయోగములు చెప్పఁబడినవి. లగ్నమువలన ౨౨ను, చంద్రునివలన ౨౨నుంగూడ నలువదినాల్గు రాజయోగము లగుచున్నవి. అదెట్లనిన; లగ్నముగాని చంద్రుఁడుగాని నాలుగు గ్రహములచేతఁ జూడఁబడెనేని ౧౫ రాజయోగము లేర్పడును. అయిదు గ్రహములచే జూడఁబడెనేని యాఱు యోగము లేర్పడును. ఆఱు గ్రహములచేతం జూడఁబడెనేని యొక రాజయోగ మేర్పడును. అదెట్లనిన; లగ్నముగాని చంద్రుఁడుగాని రవి బుధ కుజ గురువులచేతఁ జూడఁబడెనేని యొక రాజయోగము. రవి కుజ బుధ శుక్రులచే రెండు యోగములు. రవి కుజ బుధ శనులచేత మూఁడుయోగములు. రవి కుజ గురు శుక్రులచేత నాల్గుయోగములు. రవి కుజ గురు శనులచేత నైదుయోగములు. రవి కుజ శుక్ర శనులచేత నాఱుయోగములు. రవి బుధ గురు శుక్రులచేత నేడుయోగములు. రవి బుధ గురు శనులచేత నెనిమిది యోగములు. రవి బుధ శుక్ర శనులచేతఁ దొమ్మిది యోగములు. రవి గురు శుక్ర శనులచేత బదియోగములు. కుజ బుధ గురు శుక్రులచేతఁ బదునొకండు యోగములును. కుజ బుధ గురు శనులచేతఁ బండ్రెండు యోగములును. కుజ బుధ శుక్ర శనుల

 

చేతఁ బదుమూఁడు యోగములు. కుజ గురు శుక్ర శనులచేతఁ బదునాల్గు యోగములు. బుధ గురు శుక్ర శనులచేతఁ బదేను యోగములు. ఇవ్విధమున లగ్నముగాని చంద్రుఁడుగాని నాల్గుగ్రహములచేతఁ జూడఁబడుట వలనఁ బదేను యోగము లేర్పడును. మఱియుఁ బంచ గ్రహ వికల్పము లెట్లనిన; లగ్నముగాని చంద్రుఁడుగాని రవి కుజ బుధ గురు శుక్రులచేతం జూడఁ బడెనేని యొక రాజయోగము. రవి కుజ బుధ గురు శనులచేత రెండు యోగములు. రవి కుజ బుధ శుక్ర శనులచేత మూఁడు యోగములు. రవి కుజ గురు శుక్ర శనులచేత నాల్గుయోగములు. రవి బుధ గురు శుక్ర శనులచేత నైదు యోగములు. కుజ బుధ గురు శుక్ర శనులచేత నాఱు యోగములు. ఇవ్విధమున నైదు గ్రహములచేతఁ జూడఁబడుట వలన నాఱు యోగము లేర్పడుచున్నవి. ఆఱు గ్రహములచేత నేర్పడు యోగము లెట్లనిన; రవి కుజ బుధ గురు శుక్ర శనులచేతఁ జూడఁబడెనేని యొక యోగము. ఈప్రకారముగా లగ్నము వలన నిరువది రెండు యోగములును, చంద్రుని వలన నిరువది రెండును రెండుంగూడి నలువదినాల్గు రాజయోగములు చెప్పఁబడినవి. ఈప్రకారము పంద్రెండు రాసులయందుఁ బ్రత్యేకముగ వర్గోత్తమాంశస్థితిం బట్టి గణితముచేయఁగా లగ్నము వలన ౨౬౪ ను చంద్రునివలన ౨౬౪ నుం గూడి ౫౨౮ రాజయోగము లేర్పడుచున్నవి. ఇందులకు, "విలగ్న భవనంగతే బలయుతేచ వర్గోత్తమే చతుః ప్రభృతిభిర్గ్రహైశ్శశినివా సమాలోకితే, నసంభవతి పార్థివః పటుకృపాణపాణీరణే కదాచిదపి వీక్షితే రిపుజనో న యస్యాననమ్." అని మాండవ్యులవారిచేఁ జెప్పఁబడినది. పరమార్థమువలన నీశ్లోకమునందుఁ జెప్పఁబడినవి. రెండు యోగము లగుచున్నవి. అదెట్లనఁగ; చంద్రుఁడు వర్గోత్తమాంశ గతుండై చతుఃప్రభృతి గ్రహములచేఁ జూడంబడుట నొక యోగముగను లగ్నము వర్గోత్తమాంశ గతమై చతుఃప్రభృతి గ్రహములచేతఁ జూడఁబడుట రెండవ యోగముగను నూహింపఁదగినది.

యమే కుంభే ర్కేజే గవి శశిని తైరేవ తనుగై
ర్నృయుక్ సింహాళిస్థై శ్శశిజ గురు వక్రై ర్నృపతయః,

యమేందూ తుంగేంగే సవిత్ర శశిజౌ షష్ఠభవనే
తులాజేందు క్షేత్రైః ససిత కుజ జీవైశ్చ నరపౌ. 4

తా. మఱల నైదు రాజయోగములు జెప్పఁబడినవి. ఎట్లనఁగ- శనైశ్చరుఁడు కుంభమునందును, సూర్యుఁడు మేషమునందును, చంద్రుఁడు వృషభము నందునునుండి అశని సూర్య చంద్ర యుక్తము లైన కుంభ మేష వృషభముల యం దొక్కటి లగ్న మగుచుండఁగ మిథున సింహ వృశ్చికములయందున్నట్టి బుధ గురు కుజులచేత మూఁడు రాజయోగము లేర్పడుచున్న వని తెలియఁ దగినది. అదెట్లనఁగ; కుంభమునందు శనియు, మేషమున సూర్యుఁడు, వృషభమునఁ జంద్రుఁడును, మిథునమున బుధుండును, సింహమున బృహస్పతియును వృశ్చికమున నంగారకుండును ఇవ్విధమున గ్రహము లుండఁగా జన్మలగ్నము కుంభమయ్యెనేని యొక యోగము. మేషమయ్యెనేని రెండవయోగము. వృషభమయ్యెనేని మూఁడవయోగము. శని చంద్రులు తమ యుచ్చస్థానము లైన తులా వృషభముల యం దుండి ఆ తులా వృషభములలో నొకటి లగ్నమై రవి బుధులు కన్యయందు నుండఁగ శుక్ర కుజ గురువులతోఁ గూడిన తులా మేష కర్కాటకములచేత రెండు రాజయోగము లేర్పడును. అదెట్లనఁగ తుల యందు శనియు, వృషభమునఁ జంద్రుఁడును, కన్యయందు రవి బుధులును, తులయందు శుక్రుఁడును, మేషమున నంగారకుండును, కర్కాటకమున గురువును ఇవ్విధముగ గ్రహము లుండెనేని తులాలగ్నమైనచో నొకరాజయోగము. వృషభమైనచో రెండవ రాజయోగము. పూర్వార్థమునందుఁ జెప్పఁబడిన మూఁడు యోగములతోఁ గూడిన నీశ్లోకమునందు నైదురాజ యోగములు చెప్పఁబడినవి. కొందఱు షష్ఠ భవనమనఁగా లగ్నమునకు నాఱవరాశి యనిచెప్పి తులా లగ్నమునందు శుక్రుఁ డుండఁగా మీనమున సూర్యుఁ డుండఁడు కాఁబట్టి అది యయుక్త మని పూర్వపక్షము ప్రాప్త మగుచుండఁగా వక్ష్యమాణ వజ్రాది యోగముల యందు సూర్యుఁ డున్న రాశికిఁ జతుర్థ స్థానమునందు బుధ శుక్రుల స్థితిం జెప్పఁ బడియుండుటం జేసి ఆఱవ రాశి యని చెప్ప వచ్చునని యా పూర్వపక్షమును నివా

రింతురు. కాఁబట్టి యిందులకు "తులాలగ్నే సిత సౌరౌ మేషే భౌమో గురుఃకుళీరగతః, కన్యాయాం రవి శశిజౌ జాతో నృపతి ర్వృషేచ చంద్రేవా" అను బాదరాయణ వచనము వలన 'షష్ఠభవన' మనఁగాఁ గన్యారాశి యని సిద్ధాంతము.

కుజే తుంగే ర్కేందో ర్ధనుషియమ లగ్నేచ కుపతిః
పతిర్భామే శ్చాన్యః క్షితిసుత విలగ్నే స శశిని,
సచంద్రే సౌరే స్తే సురపతిగురౌ చాప ధరగే
స్వోతుంగస్థే భానా వుదయ ముపయాతే క్షితిపతిః. 5

తా. అంగారకుఁడు తన యుచ్చస్థాన మగు మకర లగ్నము నందును, సూర్య చంద్రులు ధనుస్సునందును, శనైశ్చరుఁడు జన్మ లగ్న మగు మకరమునందును, ఇవ్విధమున నుండఁగా జన్మించిన వాఁడు రాజగునని తెలియఁదగినది.మఱికొందఱు, "యమలగ్నే" యనిచెప్పు టంజేసి శనైశ్చరుండు లగ్నమునందు లేకయుండినను మకర కుంభము లలో నొక లగ్నమందని చెప్పుదురుగాని యది యుక్తముగాదు. "లగ్నే సౌర స్తుంగే భౌమ శ్చంద్రాదిత్యౌ చాప ప్రాప్తౌ" అని బాదరాయణ వచనమునందును, "ఆదిత్యశ్చ నిశాకరశ్చ భవతో వాగీశ రాశౌ యదాసార్ధం భాస్కరిణా స్వరాశి సహితః ప్రాప్తో మృగే మంగళః, ప్రాప్నోతి ప్రభవం తదా ససుకృతీక్ష్మాపాల చూడామణి స్త్రిస్యంతే పరిపంథినో రణముఖేయస్మాత్కృతాంతాదివ" అనిమాండవ్యవచనమునందును నున్నవిగనుక తొలుతఁజెప్పినవచనము సాధువని తెలియఁ దగినది. ఈయోగమునందు నంగారక సహితమైన మకరలగ్నముచంద్రునితోఁగూడిన దగుచుండ ధనుస్సునందు సూర్యుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు మఱియొక్కండైన భూపాలుం డగును. అనఁగా జన్మలగ్న మగు మకరమునందు నంగారక చంద్రులును ధనస్సున సూర్యుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు రాజగు ననియర్థము. ఇందులకు, "భానుశ్చాపే సేందు ర్భౌమ స్తుంగప్రాప్తో లగ్నేవాస్యాత్" అని బాదరాయణ వచన ప్రమాణమున్నది. చంద్రసహితుఁడైనట్టి శని యేడవయింటను, బృహస్పతి ధనస్సునను నుండఁగా సూర్యుఁడు తన యుచ్చరాశి యగు

మేషమునందుండి లగ్నగతుఁడైనచో అనఁగా మేషము లగ్నమగుచు నందు సూర్యుండును, ధనుస్సున గురువును, చంద్ర శనులు తులయందును ఇవ్విధముననుండఁగాఁ బుట్టినవాఁడు రాజగునని యర్థము.

వృషే సేందౌ లగ్నే సవితృ గురు తీక్ష్ణాంశుతనయైః
సుహృజ్జాయా ఖస్థై ర్భవతి నియమా న్మానవపతిః,
మృగే మందే లగ్నే సహజ రిపు ధర్మ వ్యయగతైః
శశాంకాద్యై ర్జాతః పృథు గుణ యశాః పుంగవపతిః. 6

తా. మఱల రెండురాజయోగములు జెప్పఁబడినవి. అదెట్లనఁగా; వృషభము లగ్నమై ఆలగ్నమునందుఁ జంద్రుఁడును, సింహమున సూర్యుండును, వృశ్చికమున గురుండును, కుంభమున శనైశ్చరుండును ఇవ్విధముననుండఁగాఁ బుట్టినవాఁడు రాజగు నని వచింపఁదగినది. "నియతాత్మానరపతిః" అని పాఠాంతరము. మఱియు మకరము లగ్నమై యందు శనియును, మీనమునందుఁ జంద్రుఁడును, మిథునమున నంగారకుండును, కన్యయందు బుధుండును, ధనుస్సునందు బృహస్పతియు నివ్విధం బుండఁగాఁ బుట్టినవాఁడు విస్తార మగు శౌర్యాది గుణములును, కీర్తియును గలరాజశ్రేష్ఠుఁ డగు నని తెలియఁదగినది. "శశాంకాద్యైః" అని పాఠాంతరము. యోగములు రెండు. ఇందులకు, "మృగే లగ్నే సౌర స్తిమి యుగ గత శ్శీతకిరణః కుజే యుగ్మే నార్యా శశధరసుత శ్చాప ధరగః, గురు ర్దైత్యే జ్యారాభవభిమతగతౌ చారవశతః ప్రసూతౌ యస్యా సౌ భవతి నరప శ్శక్ర సదృశః" అని మాండవ్యమునిచేఁ జెప్పఁబడినది.

హయే సేందౌ జీవే మృగముఖగతే భూమితనయే
స్వతుంగస్థౌ లగ్నే భృగుజ శశిజా వత్ర నృపతీ,
సుతస్థౌ నక్రార్కీ గురు శశి సితా శ్చాపి హిబుకే
బుధే కన్యాలగ్నే భవతి హి నృపో న్యోపి గుణవాన్. 7

తా. మఱియు మూఁడురాజయోగములు చెప్పఁబడినవి. అనఁగా ధనుస్సున గురు చంద్రులును మకరమున నంగారకుండును శుక్రుఁడు

మీనమునందునునుండి మీనములగ్న మైనచో నొకయోగము. కన్య యందు బుధుఁడుండి లగ్నము కన్యయైనచో రెండవయోగము.-ఈరెండు యోగములయందుఁ బుట్టినవారును రాజు లగుదురు. మఱియుఁ గుజ శనులు పంచమ స్థానమునందును, గురు చంద్ర శుక్రులు చతుర్థ స్థాన మునందును, బుధుఁడు జన్మ లగ్నమగు కన్యయందునునుండఁగా బుట్టిన వాఁడు రాజవంశ వ్యతిరిక్తవంశ సంజాతుండైనను, సద్గుణవంతుఁడును రాజ్యాధిపతియు నగునని తెలియఁదగినది.

ఝషే సేందౌ లగ్నే ఘట మృగ మృగేంద్రేషు సహితై
ర్యమా రారైర్కై రోప్యేభూ త్సఖిలు మనుజ శ్యాస్తి వసుధాం,
అజే సారే మూర్తౌ శశి గృహగతే చామరగురౌ
సురేజ్యేవా లగ్నే ధరణిపతి రన్యోపి గుణవాన్. 8

తా. అనఁగా లగ్నము మీనమై యందుఁ జంద్రుండును, కుంభమున శనియును, మకరమున నంగారకుండును, సింహమున సూ ర్యుఁడు నుండఁగాఁ బుట్టినవాఁడు భూపాలుం డగునని తెలియఁ దగిన ది. మఱియు లగ్నము మేషమై అందుఁ గుజుఁ డుండి గురువు కర్కా టకమునం దుండినచోఁ బుట్టినవాఁడు రాజగునని తెలియఁ దగినది. అట్లుకాని పక్షమున బృహస్పతి కర్కాటకమున నుండి ఆ కర్కాటక రాశి లగ్నమై కుజుఁడు మేషమునందుండి నట్లయిన ఆకాలమునఁ బుట్టిన వాఁడు భూపాలుం డగునని యెఱుంగ వలయును.

కర్కిణి లగ్నే తత్స్థే జీవే చంద్ర సిత జ్ఞై రాయ ప్రాప్తైః,
మేషగతేర్కే జాతం విద్యా ద్విక్రమ యుక్తం పృథ్వీనాథమ్.

తా. కర్కాటకము లగ్నమై యందు గురువుండి చంద్ర శుక్ర బుధులు ఏకాదశ స్థానమునను, సూర్యుఁడు మేషమునను నుండినచోఁ బుట్టినవాఁడు పరాక్రమ శీలుఁడై రాజగు నని తెలియఁ దగినది.

మృగముఖేర్కితనయే తనుసంస్థే
క్రియ కులీర హరయోధిప యుక్తాః,
మిథున తౌళి సహితౌ బుధ శుక్రౌ
యది తదా పృథుయశాః పృథివీశః. 10

తా. అనఁగా మకరము లగ్నమై అందు శనియును, మేషమున నంగారకుండును, కర్కాటకమునఁ జంద్రుండును, సింహమునందు సూర్యుండును, మిథునమున బుధుండును, తులయందు శుక్రుండు నుం డినచోఁ జాతకుఁడు సత్కీర్తి వంతుఁడై భూపాలుం డగునని తెలియఁ దగినది.

స్వోచ్చలగ్నే బుధేలగ్నే భృగౌ మేషూరణాశ్రితే,
సజీవే స్తే నిశానాథే రాజా మందార యోస్యతే. 11

తా. అనఁగాఁ గన్య లగ్నమై అందు బుధుండును, మిథునమున శుక్రుండును, మీనమున గురు చంద్రులును, మకరమున శని కుజులును ఇవ్విధమున నుండఁగఁ బుట్టినవాఁడు రాజగునని తెలియఁ దగినది.

అపి ఖల కులజాతా మానవా రాజ్య భాజః,
కిముత నృపకులోత్థాః ప్రోక్త భూపాల యోగైః,
నృపతి కులసముత్థాః పార్థివా వక్ష్యమాణై
ర్భవతి నృపతి తుల్యా స్తేష్వ భూపాలపుత్రాః. 12

తా. ఈ చెప్పఁబడిన రాజయోగముల యందుఁ బుట్టినవా రన్య కుల సంజాతులైనను రాజ్యాధిపతు లగుదురనియు నిఁకఁ జెప్పఁబడు నట్టి యోగములం బుట్టిన క్షత్రియ వంశజులు మాత్రము రాజ్యాధి పతు లగుదురనియు అన్యకుల సంభవులు రాజతుల్యు లగుదురనియుఁ జెప్పఁబడినది. ఈ చెప్పఁబడిన రాజయోగములచేత నీచకులమునం బుట్టినవారైనను పురుషులు రాజ్యాధిపతు లగుదురని తెలియఁదగినది. క్షత్రియవంశమునందుఁ బుట్టినవారు రాజ్యాధిపతు లౌదురని చెప్ప నేల? అనఁగా రాజ్యాధిపతు లగుదురని యర్థము. వక్ష్యమాణ రాజ యోగములచేత క్షత్రియ వంశసంజాతులు రాజు లగుదు రనుటకు సందియములేదు. ఆ రాజయోగములయందు నితర కులమునం బుట్టిన వారు రాజతుల్యు లగుదురని తెలియఁదగినది.

స్వోచ్చ స్వత్రికోణాగై ర్బలస్థై
స్త్రిద్యై ర్భూపతి వంశజా నరేంద్రాః,

పంచాదిభి రన్య వంశజాతా
హీనై ర్విత్త యుతా నభూమిపాలాః. 13

తా. అనఁగాఁ దను యుచ్చ మూలత్రికోణములను బొంది నట్టి స్థానదిక్కాలాది బలయుక్తములైన మూఁడు నాలుగు గ్రహములవలన క్షత్రియవంశమున జనించినవారు రాజు లగుదురనియు, ఉచ్చ మూలత్రికోణముల యందు స్థానాది బలయుక్తములై యున్న ౫-౬ గ్రహములచేత నన్యకులమునం బుట్టినవారు రాజ్యాధికారు లగుదురనియు, మూఁడు గ్రహములు మూలత్రికోణములయందు స్థానాది బలహీనములై యున్నను, ఒకటి రెండు గ్రహములు స్వోచ్చ మూల త్రికోణముల యందు బలయుక్తములై యున్నను క్షత్రియ కులోద్భవులు ధనవంతు లగుదు రనియు, రాజయోగము కల్గదనియు, పూర్వోక్త సంఖ్యాక గ్రహములలోఁ గొన్ని యుచ్చస్థానముల యందును, గొన్ని మూలత్రికోణ స్థానముల యందును, ఇవ్విధముగఁ జెప్పఁబడినట్టి సంఖ్యకుఁ దక్కువ పడక యుండెనేని యథోక్త ఫలప్రదము లగునని యును తెలియఁదగినది.

లేఖా స్థేర్కేజేందా లగ్నే భౌమే స్వోచ్చే కుంభే మందే,
చాప ప్రాప్తే జీవే రాజ్ఞః పుత్రం వింద్యాత్పృథ్వీనాథమ్. 14

తా. మఱియొక రాజయోగము చెప్పఁబడినది. అదెట్లనఁగా; ఏప్రదేశమునందు నాకాశము భూమినంటి యున్నట్లు కనఁబడుచున్నదో యాప్రదేశము లేఖాశబ్దముచేతఁ జెప్పఁబడును. అనఁగా నిక్కడ నుదయస్థాన మని యర్థ మిచ్చుచున్నది. కాఁబట్టి యుదయించుచున్నట్టి సూర్యుఁడు మేషరాశియందును, అదేరాశి యందుఁ జంద్రుండు నుండి మేషము లగ్నమై అంగారకుఁడు మకరరాశి యందును, కుంభమునందు శనియును గురువు ధనుస్సునందు నుండఁగాఁ బుట్టినవాఁడు రాజశ్రేష్ఠుం డని తెలియఁ దగినది. అన్యకులమునం బుట్టిన వాఁడు ధనవంతుం డగునని తెలియఁదగినది. "లేయస్థేర్కే" అను పాఠాంతరమునందు సూర్యుఁడు సింహరాశి యందుండఁగా నని యర్థముఁ గలదు.

స్వర్క్షే శుక్రే పాతాళస్థే ధర్మస్థానం ప్రాప్తే చంద్రే,
దుశ్చిక్యాంగ ప్రాప్తి ప్రాప్తే శ్శేషైర్జాతః స్వామీభూమేః. 15

తా. అనఁగా జన్మలగ్నము కుంభమై వృషభమున శుక్రుండును తులయందుఁ జంద్రుండును తక్కిన గ్రహములు యథాసంభవముగ మేష కుంభ ధనుస్సులయందు నుండఁగాఁ బుట్టినవారు రాజులగుదురనియు నన్యకులజాతులు ధనికు లగుదురనియు కర్కాటకము లగ్నమై తులయందు శుక్రుండును మీనమునఁ జంద్రుండును అన్యగ్రహములు కన్యా కర్కాటక వృషభములయందునుండఁగా బుట్టినవారు రాజవంశశ్రేష్ఠులును మహదైశ్వర్యసంపన్నులును అగుదురనియు నెఱుంగునది. అన్యకుల జాతుఁడు ధనికుఁ డగునని తెలియం దగినది.

సౌమ్యే వీర్యయుతే తనుయుక్తే వీర్యాఢ్యేచ శుభే శుభయాతే,
ధర్మార్థోపచయే ష్వవశేషై ర్ధర్మాత్మా నృపజః పృథివీశః. 16

తా. షడ్బల సంపన్నుండగు బుధుఁడు లగ్నమునందుండి గురు శుక్రులలో నొకండు బలయుతుఁడై తొమ్మిదవ యింటనుండఁగ నితర గ్రహములున్ - ౨-౩-౬-౧౦-౧౧ఇండ్ల నుండినను రాజయోగ మగును. ఆయోగమునం బుట్టినవాఁడు రాజగుటయేగాక పుణ్యాత్ముండుగూడనగును. అన్యకులజుండు ధనవంతుండగును. ''శుభేసుఖయాతే'' అనుపాఠమునందు శుభగ్రహము చతుర్థస్థానమునం దుండఁగా నని యర్థము.

వృషోదయే మూర్తి ధనారి లాభగై
శ్శశాంక జీవార్కిసుతా పరై ర్నృపః,
సుఖే గురౌ ఖే శశి తీక్ష్ణదీధితీ
యమోదయే లాభగతై ర్నృపోపరైః. 17

తా. అనఁగా లగ్నమగు వృషభమునఁ జంద్రుండును, మిథునమున గురువును, తులయందు శనైశ్చరుండును, సూర్య బుధ కుజ శుక్రులు మీనమునను నుండఁగాఁ బుట్టిన క్షత్రియుండు నృపేంద్రుండగు నని యెంచవలయును. మఱియు లగ్నమున శనియు, నాల్గవయింట గురువును, పదవయింట రవిచంద్రులును, కుజ బుధ శుక్రు లేకాదశ

స్థానముననుండఁగాఁ బుట్టిన క్షత్రియుఁడు నృపాలాగ్రేసరుం డగునని తలంచవలయును. అన్యకులజుండు ధనాఢ్యుం డగునని తలంపఁ దగినది.

మేషూరణాయ తనుగా శ్శశి మంద జీవా
జ్ఞారాధనే సితరవీ హిబుకే నరేంద్రమ్,
వక్రాసితౌ శశి సురేజ్య సితార్క సౌమ్యా
హోరా సుఖాస్త శుభఖాప్తి గతాః ప్రజేశమ్. 18

తా. అనఁగా దశమమునఁ జంద్రుఁడును, ఏకాదశమున శని యును, లగ్నమునందు బృహస్పతియును, ద్వితీయ స్థానమున బుధ కుజులును, చతుర్థ స్థానమున శుక్రసూర్యులును, ఇవ్విధమున నుండఁగాఁ బుట్టిన వానిని రాజుగఁ జేయుదు రని తెలియఁ దగినది. మఱియు లగ్న మునందు శన్యంగారకులును, చతుర్థమునఁ జంద్రుఁడును, సప్తమమున బృహస్పతియును, నవమమున శుక్రుండును, దశమమున సూర్యుండును, ఏకాదశమమున బుధుండును, ఇవ్విధముననుండఁగఁ బుట్టినవాఁడు రాజేంద్రుం డగు నని తెలియం దగినది. అన్యకులజుండు ధనికుం డగు నని యెంచఁ దగినది.

కర్మలగ్న యుత పాకదశాయాం
రాజ్యలబ్ధి రథవా ప్రబలస్య,
శత్రు నీచ గృహయా తదశాయాం
ఛిద్ర సంశ్రయ దశా పరికల్ప్యా. 19

తా. రాజయోగమునఁ బుట్టిన వారికి రాజ్యప్రాప్తి కాల మును, రాజ్యభ్రంశాది కాలమును జెప్పఁబడినది. రాజయోగము నిచ్చు గ్రహములయందు లగ్నమునకు దశమ స్థానమునను, జన్మ లగ్నము నందును, ఉన్నట్టి గ్రహాంత ర్దశయందు రాజయోగమునం బుట్టిన వానికి రాజ్య ప్రాప్తి యగు ననియు, ఆలగ్న దశమములయందు రెంటి యందును, రెండుగ్రహము లుండినను స్థాన ద్వయమునం దనేక గ్రహ ము లున్నను, అందు బలాధిక గ్రహాంత ర్దశయందు రాజ్యప్రాప్తి యగు ననియు, అట్లుగాని పక్షమున లగ్నదశమములయందు గ్రహములు లేకుండెనేని జన్మకాలమున సకలగ్రహములయందు నేగ్రహము బలా

ధికంబై యుండునో ఆగ్రహాంతర్దశయందు రాజ్యప్రాప్తి యగుననియు నెఱుంగవలయును. ఇవ్విధము నేకాంతర్దశలు రాజ్యప్రదములుగ నేర్ప డెనేని చారవశమున నేగ్రహము స్వాంతర్దశాకాలమునం దతిబలయుక్తమైయుండునో ఆగ్రహాంతర్దశయందు రాజ్యప్రాప్తియగునని యర్థము. మఱియుం బ్రాప్తరాజ్యుండైన వానికి జన్మకాలమునందు శత్రుక్షేత్రమునుగాని నీచక్షేత్రమునుగాని పొందినట్టి గ్రహాంతర్దశయందు ఛిద్రదశయు అనఁగా రాజ్యహరణ దశయును పరాశ్రయదశయు ను కల్పింపఁ దగినది. అనఁగా జన్మకాలమునందు శత్రునీచ క్షేత్రములయం దున్నగ్రహము బలయుక్తమైయుండెనేని యాగ్రహాంతర్దశాకాలమునందు రాజ్యముపోవు ననియు హీనబలయుక్తమై యుండెనేని తదంతర్దశాకాలములయందు నాపత్తులు సంభవించి, పరుల నాశ్రయించుటచేత రాజ్యము నిల్చుననియుం డెలియఁ దగినది. ఇందులకు "లగ్నగః కర్మగో వాస్యా దథవా ప్రబలోపియః, సస్వాత్వాన్వంతర్దశాకాలే రాజ్యదః ప్రబలోయథా, నీచారి గృహసంస్థస్య దశాయాం ప్రబలస్యచ, చ్యుతిర్బల విహీనస్య తన్మోక్షః పర సంశ్రయాత్" అని గార్గిమునిచేఁ జెప్పఁబడి యున్నది.

గురు సిత బుధ లగ్నే సప్తమస్థే ర్కపుత్రే
వియతి దివసనాథే భోగినాం జన్మవింద్యాత్,
శుభబలయుత కేంద్రైః క్రూరభ స్థైశ్చ పాపై
ర్వ్రజతి శబర దస్యు స్వామితా మర్థభాక్చ. 20

తా. భోగ జనుల జననమును, శబర తస్కరాధిపతుల జననమును జెప్పఁబడినది. లగ్నమునందు గురు బుధ శుక్రులలో నొకఁ డుండి శని యేడవయింట నుండి సూర్యుఁడు పదియవయింట నుండెనేని ధనహీనులైనను నిరతమును నేవిధముననైన భోగము లనుభవింతురని తెలియఁదగినది. కొందఱు "రవి బుధ సితలగ్నే" అని పఠించి దశమమున సూర్యుఁడుండఁగా లగ్నమున బుధ శుక్రులుండరు గనుక రవి బుధ శుక్ర సంబంధము లగుసింహ వృషభ తులా మిథున కన్యా

లగ్నములయందని యర్థమును వచించెదరు. వజ్రాది యోగముల యందు సూర్యుఁడు దశమస్థానమునం దుండఁగా లగ్నమునందు బుధ శుక్రుల యునికిఁ జెప్పఁబడి యుండుటంజేసి పూర్వశాస్త్రానుసారముగ వరాహమిహిరాచార్యులవారిచేత నీయోగము చెప్పఁబడినదని తెలియఁ దగినది. ఇందులకు "జీవజ్ఞ భార్గవైర్లగ్నే సప్తమస్థేర్కనందనే, దశమస్థే రవౌ జాతో భోగవాన్ పురుషో భవేత్" అని గార్గిమునిచేఁ జెప్పఁబడినది. "శుభ బలయుత కేంద్రైః" శుభగ్రహములు బలముగు కేంద్రస్థానములయందు అనఁగా శుభగ్రహసంబంధము లగు వృషభ మిథున కర్కాటక కన్యా తులా ధనుర్మీనములు బలయుక్తములై కేంద్రస్థాన గతము లగుచుండఁగాఁ బాపగ్రహ ఉయుతములగు మేష సింహ వృశ్చిక మకర కుంభములయందుఁ బాపగ్రహము లుండినచోఁ బుట్టినవాఁడు శబర తస్కరాదులకు రాజై ధనవంతుఁ డగునని తెలియఁ దగినది. మఱికొంద ఱీయోగమునకు శుభగ్రహ సంబంధి రాసులు కేంద్రస్థానములై అందు శుభగ్రహము లుండఁగాఁ బాపగ్రహ సంబంధి రాసులయందుఁ బాపగ్రహము లుండవలయు నందఱు. ఈయర్థద్వయము ను గ్రాహ్యంబు. మఱికొందఱు శుభగ్రహము లేరాసులనైనను కేంద్రస్థానగతములై బలయుక్తములై యుండఁగ ననియుం జెప్పెదరు. ఇందులకు "పాపక్షేత్ర గతైః పాపైః కేంద్రస్థైస్సౌమ్య రాశిభిః, సబలై ర్యస్య జన్మస్యాత్స్యాదసౌ దస్యు నాయకః" అను గార్గి మునీంద్రుని వచనము విరుద్ధముగ నున్నయది. కాఁబట్టి గ్రాహ్యము గాదని తెలియఁ దగినది.

ఇట్లు బృహజ్జాతక గ్రంథమునందు బదునొకండవ యధ్యాయ మగు

రాజయోగాధ్యాయము సంపూర్ణము.

---

# నాభసయోగాధ్యాయము.



నవది గ్వసవ స్త్రికాగ్ని వేదైః
గుణితా ద్విత్రి చతు ర్వికల్పజా స్స్యుః,
యవనై స్త్రిగుణా హి షట్ఛతీసా
కథితా వి స్తర తో త్ర త త్సమాసః. 1

తా. ఈయధ్యాయమునందు నాభసాఖ్య యోగములం దత్సంఖ్యం దెలియఁ జేయఁబడినది. నాభస యోగములకు నాలుగు వికల్పములు గలవు. అందు నాకృతి యోగము లనియొక వికల్పము. ఆకృతి యోగము లనియు సంఖ్యా యోగము లనియు రెండు వికల్పములు. ఆకృతి యోగములు సంఖ్యాయోగములు ఆశ్రయ యోగము లని మూఁడు వికల్పములు. ఆకృతి యోగములు. సంఖ్యాయోగములు ఆశ్రయ యోగములు దళయోగము లని నాల్గు వికల్పములు. ఈసంఖ్యా విశద మెట్లనిన ; "నవదిగ్వసవః" అనఁగా ౯-౧౦-౮ ఈసంఖ్యలు క్రమముగ "త్రికాగ్ని వేదైః" ౩-౩-౪ ఈసంఖ్యలచేత గుణింపఁబడినవై "ద్వి త్రి చతు ర్వికల్పజాః" ౨-౩-౪ వికల్పముల వలనంబుట్టెడు యోగములు అగుచున్నవి. అనఁగా నవసంఖ్యను మూఁటితో గుణింపఁగా ౨౭ అగును. కాఁబట్టి ద్వివికల్పమువలన ౨౭ యోగము లేర్పడుననియు, పదియు మూఁటిచేత గుణింపఁబడఁగా ౩౦ అగును. గనుక త్రివికల్పము వలన ౩౦ యోగము లేర్పడు ననియును, ఎనిమిదిని నాల్గుతో గుణింపఁగ ౩౨ అగును గనుక చతుర్వికల్పము వలన ౩౨ యోగము లగుననియు దెలియఁ దగినది. అదెట్లనఁగా—ఆకృతి యోగములు ౨౦, సంఖ్యాయోగములు ౭ ఈ ౨౭ను ద్వివికల్పజ యోగములు. ఆకృతి యోగములు ౨౦, సంఖ్యా యోగములు ౭, ఆశ్రయ యోగములు ౩ ఈ ౩౦ త్రివికల్పజయోగములు. ఆకృతి యోగములు ౨౦, సంఖ్యాయోగములు ౭, ఆశ్రయ యోగములు ౩, దళయోగములు ౨ ఈముప్పది రెండును చతుర్వికల్పజ యోగములు. ఈప్రకారము ముప్పది రెండు యోగము లేర్పడుచున్నవి. పురాతన యవనులచేత చేమూఁటి

గుణింపఁబడిన షట్ఛతీ=౬౦౦ అనఁగా ౧౮౦౦ నాభస యోగములు విస్తారముగఁ జెప్పఁబడినవి. అయినను శుచిధ్వజునిచేత "సంస్థాన సాదృశ్య మనంతకం స్యా ద్ద్రివ్యాణి నానాప్రకృతీని దృష్ట్వా" అని నాభస యోగములకు ననంత్యము చెప్పఁబడి యుండఁగాఁ బురాణ యవనులకు ౧౮౦౦ అని సంఖ్యా నిర్ణయ మెట్లేర్పడెననిన ; సకల గ్రహములును చతుర్థ సప్తమముల యందుండెనేని శంఖయోగము. సప్తమ దశమముల యందుండెనేని బభ్రుయోగము. దశమ చతుర్థములయం దుండెనేని ధ్వజయోగము. ఈమూఁటితోఁగూడ నాకృతి యోగములు ౨౩, సంఖ్యాయోగములు ౧౨౭. అదెట్లనఁగ— ఏకవికల్పజములు ౭, ద్వి వికల్పజములు ౨౧, త్రివికల్పజములు ౩౫, చతు ర్వికల్పజములు ౩౫, పంచ వికల్పజములు ౨౧, షడ్వికల్పజములు ౭, సప్త వికల్పజములు ౧-ఈ వికల్ప గణితము సునఫానఫాది యోగములయందుఁ జెప్పఁబడినది. ఇదియ వివాహ పటలమందు, "ద్వాత్రింశద్యోగాన్ పరిహృత్య తస్మా న్నోక్తం శతం సత్రిఘనం విలగ్నే" అని వరాహమిహిరాచార్యులచేతఁ జెప్పఁబడి యున్నది. ఇట్లు పూర్వోక్తములయిన ౨౩ ఆకృతి యోగములతోఁగూడ ౧౫౦ అయినది. ఈసంఖ్యను పండ్రెండుతో గుణింపఁగా ద్వాదశరాశి లగ్నజనిత యోగములు ౧౮౦౦ ఇట్లు పూర్వయవనులచేత ౧౮౦౦ నాభసయోగములు చెప్పఁబడినవి. ఈ బృహజ్జాతకమునందు నా ౧౮౦౦ యోగముల సంగ్రహము అనఁగా ముప్పదిరెండు యోగములచేత నా ౧౮౦౦ యోగములయందుఁ జెప్పఁబడియున్న యావదర్థము తెలియునట్లు సంగ్రహించి చెప్పఁబడునని తెలియఁ దగినది.

రజ్జు ర్ముసలం నల శ్చరాద్యైః
సత్యా శ్చాశ్రయజాన్ జగాదయోగాన్,
కేంద్రై స్సదసద్యుతై ర్దలాఖ్యౌ
స్రక్సర్పౌ కథితౌ పరాశరేణ. 2

తా. సత్యా చార్యోక్తములగు మూఁడాశ్రయ యోగములును పరాశరోక్తము లగు రెండుదళయోగములును చెప్పఁబడినవి. అదెట్లనఁగ-

చరరాసులయందు సకల గ్రహములునుండి స్థిరద్విస్స్వభావ రాసులు శూన్యములై యుండెనేని రజ్జుయోగమనియును,స్థిరరాసులయందు సకల గ్రహములుండి చర ద్విస్స్వభావ రాసులు శూన్యములై యుండినచో ముసలయోగ మనియును, ద్విస్స్వభావరాసుల యందు సకలగ్రహము లుండి అన్యరాసులు శూన్యములుగ నుండెనేని నలయోగ మనియు నిట్లు మూఁడాశ్రయ యోగములు సత్యాచార్యులచేఁ జెప్పఁబడినవి. కొందఱు నాల్గు చరరాసులయందు గ్రహములుండెనేని రజ్జువనియు, స్థిరరాసుల గ్రహములుండెనేని ముసల మనియుం జెప్పెదరు. ఇందులకు శ్లో. "ఏకో ద్వావా త్రయ స్సర్వేసర్వై ర్యుక్తా యదా గ్రహైః, చరయోగ స్తదా రజ్జు శ్శీర్ష్యాణాం జన్మదో భవేత్, స్థిరశ్చే న్ముసలం నామ మానినాం జన్మకృ న్నృణాం, ద్విస్స్వభావో నలాఖ్యస్తు బలినాం పరికీర్తితః." అని గార్గిచేఁ జెప్పఁబడి యున్నది. గనుక నీయర్థము గ్రాహ్యంబుగాదు. ఇట్లు సత్యాచార్య మతానుసారముగా ఆయాశ్రమ యోగత్రయము వ్యాఖ్యాతంబయ్యె. మఱియు నీయర్థమునందు "చరరాశిగై ర్గ్రహేంద్రై రజ్జుః స్థిరరాశిగై స్తథా ముసలం, ద్విశరీరగతై ర్యోగో నలసంజ్ఞో మునిభి రుద్దిష్టః." అని సత్యాచ్యారులచేఁ జెప్పఁబడినది. మఱియుఁ గేంద్ర త్రయమునందుఁ జంద్రవ్యతిరిక్త శుభగ్రహము లుండి యొక కేంద్రమునం బాపగ్రహము లేకుండినచో దళాఖ్య మగు మాలా యోగమనియు, కేంద్ర త్రయమునందుఁ బాప గ్రహములగు రవి కుజ శను లుండిరేని యొక కేంద్రమునందైన శుభగ్రహము లేకుండెనేని దళాఖ్యమగు సర్పయోగ మనియుం బరాశరులచేతఁ జెప్పఁబడినది. "కేంద్రై స్సదసద్యుతై ర్దళాఖ్యౌ" అని సామాన్యముగఁ జెప్పఁబడినను శుక్ల కృష్ణ పక్షముల యందుఁ జంద్రునకు క్షీణత్వము పూర్ణత్వములు సంభవించుట వలన గ్రంథాంతర వచనానుసారముగఁ జంద్రవ్యతిరిక్త శుభగ్రహములని యర్థము సేయఁ బడినది. అయితే మూఁడు కేంద్రములు శుభగ్రహాక్రాంతము లై యుండఁగ క్షీణ చంద్రుఁడు నాలవవాఁడై కేంద్రమున నున్నను మూఁడు కేంద్రములు పాపగ్రహాక్రాంతములై యుండఁగఁ జంద్రుఁడు నాల్గవ వాఁడై కేంద్రమునం దున్నను స్రక్సర్పయోగ

ములకు భంగము లేదని తెలియఁ దగినది. కేంద్రములు నాలుగై యుండఁగా స్రగ్యోగమునకు మూఁడు కేంద్రములయందు మూఁడు శుభగ్రహము లుండవలయు ననియు సర్పయోగమునకు మూఁడు కేంద్రములయందు మూఁడు పాపగ్రహము లుండవలె ననియు నిట్లు విశేషార్థ మెట్లు చెప్పఁబడె ననఁగ ; "త్రి కేంద్రగై ర్యమా రార్కి స్సర్పో మసఃశిత జన్మదః, భోగి జన్మ ప్రదా మాలా తద్వ జ్జీవ సితేందుజైః." అని గార్గిచేఁ జెప్పఁబడినది. మఱియును "కేంద్రే ష్వపాపేషు సిత జ్ఞ జీవై స్త్రికేంద్ర సంస్థైః కథయంతి మాలాం, సర్ప స్త్వసౌమ్యై ర్శ్చ యమార సూర్యై ర్యోగాది మాద్వా కథితౌ దళాఖ్యౌ." అని బాదరాయణులచేతం జెప్పఁబడినది. గనుక పూర్వోక్త ప్రకారముగ నర్థముచేయఁ బడె నని తెలియం దగినది. ఈయోగము లితరులచేతం జెప్పఁబడి యుండఁగఁ బరాశరులచేఁ జెప్పఁబడెనని గ్రహించుటవలన వరాహమిహిరుండును వచించెనని యూహింపఁ దగినది.

యోగా వ్రజం త్యాశ్రయజా స్సమత్వం
యవాబ్జ వజ్రాండజ గోల కాద్యైః,
కేంద్రోపగ ప్రోక్త ఫలా దలాఖ్యా
విత్యాహు రన్యేన పృథ క్ఫలా తౌ. 8

తా. పూర్వోక్తమైన ఆశ్రయ యోగ త్రయమును దళ యోగద్వయమును గ్రంథకర్తలు చెప్పినవారు కారు. కాఁబట్టి ఆహేతు వీశ్లోకమునం దెలియఁ జేయఁబడినది. యవాబ్జవజ్రాండజగోలకాద్యైః= ఆకృతి యోగము లగు యవ పద్మ వజ్ర విహంగయోగములతోడ నాదిశబ్దము వలన గదా శకటాదులతోడను సంఖ్యాయోగము లగు గోళక శూల కేదారములతోడను ఆశ్రయజములైన రజ్జు ముసల నల యోగములు సమానత్వము నొందుచున్నవి. కాఁబట్టి కొందఱు ఈ యాశ్రయ యోగములం జెప్పినవారుకారు. అయితే యీగ్రంథమునందేల చెప్పఁబడె ననఁగ—రజ్జ్వాది యోగ వ్యతిరిక్తముగ నాశ్రయయోగములకు నవకాశము లేదు కాఁబట్టి ఈరజ్జ్వాది యోగములు వరాహ మిహిరాచార్యులచేఁ జెప్పఁబడె నని తెలియఁ దగినది.

కేంద్రస్థానముల నొంది యున్నట్టి గ్రహములకుఁ జెప్పఁబడినఫలములే ఫలములుగం గల్గిన దళనామకము లగు నా స్రక్సర్పయోగములు భిన్న ఫలములు కావని కొందఱు వచించెదరు "కేంద్ర త్రికోణేషు శుభాః ప్రశస్తా స్తేష్వేవ పాపా నశుభ ప్రదాస్యుః" అని వరాహ మిహిరా చార్యులచేఁ జెప్పఁబడిన ప్రకారము కేంద్రస్థానముల యందున్నట్టి శుభగ్రహములు శుభప్రదు లనియు, కేంద్రగత పాపగ్రహము లశుభ ప్రదు లనియు ననేక గ్రంథములం జెప్పఁబడినది. ఆఫలములే ఈస్రి క్సర్ప యోగములయందుం జెప్పఁబడుచున్నవి గాని విశేషమేమియుం జెప్పఁబడదు. కాఁబట్టి యీదళాఖ్యము లగు స్రక్సర్పయోగములు రెండును గొందఱు చెప్పలేదని తాత్పర్యము. అయితే యిందేల చెప్పఁబడినది యనఁగ- కేంద్రస్థానములం బొంది యున్నట్టిగ్రహములు స్వదశాకాలములయందు మాత్రము ఫలప్రదము లగుంగాని సర్వదశల యందును ఫలప్రదములు గావు. నాభస యోగములయందుఁ జెప్పఁ బడిన యీయోగములు సర్వదశలయందును ఫలప్రదము లగును గాఁ బట్టి పరాశరా ద్యుక్త ప్రకారముగ వరాహమిహిరాచార్యులచేత స్రక్సర్పయోగములు చెప్పఁబడె నని తెలియఁ దగినది.

ఆసన్న కేంద్ర భవన ద్వయగై ర్గదాఖ్య
స్తన్వస్తగేషు శకటం విహగః ఖబంధ్వోః,
శృంగాటకం నవమ పంచమ లగ్నసంస్థైః
లగ్నాన్యగై ర్హలమితి ప్రవదంతి తజ్ఞాః. 4

తా. ఆకృతియోగములయందు గదా శకట విహంగ శృంగా టక హలాఖ్యము లైన యైదు యోగంబులును జెప్పఁ బడినవి. ఎట్లనఁగ.—పరస్పర సమీపమునం దున్నట్టి రెండు కేంద్రస్థాన ములను బొందిన గ్రహముచేత గదాఖ్య యోగమగును. అది నాల్గు విధములు. అందు సకలగ్రహములు పరస్ప రాసన్న కేంద్రము లగు లగ్న చతుర్థముల యందుండుట యొకటి, చతుర్థ సప్తమముల యం దుండుట రెండు, సప్తమ దశమములయందుండుట మూఁడు, దశమ లగ్నముల యందునుండుట నాల్గు, ఇట్లు గదాయోగములు నాల్గు

విధము లని తెలియఁ దగినది. సర్వగ్రహములును లగ్న సప్తమముల యందుండఁగా శకటయోగమని తెలియఁ దగినది. దశమ చతుర్థమములయందు సర్వగ్రహము లుండెనేని విహంగ యోగ మనంబడును. నవమ పంచమ లగ్నముల యందు సకల గ్రహము లుండినచో శృంగాట యోగ మనంబడును. లగ్నముగాక తక్కిన స్థానముల యందు యథాసంభవముగ సకల గ్రహములు పరస్పర త్రికోణస్థానముల యందుండెనేని హలయోగ మనం బడును. ఇట్లు హోరాశాస్త్రజ్ఞులు వచింతు రని తెలియఁ దగినది.

శకటాండజ వచ్ఛుభా శుభై
ర్వజ్రం తద్విపరీతగై ర్యవః,
కమలంతు విమిశ్రసంస్థితై
ర్వాపీతద్యది కేంద్ర బాహ్యతః. 5

తా. వజ్ర యవ కమల వాపీ యోగము లిందుఁ జెప్పఁబడినవి పూర్వ శ్లోకమునందు "తన్వ స్తగేషు శకటం విహాగః ఖబంధ్వోః" అని శకటయోగమునకు నేస్థానముల యందు గ్రహము లుండ వలయునని చెప్పఁబడెనో ఆలగ్న సప్తమముల యందు శుభ గ్రహములును, విహగయోగమునకు నేస్థానముల యందు గ్రహము లుండవలయునని చెప్పఁబడెనో ఆ దశమ చతుర్థ స్థానముల యందుఁ బాపగ్రహములునుండి అన్యస్థానములయందు గ్రహములు లేకుండినచో వజ్రయోగ మగు నని తెలియఁ దగినది. అనఁగా నీవజ్రయోగమునకుఁ జెప్పఁబడిన క్రమమునకు వ్యత్యాసముగ లగ్న సప్తమముల యందుఁ బాపగ్రహములును, దశమ చతుర్థములయందు శుభగ్రహములు నుండి అన్యస్థానములయందు గ్రహములు లేకుండినచో యవ యోగ మని తెలియఁ దగినది. ఈనాల్గు కేంద్రముల యందును శుభ పాప గ్రహంబులు కలిసి అనఁగా శుభగ్రహము లుండవలసిన లగ్న సప్తమములలో నొకస్థానమునందు శుభగ్రహమును, మఱియొక స్థానమునందుఁ బాపగ్రహమును, ఆశుభగ్రహము లుండవలసిన దశమ చతుర్థముల యందు నొకస్థానమునందు శుభగ్రహమును, మఱియొక

స్థానమునందుఁ బాపగ్రహమును ఇవ్విధమునసుండి తక్కిన స్థానంబుల గ్రహములు లేకుండెనేని కమల యోగమని తెలియఁ దగినది. ఆ కమల యోగమునకుఁ జెప్పఁబడిన గ్రహస్థితి కేంద్రముల మీఁది రాసులగు ఫణపరములయందు నైనను, ఆపోక్లిమముల యందైనను అగునేని వాపీయోగ మనం దగినది. అయ్యది ద్వివిధము శుభాశుభ గ్రహములు మిశ్రములై ఫణపర స్థానము లగు ద్వితీయాష్ట మైకాదశ పంచమముల యందుండుట యొకటి. ఆపోక్లిమము లగుతృతీయ నవమ ద్వాదశ షష్ఠమముల యందుండుట రెండు.

పూర్వ శాస్త్రానుసారేణ మయా వజ్రాదయః కృతాః,
చతుర్థే భవనే సూర్యాత్ జ్ఞ సితౌ భవతః కథమ్. 6

తా. వజ్ర యవ యోగములు పూర్వ శాస్త్రానుసారముగఁ జెప్పఁబడెం గాని యవి సంభవింపఁ వని తెలియఁ జేయఁబడినది. మయ యవనా ద్యుక్త పూర్వ శాస్త్రానుసారముగ నాచేత వజ్ర యవాది యోగములు రచియింపఁబడెను. అదెట్లగును? ఏలనన; సూర్యునకు నాల్గవ రాశియందు బుధ శుక్రు లెట్లుందురు? అనఁగా వజ్రయోగమునందు శుభగ్రహములకును పాపగ్రహములకును పరస్పర చతుర్థస్థానస్థితి చెప్పఁబడినది. కాఁబట్టి రవికి చతుర్థస్థానమునందు బుధ శుక్రు లుండని యెడల నిది సంభవింపదు. సూర్యోదయాస్తమయ కాలములయందుఁగాని మధ్యాహ్న నిశీథ కాలముల యందుఁగాని బుధ శుక్రుల యుదయాస్త సమయములు గానేరవు. కావున రవికిఁ జతుర్థ స్థానమున బుధ శుక్రు లొకప్పుడునుండరు. కాఁబట్టి యీవజ్ర యోగము సంభవింపనిదని తెలియఁదగినది. అయితే యీయోగము లితర మన్వంతరముల యందు సంభవించియుండుటం జేసి గ్రంథకర్తలు చెప్పియున్నారని యూహింపఁదగినది.

కంటకాది ప్రవృత్తైస్తు చతుర్గృహ గతైః గ్రహైః,
యూపేషు శక్తి దండాఖ్యా హోరాద్యైః కంటకైః క్రమాత్.

తా. యూప శర శక్తి దండయోగములు జెప్పఁబడినవి. కేంద్రస్థానము మొదలుగ నాల్గురాసులం బొంది యున్నట్టి సర్వ గ్రహములచేతను, లగ్నము మొదలుగాఁగల కేంద్రములచేతను క్రమ

ముగ యూప, శర, శక్తి, దండము లనెడు నాల్గుయోగములు గల్గినవి. అదెట్లనఁగ; లగ్న తృతీయ ద్వితీయ చతుర్థముల యందు సకల గ్రహములునుండెనేని యూపయోగ మనందగినది. చతుర్థ పంచమ షష్ఠ సప్తమముల యందు సకల గ్రహములునుండెనేని శరయోగ మని తెలియఁదగినది. సప్తమాష్టమ నవమ దశమ ములయందు సకలగ్రహములుండెనేని శక్తియోగ మని తెలియఁదగినది. దశమైకాదశ ద్వాదశ లగ్నములయందు సకల గ్రహములునుండెనేని దండయోగమని వచింపఁదగినది.

నౌకూట చ్ఛత్రచాపాని తద్వ త్సప్తర్క్ష సంస్థితైః,
అర్థచంద్రస్తు నావాద్యైః ప్రోక్తా దన్యర్క్ష సంస్థితైః. 8

తా. ఇందు నౌ కూట చ్ఛత్ర చాపా ర్ధచంద్రాఖ్యములగు నైదు యోగములు జెప్పఁబడినవి. పూర్వశ్లోకోక్త ప్రకారముగ లగ్న చతుర్థ సప్తమ దశమ కేంద్రములు మొదలేడేసి రాసులయం దుండెడు సర్వగ్రహములచేత నౌ కూట చ్ఛత్ర చాపాఖ్యము లగునాలుగు యోగము లెఱుంగ వలయును. అదెట్లనఁగ; సకలగ్రహము లవిచ్ఛిన్నములై లగ్నమునకు ౧-౨-౩-౪-౫-౬-౭ ఈస్థానములయందుండెనేని నౌయోగ మని తెలియం దగినది. ౪-౫-౬-౭-౮-౯-౧౦ ఈస్థానముల యం దుండెనేని కూటయోగ మని యెఱుంగ వలయును. ౭-౮-౯-౧౦-౧౧-౧౨-౧ ఈస్థానములయం దుండెనేని ఛత్రయోగ మని తెలియఁదగినది. ౧౦-౧౧-౧౨-౧-౨-౩-౪ ఈస్థానముల యందుండెనేని ధనుర్యోగ మని తెలియఁదగినది. ఈ నౌయోగాదులచేతఁ జెప్పఁబడిన కేంద్రాది క్రమమునకంటె నితర స్థాన పణఫర రాశ్యాదిగ నైనను ఆపోక్లిమ రాశ్యాదిగా నైనను నేడురాసుల యందున్నట్టి సర్వగ్రహములచేత నర్ధచంద్రయోగ మని తెలియఁ దగినది. ఇది యెనిమిది విధము లగుచున్నది. అదెట్లనిన, సర్వగ్రహముల విచ్ఛిన్నములై ౨-౩-౪-౫-౬-౭-౮ ఈస్థానములయం దుండుట యొకయోగము. తృతీయాది నవమాంత స్థానముల యందుండుట రెండవయోగము. పంచమా ద్యైకాదశాంతస్థానములయం దుండుట మూఁడవ యోగము. షష్ఠాది

ద్వాదశాంత స్థానములయం దుండుట నాల్గవయోగము. అష్టమాది ద్వితీయాంత స్థానములయం దుండుట యైదవ యోగము. నవమాది తృతీయాంత స్థానములయం దుండుట యాఱవయోగము. ఏకాదశాది పంచమాంత స్థానములయం దుండుట యేడవ యోగము. ద్వాదశాది షష్ఠాంత స్థానములయందుండుట యెనిమిదవ యోగము. ఇట్లు తెలియఁ దగినది.

ఏకాంతర గతైరర్థా త్సముద్ర షడ్గృ హాశ్రితైః,
విలగ్నాది స్థితైశ్చక్ర మిత్యాకృతిజ సంగ్రహః. 9

తా. సముద్రయోగ చక్రయోగములు జెప్పఁబడినవి. ద్వితీయ స్థానము మొదలుకొని యొకరాశిని వదలి యొకరాశి యందున్నట్టి యాఱురాసులం బొందిన సకల గ్రహములచేతను అనఁగా ౨-౪-౬-౮-౧౦-౧౨ ఈస్థానముల యందు సకలగ్రహము లుండెనేని సముద్ర యోగ మని తెలియఁ దగినది. లగ్నము మొదలుకొని యొకరాశిని విడిచి యొకరాశియం దున్నట్టి గ్రహములచేత అనఁగా ౧-౩-౫-౭-౯-౧౧ ఈ స్థానములయందు సకల గ్రహము లుండెనేని చక్ర యోగ మని తెలియఁ దగినది. ఆకృతియోగముల సంగ్రహ మివ్విధమునం జెప్పఁబడినది. అనఁగా, ''ఆసన్న కేంద్ర భవన ద్వయగైః'' అను శ్లోకము మొదలుకొని యీశ్లోకము వరకు నాకృతిజములగు గదా ౧ శకట, ౨ విహగ, ౩ శృంగాట, ౪ హల, ౫ వజ్ర, ౬ యవ, ౭ కమల, ౮ వాపీ, ౯ యూప, ౧౦, శర, ౧౧ శక్తి, ౧౨ దండ, ౧౩, నౌ, ౧౪, కూట, ౧౫ ఛత్ర, ౧౬ చాప, ౧౭ అర్ధచంద్ర, ౧౮ సముద్ర, ౧౯ చక్ర, ౨౦ ఈయోగములు చెప్పఁబడీన వని తెలియఁ దగినది.

సంఖ్యా యోగాస్సప్త సప్తర్క్షసంస్థై
రేకాపాయా ద్వల్లకీ దామనీచ,
పాశః కేదారశ్చ శూలో యుగంచ
గోళ శ్చాన్యాః పూర్వ ముక్తాన్విహాయ. 10

తా. అనఁగా నేడురాసులయం దున్నట్టి యేడు గ్రహముల చేత నొక్కొక రాశి తగ్గుటవలనఁ గ్రమముగ నేడు సంఖ్యాయోగము.

లేర్పడుచున్న వదెట్లనఁగ, పండ్రెండు రాసులలో నేరాసులయందైనను సకల గ్రహము లేడురాసులయందు నిమిడి యుండినచో వల్లకీయోగ మనంబడును. సకలగ్రహము లాఱురాసుల యందు నుండెనేని దామనీయోగ మనంబడును. అయిదు రాసులయందు నుండెనేని పాశ యోగ మనంబడును. నాల్గురాసులయం దుండెనేని కేదారయోగ మనంబడును. మూఁడురాసుల యందుండెనేని శూలయోగ, మనంబడును. రెండురాసుల యందుండెనేని యుగయోగ మనంబడును. ఒకరాశి యందు సకల గ్రహము లుండినచో గోళయోగ మనంబడును. ఈప్రకారముగ నేడు సంఖ్యాయోగములని తెలియఁదగినది. ముందుగఁ జెప్పఁబడిన ఆశ్రయ దళాకృతి యోగములను విడిచినచో సంఖ్యా యోగములనంబడును. అనఁగాఁ బూర్వోక్తములగు కేంద్రాది స్థాన నియమము గల ఆశ్రయాది యోగములు సంఖ్యాయోగ సాదృశ్యము నొందెనేని యపుడు ఆశ్రయాది యోగములే గ్రాహ్యము లగుంగాని సంఖ్యా యోగము గ్రాహ్యముగానేరదు. ఇట్లు ముప్పదిరెండు యోగములు విశదీకరింపఁ బడినవి.

ఈర్ష్యుర్విదేశ నిరతో ధ్వరుచిశ్చరజ్వాం
మానీ ధనీచ ముసలే బహుకృత్య సక్తః,
వ్యంగస్థిరాఢ్య నిపుణానలజాః స్రగుత్థో
భోగాన్వితో భుజగజో బహుదుఃఖ భాక్స్యాత్. 11

తా. ఈ శ్లోకమున నాశ్రయ రజ్జు నళయోగముల యందుఁ బుట్టిన వానికిం గల్గు ఫలములు చెప్పఁబడినవి. రజ్జు యోగమునం బుట్టినవాడు పరుల శ్రేయముఁజూచి యోర్వఁ జాలని వాడును, పరదేశ నివాసాసక్తుఁడును, త్రోవ నడచుటయం దాశగలవాఁడును నగును. ముసలయోగమునం బుట్టినవాఁడును, ధనికుండును, అనేక కార్యములు చేయ నారంభించు వాఁడును నగును. నలయోగమునం బుట్టినవాఁడు అంగహీనుఁడును, దృఢ నిశ్చయము గలవాఁడును, ధనవంతుఁడును, సూక్ష్మబుద్ధి గలవాఁడును నగును. ఇట్లాశ్రయయోగ

త్రయ సంజాతులఫలములు జెప్పఁబడెను. స్రగ్యోగము నందుఁ బుట్టిన వాఁడు సుఖియును సర్పయోగమునందుఁ బుట్టినవాఁడు నానావిధములగు దుఃఖము లనుభవించు వాఁడును నగును. ఇట్లు దళయోగ ద్వయ సంభవుల ఫలములు చెప్పఁబడినవి.

ఆశ్రయోక్తాస్తు విఫలాభవం త్యన్యైర్వి మిశ్రితాః,
మిశ్రాయైస్తే ఫలం దద్యు రమిశ్రా స్స్వఫల ప్రదాః. 12

తా. ఏకకాలమున నాశ్రయ యోగమును మఱియొక యోగమును సంభవించునేని యపు డాశ్రయ యోగము విఫల మగునని తెలియఁ జేయఁబడినది. ఆశ్రయ యోగములు అన్యములగు గదాది యోగములతోఁ గూడిన వైనచో నిష్ఫలము లగుచున్నవి. అపుడాశ్రయ యోగములు ఏ యోగములతోఁ గూడిన వగుచున్నవో ఆ యోగముల ఫలము లిచ్చునని తెలియఁ దగినది.

యష్టా ర్థభా క్సతత మర్థరుచి ర్గదాయాం
తద్వృత్తి భుక్శకటజ స్సరుజః కుదారః,
దూతోటనః కలహకృద్విహగే ప్రదిష్టః
శృంగాటకే చిరసుఖీ కృషికృద్ధలాఖ్యే. 13

తా. ఇందులో గదా, శకట, విహగ, శృంగాటక, హలాది యోగములయందుఁ బుట్టినవారి స్వభావములు జెప్పఁబడినవి. గదా యోగమునం బుట్టినవాఁడు ధనవంతుఁడును, యజన శీలుండును, ధనార్జనోద్యమము సేయువాఁడును నగును. శకట యోగమునం బుట్టిన వాఁడు శకటాది సాధనములచే జీవించువాఁడును, వ్యాధిపీడితుఁడును, కుత్సితురా లగుభార్య గలవాఁడును నగును. విహగ యోగమునం బుట్టిన వాఁడు దూతలపనిచేయువాఁడును, ఇష్టానుసారముగఁ దిరుగువాఁడును, కలహ ప్రియుండును, అధిక నిద్ర గలవాఁడు నగును. శృంగాట యోగమునందుఁ బుట్టినవాఁడు అంతిమకాలమున సుఖియును, పరోపకార చిత్తుండును నగును. ఇది, కొందరు "చిరసుఖీ" యన నిరంతరసుఖి యందురు. "లగ్న పంచమ ధర్మస్థై ర్యోగ శ్శృంగాటకో మతః,

వయోంతే సుఖినాం జన్మ తత్రస్యాత్కటు భాషిణాం" అని గార్గి మునిచేతం జెప్పఁబడిన దాని ననుసరించి యుండలేదు గనుక గ్రాహ్యము గాదు. హలయోగమునం బుట్టినవాఁడు కృషిమూలక జీవనము చేయువాఁ డగునని తెలియఁదగినది.

వజ్రేంత్య పూర్వ సుఖిత స్సుభగోతి శూరో
వీర్యాన్వితో ప్యథయవే సుఖితో వయోంతః,
విఖ్యాతకీర్త్య మితసౌఖ్యగుణశ్చ పద్మే
వాప్యాం తనుస్థిరసుఖీ నిధికృ న్నదాతా. 14

తా. వజ్ర యవ పద్మ వాపీ యోగములయందు బుట్టిన వారి గుణములు చెప్పఁబడినవి. వజ్రయోగమునఁ బుట్టినవాఁడు బాల్య వార్ధక దశలయందు సుఖముగలవాఁ డగును. అనఁగా బాల్యమునందు సుఖియై యౌవనమునందు దుఃఖియై ముసలితనమునందు సుఖపడు నని యెఱుంగఁ దగినది. యవయోగమునం బుట్టినవాఁడు పరాక్రమ యుతుండును, యౌవనమునందు సౌఖ్యము గలవాఁడును నగును. పద్మయోగమున జనించినవాఁడు కీర్తి గలవాఁడును, సర్వజనస్నేహితుఁడును, సుగుణ సంపన్నుండును, సౌఖ్యము గలవాఁడును నగును. వాపీ యోగమున జనించినవాఁడు అల్ప సుఖము గలవాఁడును, దాన మీయనివాఁడును, భూజీవనము గలవాఁడు నై యుండును.

త్యాగాత్మవాన్ క్రతువరై ర్యజతేచ యూపే
హింస్రోథ గు ప్త్యధికృత శ్శర కృచ్ఛరాఖ్యే,
నీచో లస స్సుఖ ధనై ర్వియుతశ్చ శక్తౌ
దండేప్రియై ర్విరహితః పురుషోంత్యవృత్తిః. 15

తా. యూప శర శక్తి దండ యోగములయందు జనించిన వారి గుణములు చెప్పఁబడినవి. యూపయోగమునం బుట్టినవాఁడు వాజపేయాఖ్య యజ్ఞాది సత్కార్యములచేత దేవతలం దృప్తి బొందించువాఁడును, త్యాగియును, ప్రియవచనములు గలవాఁడును నగును. శర యోగమునఁ బుట్టినవాఁడు, చంపు వాఁడును, బంధనాధికారియును,

కఠిన గుణము గలవాఁడును, కత్తులు మొదలగు నాయుధములు చేయువాఁడును, వానిధరించి జీవించువాఁడును అగును. రాజగృహమున రహస్యముగ ఖడ్గధారణము చేయువాఁడును, బాణప్రయోగాభ్యాసము లౌకరికిం జెప్పువాఁడును నగునందురు. శక్తియోగమునందు జనించినవాఁడు స్వకులాచార విముఖుండును, మంద చిత్తుండును, మలినవస్త్ర ధారణము గలవాఁడును, సుఖ ధన విహీనుండును నగును. దండయోగమునం బుట్టినవాఁడు ప్రియజన విరహితుండును, నీచవృత్తి గలవాఁడును నగును.

కీర్త్యన్విత శ్చలసుఖః కృపణశ్చ నౌజః
కూటే నృతప్లవగ బంధనపశ్చజాతః,
ఛత్రోద్భవ స్స్వజనసౌఖ్యకరోం త్యసౌఖ్య
శ్శూరశ్చ కార్ముకభవః ప్రథమాంత్యసౌఖ్యః. 16

తా. నౌయోగమునందు జనించినవాఁడు కీర్తివంతుఁడును, చంచల సౌఖ్యము గలవాఁడును,లోభియు నగును. కూటయోగమునం బుట్టినవాఁడు అసత్యమనెడు కార్యతరణ సాధనముం బొందినవాఁడును, కారాగృహాధికారియును నగును. ఛత్రయోగమునం బుట్టినవాఁడు బంధుజన సౌఖ్యకరుండును, వృద్ధత్వమున సౌఖ్యము గలవాఁడును నగును. చాపయోగమున జనించినవాఁడు శూరుండును, సౌఖ్యము గలవాఁడును, మధ్యవయస్సునఁ గష్టపడువాఁడు నగును.

అర్ధేందుజ స్సుభగ కాంత వపుః ప్రధాన
స్తోయాలయే నరపతి ప్రతిమస్తు భోగీ,
చక్రే నరేంద్ర మకుట ద్యుతి రంజితాంఘ్రి
ర్వీణోద్భవశ్చ నిపుణః ప్రియగీత నృత్యః. 17

తా. అర్ధచంద్ర యోగమునం బుట్టినవాఁడు సర్వజన ప్రియుండును, మనోహరుండును, సర్వజన ముఖ్యుండును, సముద్రయోగమున జనించిన వాఁడు రాజసమానుండును, సుఖము గలవాఁడును, చక్రయోగమునజనించినవాఁడు రాజకిరీట మణిద్యుతిచేత రంజింపఁబడిన పాదములు గలవాఁడును నగుదురు. ఇఁక సంఖ్యా యోగఫల

ములు చెప్పఁబడుచున్నవి. వల్లకీ యోగమునం బుట్టినవాఁడు సూక్ష్మ దృష్టి గలవాఁడును గానలోలుండును, నాట్య ప్రియుండును, మిత్రజన పరివృతుండును నగును.

దాతా న్యకార్యనిరతః పశుపశ్చ దామ్ని
పాశే ధనార్జనసుశీల సభృత్యబంధుః,
కేదారజః కృషికర స్సుబహూప యోజ్యః
శూరః క్షతో ధనరుచి ర్విధనశ్చ శూలే. 18

తా. దామ పాశ కేదార శూల యోగములం బుట్టినవారి స్వరూపము జెప్పఁబడినది. దామయోగమునం బుట్టినవాఁడు దాన శీలుండును, పరోపకా రాసక్తుండును, గోగణ రక్షకుండును, పాశ యోగమున జనించినవాఁడు సన్మార్గముచే ధనార్జనము చేయనెంచు వాఁడును, బంధు మిత్ర భృత్యజనులతోఁ గూడినవాఁడును, కేదార యోగమునం బుట్టినవాఁడు అనేకులకు నుపకారోపచారములు చేయువాఁడును, కృషిజీవనుండును, శూలయోగమున సంభవించినవాఁడు యుద్ధ వీరుండును, పరాక్రమశాలియును, నెత్తుటి గాయములు గలవాఁడును, ధనాశగల వాఁడు ప్రాణి హింసాపరుండును నగుదురు.

ధన విరహితః పాషండీ స్యాద్యుగే త్వథగోలకే
విధన మలి నాజ్ఞానోపేతః కుశిల్పోలసోటనః,
ఇతి నిగదితా యోగా సార్థం ఫలై రిహ నాభసా
నియతఫలదా శ్చింత్యాహ్యేతే సమస్త దశాస్వపి. 19

తా. యుగ గోలక యోగములయందు జనించినవారి గుణము లు చెప్పఁబడినవి. యుగయోగమున జనించిన వాఁడు ధనహీనుండును, పాషండుఁడును నగును. గోలక యోగమునంబుట్టినవాఁడు మలినవస్త్ర ధరుండును, మూర్ఖుండును, ధనహీనుండును, లోకనింద్య మగుశిల్పము గలవాఁడును, నిష్ప్రయోజనముగ తిరుగువాఁడును నగును. ఈ యధ్యాయ మునం దీపరికారము నాభసాఖ్యములగు యోగములు ఫలములతోఁడఁ జెప్పఁబడినవి. ఈనాభస యోగములు సకల దశలయందును సర్వకాల

ఫలప్రదములగునని యాలోచింపఁదగినది. అయితే యెవనికి సుఖముగాని దుఃఖముగాని యావజ్జీవ మేకరీతిగ నుండదు గదా! కొందఱు సుఖముగ నుగొందఱు దుఃఖ మనుభవించు వారుగనునుందురు. భిక్షుకులు సంతుష్టులై యుండరు. ఇట్లుండఁగా నీనాభస యోగములు సకల దశలయందును నియత ఫలప్రదము లెట్లగుననిన:—ఈ యోగములు దశాష్టకవర్గ ఫలములందొలఁగించి తమఫలముల నీయఁజాలవు. కాఁబట్టి యష్టకవర్గానుసారముగ శుభాశుభ ఫలములు గల్గుచుండఁగా నివియును తత్తత్కాలోచితముగ సర్వదశలయందును తమఫలముల నిచ్చుచుండును. కాఁబట్టి సుఖదుఃఖ మిశ్రఫలానుభవము ధనవంతులకును దరిద్రులకును సామాన్యముగ సంభవించుచుండు నని తెలియఁ దగినది. పూర్వము అధ్యాయాంతమునందు విశదీకరింపఁ బడునని చెప్పియున్న విషయ మేమనిన, దళయోగాకృతియోగములును దళయోగాశ్రయ యోగములు నేక కాలమున సంభవించు నదిలేదు. దళయోగ సంఖ్యాయోగము లేక కాలమునం గూడెనేని దళయోగము ఫలప్రద బగుంగాని సంఖ్యాయోగము ఫలప్రదముగాదు. ఆకృతి యోగాశ్రయ యోగములు గూడినను, ఆకృతి యోగ సంఖ్యా యోగములుగూడినను ఆకృతియోగమే ఫలప్రద మగునుగాని తక్కినవి ఫలప్రదములు గావు. ఆశ్రయ యోగ సంఖ్యా యోగములు గూడినచో నపుడు సంఖ్యా యోగమున కవకాశము లేదు. అదెట్లనిన, చర స్థిర ద్విస్వభావ రాసులయందు నెందైన నొకరాశియందు సర్వగ్రహము లుండెనేని ఆశ్రియ యోగమే ఫలకారియగుచున్నది. కాఁబట్టి అపుడు సంఖ్యాయోగాంతర్గతంబగు గోళక యోగమున కవకాశము లేదు. ఇత్యాది విషయములు బుద్ధిమంతులూహింతురని తెలియఁ జేయఁబడినవి.

ఇట్లు బృహజ్జాతక గ్రంథమునందుఁ బండ్రెండవ యధ్యాయమగు నాభసయోగాధ్యాయము సంపూర్ణము.

---

## చంద్రయోగాధ్యాయము.



అథమ సమవరిష్ఠా న్యర్క కేంద్రాది సంస్థే
శశిని వినయ విత్త జ్ఞాన ధీ నైపుణాని,
అహని నిశిచ చంద్రే స్వాధి మిత్రాంశ కేవా
సురగురు సిత దృష్టే విత్తవాన్ స్యాత్సుఖీచ. 1

తా. ఈయధ్యాయమునందుఁ జంద్రయోగ ఫలములం జెప్పఁబూని మొట్టమొదట సూర్యుఁ డుండుస్థానము మొదలు కేంద్ర పణఫ రాపోక్లిమ స్థానములయందుఁ జంద్రుఁ డుండగాఁ జనించినవాని స్వరూపము చెప్పఁబడినది. చంద్రుఁడు సూర్యునకుఁ గేంద్ర పణఫ రాపోక్లిమ స్థానములయం దుండఁగాఁ బుట్టినవానికి వినయమును, ధనమును, శాస్త్రజ్ఞానమును, బుద్ధియును కార్యములయందు నేర్పును గల్గును. అనఁగా జన్మకాలమునందు సూర్యునకుఁ గేంద్రములయందుఁ జంద్రుఁ డుండెనేని ఈచెప్పఁబడిన వినయాదులు పూర్ణముగ నుండవనియు, పణఫరాలయములయం దుండినచో వినయాదులు మధ్యమములై యుండుననియు, ఆపోక్లిమ స్థానములయందు జంద్రుఁ డుండినచో వినయాదులధికముగ నుండుననియు తెలియఁదగినది. "మూర్ఖాన్ దరిద్రాంశ్చ ఫలాన్విశీలాం శ్చంద్రఃప్రసూతేర్క చతుష్టయస్థః" అని యవనేశ్వరుండు చెప్పియున్నాఁడు. కాఁబట్టి యిక్కడ నధమ శబ్దమునకు నభావమని యర్థము. మఱియుఁ జంద్రుఁడు తననవాంశయందైనను అధిమిత్ర నవాంశ యందైనను గురువుచేఁ జూడఁబడు చుండఁగాఁ బగలు పుట్టినవాఁడు ధనాఢ్యుండును భోగియును నగునని తెలియఁదగినది. చంద్రుఁడు తన నవాంశయందుగాని అధిమిత్రాంశ యందుగాని శుక్రునిచేఁ జూడఁబడు చుండెనేని రాత్రియందుఁ బుట్టినవాఁడు ధనవంతుఁడును భోగవంతుఁడును సమర్థుఁడును స్త్రీలోలుండును. ఇందులకు, "స్వాంశేధిమిత్ర స్వాంశేవా సంస్థితో దివసే శశీ, గురుణాదృశ్యతే తత్ర జాతో విత్త సుఖాన్వితః, నిశ్యేవం భృగుణా దృష్టః శశీజన్మని శస్యతే, విపర్యయస్థే శీ

తాంశౌ జాయంతేల్ప ధనాన రాః. స్వాంశే శశీ భార్గవ దృష్ట మూర్తిః నిశీశ్వరో ద్యూతికరః ప్రదిష్టః, తదుత్తమో ద్యూతికర స్సతుస్యా ద్దృష్టేదివా దేవ పురోహి తేన" అని గార్గి యవనేశ్వరులచేఁ జెప్పఁబడినది గనుక గ్రాహ్యము.

సౌమ్యై స్స్మరారి నిధనే ష్వధియోగ ఇందో
స్తస్మిం శ్చమూప సచివ క్షితిపాల జన్మ,
సంపన్న సౌఖ్య విభవా హత శత్రవశ్చ
దీర్ఘాయుషో విగతరోగభయాశ్చ జాతాః. 2

తా. అనఁగా అధియోగ మనుదానికి ఫలము చెప్పఁబడినది. ఎట్లనఁగా, చంద్రునకు ౬-౭-౮ ఇండ్లనుండెడు బుధ గురు శుక్రుల చేత అనఁగా షష్ఠ సప్తమాష్టమ స్థానములలో నొకస్థానమునం దైనను స్థానద్వయమునం దైనను స్థానత్రయమునం దైనను సకల శుభగ్రహము లుండెనేని అధియోగ మనంబడును. మఱికొందఱు మూఁడు స్థానములయందును మూఁడు శుభగ్రహము లుండవలయు నందురు గాని యది యుక్తముగాదు. "నిధనం ద్యూనం షష్ఠచంద్ర స్థానాద్య దాశుభై ద్యుక్తం, అధియోగ స్సప్రోక్తో న్యాసకృతౌ సప్తధాపూర్వైః" అని శ్రుతకీర్తిచేఁ జెప్పఁబడినది. ఎట్లనఁగా, ఈ యోగము లేడువిధములుగఁ బూర్వీకులచేఁ జెప్పఁబడినట్లు తెలియుచున్నది. సకల శుభగ్రహములు చంద్రునకు నాఱవయింట నుండుట నొకయోగము. ఏడవయింటనుండుట రెండవయోగము. ఎనిమిదవయింట నుండుట మూఁడవ యోగము. ఆఱు, ఏడు ఈయిండ్ల నుండుట నాల్గవయోగము. ఆఱవయెనిమిదవయిండ్లనుండుట యైదవయోగము. ఏడెనిమిది యిండ్ల నుండుట యాఱవయోగము. ౬-౭-౮ ఇండ్లనుండుట యేడవ యోగ మిట్లు అధియోగ మేర్పడు చున్నదని తెలియఁ దగినది. మఱి యిదే ప్రకారము పాపగ్రహము లుండెనేని పాపాధి యోగమనియు, మిశ్రమముగ నుండెనేని మిశ్ర యోగమనియు నెంచఁదగినది. ఇందులకు, "షట్సప్తాష్టమ సంస్థై శ్చంద్రా త్సౌమ్యై శ్శుభోధి యోగస్స్యాత్, పాపాః పాపై రేవం మిశ్రై ర్మిశ్ర స్తథైవోక్తః." అని శ్రుతకీర్తిచేఁ జెప్పఁబడి యున్నది. కాఁ

బట్టి ఆయధియోగమునందు, "చమూప సచివ క్షితిపాలజన్మ" సేనాపతి మంత్రి భూపతులు జననం బగుదురనియు అనఁగా, బుధ గురు శుక్రు లధికబలముతోఁగూడి యుండిరేని యీయోగమునందుఁ బుట్టినవాఁడు రాజగు ననియు మధ్య బలయుతులై యుండిరేని మంత్రియగు ననియు బలహీనులై యుండిరేని సేనాపతి యగుననియుం దెలియఁదగినది. ఈ యోగమునం బుట్టిన రాజాదులు అత్యంత సౌఖ్యసంపన్నులును, జితశత్రుసమూహము గలవారును, పూర్ణాయువు గలవారును, విగత రోగ భయాదులు గలవారు నగుదురని తెలియఁ దగినది. మఱికొంద ఱియ్యది రాజయోగముగనెంచి రయ్యదెట్లనిన, "ద్యూనం షష్ఠ మథాష్టమం శశిరగోః ప్రాప్తా స్సమస్తా శ్శుభాః క్రూరాణాం యదిగోచరే నరపతి స్స్యార్వ్యాలయా ద్దూరతః, భూపాలః ప్రిభవే త్యయస్య జలధేర్వేలావనాం తోద్భవై స్సేనా మత్తకరీంద్రదాన సలిలంభృంగై ర్ముహుః పీయతే. అమిత్రం జామిత్రం నిధన మథవా శీతరుచితో గతస్సర్వే సౌమ్యా స్తమిహ జనయేయు ర్నరపతిమ్, ఘృతే సేవానేకం గతవతి విషా దేతుపయసా ప్రతాపాగ్ని ర్యస్య జ్వలతి హృదయే శత్రుషు భృశమ్" అని సారావళియందును మాండవ్య మునిచేతను జెప్పఁ బడి యున్నది.

హిత్వార్కం సునఫానఫా దురుధురా స్స్వాంత్యోభయ స్థైర్గ్రహైః
శీతాంశోః కథితో న్యథాతు బహుభిః కేమద్రుమో నైస్త్వసౌ,
కేంద్రే శీతకరేథవా గ్రహయుతే కేమద్రుమో నేష్యతే
కేచి త్కేంద్ర నవాంశ కేషుచ వదం త్యుక్తి ప్రసిద్ధానతే. 3

తా. ఈశ్లోకమున సునఫా ఉనఫా దురుధురా కేమద్రుమము లనెడు నాల్గుయోగములు చెప్పఁబడినవి. సూర్య వ్యతిరిక్త గ్రహములు చంద్రునకు రెండవయింట నుండెనేని సునఫాయోగమనియును, చంద్రునకుఁ బంద్రెండవ యింట నుండెనేని అనఫా యోగమనియును, చంద్రునకు నుభయపార్శ్వముల యందు నుండెనేని దురుధురాయోగ మనియును, సూర్యుఁడు రెండు, పంద్రెండు ఇండ్ల నుండినను ఈయోగ కర్తలయందు గణింపఁబడుంగాని యీయోగ

ములకు భంగము లేదని దెలియఁ దగినది. మఱియుఁ జంద్రునకు రెండవ యింట నైనను, పండ్రెండవయింట నైన సూర్యవ్యతిరిక్త గ్రహములు లేకుండెనేని కేమద్రుమ యోగ మనియును తలంచవలెను. కొందఱు గ్రంథకర్తలు చంద్రునకు ద్వితీయ ద్వాదశముల యందుఁ గుజాది గ్రహములు లేకుండినను జన్మ లగ్నాది కేంద్రముల యందు నొక కేంద్రమునందుఁ గుజాది గ్రహము లుండినను చంద్రుఁడు కుజాది యుక్తుఁడై యుండినను కేమద్రుమ యోగము గాదందు రని తెలియన గును. అయితే చంద్రునకు ద్వితీయ ద్వాదశములయందు జన్మ లగ్నాది కేంద్రముల యందుఁ గుజాది గ్రహములు లేక చంద్రుఁడు కుజాది గ్రహయుక్తుఁడుగాక యుండినచో గేమద్రుమ యోగ మని తెలియఁ బడుచున్నది. ఇందులకు, "వ్యయార్థకేంద్రగ శ్చంద్రా ద్వినాభానుం నచేద్గ్రహః, కశ్చిత్ప్రాప్యద్వా వినా చంద్రం లగ్నాత్కేంద్ర గతోథవాః. యోగకేమద్రుమోనామ తదాస్యాద్యత్ర గర్హితాః, భవంతి నిందితాచారా దారిద్ర్య పత్తి సంయుతాః." అను గార్గి వచనముల వలనఁ జంద్ర కేంద్రమునందు గ్రహము లుండినను కేమద్రు యోగము గాదని తెలియఁబడుచున్నది. మఱియును, "సునఫానఫా దురుధురాః క్రమేణ యోగాభనంతి రవి రహితైః, విత్తాంత్యోభయ సంస్థైః కైరవ వనబాంధవాద్గ్రహైః, ఏతేన యదాయోగాః కేంద్రే గ్రహ వర్జితే శశాం కేచ, కేమద్రుమోతి కష్టశ్శశినిచ సర్వ గ్రహైర్దృష్టే"అని సారావళిగ్రంథమునందును జెప్పఁబడియున్నది. మఱికొందఱు వ్యాఖ్యాతలు జన్మలగ్నాది కేంద్రములయందుఁ జంద్రుఁ డున్నను ఏస్థానమునంగాని చంద్రుఁడు కుజాది గ్రహయుక్తుఁడై యుండినను చంద్రునకు ద్వితీయ ద్వాదశములు కుజాది గ్రహవర్జితములై యుండినను కేమద్రుమ యోగము గాదని యర్థము చేసినారు గాని వరాహమిహిరాచార్యుల మతముగాదని లఘుజాతకమునందు, "రవివర్జం ద్వాదశగై రనఫా చంద్రా ద్ద్వితీయగైస్సునఫా, ఉభయస్థితై ర్దురుధురా కేమద్రుమ సంజ్ఞితోన్యః." అని చెప్పుటంజేసి పూర్వోక్తరీతిగఁ జంద్రునకు ద్వితీయ ద్వాదశములయందు సూర్య వ్యతిరిక్త గ్రహములు

లేకుండెనేని కేమదు్రమ యోగమని వరాహమిహిరాచార్యుల మత మని తెలియఁ దగినది. శ్రుతకీర్తి జీవశర్మాదులు మాత్రము, కేంద్రాదులయందుఁ గొందఱును నవాంశలయందుఁ గొందఱును ఈ మూఁడు యోగములం జెప్పుదురు. అదెట్లనిన, సూర్య వ్యతిరిక్తము లయిన కుజాది తారా గ్రహములు చంద్రునకుఁ జతుర్థమునందు నుండినచో సునఫా యోగము. చంద్రునకు దశమమందుండెనేని అనఫా యోగము. చంద్రునకుఁ జతుర్థ దశమములయం దుండెనేని దురుధురా యోగము. చంద్రునకుఁ జతుర్థ దశమములయందుఁ గుజాది గ్రహములు లేకుండెనేని కేమద్రుమ యోగము. ఇందులకు, "చంద్రాచ్చతుర్థగై స్సునఫా దశమ స్థితైః కీర్తితోనఫా విహగైః, ఉభయస్థితై ర్దురుధురా కేమద్రుమ సంజ్ఞితో న్యథా యోగః" అని శ్రుతకీర్తిచేఁ జెప్పఁబడి యున్న యది. నవాంశల యందు నెట్లనిన, తారా గ్రహము లగు కుజాదులు ఏరాశియందైనం జంద్రుఁ డుండు నవాంశ రాశికి ద్వితీయమున నుండిరేని సునఫా యోగము. చంద్ర నవాంశ రాశికి ద్వాదశమున నుండిరేని అనఫా యోగము. చంద్ర నవాంశ రాశికి ద్వితీయద్వాదశముల యందుండిరేని దురుధురా యోగము. చంద్ర నవాంశ రాశికి ద్వితీయ ద్వాదశములం గుజాదులు లేకుండిరేని కేమద్రుమము. ఇందులకు, "యద్రాసి సంజ్ఞే శీతాంశు ర్నవాంశే జన్మనిస్థితః, తద్ద్వితీయ స్థితై ర్యోగ స్సునఫాఖ్యః ప్రకీర్తితః, ద్వాదశై రనఫా జ్ఞేయా గ్రహై ర్ద్విద్వాదశ స్థితైః, ప్రోక్తో దురుధురా యోగోన్యథా కేమద్రుమః స్మృతః" అని జీవశర్మ గారిచేఁ జెప్పఁబడినది.

త్రింశ త్స్వరూపా స్సున ఫానఫాఖ్యా
షష్టి త్రయం దౌరుధుర ప్రభేదాః,
ఇచ్ఛా వికల్పైః క్రమశో భినీయ
నీతే నివృత్తిః పునరస్య నీతిః. 4

తా. అనఁగా నిచ్ఛావికల్పములచేత నేర్పడెడు యోగముల సంఖ్యలు జెప్పఁబడినవి. "త్రింశత్ ... భేదాః" అనఁగా సునఫా యోగములు 30. అనఫా యోగములు 30. దురుధురా యోగాలు ౧౮౦. ఈ సంఖ్య లేర్పడు నని తెలియఁ దగినది. "ఇచ్ఛావికల్పైః" కుజాది

గ్రహైకైకాది సంస్థాపన లక్షణమగు నిచ్ఛచేత నైన వికల్పములచేతఁ గ్రమముగఁ జంద్రునకు ద్వితీయ ద్వాదశములయందుఁ గుజాద్రి గ్రహ ములం బ్రత్యేకముగ నునిచి యోగభేదము తెలియఁ బడిన దగుచుం డఁగఁ బూర్వసంస్థాపిత గ్రహ నివృత్తి చేయఁదగినది. మఱల మఱి యొక విధముగ గ్రహసంస్థాపనము చేయఁదగినది. ఇవ్విధమునం గుజాది పంచగ్రహముల నొక్కొకటిగాను రెండేసిగాను మూఁడేసిగాను నాలు గేసిగాను అయిదేసిగాను చంద్రునకు ద్వితీయమునం దుంచి గణింపఁగా ౩౦ సునఫాయోగము లేర్పడు చున్నవి. చంద్రునకు ద్వాదశము నందుంచి గణింపఁగా ౩౦ అనఫాయోగము లేర్పడును. ఈస్థానద్వయ మునందు ననేక కాలముననునిచి గణింపఁగా ౧౮౦ దురధురా యోగము లేర్పడును. ఈ వికల్పమును దెలియు విధమెట్లనిన ; ''ప్రతిలోమం విని క్షిప్య చానులోమ మధక్షిపేత్, అనులోమం సమాహన్యా దధ స్థ్సేన విభాజయేత్'' అనుశ్లోకమునందు జెప్పియున్న ప్రకారముగ నిక్కడఁ గుజాదికము లగు ౫ గ్రహములచేత నీయోగము లేర్పడు చున్నవి. గనుక ౫ మొదలు ౧ వరకుఁ బ్రతిలోమముగ సంఖ్యలు

| | | | | |
|---|---|---|---|---|
| ౫ | ౪ | ౩ | ౨ | ౧ |
| ౧ | ౨ | ౩ | ౪ | ౫ |

వ్రాసి దానిక్రింద ౧ మొదలు ౫ వరకును అనులోమముగా సంఖ్యలు అధోరూప ముగ భేదము చేయఁదగినది. ఇట్లు చేయఁగా మొదట నేర్పడెడు ఏక వికల్ప యోగములు ౫ ఈ యైదుచేత ద్వితీయస్థానమునందున్న ౪ ను గుణింపఁగా ౨౦ యగును. ఆ ౨౦ ని క్రింద నున్న రెంటిచేత భాగిం పఁగా ౧౦ అగును గనుక ద్వివికల్పములు ౧౦ ఈ పదిచేతఁ దృతీయ స్థానమున నున్న ౩ గుణించి దానిక్రింద నున్నమూఁటిచేత భాగింపఁ గాఁ బదియగును. గనుక త్రివికల్పములు ౧౦ ఈపదిచేతఁ జతుర్థ స్థాన మునందున్న రెండును గుణించి దానిక్రింద నున్న నాల్గుచేత భాగింపఁగా నైదు అగును. గనుక చతుర్వికల్పములు ౫. ఈ యైదుచేత బంచమ స్థానమునందున్న ౧ ని గుణించి దానిక్రింద నున్న ౫ చేత భాగింపఁగా ౧ అగును గనుక పంచ వికల్పము ౧. ఇదియునుంగాక, ''పూర్వేణ పూ ర్వేణ గతేనయుక్తం స్థానం వినాంత్యం ప్రవదంతి సంఖ్యామ్'' అను

వచన ప్రకారముగ గణితము చేసినను ఇవ్విధముననే సంఖ్య లేర్పడును. ఈ యోగములయొక్క యుత్పత్తి ప్రకారము చంద్రునకు రెండవ యింట నంగారకుఁ డుండెనేని ౧ బుధుఁ డుండెనేని ౨ గురు వుండెనేని ౩ శుక్రుఁ డుండెనేని ౪ శని యుండెనేని ౫ ఇవ్విధమున నేకవికల్ప యోగములు ౫ అగును. కుజబుధులు, కుజ గురులు, కుజ శుక్రులు, కుజ శనులు, బుధ గురులు, బుధ శుక్రులు, బుధ శనులు; గురు శనులు, శుక్ర శనులు వీరు చంద్రునకు రెండవ యింట నుండిరేని ద్వివికల్ప యోగాలు ౧౦ అగును. కుజ బుధ గురులు, కుజ బుధ శుక్రులు, కుజ బుధ శనులు, కుజ గురు శుక్రులు, కుజ గురు శనులు, కుజ శుక్ర శనులు, బుధ గురు శుక్రులు, బుధగురు శనులు, బుధ శుక్ర శనులు, గురు శుక్ర శనులు వీరు చంద్రునకు రెండవయింట నుండిరేని త్రివికల్ప యోగములు ౧౦ అగును. కుజ బుధ గురు శుక్రులు, కుజ బుధ గురు శనులు, కుజ గురు శుక్ర శనులు, కుజ బుధ శుక్ర శనులు. బుధ గురు శుక్ర శనులు వీరు చంద్రునకు రెండవ యింట నుండిరేని చతుర్వికల్ప యోగములు ౫ అగును. కుజ బుధ గురు శుక్ర శనులు, చంద్రునకు రెండవయింట నుండిరేని పంచవికల్ప యోగము ౧. ఇవ్విధమున ౩౦ సునఫా యోగ భేదముల యుత్పత్తిం దెలియఁదగినది. ఈ ప్రకారముగనే చంద్రునకు ద్వాదశమునం గుజాదు లుండిరేని ౩౦ అనఫా యోగము లుత్పన్నము లగును. దురధురా యోగభేదములు పూర్వోక్త గణితము వలన నేర్పడవు గావున నిచ్ఛా వికల్పములచేతనే తెలియఁదగినది. అదెట్లనిన; కుజ బుధ గురు శుక్ర శనైశ్చరులయందుఁ జంద్రునకు రెండవ యింట నొకగ్రహము, పండ్రెండవ యింట నొకగ్రహము, ఈ విధమున నుండిరేని ౨౦ భేదము లేర్పడును. చంద్రునకు రెండవ యింట రెండు గ్రహములు పండ్రెండవ యింట నొకగ్రహము ఈ విధంబుండిరేని ౩౦ భేదము లగును. పండ్రెండవయింట రెండు గ్రహములు రెండవ యింట నొకగ్రహము ఈ విధంబుండెనేని ౩౦ భేదంబు లగును. రెండవయింట మూఁడు గ్రహములు, పండ్రెండవయింట నొక గ్రహము ఈ విధముండినచో ౨౦ భేదంబు లుత్పన్నంబులగుచున్నవి. పండ్రెండవయింట మూఁడుగ్రహములు, రెండవయింట నొకగ్రహము ఈవిధంబుండినచో

౨౦ భేదను లుద్భవించును. రెండవయింట నాలుగు గ్రహములు, పండ్రెండవ యింట నొకగ్రహము, ఇవ్విధమున నుండిన ౫ భేదములు సంభవించును. పండ్రెండవ యింట నాలుగు గ్రహములును రెండవ యింట నొకగ్రహమును. ఈరీతి నుండినచో ౫-భేదము లగుచున్నవి. రెండవయింట రెండు గ్రహములు పండ్రెండవయింట రెండు గ్రహములు ఇవ్విధముననుండినచో ౩౦-భేదములు జనించును. రెండవయింట మూఁడు గ్రహములు, పండ్రెండవ యింట రెండు గ్రహములు ఇవ్విధముననుండెనేని ౧౦-భేదములు గల్గుచున్నవి. పండ్రెండవ యింట మూఁడు గ్రహములు రెండవ యింట రెండుగ్రహములు ఇవ్విధముండినచో ౧౦-భేదములేర్పడుచున్నవి. ఈరీతిగ దురుధురా యోగ భేదములు ౧౮౦ అగునని తెలియఁదగినది.

స్వయ మధిగత విత్తః పార్థివ స్తత్సమోవా
భవతి హి సునఫాయాం ధీధన ఖ్యాతి మాంశ్చ,
ప్రభురగద శరీర శ్శీలవాన్ ఖ్యాతకీర్తి
ర్విషయ సుఖ సువేషో నిర్వృత శ్చానఫాయామ్. 5

తా. సునఫా యోగమునందుఁ బుట్టినవాఁడు కష్టపడి ధనార్జన చేసి రాజగును. అట్లు కాదేని రాజతుల్యుఁ డగును. మఱియు బుద్ధియు, కీర్తియు, విత్తమును, భూమియును గలవాఁ డగును. అనఫా యోగమునం బుట్టినవాఁడు వ్యాధిలేని శరీరముగలవాఁడును, అప్రతిహతం బగునాజ్ఞ గలవాఁడును, శాంతి వినయాది గుణములు గలవాఁడును, కీర్తిగలవాఁడును, శబ్ద స్పర్శాది విషయ సుఖములు గలవాఁడును, అనులేపన మాల్య భూషణా ద్యలంకారములు గలవాఁడును, మనోదుఃఖము లేనివాఁడును నగును.

ఉత్పన్న భోగ సుఖభు గ్ధన వాహనాఢ్య
స్త్యాగాన్వితో దురుధురా ప్రభవ స్సుభృత్యః,
కేమద్రుమే మలిన దుఃఖిత నీచ నిస్స్వాః
ప్రేష్యాః ఖలాశ్చ నృపతే రపివంశ జాతాః. 6

తా. దురుధురా యోగమునందుఁ బుట్టినవాఁడు సకలభోగము లనుభవించువాఁడును, ధనవాహనములతో నిండినవాఁడును, దాన ధర్మ పరోపకారములు గలవాఁడును, భృత్యులు గలవాఁడును అగును. కేమద్రుమ యోగమునం బుట్టిన వాఁడు రాజవంశోద్భవుండైనను మలిన వస్త్రధారియును, స్నానము సేయక యనాచార కార్యములు సహించువాఁడును, శరీర వ్యాధిగలవాఁడును, మనోదుఃఖము గలవాఁడును, అధమ నీచ కార్యములు చేయువాఁడును, పరుల వలన జీవించు వాఁడును, దుష్టబుద్ధి గలవాఁడును అగును. ఈరాజ వంశజులే యిట్లగుచుండ నిఁక నన్యజాతిం జెప్పనేల!

ఉత్సాహ శౌర్య ధనసాహసవా న్మహీజః
సౌమ్యః పటు స్సువచనో నిపుణః కలాసు,
జీవోర్థ ధర్మ సుఖభు జ్నృప పూజితశ్చ
కామీ భృగు ర్బహుధనో విషయోపభోక్తా. 7

తా. ఈసునఫాదియోగములం గలుగఁ జేయు గ్రహము అంగారకుండైనచోఁ బుట్టినవాఁ డుత్సాహశౌర్య ధన హసములు గలవాఁడగును. బుధుఁడైనచో సమర్థుండును, వాక్చతురత్వము గలవాఁడును, గీతవాద్యాది చతుష్షష్ఠి కళలయందును నేర్పరియు నగును. గురుండైనచో ధనవంతుఁడును, ధర్మిష్ఠియును, సుఖ మనుభవించు వాఁడును, బంధు మిత్ర రాజపూజితుండును అగును. శుక్రుండైనచో స్త్రీలోలుండును, సువర్ణ రత్న రజితాది భేదము వలన బహువిధ ధనము గలవాఁడును,ఇంద్రియ సుఖము లనుభవించువాఁడును నగును.

పరవిభవ పరిచ్ఛదోప భోక్తా
రవితనయే బహుకార్య కృద్గణేశః,
అశుభ కృదుడుపోహ్ని దృశ్యమూర్తి
ర్గళిత తనుశ్చ శుభోన్యథా న్యదూహ్యమ్. 8

తా. ఈ యోగములకు శని కర్తయైనచోఁ దత్ఫలము చెప్పఁబడినది.ఈ యోగములకు శనైశ్చరుం డధిపతియైనచో జాతకుఁ డన్యుల వస్త్రవాహనాది గృహముల ననుభవించువాఁడును, అనేక కార్య

ములు చేయువాఁడును, స్వజాతి జనాధిపుఁడును నగును. ఈ ప్రకారముగ సునఫాది యోగ కర్త యగుచుండఁగాఁ గల్గుఫలములు చెప్పఁబడినవి. రెండుమూఁడు గ్రహములు యోగకర్తలై చంద్రునకు రెండవ యింట గాని పండ్రెండవ యింటఁగాని యుండిరేని ఆయా గ్రహములకు "ఉత్సాహ శౌర్య ధనసాహసవాన్ మహీజః" ఇత్యాది వాక్యముల చేతఁ జెప్పఁబడిన ఫలము లన్నియు నీచ శత్రుక్షేత్ర నవాంశాది స్థితుల నెఱింగి చెప్పఁదగినది. పగటియందు జనించినవానికిఁ జంద్రుఁడు దృశ్య చక్రార్ధమునందుఁ గానంబడు చుండెనేని దారిద్ర్యాద్యశుభ ఫలము లం జేయును. అదృశ్య చక్రార్ధమునందుఁ గానరాకుండెనేని పగలు పుట్టినవానికి నైశ్వర్యాది శుభఫల ప్రదుం డగును. ఉక్తవైపరీత్యముగ జన్మకాలమునందుఁ జంద్రుఁ డుండెనేని ఉక్త వ్యతిరిక్త ఫలము నూహింపఁ దగినది.

లగ్నాదతీవ వసుమాన్ స్వసు మాంచ్ఛశాంకా
త్సౌమ్యగ్రహై రుపచయోప గతై స్సమస్తైః,
ద్వాభ్యాం సమోల్ప వసుమాంశ్చ తదూన తాయా
మన్యేష్వ సత్స్వపి ఫలే ష్విద ముత్కటేన. 9

తా. జన్మలగ్నమునకు నుపచయ స్థానమును బొందియున్నట్టి శుభగ్రహములచేత(బుధ గురు శుక్రులచేత)మిక్కిలి ధనవంతుఁడగును. చంద్రుఁ డున్నరాశికి నుపచయస్థానమునందున్న బుధ గురు శుక్రుల చేత ధనవంతుం డగును. మఱియు జన్మ లగ్నమునకైనను చంద్రలగ్న మునకైన నుపచయ స్థానమునం దున్న రెండు శుభగ్రహములచేత సామాన్య ధనవంతుం డగును. లగ్నమునకైనను చంద్రునికైనను నుప చయస్థానమునం దొక శుభగ్రహ ముండెనేని స్వల్పధనవంతుఁ డగును. ఇవ్విధమునఁ జెప్పుటవలన నుపచయస్థానమునం దొక గ్రహమైన లేకుండెనేని దరిద్రుం డగుననియు, లగ్నోపచయ చంద్రోపచయముల రెంటియందును శుభగ్రహము లుండెనేని అధిక ధనవంతుం డగుననియు తెలియందగినది. అన్యయోగములయందు జనించిన ఫలములు అశుభ కరములై యుండినను ఈశ్లోకమునందుఁ జెప్పఁబడినట్టి శుభఫలములు

బాహుళ్యముగ నగును. అనఁగా లగ్నమునకుఁగాని చంద్రునకుఁగాని యుపచయ స్థానమునందు శుభగ్రహము లుండెనేని కేమద్రుమా ద్యశుభ యోగములు గల్గియుండినను వాని ఫలములు క్షీణములై ఈశుభ ఫలములే అధికముగ నగునని తెలియఁ దగినది. వ్యాఖ్యానాంతర మునందు "అన్యేషు సత్స్వవిఫలే ష్వదముత్క టేన" అని పఠింపఁ బడి యనుపచయ స్థాన గత గ్రహములచేతఁ బ్రాప్తములైన యోగములు నిష్ఫలము లగుచుండఁగ నీయుపచయ స్థానగతశుభగ్రహ ఫలము లధికముగ నగునని యర్థము చేయఁబడినది.

ఇట్లు బృహజ్జాతక గ్రంథమునందుఁ బదుమూఁడవ యధ్యాయ మగు చంద్రయోగాధ్యాయము సంపూర్ణము.

---

## ద్విగ్రహ యోగాధ్యాయము.

తిగ్మాంశు ర్జనయత్యుషేశ సహితో యంత్రాశ్మకారం నరం
భౌమేనాఘనరతం బుధేన నిపుణం ధీకీర్తి సౌఖ్యాన్వితం,
క్రూరంవాక్పతి నాన్య కార్య నిరతం శుక్రేణ రంగాయుధై
ర్లబ్ధస్వం రవిజేన ధాతు కుశలం భాండ ప్రకారేషువా. 1

తా. ఈయధ్యాయమునందు రెండు గ్రహములు గూడి యుండఁగాఁ బుట్టినవాని లక్షణములను విశదీకరింపఁ బూని మొట్టమొదట సూర్యుఁడు చంద్రాది యుక్తుఁడై యుండఁగా జనించినవాని స్వభావములు చెప్పఁబడినవి. సూర్యుఁడు చంద్ర సహితుఁడై నానావిధ యంత్రములను బాషాణ కర్మలను జేయునట్టి పురుషుని పుట్టించును. అంగారకునితోఁ గూడినవాఁడైనఁ బాపాసక్తుని జనింపఁజేయును. బుధునితోఁ జేరినఁ గార్యములయందు సమర్థునిగ జేయును. గురువుతోఁ గూడినట్లయిన నితరుల కార్యములయం దాసక్తి గలవానిని జనింపఁ జేయును. శుక్ర సహితుఁడైనచో మల్లాది క్రియలచేతను లేక,

నాట్య క్రియలచేతను ఖడ్గ శస్త్రాద్యాయుధములచేతను పొందఁబడిన ధనము గలవానిగ జనింపఁ జేయును. శనితోఁ గూడిన తామ్రాద్యుత్పాదక మృత్తికా గైరికాది ధాతువులయందు సమర్థుఁడైన వానినైనను, తద్ధాతువులవలన నగుపాత్రాదులు చేయువాని నైనను జనింపఁ జేయును. "భాండంపాత్రే వణిజ్మూల ధనే భూమాశ్వ భూషయోః" అని మేదిని నిఘంటువున జెప్పఁబడుటంజేసి పాత్ర నిర్మాపకునిం జేయునని యుం జెప్పఁదగినది.

కూట స్త్ర్యాసవ కుంభ పణ్యమ శివం మాతు స్సవక్ర శ్శశీ
సజ్ఞః ప్రశ్రిత వాక్య మర్థ నిపుణం సౌభాగ్య కీర్త్యన్వితం,
విక్రాన్తం కులముఖ్య మస్థిరమతిం విత్తేశ్వరం సాంగిరా
వస్త్రాణాం నసితః క్రియాది కుశలం సార్కిః పునర్భ్వాసుతమ్. 2

తా. చంద్రుఁడు కుజాది గ్రహయుతుఁడై యుండఁగ జనించిన వాని లక్షణములు చెప్పఁబడినవి. చంద్రుఁడు కుజునితోఁ గూడినచో కూట స్త్ర్యాసవకుంభపణ్యం=అనఁగా నిచ్చట పణ్య శబ్దమును కూటాదులయందుఁ బ్రత్యేకముగ సంబంధింపఁ జేసి "కూటపణ్యం, స్త్రీపణ్యం, ఆసవపణ్యం, కుంభపణ్యం" అని నాలుగు విధములుగఁ జెప్పఁదగినది.

1. కూటపణ్య మనఁగాఁ గపటమున నొకవస్తువునకు మఱియొక వస్తు రూపము గల్పించి విక్రయించువాఁడును.
2. స్త్రీపణ్యమనఁగా స్త్రీని విక్రయించువాఁడును ఇక్కడ నన్యకుల జుఁ డన్యకుల కన్యావిక్రయమును గూడఁ జేయువాఁ డని యర్థము.
3. ఆసవపణ్య మనఁగా మద్యము నీచపదార్థములు విక్రయించువాఁడును.
4. కుంభపణ్య మనఁగాఁ గుండలమ్మెడువాఁడును అని యర్థము గనుక యీవిధ మగుపనులు చేయువారలం బుట్టింపఁ జేయు నని తెలియఁ దగినది.

మఱియుం దల్లికి న శ్రేయస్కరుఁడైన వానిని జనింపఁ జేయునని యుఁ దెలియఁ దగినది. బుధునితోఁ గూడినచో సౌభాగ్య కీర్త్యన్వితుని ధనార్జనము చేయుటయందు సమర్థుని మంచిమాటలాడువానిని సూక్ష్మ బుద్ధిగలవానిని జనింపఁ జేయునని తెలియఁ దగినది. గురువుతోఁ గూడి నట్లైనఁ బరాక్రమ వంతుని బంధు శ్రేష్ఠుని చపలచిత్తుని ధనవంతునిఁ గా జనింపఁ జేయునని తెలియఁ దగినది. శుక్రునితోఁ జేరినచో వస్త్రములు విక్రయించుటయందుఁ గానశాస్త్రమునందు నేర్పు గలవానిగ జనింపఁ జేయునని తెలియఁ దగినది. శనితోఁ గూడినచో మాఱుమను వు కౌమారునిగ బుట్టించు నని తెలియఁ దగినది. మఱియు "పరిణీతా పతిం హిత్వా సవర్ణం కామతః శ్రయేత్, అక్షతా చ క్షతాచైవ పునర్భూ సంస్కృతా పునః." అని పునర్భూలక్షణము లఘుజాతకమునం దుఁ జెప్పఁబడి యుండుటంజేసి చంద్రుఁడు శనితోఁ గూడియుండఁగాఁ బుట్టినవాఁడు నిజమగు తండ్రికి జనింపక వేఱొకనికి జనించునని తెలి యందగినది.

మూలాది స్నేహ కూటై ర్వ్యవహరతి వణిగ్బాహుయోద్ధా ససౌమ్యే
పుర్యధ్యక్షః సజీవే భవతి నరపతిః ప్రాప్త విత్తో ద్విజోవా,
గోపో మల్లోథ దక్షః పరయువతి రతో ద్యూతకృ త్సాసు రేజ్యే
దుఃఖార్తో సత్యసంధ స్సవిత్రృ తనయే భూమిజే నిందితశ్చ. 5

తా. అంగారకుఁడు బుధాదులతోఁగూడి యుండఁగా బుట్టిన వాని లక్షణము చెప్పఁబడినది. కుజుఁడు బుధునితోఁ గూడిన కాలమునం బుట్టినవాఁడు కందమూల ఫల పుష్ప వల్కములను, ఘృత తైలాదులను, విక్రయించి వ్యాపారాది కృత్రిమ వృత్తిచే ధనమార్జించువాఁడగును. మఱియు మల్లయుద్ధమును జేయువాఁడు నగును. గురువుతో గూడినచోఁ బురాధిపతిగాని, రాజ్యాధిపతిగాని, ధనికుఁడుగాని, బ్రాహ్మణుండుగాని యగును. (ఈవిషయమున గ్రహబలానుసారముగ విద్యా వినయ సంపన్నత్వమును గూడఁజెప్పఁ దగినది). శుక్రునితోఁ గూడినచో గోపాలకుండును, బాహుయుద్ధము సేయువాఁడును, సమర్థుండును, పరస్త్రీరతుండును, ద్యూతమునందు నాసక్తి గలవాఁడును

అగును. ఇచ్చటకొందఱు "సూతకృత్" అనిపఠించి శకటముల నడిపించువాఁడగు ననియుం జెప్పెదరు. శనితోఁగూడి నట్లయిన దుఃఖపీడితుండును, అసత్యము పల్కువాఁడును, జననిందితుండును, కుచ్ఛితాన్న భోజనముగలవాఁడును నగునని తెలియఁదగినది.

సౌమ్యే రంగచరో బృహస్పతియుతే గీతప్రియో నృత్యవి
ద్వాగ్మీ భూగణపః సితేన మృదునా మాయీ పటుర్లంఘకః,
సద్విద్యో ధనదారవాన్ బహుగుణః శుక్రేణ యుక్తే గురౌ
జ్ఞేయః శ్మశ్రుకరో సితేన ఘటకృజ్జాతోఽన్నకారోఽపి వా. 4

తా. బుధుఁడు గురువు మొదలగు గ్రహములతోను, గురువు శుక్రాదులతోను గూడియుండఁగా జనించిన వాని లక్షణములు చెప్పఁబడినవి. బుధుఁడు గురుయుతుండైనచోఁ బుట్టినవాఁడు రంగచరః=మల్లక్రీడాదులయందుఁ దిరుగు వాఁడును, గానలోలుండును, నాట్యశాస్త్రాభిజ్ఞుండును అగునని తెలియఁ దగినది. శుక్ర సహితుఁడైనచో జనించినవాఁడు మాటలచేత గౌరవమునొందువాఁడును, భూమి గలవాఁడును, సభాధిపుండును అగును. శనితోఁగూడి నట్లయినఁ బుట్టినవాఁడు అన్యుల మోసపుచ్చుటయందు నేర్పరియును, గురు వచనతిరస్కారము చేయువాఁడు నగును. గురు శుక్రులు గూడిరేని జనించినవాఁడు సద్విద్యాధన కళత్రము గలవాఁడును, జ్ఞాన శీలుండును విద్యాధనములు గలవాఁడును, సద్గుణములు గలవాఁడును నగును. గురువు శనితోఁగూడినట్లయిన మంగల కుమ్మర కులములం బుట్టినవాఁడుగనైనను, వంటలు నేయువాఁడుగాని కలాహీనుండుగాని యగునని తెలియఁ దగినది.

అసిత సిత సమాగమేఽల్ప చక్షు
ర్యువతి సమాశ్రయ సంప్రవృద్ధ విత్తః,
భవతిచ లిపి చిత్రకాదివేత్తా
కథిత ఫలైః పరతో వికల్ప నీయాః. 5

తా. శుక్రుఁడు శనితోఁగూడి యుండఁగా బుట్టినవాని స్వభావములు చెప్పఁబడినవి. శుక్రుఁడు శనియుతుండైనచో అల్ప దృష్టిగలవాఁడును, స్త్రీల నాశ్రయించుటచేత వృద్ధినొందిన ధనము గలవాఁ

డును, పుస్తకములు వ్రాయుట చిత్తరువులు వ్రాయుట మున్నగు పనులు తెలిసినవాఁడును నగునని తెలియఁదగినది. ఇవి ద్విగ్రహ యోగములు. మఱి జన్మకాలమునందు ద్విగ్రహ యోగములు రెండుమూఁడు సంభవించినచో నపుడు ఆయాయోగముల ఫలము లన్నియుఁ జెప్పఁదగినవి. అన్యము లగుమూఁడు నాల్గు గ్రహాదులతో నేకరాశి గతులై యుండిరేని ద్విగ్రహ యోగమునకుం జెప్పఁబడిన ఫలములచేత వికల్పింపఁ దగినవి. అదెట్లనఁగా నొకరాశియందు రవి చంద్ర కుజులు గూడి యుండిరేని యపుడు రవి చంద్ర యోగఫలమును రవి కుజ యోగ ఫలమును చంద్ర కుజ యోగఫలమును ఈమూఁడు ఫలములును చెప్పఁదగినవి. తక్కినవి గూడ నివ్విధమున నూహింపఁ దగినది.

ఇట్లు బృహజ్జాతక గ్రంథమునందుఁ బదునాల్గవ యధ్యాయ మగు ద్విగ్రహయోగాధ్యాయము సంపూర్ణము.

---

## ప్రవ్రజ్యాయోగాధ్యాయము.

ఏకస్థై శ్చతురాదిభి ర్బలయుతై ర్జాతాః పృథ గ్వీర్యగైః
శ్శాక్యా జీవక భిక్షువృద్ధ చరకా నిర్గ్రంథ వన్యాశనాః,
మాహే యజ్ఞ గురు క్షపాకర సిత ప్రాభాకరీ నైః క్రమాత్
ప్రవ్రజ్యా బలిభి స్సమాః పరజితై స్తత్స్వామిభిః ప్రచ్యుతిః. 1

తా. ఈయధ్యాయమునందు నీయీకాలమునం బుట్టినవారు సన్యసింతురని తెలియఁ జేయుంబూని మొట్టమొదట యేకరాశి గతులగు చతుర్థ పంచమాది గ్రహములచేత సంభవించు ప్రవ్రజ్యా భేదములు చెప్పఁబడినవి. అదెట్లనఁగా—ఏరాశియందైన నొకరాశియందు నాలు గైదా ఱేడు గ్రహములు బలయుతులై యుండఁగా బుట్టినవాఁడు అందెన్ని గ్రహములు బలయుక్తము లై యుండునో యన్ని విధము

లగు ప్రవ్రజ్యలను వక్ష్యమాణ ప్రకారముగఁ బొందునని తెలియఁదగినది. అనఁగాఁ బ్రత్యేకముగ బలవంతులైన "మాహేయజ్ఞ గురుక్షుపాకర సిత ప్రాభాకరీనైః" అంగారక బుధ బృహస్పతి చంద్ర శుక్ర శని సూర్యులచేత వరుసగా శాక్యాజీవక భిక్షు వృద్ధ చరక నిర్గ్రంథ వన్యాశనాఖ్యులయిన సన్న్యాసులగుదు రని తెలియ దగినది. అనఁగా నేకరాశిస్థితు లగు చతుర్థ పంచమాది గ్రహముల యందు నంగారకుఁడు బలవంతుఁడై యుండెనేని శాక్య=బుద్ధోపాసకుం డగు రక్తవస్త్ర సన్న్యాసి యగు ననియును, బుధుఁడు బలవంతుఁడై యుండెనేని ఆజీవక=ఏకదండసన్న్యాసి యగుననియు, గురువు బలవంతుఁడై యుండెనేని భిక్షు=త్రిదండ సన్న్యాసి యగుననియును, చంద్రుఁడు బలవంతుఁడై యుండెనేని వృద్ధ=వృద్ధశ్రావకుం డనెడు కాపాలికుం డగుననియును, శుక్రుండు బలయుక్తుం డై యుండెనేని చరక=చక్ర చరాఖ్య సన్న్యాసి యగుననియు, శని బలవంతుఁడైనచో నిర్గ్రంథ=దిగంబర సన్న్యాసి యగుననియు, సూర్యుఁడు బలవంతుఁడై యుండెనేని వన్యాశన=వనమునం బుట్టిన కందమూలాదులను తినుచుండు తాపసుం డగు ననియుం దెలియఁదగినది. "ప్రవ్రజ్యా బలిభి స్సమాః" అనఁగా నేకరాశిం బొందినట్టి నాల్గు మొదలగు గ్రహములలో నెన్ని గ్రహములు బలయుక్తములై యుండునో అన్ని విధములగు ప్రవ్రజ్యలు జాతకునకుఁ గల్గునని యర్థము. ఆ బలయుక్త గ్రహములయందు నధిక బలయుక్త గ్రహమునకుం జెప్పఁబడిన ప్రవ్రజ్య ముందు గల్గి బలాధిక గ్రహ పూర్వకముగ నితర ప్రవ్రజ్యలుం గల్గునని తెలియఁ దగినది. ఇందులకు "చతురాదిభి రేకస్థైః ప్రవ్రజ్యాం స్వాంగ్రహః కరోతి బలీ బహుభిః వీర్యోపేతైః ప్రథమా వీర్యాధికస్యైవ, తాపస వృద్ధ శ్రావక రక్తపటా జీవి భిక్షు చరకాణాం నిర్గ్రంథానాం చార్కా త్పరాజితైః ప్రచ్యుతిర్బలిభిః." అని లఘుజాతకమునందుఁ జెప్పఁబడియున్నది. కాఁబట్టి యేకరాశి గతులైన చతురాది గ్రహముల యందు నొకగ్రహ మైన బలయుక్తమైనది గాక యుండెనేని ప్రవ్రజ్యాయోగమే లేదని తెలియఁదగినది. పరాజితైః=గ్రహయుద్ధమునందు నితరగ్రహములచే జయిం

పఁబడిన ప్రవ్రజ్యాధిపతులగు గ్రహములచేత స్వీకృత ప్రవ్రజ్యా భ్రంశము గల్గును. అనఁగా జననకాలమున నేకరాశి గతులై ప్రవ్రజ్యాధిపతు లైన నాల్గు గ్రహములు మొదలగు గ్రహములయందు బలయుత గ్రహము యుద్ధమునందుఁ బరాజితమై యుండెనేని ఆగ్రహసంబంధినియగు ప్రవ్రజ్యను స్వీకరించి మఱల విడుచు నని తెలియఁదగినది. ఇవ్విధమున ననేకగ్రహములు బలయుక్తములై పరాజితములై యుండెనేని పరాజిత గ్రహసంబంధిక ప్రవ్రజ్యల నన్నింటిని స్వీకరించి మఱల విడిచి పెట్టుచుఁ గట్టకడఁ బరాజితము గాక యుండెడుగ్రహప్రవ్రజ్య నాశ్రయించి ఆప్రవ్రజ్యయందు యావజ్జీవ ముండుననియు, బలవద్గ్రహము లన్నియుఁ బరాజితములై యుండెనేని అన్ని ప్రవ్రజ్యలవలనను భ్రష్టుం డగుననియు, ప్రవ్రజ్యా దాయక గ్రహము లనేకములు పరాజితములుగాక యుండెనేని అందుఁ బ్రథమ ప్రవ్రజ్యా దాయక గ్రహాంతర్దశయందు మొదట ప్రవ్రజ్య నాశ్రయించి ద్వితీయ ప్రవ్రజ్యా దాయక గ్రహాంతర్దశ నఱకుఁ బ్రథమాశ్రిత ప్రవ్రజ్య యందుండి ద్వితీయప్రవ్రజ్యా దాయక గ్రహాంత ర్దశాంతర్దశలయందు రెండవ ప్రవ్రజ్య నాశ్రయించు ననియు నిట్లు ఎన్నిగ్రహములు ప్రవ్రజ్యా దాయకము లై యుండునో యన్ని ప్రవ్రజ్యలను గ్రమముగ నాశ్రయించి కట్టకడపటి ప్రవ్రజ్యయందు యావజ్జీవ ముండు ననియు తెలియఁదగినది. ఇందులకు, "తేష్వధిక బలీ జీవ స్త్రీదండినం భార్గవశ్చ చరక ముఖ్యం నగ్న శ్రమణం సౌరో బుధ స్తథా జీవ కాచార్యమ్. వృద్ధశ్రావక మిందర్దివాకర స్తాపసంతపోముఖ్యం వక్రశ్శాక్యం శ్రవణం క్షేత్రాశ్రయజః గుణాం శ్చైతాః, వీర్యోపేతేల్పత నానదీక్షితాభ క్తివా దిన స్తేషావ్ అన్యైః పరాజిత శ్చేత్ప్రవ్రజ్యాప్రచ్యుతింకుర్యాత్. యావంతో వీర్యయుతాః ప్రవ్రజ్యా భవంతి తావంత్యః, ఏకర్క్ష గేషు నియమాత్తేషా మద్యా బలోపేతాత్" అని సత్యాచార్యులచేతఁ జెప్పఁబడియున్నయది

రవి లుప్తకరై రదీక్షితా బలిభి స్తద్గతభక్తయో నరాః,
అభియాచిత మాత్ర దీక్షితా నిహతై రన్య నిరీక్షితై రపి.

తా. ప్రవ్రజ్యాయోగదాయక గ్రహములు అస్తంగతులై యుండినను, ఇతరగ్రహములచేతఁబరాజితములై యుండినను,పూర్వశ్లోకము

చేతఁ జెప్పఁబడిన ప్రవ్రజ్యలు సంభవించు నవి కావని చెప్పఁబడినవి. సూర్యకిరణాక్రాంతములగు బలయుక్తగ్రహములచేతఁ బురుషులు ప్రవ్రజ్యావర్జితులగుదురు. అనఁగా నేకరాశిగతములగు చతురాదిగ్రహములయందు బలయుక్తగ్రహములు ప్రవ్రజ్యాదాయకములని చెప్పఁబడినవి గదా! ఆబలయుక్త గ్రహములయందు నెన్నిగ్రహము లస్తంగతములై యుండునో ఆగ్రహములు తమతమ ప్రవ్రజ్యలనీయఁజాల వని తెలియఁ దగినది. అయితే బలయుక్తగ్రహము లస్తంగతములై యుండఁగాఁ బుట్టిన మనుజులు ఆప్రవ్రజ్యనుబొందిన సన్న్యాసులయందు భక్తిగలవారై యుందురు. ఏకరాశిగత చతురాది గ్రహముల యందు బలయుక్త గ్రహములు జన్మకాలమునందు నితరగ్రహములచేత గెలువంబడియుండినను అన్య గ్రహములచేతఁ జూడఁబడి యుండినను సన్న్యసింప వలయునని గోరుదురుగాని తత్ఫలము నొందలేరని తెలియఁ దగినది. ఇందులకు “ ప్రవ్రజ్యాయాస్స్వామీ రవి ముషిత తనుర్నిరీక్షితో వాన్యైః, యాచిత దీక్షా నభవతి యవనాధిపతేర్యథావాక్యమ్” అని యవనుల చేతఁ జెప్పఁబడి యున్నది. కాఁబట్టి “పరాజితైస్తత్స్వామిభిః ప్రచ్యుతిః” అని పూర్వము చెప్పిన దాని కపవాదము కాఁబట్టి బలవద్గ్రహ యుద్ధమునందుఁ బరాజితంబై అన్యగ్రహ దృష్టి లేకుండినచో ఆప్రవ్రజ్యను గ్రహించి మఱలఁ బరిత్యజించు ననియు బలయుక్త గ్రహము పరాజితంబై యితరగ్రహముచేఁ జూడఁబడు చుండెనేని ప్రవ్రజ్యా ప్రార్థనా పరుండయ్యును ప్రవ్రజ్యం బొందఁజాలఁడనియు తెలియఁదగినది. ఇదియునుం గాక “ దీక్షా దాన సమర్థో యో భవతి తదా బలేన సంయుక్తః, తస్యైవ దశాకాలే దీక్షాం లభతే నరోవశ్యం, యస్యచ దీక్షా చ్యవనం తస్యైవ దశావసానే స్యాత్” అని గ్రంథాంతరమునం జెప్పఁబడి యున్నది. ఇవ్విధమున జన్మకాలమునందు గ్రహ బలాబలములను బాగుగఁజూచి యోచించి చెప్పఁదగినది.

జన్మేశో న్యైర్యద్య దృష్టోర్కపుత్రం
పశ్యత్యార్కి ర్జన్మపం వా బలోనం,
దీక్షాం ప్రాప్నోత్యార్కి ద్రేక్కాణ సంస్థే
భౌమార్క్యంశే సౌరదృష్టేచ చంద్రే.

తా. ప్రవ్రజ్యా యోగత్రయమును చెప్పఁబడినది. జన్మకాలమునఁ జంద్రుఁ డేరాశియం దుండునో అరాశ్యధిపతికి జన్మేశుండని నామము గలదు. ఆజన్మేశుండు అన్యగ్రహముల చేతఁ జూడఁబడనివాఁడై శనైశ్చరుని చూచుచుండెనేని జాతకుఁడు శనైశ్చరునకుం జెప్పఁబడిన దిగంబర సన్న్యాసము నొందు ననియు, నిందులకు "యస్యేశ తేర్క-పుత్రం జన్మభ నాథో గ్రహై ర్నసం దృష్టః, తస్య హిదీక్షాలాభ స్త ద్బలయోగా ద్దశాకాలే" అని గ్రంథాంతరమునందుఁ జెప్పఁబడి యున్నది కాఁబట్టి జన్మకాలమున శనైశ్చర జన్మేశుల యందు నెవఁడు బలాధికుఁడై యుండునో వాని యంతర్దశలయందుఁ బ్రవ్రజ్యం బొందునని తెలియందగినది. అట్లు కాకపోయినచో శనైశ్చరుఁడు తా బలయుతుఁడై బలహీనుఁ డగు జన్మేశుని చూచినచో శనైశ్చరునకుం జెప్పఁబడిన ప్రవ్రజ్యను బొందునని తెలియఁ దగినది. ఇందులకు "శనిదృష్టే బలహీనే జన్మ నినాథే వదేచ్చ నిర్గ్రంథమ్" అని చెప్పఁబడినది. మఱియు శనిద్రేక్కాణమునం దున్నట్టి చంద్రుఁడు కుజ శని నవాంశలలో నొకనవాంశ యందు నితర గ్రహములచేఁ జూడఁబడక యుండి శనిచేతఁ జూడఁబడెనేని శనికిం జెప్పఁబడినట్టి ప్రవ్రజ్యను బొందును. ఇందులకు "సౌరిద్రేక్కాణ సంస్థో యదిభవతి శశీ తదంశ సంస్థశ్చ, వక్రాంశేవా దృష్టస్సౌరేణతు సర్వదర్శన విముక్తః." అని లఘుజాతకమునందుఁ జెప్పఁబడి యున్నది.

సురగురు శశిహోరా స్వార్కి దృష్టా సుధర్మే
గురు రథనృపతీనాం యోగజ స్తీర్థకృత్స్యాత్,
నవను భవన సంస్థే మందగే న్యైరదృష్టే
భవతి నరపయోగే దీక్షితః పార్థివేంద్రః. 4

తా. అనఁగా గురు చంద్రలగ్నములు శనిచేతఁ జూడఁబడుచుండఁగాఁ దొమ్మిదవ యింట గురు వుండెనేని రాజయోగమునం బుట్టినవాఁడైనను శాస్త్రకర్త యగునని తెలియఁ దగినది. "తీర్థం శాస్త్రే ధ్వరక్షే త్రోపా యోపాధ్యాయ మంత్రిషు" అని విశ్వనిఘంటువునం జెప్పఁబడినది. కాఁబట్టి పైఁ జెప్పఁబడి నందులకు "గురు

శశి లగ్న ద్రష్టరిమందే యది నవమ గో జీవః, నరజాత జన్మ జాత శ్శాస్త్రకర్తో భవతి నచనృపః." అని గ్రంథాంతరమునం జెప్పఁబడినది. ఇక్కడ కేవల మీయోగమునం బుట్టినవారు కణాద బ్రహ్మ గుప్తాదులవలె శాస్త్ర కర్త లగుదు రనియు నీయోగమును రాజయోగమును గూడి యుండఁగాఁ బుట్టినవారు జనక కాశీరాజ ప్రభృతులవలె రాజేంద్రులై శాస్త్రి కర్త లగుదు రనియుం దెలియఁ దగినది. ఇందులకు "అస్మిన్ యోగే చాన్యో నృపయోగోభవతి తత్రయో జాతః, నభవతి జనేంద్ర తుల్యో నరనాథ శ్శాస్త్రికర్తాచ" అని గ్రంథాంతరమునం జెప్పఁబడి యున్నది. అయినఁ గొందఱు ధనుర్మీన కర్కాటకముల యందు నొక్కటి జన్మలగ్నమై ఆలగ్నమును శనిచూచు చుండఁగా గురువు నవమమునం దుండెనేని రాజయోగ జాతుండైనను తీర్థయాత్ర సేయువాఁడు నగునని వ్యాఖ్యానము చేసియున్నారు. లగ్నమునకు నవమ స్థానమున నున్నట్టి శనైశ్చరుఁడు అన్య గ్రహములచేతఁ జూడఁబడ కుండఁగా రాజయోగమునందుఁ బుట్టినవాఁడు రాజాధిరాజును, పరివ్రాజకుండును అగును. అయితే రాజయోగము లేక కేవల ప్రవ్రజ్యాయోగమునందుఁ బుట్టినవాఁడు కేవల పరివ్రాజకుండగుననియు, రాజయోగమును ప్రవ్రజ్యా యోగమునుం గూడియుండఁగాఁ బుట్టినవాఁడు సకల రాజేశ్వరుండై పరివ్రాజకుం డగుననియు తెలియఁదగినది. ఇందులకు "నవమస్థానే సౌరో యదిస్థిత స్సర్వ దర్శన విముక్తః, నృపయోగస్యా భావే యోగేస్మిన్ దీక్షితో౽నరోజాతః, నిస్సందిగ్ధం ప్రవదే ద్యోగస్యా స్యప్రభావేన" అని గ్రంథాతరమునందుఁ జెప్పఁబడి యున్నది. ఈప్రకారముగ రాజయోగ యుక్తములయిన సకల ప్రవ్రజ్యా యోగములకును ఫలము చెప్పఁదగినది. ఇందులకు "ప్రథిత మునిపయోగే రాజయోగే యదిస్యా దశుభ ఫలవిపాకం సర్వమున్మూల్య పశ్చాత్, జనయతి పృథివీశం యోగినం సాధుశీలం ప్రణత నృపశిరోమ ణ్యుజ్జ్వల త్పాదపద్మమ్" అని సారావళియందు జెప్పఁబడినది.

ఇట్లు బృహజ్జాతకమునందుఁ బదేనవ యధ్యాయం బగు
ప్రవ్రజ్యా యోగాధ్యాయము సంపూర్ణము.

---

# ఋక్షశీలాధ్యాయము.



ప్రియభూషణ స్సురూప స్సుభగో దక్షో శ్వినీషు మతిమాంశ్చ,
కృతనిశ్చయ సత్యారు గ్దక్షస్సుఖితశ్చ భరణీషు. 1

తా. ఈయధ్యాయ ముపసంహారాధ్యాయమునందుఁ జెప్పఁబడి యుండు నధ్యాయానుక్రమణియందును అధ్యాయసంఖ్యయందును జేరియుండలేదు. ఏతద్దేశీయానేకమూలవ్యాఖ్యాన పుస్తకములయందును గనఁబడలేదు. అట్లయినను దేశాంతర కోశమునందు వ్యాఖ్యాన సహితముగ నీఘట్టమునందుఁ జేరి యుండుటంజేసి నక్షత్రఫలములు దెలియుట కత్యంతోప యుక్తమై యుండు ననితలంచి ఈయధ్యాయ మిచ్చటఁ జేర్పఁబడినది. ఇందు అశ్వినీ నక్షత్రమునందును భరణీ నక్షత్రమునందును బుట్టినవాని స్వభావములు జెప్పఁబడినవి. అశ్వినీ నక్షత్రమునం బుట్టినవాఁడు అలంకార ప్రియుండును, సౌందర్యము గలవాఁడును, సర్వజన ప్రియుండును, సమర్థుండును, బుద్ధిమంతుఁడు నగును. భరణీనక్షత్రమునం బుట్టినవాఁడు ప్రారంభించినకార్యముల నెరవేర్చువాఁడును, దృఢనిశ్చయుండును, యథార్థవాదియును, అరోగకాయుండును, దుఃఖములేనివాఁడును నగును.

బహుభు క్పరదార రత స్తేజస్వీ కృత్తికాసు విఖ్యాతః,
రోహిణ్యాం సత్యశ్శుచీ ప్రియం వదశ్చిరమతి స్సురూపశ్చ. 2

తా. కృత్తికానక్షత్రమునం బుట్టినవాఁడు అధికాహారము గలవాఁడును, పరస్త్రీలయం దాసక్తిగలవాఁడును, శాంతివంతుఁడును, ప్రసిద్ధుఁడును అగును. రోహిణియందుఁ బుట్టినవాఁడు యథార్థవాదియును, పరధనదారాసక్తి లేనివాఁడును, శాస్త్రధర్మాచరణుండును, ప్రియభాషణుండును, నిశ్చలబుద్ధి గలవాఁడును, సౌందర్యము గలవాఁడు నగును.

చపల శ్చతురో భీరుః పటు రుత్సాహీ ధనీ మృగేభోగీ,
శఠగర్వితో కృతఘ్నో హింస్రః పాపశ్చ రౌద్రర్క్షే. 3

తా. మృగశిరయందుఁ బుట్టినవాఁడు చపల చిత్తుండును, సమర్థుండును, భయశీలుండును, మాటలయందు నేర్పరియు, ధనవంతుఁడును, భోగముగలవాఁడును, మహోత్సాహియు నగును. ఆర్ద్రయందుఁ బుట్టినవాఁడు స్వకార్యమునకుఁబూని యొకటి దలఁచి మఱియొకవిధముగఁ బల్కుచుఁ తద్వ్యతిరిక్తకార్యము చేయుచు శఠతగలవాఁ డగును. మఱి యహంకారియు, అనుపకారియును, ప్రాణహింసాచరణుండును, పాపకార్య ప్రియుండు నగును. ఇందులకు, "మనసా వచసా యశ్చ దృశ్యతే కార్యతత్పరః, కర్మణా విపరీతశ్చ సశఠస్సద్భిరీడ్యతే" అని శఠలక్షణము రత్నావళియందుఁ జెప్పఁబడి యున్నయది.

దాంత స్సుఖీ సుశీలో దుర్మేధా రోగ భాక్పిపాసుశ్చ,
అల్పేనచ సంతుష్టః పునర్వసౌ జాయతే మనుజః. 4

తా. పునర్వసునందుఁ బుట్టినవాఁడు తపః క్లేశము నోర్చునట్టివాఁడును, సుఖవంతుఁడును, సత్స్వభావము గలవాఁడును, జడప్రాయుఁడును, రోగపీడితుఁడును, అల్పలాభముచేత సంతోషించు వాఁడును, దప్పిగలవాఁడును అగును.

శాంతాత్మా సుభగః పండితో ధనీ ధర్మసంశ్రితః పుష్యే,
శఠ సర్వభక్ష పాపః కృతఘ్న ధూర్తాచ భౌజంగే. 5

తా. పుష్యమి యందుఁ బుట్టినవాఁడు శమదమాది గుణములు గలవాఁడును, సర్వప్రియుండును, శాస్త్ర పరిజ్ఞానుండును, ధనవంతుఁడును, ధర్మరతుండును అగును. ఆశ్లేషయందుఁ బుట్టినవాఁడు కుత్సితుండును, స్వజనులను భాగార్థులను మోస పుచ్చి ధన మపహరించు వాఁడును, పాపకార్య రతుండును, కఠినుండును, ధూర్తుండును, దయావిరహితుండును నగును.

బహుభృత్య ధనో భోగీ సురపితృభక్తో మహోద్యమః పిత్ర్యే,
ప్రియ వాగ్దాతా ద్యుతిమా నటనో నృపసేవకో భాగ్యే. 6

తా. మఖయందుఁ బుట్టినవాఁడు అనేక జనపరివృతుండును, ధనికుండును, భోగియు, దేవ పితృవులయందు భక్తి గలవాఁడును, అగును. పూర్వఫల్గుని యందుఁ బుట్టినవాఁడు ప్రియభాషణుండును,

దానశీలుండును, దేహకాంతి గలవాఁడును, సంచార ప్రియుండును, రాజభక్తి గలవాఁడు నగును.

సుభగో విద్యాప్త ధనో భోగీ సుఖ భాగ్ద్వితీయ ఫల్గున్యాం,
ఉత్సాహీ దృష్టః పానపో ఘృణీ తస్కరో హస్తే. 7

తా. ఉత్తరయందుఁ బుట్టినవాఁడు సర్వజన ప్రియుండును, విద్యాధన సంపన్నుండును, భోగవంతుఁడును, దుఃఖ రహితుండును, నిజాత్మ గలవాఁడు నగును. హస్తయందుఁ బుట్టినవాఁ డుత్సాహము గలవాఁడును, దృఢాత్మ గలవాఁడును, మద్యపానాసక్తుఁడును, దయ లేని వాఁడు నగును.

చిత్రాంబర మాల్యధర స్సులోచ నాంగశ్చ భవతి చిత్రాయామ్,
దాంతో వణిక్కృపాళుః ప్రియవా గ్ధర్మాశ్రితస్స్వాతౌ. 8

తా. చిత్తయందుఁ బుట్టినవాఁడు వివిధవస్త్ర మాల్యాదులు ధరించువాఁడును, సునేత్రములు గలవాఁడును, చిత్రాన్న ప్రియుండును, వన నదీతీరముల యందు సుఖవిహారము సేయ నెంచువాఁడు నగును. స్వాతియందుఁ బుట్టినవాఁడు వినయాది జితేంద్రియ సాధన రతుండును, దయగలవాఁడును, దప్పిగలవాఁడును, ప్రియభాషణుండును, ధర్మరతుండును నగును.

ఈర్ష్యు ర్లుబ్ధో ద్యుతిమా న్వచనపటుః కలహ కృద్విశాఖాసు,
ఆఢ్యో విదేశవాసీ క్షుధాళు రటనోనూరాధాసు. 9

తా. విశాఖయందుఁ బుట్టినవాఁడు పరుల సంపదం జూచి యోర్వనివాఁడును, లోభియును, కాంతిమంతుఁడును, సంభాషణమందు సమర్థుండును, ధనార్జనసమర్థుండును, కలహము చేయువాఁడు నగును. అనూరాధయందుఁ బుట్టినవాఁడు ధనికుఁడును, పరదేశమున నివసించు వాఁడును, ఆఁకలి కోపనివాఁడును, జ్ఞానసంపన్నుండును, విద్యావినయ గాంభీర్యగౌరవములుగలవాఁడును,దయగలవాఁడును,కళత్రప్రియుండును, పరిభ్రమణ శీలుండును, సభాంతర ప్రకాశుండును అగును.

జ్యేష్ఠాసున బహుమిత్ర స్సంతుష్టో ధర్మకృత్ప్రచుర కోపః,
మూలే మానీ ధనవా న్సుఖీనహం స్రస్థిరో భోగీ. 10

తా. జ్యేష్ఠయందుఁ బుట్టినవాఁడు మిత్రబాహుళ్యము లేనివాఁడును, సంతోష స్వభావుండును, ధర్మరతుండును, అతిక్రోధము గలవాఁడును నగును. మూలయందుఁ బుట్టినవాఁడు గర్వితుండును, ధనవంతుఁడును, సుఖియును, జీవహింస చేయనివాఁడును, స్థిరచిత్తుండును, భోగవంతుఁడును నగును.

ఇష్టానందకళత్రో మానీ దృఢ సౌహృదశ్చ జలదైవే,
వైశ్వే వినీత ధార్మిక బహుమిత్రః కృతజ్ఞ స్సుభగశ్చ. 11

తా. పూర్వాషాఢయందుఁ బుట్టినవాఁడు సంతోషాయత్త చిత్తయగు కళత్రముగలవాఁడును, గర్వితుండును, స్థిరకాల స్నేహము గలవాఁడును అగును. వైశ్వే=ఉత్తరాషాఢయందుఁ బుట్టినవాఁడు వినయోపేతుండును, ధర్మకార్యరతుండును, ధర్మజ్ఞుండును, స్నేహితులు గలవాఁడును, ప్రత్యుపకారము సేయువాఁడును, సర్వజనప్రియుండును నగును.

శ్రీమాఞ్ శ్రవణే శ్రుతవా నుదారదారో ధనాన్వితః ఖ్యాతః,
దాతా చాఢ్య శ్శూరో గీతప్రియో ధనిష్ఠాసు ధనలుబ్ధః. 12

తా. శ్రవణ నక్షత్రమునఁ బుట్టినవాఁడు సంపద గలవాఁడును, పండితుఁడును, ఉదారగుణవతి యగు భార్యగలవాఁడును, భార్యయందుఁ బ్రియముగలవాఁడును, ధనికుండును, కీర్తిగలవాఁడు నగును. ధనిష్ఠ యందుఁ బట్టినవాఁడు దానశీలుండును ధనికుండును రణశూరుండును గానలోలుండును ధనాశగలవాఁడును నగును.

స్ఫుటవా గ్వ్యసనీ రిపుహా సాహసిక శ్శతభిషజి దుర్గ్రాహ్యః,
భాద్రపదా సూద్విగ్నః స్త్రీవిజితధనీ పటు రదాతా. 13

తా. శతభిషయందుఁ బుట్టినవాఁడు స్ఫుట మగు వచనములు గలవాఁడును స్త్రీద్యూతాది వ్యసనరతుండును, శత్రుఘాతకుండును, దురారాధ్యుఁడును, సాహసికుఁడును, స్వజాతి తిరస్కారుండును, పరాపవాదము గలవాఁడు నగును. పూర్వాభాద్రయందుఁ బుట్టినవాఁడు

దుఃఖమానసుండును, స్త్రీలచే జయింపఁబడినవాఁడును, ధనవంతుఁడును, స్త్రీధనము గలవాఁడును, కృపణుండును, నేర్పరియు నగును.

వక్తా సుఖీ ప్రజావాన్ జితశత్రుర్ధార్మికో ద్వితీయాసు,
సంపూర్ణాంగ స్సుభగ శ్శూర శ్శుచి రర్థవాన్ పౌష్ణే. 14

తా. ఉత్తరాభాద్రయందుఁ బుట్టినవాఁడు సభాంతరమునందు ధర్మ మెఱింగి చమత్కారముగ మాటాడువాఁడును, సుఖవంతుఁడును, పుత్త్రసంపద గలవాఁడును, జితశత్రువులు గలవాఁడును, ధర్మశీలుండు నగును. రేవతియందుఁ బుట్టినవాఁడు సంపూర్ణావయవములు గలవాఁడును, సర్వజన ప్రియుండును, రణశూరుండును, పరధన పరదారాపేక్ష లేక దేవపితృ భక్తిగలవాఁడును, ధనవంతుఁడును అగును. ఈనక్షత్ర బలములు చంద్రుని బలాబలములచేత జాతకునకు సంభవించును. గాన నక్షత్రముంబట్టి ఫలనిర్ణయము చేయ నుద్యమింపఁ గూడ దని బుద్ధిమంతు లూహింతు రని తెలియఁ దగినది.

ఇట్లు బృహజ్జాతకమునందు ఋక్షశీలాధ్యాయము
సంపూర్ణము.

---

## రాశిశీలాధ్యాయము.

వృత్తాతామ్ర దృగుష్ణశాక లఘుభుక్ క్షిప్రప్రసాదోటనః
కామీ దుర్బలజాను రస్థిర ధన శ్శూరోంగనావల్లభః,
సేవాజ్ఞః కునఖీ వ్రణాంకితశిరా మానీ సహోత్థాగ్రజ
శ్శక్త్యా పాణితలేంకితో తిచపల స్తోయేచ భీరుః క్రియే. 1

తా. ఈ యధ్యాయమునందుఁ జంద్రుఁ డుండురాశింబట్టి బలానుసారముగ ఫలములు జెప్పఁబడినవి. అదెట్లనఁగా—మేషరాశియం దుఁ జంద్రుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు తామ్రము వంటి యెఱ్ఱ నగు

వృత్తాకార మగు నేత్రములు గలవాఁడును, ఉష్ణపదార్థ భోజనము సేయువాఁడును, అధిక శాక భక్షకుండును, అల్పాహారియును, క్షిప్రకోపత్యాగము గలవాఁడును, మిక్కిలి సంచరించువాఁడును, స్త్రీలోలుండును, బలహీనము లగుకాళ్లు గలవాఁడును, దీర్ఘకాలము నిలువని ధనసంపద గలవాఁడును, యుద్ధప్రియుండును, స్త్రీలకుఁ బ్రియుఁడైనవాఁడును, పరులం గొలుచుటయందు నేర్పుగలవాఁడును, పుచ్చిన గోళ్లు గలవాఁడును, కురుపులచేత గుఱుతులు గలగాయ మగుతల గలవాఁడును, గర్వము గలవాఁడును, సహోదరుల యందుఁ బెద్దవాఁడును, అరచేతి యందు శక్తిరేఖ గలవాఁడును, చపలచిత్తుండును, నీటికి భయపడు వాఁడును అగునని తెలియఁ దగినది.

కాంతః ఖేలగతిః పృథూరువదనః పృష్ఠాస్యపార్శ్వాంకిత
స్త్యాగీ క్లేశ సహః ప్రభుః కకుదవాన్ కన్యాప్రజ శ్శ్లేష్మలః,
పూర్వైర్బంధు ధనాత్మజై ర్విరహిత స్సౌభాగ్య యుక్తః క్షమీ
దీప్తాగ్నిః ప్రమదాప్రియః స్థిరసుహృ న్మధ్యాంత్యసౌఖ్యో గవి. 2

తా. వృషభమునం జంద్రుఁ డుండఁగాఁ బుట్టినవాని స్వభావము చెప్పఁబడినది. అట్టివాఁడు సుందరుండును, విలాస గతుండును, పొడవగు తొడలు గలవాఁడును, నిడుపగు ముఖము గలవాఁడును, ముఖమునఁగాని వీఁపునంగాని ప్రక్కలంగాని మచ్చలుగలవాఁడును, దాతయును, దుఃఖము సహించువాఁడును, అప్రతిహత మగునాజ్ఞ గలవాఁడును, మూఁపులు విస్తారముగఁ గలవాఁడును, స్త్రీజనకుండును, కఫాధిక్యముగలకంఠము గలవాఁడును, బంధుపుత్రాదుల నెడఁబాయువాఁడును, సౌభాగ్య యుక్తుండును, శాంతము గలవాఁడును, అధిక మగు నాఁకలిగలవాఁడును, వనితాజన వల్లభుండును, దృఢస్నేహితుఁడును, బాల్యదశయందు దుఃఖము గలవాఁడు నగును.

స్త్రీలోల స్సురతోపచార కుశల స్తామ్రేక్షణ శ్శాస్త్రవి
ద్దూతః కుంచిత మూర్ధజః పటుమతి ర్హాస్యేంగితద్యూతవిత్,
చార్వంగః ప్రియవాక్ ప్రభక్షణరుచి ర్గీత ప్రియో నృత్యవిత్
క్లీబై ర్యాతి రతిం సమున్నతనస శ్చంద్రే తృతీయర్క్షగే. 3

తా. అనఁగాఁ జంద్రుఁడు మిధునమున నుండఁగాఁ బుట్టినవాఁడు స్త్రీలోలుఁడును, కామశాస్త్ర విచారకుండును, ఎఱ్ఱని కన్నులుగలవాఁడును, పండితుఁడును, పరులకు రాయబారము సేయువాఁడును, వక్రము లగువెండ్రుకలు గలవాఁడును, చతుర బుద్ధిగలవాఁడును, ద్యూతము పరిహాసము నెఱిఁగినవాఁడును, సుందరుండును, ప్రియభాషణుండును, గానలోలుండును, నాట్య మెఱింగినవాఁడును, ఉన్నత నాసికుండును, షండులతోఁడఁ గ్రీడచేయువాఁడును నగును.

ఆవక్రద్రుతగ స్సముమన్నత కటిః స్త్రీనిర్జిత స్సత్సుహృ
ద్దైవజ్ఞః ప్రచురాలయః క్షయధనై స్సంయుజ్యతే చంద్రవత్,
హ్రస్వః పీనగళ స్సమేతిచ వశం సామ్నా సుహృద్వత్సల
స్తోయోద్యానరతః స్వవేశ్మ సహితే జాత శ్శశాంకే నరః. 4

తా. కర్కాటకమునఁ జంద్రుఁడుండఁగాఁ బుట్టినవాఁడు గుటిలంబగు శీఘ్రగమనముగలవాఁడును, ఉన్నతమగు జఘనముగలవాఁడును, స్త్రీలచేత జయింపఁబడు వాఁడును, మంచి స్నేహితులు గలవాఁడును జ్యోతిశ్శాస్త్ర మెఱింగినవాఁడును, అనేక గృహములు గల్గువాఁడును మఱియుఁ బొట్టివాఁడును, బలిసినకంఠముగల వాఁడును, సత్స్వభావముచేత స్వాధీనము చేసుకొనువాఁడును, మిత్రానురంజకుండును, జలమునందును నుద్యానవనమునందును గ్రీడింప నాసక్తిగలవాఁడును, చంద్రునివలెఁ గొన్నాళ్లు ధనవంతుఁడుగను, గొన్నాళ్లు ధనహీనుఁడుగను నగును.

తీక్ష్ణ స్స్థూల హను ర్విశాల వదనః పింగేక్షణో ల్పాత్మజః
స్త్రీద్వేషీ ప్రియమాంసకాననగః కుప్యత్య కార్యేచిరం,
క్షు త్తృష్ణోదర దంత మానస రుజా సంపీడిత స్త్యాగవాన్
విక్రాంత స్థిరధీ స్సుగర్విత మనామాతు ర్విధేయోర్కభే.

తా. సింహరాశియందుఁ జంద్రుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు బలిసిన చెక్కిళ్లు గలవాఁడును, అమర్షణ శీలుండును, విశాలముఖముగలవాఁడును, పచ్చకన్నులు గలవాఁడును, అల్పసంతానము గలవాఁడును, స్త్రీలయందు వైరముగలవాఁడును, మాంసప్రియుఁడును, ప

పర్వతములందిరుగ నిచ్ఛగలవాఁడును, అకార్యములయందు నకాలము నందుఁ గోపించువాఁడును,ఆఁకలి దాహములు గలవాఁడును,ఉదర దంత మానస రోగములవలన పీడింపఁబడువాఁడును, ఈవిగలవాఁడును, పరాక్రమవంతుఁడును, నిశ్చలబుద్ధిగలవాఁడును, అహంకార చిత్తము గలవాఁడును, తల్లిమాట వినువాఁడును అగును.

వ్రీడా మంథర చారువీక్షణగతిః స్రస్తాంస బాహుస్సుఖీ
శ్లక్ష్ణ స్సత్యరతః కలాసు నిపుణ శ్శాస్త్రార్థవి ద్ధార్మికః,
మేధావీ సురతప్రియః పరగృహై ర్విత్తైశ్చ సంయుజ్యతే
కన్యాయాం పరదేశగః ప్రియవచాః కన్యా ప్రజోల్పాత్మజః. 6

తా. కన్యయందుఁ జంద్రుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు సిగ్గుచేతను, అలసటచేతను, సుందరమగు చూపులును గమనము గలవాఁడును, జారినమూఁపులును భుజములును గలవాఁడును, సుఖవంతుఁడును, మృదుశరీరము గలవాఁడును, సత్యభాషణుండును, నృత్తగీత వాద్య పుస్తక లేఖనాది క్రియలయందు నిపుణుఁడును, శాస్త్రార్థము తెలిసిన పండితుండును, ధర్మాసక్తుండును, ధారణాశక్తి యుక్తి బుద్ధిగలవాఁడును, కామక్రీడావిహారుండును, స్త్రీప్రియుండును, పరధనపరగృహములు గలవాఁడును, పరదేశ సంచార ప్రియుండును, ప్రియభాషియు, స్త్రీ సంతానము గలవాఁడును, పుత్త్రులు స్వల్పముగ గలవాఁడు నగును.

దేవబ్రాహ్మణ సాధుపూజనరతః ప్రాజ్ఞ శ్శుచిః స్త్రీజితః
ప్రాంశు శ్చోన్నత నాసికః కృశచలద్గాత్రోట నోర్థాన్వితః,
హీనాంగః క్రయవిక్రయేషు కుశలో దేవ ద్వినామా సరు
గ్బంధూనా ముపకార కృద్విరుపిత స్త్యక్తస్తు తైస్సప్తమే. 7

తా. తులయందుఁ జంద్రుఁ డుండఁగా బుట్టినవాఁడు, దేవబ్రాహ్మణ సాధు సజ్జన పూజారతుండును, ప్రజ్ఞగలవాఁడును, "శుభాశుభ విచారజ్ఞా ప్రజ్ఞాధీరై రుదాహృతా" అని నిఘంటువునందుఁ జెప్పఁబడుటంజేసి ప్రజ్ఞ యనఁగా నన్నిఁటియందు జ్ఞానము గలుగుటయని యర్థము. శుచియనఁగాఁ బరదారార్థాపేక్షలయందుఁ బరిశుద్ధుండును,

స్త్రీకి లోపడియుండువాఁడును, ఉన్నతశరీరము గలవాఁడును, ఉన్నత నాసిక గలవాఁడును, చలించు దేహము గల వాఁడును, పరిభ్రమణ శీలుండును, ధనవంతుఁడును, పరిపూర్ణావయవములు గలవాఁడును, క్రయవిక్రయములయందు సమర్థుండును, తూనిక పట్టువాఁడును, లేక యెచ్చుతక్కువలేని మాటలు మాటాడువాఁడును, వేఱొక నామము నొందువాఁడును, రోగయుతుండును, ఉపకారము సేయువాఁడును, బంధుపూజ్యతయును బంధు తిరస్కారమును గలవాఁడు నగును.

పృథుల నయన వక్షా వృత్త జంఘోరు జాను
ర్జనక గురువియుక్త శ్శైశవే వ్యాధితశ్చ,
నరపతి కులపూజ్యః పింగలః క్రూర చేష్టో
ఝష కులిశ ఖగాంక శ్ఛన్నపాపో ళిజాతః. 8

తా. వృశ్చిక రాశియందుఁ జంద్రుఁ డుండఁగా జనించినవాఁడు విశాలములగు కన్నులును వక్షస్సును వర్తులములగు పిక్కలును తొడలును మోకాళ్లును గలవాఁడును, తల్లిదండ్రులచేతను నాచార్యునిచేతను విడువంబడినవాఁడును, బాల్యమునందు వ్యాధిపీడితుండును, రాజపూజ్యుండును, పింగళాక్షుండును, కఠినస్వభావుండును, మత్స్య వజ్ర పక్షి రేఖలుచేత గలవాఁడును, దాచఁబడిన పాపకార్యములు గలవాఁడును అగును. మఱియు నీచత్వమునొందిన చంద్రుఁడుగనుక విధవ స్త్రీ సంభోగియు, అన్యస్త్రీసంభోగియు, నీచపదార్థ భోజన ప్రియుఁడును, హింసకుఁ దాళఁగూడనివాఁడును, కావ్యగ్రంథ రచనాసక్తుండును, విశేషముగు ధనములేనివాఁడును, సభారంజకుండును అగును.

వ్యాదీర్ఘాస్యశిరోధరః పిత్రృధన స్త్యాగీ కవిర్వీర్యవాన్
వక్తా స్థూలరదశ్రవో ధర నసః కర్మోద్యత శ్శిల్పవిత్,
కుబ్జాంసః కునఖీ సమాంసలభుజః ప్రాగల్భ్యవాన్ ధర్మవిత్
బంధు ద్విన్నబలా త్సమేతిచ వశం సామ్నైక సాధ్యోశ్వజః. 9

తా. ధనస్సునందుఁ జంద్రుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు దీర్ఘమగు ముఖమును, కంఠమును గలవాఁడును, పిత్రార్జితధనము గలవాఁడును, దాతయును, కావ్యకర్తయును, బలవంతుఁడును, వక్తయును,

బహుకార్యములయందుఁ దిరుగువాఁడును, వార్తయందు నేర్పరియును, పొట్టిమూఁపుగలవాఁడును, పుచ్చినగోళ్ళు గలవాఁడును, బలిసిన భుజములతోఁ గూడినవాఁడును, ధర్మం బెఱింగినవాఁడును, బంధుద్వేషియును సామోపాయముచేత సాధింపఁ దగినవాఁడు నగును.

నిత్యం లాలయతి స్వదార తనయాన్ ధర్మధ్వజోధః కృశః
స్వక్షః క్షామకటి గృహీతవచన స్సౌభాగ్యయుక్తో లసః,
శీతాళు ర్మనుజోటనశ్చ మకరే సత్వాధికః కావ్యకృ
ల్లుబ్ధో గమ్యజరాంగనాసు నిరత స్సంత్యక్త లజ్జోఘృణః. 10

తా. మకరమునఁ జంద్రుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు తన భార్యాపుత్రులను ప్రేమం జూచువాఁడును, ధర్మముచేసెదనని చెప్పి దబ్బరలాడి ధనమార్జించు వాఁడును, అధరావయవములు కృశించియుండు వాఁడును, మంచికన్నులు గలవాఁడును, కృశమగు జఘనము గలవాఁడును, చెప్పినమాత్రాన గ్రహించువాఁడును, సౌభాగ్య సంపన్నుండును, అలసుండును, చలికి నోపని వాఁడును, తిరుగువాఁడును, ఉదారచేష్టుఁడును, కవితాశక్తి గలవాఁడును, హీనజాతి స్త్రీలయందు వృద్ధస్త్రీలయందు నాసక్తి గలవాఁడును, సిగ్గులేనివాఁడును, దయలేనివాఁడు నగును.

శరభగళస్సిరాళుఖరలోమశదీర్ఘతనుః
పృథుచరణోరుపృష్ఠజఘనాస్యకటిర్బధిరః,
పరవనితార్థ పాపనిరతః క్షయవృద్ధి యుతః
ప్రియ కుసుమానులేపన సుహృద్ఘటజో ధ్వసహః. 11

తా. కుంభమునందుఁ జంద్రుఁ డుండఁగా జనించినవాఁడు లొట్టియవలె వంకరయగు మెడగలవాఁడును, నరము లుబ్బినట్టి శరీరము గలవాఁడును, కఠినమగు రోమములతోఁ గూడిన తనువు గలవాఁడును గొప్పలైన పాదములును, తొడలును, వీఁపును, నితంబస్థానమును నోరును, నడుమును గలవాఁడును, చెవిటివాఁడును, పాపకార్యరతుఁడును, కలిమిలేములు సమముగ నుండువాఁడును, కుసుమ గంధములయందుఁ బ్రీతియుతుండును, మిత్రరంజకుండును క్లేశము సహించువాఁడును నగును.

జల పరధన భోక్తాదార వాసోను రక్తః
సమరుచిరశరీర స్తుంగనాసో బృహత్కః,
అభిభవతి సపత్నాన్ స్త్రీజిత శ్చారు దృష్టి
ర్ద్యుతినిధిధనభోగీ పండిత శ్చాంత్య రాశౌ. 12

తా. మీనమునఁ జంద్రుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు నీటియందుఁ బుట్టిన ముత్యాలు మొదలగువానిని విక్రయము చేయుచు ధనము సంపాదించు వాఁడును, పరధనము ననుభవించువాఁడును, భార్యయందును వస్త్రభూషణములయందు నాసక్తి గలవాఁడును, కాంతితోఁ గూడిన శరీరము గలవాఁడును, గొప్ప తలయును ముక్కును గలవాఁడును, శత్రు తిరస్కారుండును, స్త్రీలోలుండును, అందమగు కన్నులు గలవాఁడును, శాస్త్రజ్ఞుండును, నిక్షేపధనానుభవము గలవాఁడు నగును.

బలవతి రాశౌ తదధిపతౌ చ స్వబల యుత స్స్యా ద్యది తుహినాంశుః,
కథిత ఫలానా మవికలదాతా శశివదతో౽న్యే ప్యనుపరి చింత్యాః.

తా. అనఁగా జన్మకాలమునందుఁ జంద్రుఁ డుండురాశియును, ఆచంద్రాధిష్ఠిత రాశ్యధిపతియును, బలవంతులై యుండఁగా చంద్రుఁడు పూర్వోక్త స్థానములయందు బలములతోఁ గూడియుండినచో నీచెప్పఁబడిన ఫలములను సంపూర్ణముగ నిచ్చువాఁ డగును. ఈమూఁడును బలయుక్తములై యుండెనేని యీచెప్పఁబడి రాశిస్వభావములు సంపూర్ణముగ నగుననియు, వీనియందు బలయుక్తము లై యుండెనేని కొంచెము తక్కువగానగు ననియు, ఒకటి బలయుక్తమై యుండెనేని మిక్కిలి తక్కువగా నగుననియు, నొకటియును బలయుక్తము గాక యుండెనేని రాశిస్వరూప ఫలములు కానేరవనియు నెఱుంగవలయును. మఱియు నాచంద్రునికంటె నితరము లగు రవి కుజాది గ్రహములను చంద్రునివలెఁ జింతింపఁదగినవి. అనఁగా "బలవతి రాశౌ తదధిపతౌ చ" అనిన ప్రకారము సూర్య కుజ బుధ గురు శుక్ర శనైశ్చరు లేరాశియందు నుందురో యీరాశియు, ఆరాశ్యధిపతియు ఆరాశియందుఁ దత్కాలమున నున్నట్టి గ్రహమును ఈమూఁడును బలయుక్తములై యుండెనేని వక్ష్యమాణ రవి కుజా ద్యధిష్ఠిత రాశిస్వభావ

ములు సంపూర్ణముగ నగుననియు, ౧-౨-బలయుక్తములై యుండెనేని ఉక్తప్రకారమున మధ్యమముగ నగుననియు, అన్నియు బలహీనములై యుండెనేని ఆరాశి స్వభావములే యుండ వలయుననియు తెలియఁదగినది. ఇయ్యది చంద్రాధిష్ఠిత రాశిఫలములు సంపూర్ణము.

ప్రథిత శ్చతురోటనోల్ప విత్తః
క్రియగే త్వాయుధభృ ద్వితుంగ భాగే,
గవి వస్త్ర సుగంధ పణ్యజీవీ
వనితా ద్విట్ కుశలశ్చ గేయవాద్యే. 14

తా. మేష వృషభ రాసులయందు సూర్యుఁడుండఁగాఁ బుట్టిన వానిస్వభావము జెప్పఁబడినది. మేషమున రవియుండఁగాఁ బుట్టినవాఁడు ప్రఖ్యాతుఁడును, నేర్పరియును, తిరుగువాఁడును, అల్పధనికుఁడును, శస్త్రజీవియును అగును. ఈఫలము సూర్యుఁడు పరమోచ్చ భాగమునకు వెలిగ నిరువది భాగములయం దుండగఁ బుట్టినవానికి నగునని తెలియఁదగినది. పరమోచ్చ భాగమున రవియుండఁగా అల్ప ధనుఁడును, తిరుగువాఁడును, ఆయుధ జీవియుఁ గానేరఁడని తెలియఁదగినది. వృషభమున సూర్యుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు వస్త్రసుగంధద్రవ్య క్రయవిక్రయములచేత జీవించువాఁడును, స్త్రీ ద్వేషియు, గానకళల యందుఁ గుశలుండు నగునని తెలియఁ దగినది.

విద్వాన్ జ్యోతిష విత్తవాన్ మిథునగే భానౌ కులీరస్థితే
తీక్ష్ణోస్వః పరకార్య కృచ్ఛ్రమపథః క్లేశైశ్చ సంయుజ్యతే,
సింహస్థే వనశైల గోకుల రతి ర్వీర్యాన్వితోజ్ఞః పుమాన్
కన్యాస్థే లిపి లేఖ్య కావ్యగణిత జ్ఞానాన్వితః స్త్రీవపుః. 15

తా. మిథునమునందు రవియుండఁగాఁ బుట్టినవాఁడు వ్యాకరణశాస్త్రజ్ఞుండును, జ్యోతిశ్శాస్త్రజ్ఞుండును, ధనికుండునగును. కర్కాటకమున రవి యుండఁగాఁ బుట్టినవాఁడు తీవ్ర మగుబుద్ధిగలవాఁడును, దరిద్రుఁడును, అన్యకార్యరతుండును, మార్గాయాసము నోర్వనివాఁడును, దుఃఖయుతుండునగును. సింహమున రవియుండఁగా జనించినవాఁడు

అరణ్యపర్వత గోవాటికలయం దనురాగము గలవాఁడును, బలవంతుఁడును మూర్ఖుఁడును, కోపముగలవాఁడును అగును. కన్యారాశియందు రవియుండఁగాఁ బుట్టినవాఁడు పుస్తకములు వ్రాయుట, చిత్రములు వ్రాయుట, కవిత్వము చెప్పుట, గణితముసేయుట, ఆత్మజ్ఞాన మభివృద్ధి చేసుకొనుట, వీనితోఁగూడిన వాఁడును, స్త్రీతుల్యశరీరుండు నగునని యూహింప వలయును.

జాతస్త్వాళిని శౌండికో ధ్వని రతో హైరణ్యకో నీచకృత్
క్రూర స్సాహసికో విషార్జిత ధన శ్శస్త్రాంతగో ళిస్థితే,
సత్పూజ్యో ధనవాఁ ధనుర్ధరగతే తీక్ష్ణోభిష క్కారుకో
నీచోఙ్జః కువణిజ్మృగేల్ప ధనవాఁ లుబ్ధో న్యభాగ్యోపభుక్. 16

తా. అనఁగా స్వరాశియగు తులయందు రవియుండఁగా బుట్టినవాఁడు మద్యపానాసక్తుండును, అనఁగా మద్యమును చేయువాఁడనియుఁ గూడఁ జెప్పనగును. త్రోవ నడచుటయం దాశగలవాఁడును, స్వర్ణకారకుండును, అనుచితకృత్యములు సేయువాఁడు నగును. వృశ్చికమున రవియుండఁగాఁ బుట్టినవాఁ డుగ్రస్వభావుండును, యుక్తాయుక్త పరిజ్ఞానములేక ధైర్యముతో మూర్ఖముతో సాహసకార్యములకుఁ దొడంగు వాఁడును, విషప్రయోగముచేత సంపాదింపఁబడిన ధనముగలవాఁడును, చోరుల మూలముగ ధనమును బోఁగొట్టుకొను వాఁడును, శాస్త్రములయందుఁ బ్రీతిగలవాఁడును నగును. ధనస్సునందుఁ బుట్టినవాఁడు సత్పురుషులచేతఁ బూజింపఁదగినవాఁడును, ధనికుఁడును, కోపము గలవాఁడును, వైద్యక్రియాసమర్థుండును, శిల్పకార్య పరిజ్ఞానుండును, శిశుకుండునగును. మకరమునందు సూర్యుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు కులాచారవర్జితకార్యములు సేయువాఁడును, మూర్ఖుఁడును, కుచ్ఛితంబగు బేరములాడువాఁడును. అల్పధనము గలవాఁడును, లోభియును, పరుల భాగ్యము ననుభవించువాఁడు నగును.

నీచోఘటే తనయ భాగ్య పరిచ్యుతోస్వ
స్తోయోత్థ పణ్య విభనో వనితా దృతోంత్యే,

నక్షత్ర మానవ తను ప్రతిమే విభాగే
లక్ష్మాదిశే త్తుహినరశ్మి దినేశ యుక్తే. 17

తా. కుంభమున రవియుండఁగాఁ బుట్టినవాఁడు అధమ కృత్యములు చేయువాఁడును, పుత్త్రులచేతను భాగ్యముచేతను విడువఁబడినవాఁడును, నిర్ధనుండు నగును. మీనమునందు సూర్యుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు ఉదకమునందుఁ బుట్టిన ముత్యములు మొదలగువానిని విక్రయించి సంపాదించిన ధనము గలవాఁడును, స్త్రీలచేత నాదరింపఁ బడినవాఁడును, ఈఁతకొట్టుటయందుఁ బ్రీతిగలవాఁడును నగును. మఱియుఁ జంద్రసూర్యు లేకరాశి గతులై యుండఁగా వారేరాశియందు నుందురో ఆరాశియొక్క నక్షత్రమానవతను=అనఁగాఁ గాలపురుషుఁ డని యర్థము ఆ కాలపురుషుని శరీరమునకు సమమగు "కాలాంగాని వరాంగమానన" మిత్యాది శ్లోకోక్తమగు నంగ విభాగమునందలి చిహ్నము ను జెప్పవలయును. ఎట్లనఁగా మేషమునఁ జంద్రసూర్యులు గూడియుండిరేని మేషాంగ మగుశిరస్సున మచ్చయుండు ననియు, వృషభమున నుండిరేని వృషాకార మచ్చ ముఖమునం దుండుననియు, వచింపఁదగినది, తక్కినరాసులయందు రవి చంద్రులు కూడియుండిరేని ఆయా రాశికిఁ జెప్పఁబడిన అంగములయందు మచ్చ లుండునని తెలియందగినది.

నరపతిసత్కృ తాటన చమూప వణిక్స ధనా
క్షత తను చోర భూరివిషయాంశ్చ కుజస్స్వగృహే,
యువతిజితాం త్సుహృత్సు విషమా న్పరదారరతా
కుహక సువేష భీరు పరుషా న్సితభేజనయేత్. 18

తా. మేష వృశ్చిక వృషభ తులలయందుఁ గుజుఁడుండఁగాఁ బుట్టినవాని స్వభావములు చెప్పఁబడినవి. స్వక్షేత్రము లగు మేష వృశ్చికములయం దుండు నంగారకుఁడు రాజపూజ్యత, దేశపరిభ్రమణము, సేనాధిపత్యముగాని గ్రామాధిపత్యముగాని, వ్యాపారాదులు తెలియునట్లును, ధైర్యము, గాయములచే నేర్పడు శరీరమును, దొంగలచేత దెబ్బలను ఇట్లుండఁ గల్గఁజేయును. శుక్రక్షేత్రము లగు

వృషభ తులలయందు నంగారకుఁ డుండెనేని స్త్రీలకు వశమగునట్లును, బంధు మిత్రులయందుఁ గ్రూరబుద్ధియును, పర స్త్రీప్రియతయు, ఇంద్రజాలత్వమును, భయమును, మంచివేషమును గలుగఁజేయు నని తలంచవలెను.

బౌధేసహ స్తనయవాన్ విసుహృత్కృతజ్ఞో
గాంధర్వ యుద్ధ కుశలః కృపణో భయోగ్రీ,
చాంద్రేర్థవాన్ సలిల యాన సమార్జితస్వః
ప్రాజ్ఞశ్చ భూమితనయే వికలః ఖలశ్చ. 19

తా. బుధక్షేత్రము లగుమిథున కన్యారాసులయందుఁ గుజుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు, పరులకు సహింపఁగూడని తేజము గలవాఁడును, పుత్త్రవంతుఁడును, మిత్రరహితుండును, ఉపకారమును మరువక ప్రత్యుపకారము సేయువాఁడును, గానమునందును యుద్ధమునందును సమర్థుండును, కార్పణ్యము గలవాఁడును, భయరహితుండును, యాచకుఁడును నగును. మఱియుఁ జంద్రక్షేత్ర మగు కర్కాటకమున నంగారకుఁడుండఁగాఁ బుట్టినవాఁడు ధనికుండును, సముద్రయానముచేత ధనమార్జించువాఁడును, ప్రాజ్ఞుండును, అంగహీనుండును, దుర్జనప్రియుండును నగు నని తెలియఁ దగినది.

నిస్వః క్లేశ సహోవనాంతరచరః సింహేల్పదారాత్మజో
జైవే నైక రిపు ర్నరేంద్ర సచివః ఖ్యాతో భయోల్పాత్మజః,
దుఃఖార్తో నిధనోట నోన్నృతరత స్తీక్ష్ణశ్చ కుంభస్థితే
భౌమే భూరి ధనాత్మజో మృగగతే భూపోధవా తత్సమః. 20

తా. సింహమున నంగారకుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు దరిద్రుఁడును, కష్టములు సహించువాఁడును, అరణ్య మధ్య సంచారప్రియుండును, స్వల్పదారాపుత్రులు గలవాఁడును అగునని తెలియఁదగినది. మఱియు గురుక్షేత్రము లగు ధనుర్మీనముల యందు నంగారకుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు అనేక శత్రువులు గలవాఁడును, రాజమంత్రియును, ప్రసిద్ధుఁడును, నిర్భయుండును, అల్పసంతానము గలవాఁడును నగునని యెఱుంగ వలయును. కుంభమునఁ గుజుఁ డుండఁగా జనించినవాఁడు

షితుఁడును, దరిద్రుఁడును, తిరుగువాఁడును, దబ్బరలాడువాఁడు రుండును అగును. మకరమునఁ గుజుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు నము గలవాఁడును, అనేక పుత్త్రులు గలవాఁడును, రాజేం ను, రాజతుల్యుండును అగును.

ద్యూతర్ణపానరత నాస్తిక చోర నిస్స్వాః
కుస్త్రీక కూట కృదసత్యరతాః కుజర్క్షే,
ఆచార్య భూరి సుతదార ధనార్జ నేష్టా
శ్శుక్రే వదాన్య గురుభక్తి రతాశ్చ సౌమ్యే. 21

తా. బుధుఁడు కుజక్షేత్రము లగు మేష వృశ్చికములయందుం నించినవాఁడు జూదము నాడువాఁడును, ఋణధన మీయని ,మద్యపానాసక్తుండును, వేదనిందా శాస్త్రనిందలఁ జేయువాఁ రిద్రుఁడు చోరుఁడు దుష్టభార్య గలవాఁడును, అసత్యవచనము డును అగును. శుక్రక్షేత్రము లగు తులా వృషభములయందు ండెనేని గురుభక్తియును బహుపుత్త్రులును బహుభార్యలు ర్జన విషయమును దానధర్మములును మాతాపితృ భక్తియును షగ జనించును.

న శాస్త్రకలా విదగ్ధః ప్రియంవద సౌఖ్యరతస్తృతీయే,
ర్జితస్వః స్వజనస్య శత్రుః శశాంకజే శీతకరర్క్షయుక్తే. 22

తా. బుధుఁడు మిథునమునం దుండఁగాఁ బుట్టినవాఁడు అసత్య , వ్యాకరణ శాస్త్రములయందును గీతవాద్యములయందునుఁ ము గలవాఁడును, ప్రియవచనము లాడువాఁడును, సుఖాసక్తుం రోపకారము సేయుటయందు సంతోషము గలవాఁడును, పరుండును, కవితాశక్తియును వృద్ధజనసేవయు గలవాఁడు ర్కాటకమున బుధుఁ డుండగాఁ బుట్టినవాఁడు నీటిచేత సంపా న ధనము గలవాఁడును, పాఠాంతరమునఁ "బలార్జితస్వః" డుటం జేసి పరాక్రమమున ధనార్జనము సేయువాఁడును, బంధు వైరియు నగునని తెలియఁదగినది.

స్త్రీద్వేష్యో విధన సుఖాత్మజోటనోజ్ఞః
స్త్రీలోలః సుపరిభవోర్క రాశిగే జ్ఞే,
త్యాగీజ్ఞః ప్రచుర గుణస్సుఖీ క్షమావాన్
యుక్తిజ్ఞో విగత భయశ్చ షష్ఠరాశౌ. 23

తా. సింహమునందు బుధుఁడుండఁగాఁ బుట్టినవాఁడు స్త్రీలకుఁ బ్రియము గానివాఁడును, ధన సుఖ పుత్త్రులు లేనివాఁడును, అట్లుండినను అనుభవములేని వాఁడును, పనిలేక తిరుగువాఁడును, మూర్ఖుఁడును, తిరస్కరింపఁ బడువాఁడును అగును. కన్యయందు బుధుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు, దాతయును, పండితుఁడును, విద్యాశౌర్యాది గుణములు గలవాఁడును, సుఖవంతుఁడును, భార్యా జననిం జేఁబట్టువాఁడును, శాంతస్వభావుండును, కపట సత్య సమర్థ వచనములాడువాఁడును, భయరహితుఁడు నగును.

పరకర్మ కృద స్వశిల్పబుద్ధీ
ఋణవా న్విష్టికరో బుధేర్కజర్క్షే,
నృప సత్కృత పండితా ప్తవాక్యా
నవమేంత్యే జితసేవ కోంత్యశిల్పః. 24

తా. మకర కుంభములయందు బుధుఁ డుండఁగాఁబుట్టినవాఁడు దరిద్రుఁడును, శిల్పకార్యములయం దాసక్తి గలవాఁడును, ఋణధనముచే జీవించువాఁడును అగును. ధనుస్సున బుధుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు రాజపూజితుండును, విద్వాంసుండును, వ్యవహారము లెఱింగి అనుకూలముగఁ బల్కువాఁడును అగును. మీనమున బుధుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు పరులగుణము నెఱింగి వర్తించుటగాక సేవకత్వముఁ గల్గినవాఁడును, చర్మపాదుకా నిర్మాణాది నీచపుఁ బనులుసేయుటయందు నేర్పరియును, లేక నీచకార్యములను కుల వివర్జిత కార్యములను చేయువాఁడగును.

సేనానీ ర్బహువిత్తదార తనయో దాతాసుభృత్యఃక్షమీ
తేజో దార గుణాన్విత స్సురగురౌ ఖ్యాతః పుమాన్ కౌజభే,

్యంగ స్సుసుఖార్థ మిత్రతనయ స్త్యాగీ ప్రియ శ్శౌక్రభే
చే భూరి పరిచ్ఛదాత్మజ సుహృ త్సాచివ్య యుక్తశ్శశీ. 25

తా. కుజక్షేత్రము లగు మేష వృశ్చికములయందు గురువుండఁ
ట్టినవాఁడు సేనా నాయకుండును, బహుధన పత్నీపుత్రులు గ
ను, దానశీలుండును సద్భృత్యులు గలవాఁడును, శాంతుండు
ఃమును, కళత్ర సౌఖ్యమును గలవాఁడును అగును. గురువు వృ
లారాసుల యందుండఁగాఁ బుట్టినవాఁడు స్వస్థదేహుండును,
న మిత్ర పుత్రులతోఁ గూడినవాఁడును, దానశీలుండును, సర్వ
ుండును అగును. మిథున కన్యలయందు గురువుండఁగాఁ బుట్టిన
అనేకు లగుపరివార పుత్ర మిత్రులు గలవాఁడును, మంత్రిత్వము
ుయోగింపఁ బడినవాఁడు నగును.

ంద్రే రత్న సుతస్వదార విభవ ప్రజ్ఞా సుఖై రన్విత
ంహేస్యా ద్బలనాయక స్సురగురౌ ప్రోక్తంచ యచ్చంద్రభే,
ర్తే మాండలికో నరేంద్ర సచివ స్సేనాపతి ర్వా ధనీ
ఝే కర్కట వత్ఫలాని మకరే నీచోల్ప విత్తోసుఖీ. 26

తా. కర్కాటకమున గురువుండఁగాఁ బుట్టినవాఁడు, నవరత్న
పుత్త్రులు ధనము భార్య విభవము మంచిబుద్ధి సౌఖ్యము తత్వ
శాస్త్రపరిజ్ఞానము ఘనగౌరవము సజ్జనపూజ్యత కులాచారము
గల్గిన వాఁడగును. సింహమున గురువుండఁగాఁ బుట్టినవాఁడు
పతియగును. కర్కాటమున గురువు కేఫలము జెప్పఁబడినదో
ల మీనసింహరాశికిఁ జెప్పఁ దగినది. గురువు ధనుర్మీనముల యం
ండఁగాఁ బుట్టినవాఁడు మండలాధిపతియును, రాజ మంత్రియైన
కుం డైనను నిశ్చల బుద్ధియును యోగాభిలాషియును స్థూలదే
ను సుందర ముఖము గలవాఁడును నగును. కుంభమున గురు
ాఁ బుట్టినవానికి కర్కాటకరాశిస్థిత గురుఫలమును వక్కాణిం
ను. మకరమున నుండిన గురువువలన నీచకృత్యములు సేయు
ు, కులాచార వివర్జితుండును, అల్పధనికుండును, దుఃఖితుండు
్యభంగముగలవాఁడును, మనస్సంకల్పము సేయువాఁడునునగును.

పరయువతిరత స్త దర్థవాదై
ర్హృత విభవః కులపాంసనః కుజర్క్షే,
స్వబలమతి ధనో నరేంద్ర పూజ్యః
స్వజన విభుః ప్రథితో భయ స్సి తేస్వే. 2

తా. శుక్రుఁడు మేష వృశ్చికములయం దుండఁగాఁ బుట్టినవాఁడు పరస్త్రీలోలుండును, పరస్త్రీల మూలక ధనార్జితుండును, కుల నిందితుండును, పరస్త్రీలం జెఱుచువాఁడును నగును. వృషభ తులల యందు శుక్రుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు స్వబలముచేతను బుద్ధిచేతను ధనమార్జించువాఁడును, రాజపూజ్యుండును, బంధుశ్రేష్ఠుండును, నిర్భయుండును, ప్రసిద్ధుండును, గానవిద్యాలోలుండును, బలానుసారముగ పశు మృగ మైథునము చేయువాఁడును కళత్ర ప్రియుండును అన్యస్త్రీ లోలుండును నగును.

నృప కృత్యకరోర్థవాన్కలావి
న్మిథునే షష్ఠగతేతి నీచకర్మా,
రవిజర్క్షగతే సురారిపూజ్యే
సుభగః స్త్రీవిజితో రతః కుసార్యామ్. 2

తా. మిథునమున శుక్రుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు రాజకార్యములు సేయువాఁడును, ధనవంతుఁడును, సంగీతరతుండును, అగును కన్యయందు శుక్రుం డుండినవాఁడు నీచకర్మలు సేయువాఁడును, జారస్త్రీతోఁగూడ కాఁపురము సేయువాఁడును, కళత్ర వియోగ దుఃఖ మనుభవించు వాఁడును, ధర్మరహితుండును అగును. మకర కుంభములయందు శుక్రుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు సర్వజన ప్రియుండును, స్త్రీవశుండును దుష్టస్త్రీయందు రమించువాఁడును, స్త్రీసంతానముగలవాఁడును, ధనాఢ్యుండును గ్రామాధిపత్యముగాని ధర్మాధిపత్యముగాని గలవాఁడనై యుండును.

ద్విభారోర్వ్యర్థీ భీరుః ప్రబల మద శోకశ్చ శశిభే
హరౌ యోషాప్తార్థః ప్రవరయువతి ర్మందతనయః,

గుణైః పూజ్య స్సన్వస్తురగ సహితే దానవ గురౌ
ఝషే విద్వానాఢ్యో నృపజనిత పూజోతి సుభగః. 29

తా. శుక్రుఁడు కర్కాటకమునం దుండఁగాఁ బుట్టినవాఁడు, ఇద్దఱుభార్యలు గలవాఁడును, యాచకుండును, భయశీలుండును, అధికమదదుఃఖము గలవాఁడును అగును. శుక్రుఁడు సింహమున నుండఁగాఁ బుట్టినవాఁడు స్త్రీమూలకముగ వచ్చిన ధనముగలవాఁడును, మంచి స్త్రీగలవాఁడును, స్వల్పపుత్త్రిలు గలవాఁడును, ధనాశ గలవాఁడును నగును. ధనుస్సున శుక్రిఁ డుండఁగాఁ బుట్టినవాఁడు సద్గుణములచేతఁ బూజ్యుండును, ధనికుండును నగును. శుక్రుఁడు మీనమునం దుండఁగాఁ బుట్టినవాఁడు పండితుండును, ధనికుండును, రాజపూజితుండును, సర్వజనప్రియుండును, స్వకులాచారసంపన్నుండును నగును.

మూర్ఖోటనః కపటవా న్విసుహృద్య మేజే
కీటేతు బంధ వధ భా క్చపలో ఘృణశ్చ,
నిర్హ్రీ సుఖార్థ తనయః కుశలశ్చ లేఖ్యే
రక్షాపతి ర్భవతి ముఖ్యపతిశ్చ బాధే. 30

తా. శనైశ్చరుండు మేషమున నుండఁగాఁ బుట్టినవాఁడు తెలివిలేనివాఁడును, తిరిగెడువాఁడును, కపటము గలవాఁడును స్నేహితవర్జితుండును నగును. వృశ్చికమున శనియుండఁగాఁ బుట్టినవాఁడు బంధనతాడనము లొందువాఁడును, చపలచిత్తుండును, దయలేని వాఁడును అగును. మిథున కన్యలయందు శనియుండఁగాఁ బుట్టినవాఁడు లజ్జాధనసుఖ పుత్రహీనుండును, చిత్ర పటాదులు వ్రాయుటయందు సమర్థుండును, పాఠాంతరమున వ్రాయ శక్తిలేనివాఁ డనియర్థము నూహింపఁ దగినది. రాక్షస కృత్యములం గలవాఁడును నగును.

సర్జ్య స్త్రీష్టో న బహువిభవో భూరిభార్యో వృషస్థే
ఖ్యాత స్స్వోచ్చే గణపుర బలగ్రామ పూజ్యోర్థ వాంశ్చ,
కర్కిన్యాస్యో వికలదశనో మాతృహీనో సుతోజ్ఞ
స్సింహేనార్యో విసుఖతనయో విష్టికృ త్తూర్య పుత్రే. 31

తా. శని వృషభమున నుండఁగాఁ బుట్టినవాఁడు అగః మునం దిష్టము గలవాఁడును, అల్పైశ్వర్యము గలవాఁడును, భార్యలు గలవాఁడును నగును. తులారాశియందు శనియుండఁ వాఁడు ప్రసిద్ధుఁడును, గణపుర బలగ్రామములం గలజనులచే బడు వాఁడును, ధనవంతుఁడును, మంత్రక్రియా విషయాఁ గినవాఁడు నగును. కర్కాటకమున శనియుండఁగాఁ బుట్టిన ద్రుఁడును, దంత పటుత్వము లేనివాఁడును, తల్లిలేనివాఁడ హీనుండును, మూర్ఖుండు నగును. సింహమున శనియుండఁ వాఁడు మూర్ఖుండును, సుఖ పుత్ర ధనవివర్జితుండును, అన్య ముల నూరక చేయువాఁడు నూరక తిరుగువాఁడు నగును.

స్వాంతః ప్రత్యయితో నరేంద్ర భవనే సత్పుత్రిజాయా
జీవ క్షేత్రగతేర్కజే పురబల గ్రామాగ్రనేతాథవా,
అన్యస్త్రీ ధనసంయుతః పురబల గ్రామాగ్రణీ ర్మందదృ
స్వక్షేత్రే మలిన స్థిరార్థ విభవో భోక్తాచ జాతఃపుమ

తా. శనైశ్చరుఁడు ధనుర్మీనములయందుండఁగాఁ డు మంచిమరణము గలవాఁడును, అంతకాలమునందు సౌ భవించువాఁడును, రాజేంద్రుల యిండ్ల నమ్మకము గలవాఁడ భార్యాపుత్త్రిలు గలవాఁడును, పట్టణములకును సేనలకు ములకును నాయకుండును నగును. మకర కుంభముల యంద డఁగాఁ బుట్టినవాఁడు పరస్త్రీ ధనయుతుండును, నగర సేనా లకుఁ బ్రధాన నాయకుండును, అల్పదృష్టి గలవాఁడును, మలి ను, స్థిరమగు ధన వైభవము గలవాఁడును, ఆయుస్సు గ తినక కూడఁబెట్టు ధనము గలవాఁడును నగును. ఇట్లు శన్య స్వభావము సంపూర్ణము.

శిశిరకర సమాగ మేక్షణానాం
సదృశ ఫలం ప్రవదంతి లగ్నజాతమ్,
ఫలమధిక మిదం యదత్రభావా
భవనభనాథ గుణై ర్విచింతనీయాః.

తా. చంద్రాధిష్ఠిత మేషాది రాశ్యుక్త స్వభావములు మేషాది లగ్నములకుం జెప్పఁబడినవి. అదెట్లనఁగా—చంద్రునియొక్క సంయోగ వీక్షణములకు సమానము లగుఫలములనే లగ్నమువలనఁ గల్గెడుదానినిగాఁ జెప్పెదరు. అనఁగా మేషమునకు "వృత్తా తామ్రదృగుష్ణ శాక లఘుభుక్" అనుశ్లోకమునందుఁ జెప్పఁబడిన ప్రకారము చంద్రసంయోగ ఫలమును "చంద్రేభూప బుధౌ నృపోపమ గుణీ స్తేనా ధనాఢ్యాజగే" అని ముందు చెప్పఁబడు నధ్యాయము నందు వచించు ప్రకారముగాఁ గుజాది రవ్యంతదృష్టి ఫలములను మేషలగ్నమునం బుట్టిన వానికిం జెప్పవలయు. ఈరీతిగ వృషాది లగ్నమునకు నూహింపఁ దగినది. అయితే యీలగ్న ద్వితీయాదులయందుఁ దనకుటుంబాది భావములేది గలదో ఆయాఫలము లధికము. తన్వాది భావములయొక్క భావాధిపతులయొక్క షడ్బలములచేతఁ జింతింపఁ దగినది. అదెట్లనఁగా— లగ్నము బలయుక్తమై లగ్నాధిపతియును బలవంతుఁడై యుండెనేని శరీరపుష్టి గల్గుననియును ద్వితీయము బలయుక్తమై ద్వితీయాధిపతియును బలవంతుఁడై యుండెనేని ధనసమృద్ధి గల్గుననియు, తృతీయమును తదధిపతియును బలయుతులై యుండిరేని ధనసమృద్ధి గల్గుననియును, ఈప్రకారము తక్కినభావములకుం దెలియఁ దగినది. ఈభావ భావాధిపతులలో నొకటి బలయుక్తమై మఱియొకటి బలహీనమై యుండెనేని సగముబలము నిచ్చుననియు రెండును బలహీనములై యుండెనేని భావము చెడుననియుం జెప్పవలయును. ఇట్లు బలానుసార మూహింపఁ దగినది.

ఇట్లు బృహజ్జాతకమునందుఁ బదునాఱవ యధ్యాయ మగు
రాశిశీలాధ్యాయము సంపూర్ణము.



## దృష్టిఫలాధ్యాయము.

చంద్రే భూప బుధౌ నృపోపమగుణీ స్తేనాధనాఢ్యాజగే
నిస్స్వ స్తేన నృమాన్య భూప ధనినః ప్రేష్యః కుజాద్యై ర్గవి,

నృస్థే యోవ్యవహారిపార్థివ బుధా భీతం తు వాయోధనా
స్స్వర్క్షే యోద్ధృక విజ్ఞ భూమిపతయో యోజీవి దృగోగిణో.

తా. చంద్రుడు మేష వృషభ మిథున కర్కాటకము యం దుండి కుజాది గ్రహములచేఁ జూడఁబడు చుండఁగాఁ బుట్టి వారి స్వభావములు చెప్పఁబడినవి. మేషమునఁ జంద్రుఁ డుండి అంగా కాది గ్రహములచేఁ జూడఁబడు చుండఁగా జనించినవారు క్రమము రాజ పండిత రాజతుల్య గుణీ చోర దరిద్రు లగుదురు. అనఁగా మే లగ్నము కుజాది దృష్టంబై యుండినచో నీఫలములు బాగుగ వచింప దగినవి. అదెట్లనఁగా—జన్మకాలమున మేషమున నుండుచంద్రుఁ గాని మేషలగ్నముగాని అంగారకునిచేఁ జూడఁబడెనేని జాతకుఁ రా జగు ననియును, బుధునిచేఁ జూడఁబడెనేని పండితుం డగుననియ గురువుచేఁ జూడఁబడెనేని రాజతుల్యుం డగుననియును, శుక్రునిచే జూడఁబడెనేని గుణవంతుఁ డగుననియును, శనిచేఁ జూడఁబడెనేని చోర డగుననియును, సూర్యునిచేఁ జూడఁబడెనేని దరిద్రుఁ డగుననియు జెప్పఁదగినది. వృషభమున నున్నచంద్రుఁడుగాని, వృషభ లగ్నము గాని అంగారకునిచేఁ జూడఁబడెనేని దరిద్రుఁ డగును. బుధునిచేఁ జూడ బడెనేని చోరుఁడగును. గురువుచేఁ జూడఁబడెనేని సర్వజన పూజితు డగును. లేక రాజశ్రేష్ఠుండుగాని కులశ్రేష్ఠుండుగాని యగును. శుక్రు చేఁ జూడఁబడెనేని రాజుగాని రాజతుల్యుఁడుగాని యగును. శనిచే జూడఁబడెనేని ధనికుం డగును. రవిచేఁ జూడఁబడెనేని సేవకుం డగున యొఱుంగ వలయును. మిథునమున నున్న చంద్రునిగాని మిథున లగ్ మునుగాని కుజుఁడు చూచెనేని ఖడ్గాదులు విక్రయించి జీవించువాఁడగ ను. బుధుఁడు చూచెనేని రాజగును. గురువుచూచెనేని పండితుం డగ ను. శుక్రుఁడు చూచిన నిర్భయుండగును. శనిచూచెనేని సాలెవాఁడగ ను.సూర్యుఁడు చూచెనేని దరిద్రుఁడగును. కర్కాటకమునఁ జంద్రుఁ గాని కర్కాటక లగ్నముగాని కుజునిచేఁ జూడఁబడెనేని యుద్ధవ సేయువాఁడగును. బుధునిచేఁ జూడఁబడెనేని కవిత్వము చెప్పువా డగును. గురువుచేఁ జూడఁబడెనేని పండితుండగును. శుక్రునిచేఁ జూ

బడెనేని రాజగును. శనిచేఁ జూడఁబడెనేని ఆయుధములచేత జీవించువాఁ డగును. సూర్యునిచేఁ జూడఁబడెనేని నేత్రవ్యాధిపీడితుండగునని తెలియఁ దగినది.

జ్యోతి ర్జ్ఞాఢ్య నరేంద్ర నాపిత నృప క్ష్మేశా బుధాద్యై ర్హరౌ
తద్వద్భూప చమూప నైపుణయుతా షష్ఠే శుభైః స్త్ర్యాశ్రయః,
జూకే భూప సువర్ణకార వణిజ శ్శేషే క్షితే నైకృతిః
కీటే యుగ్మ పితానతశ్చ రజకో వ్యంగో ధనో భూపతిః. 2

తా. అనఁగా సింహమున నున్న చంద్రుఁడుగాని సింహాలగ్నముగాని బుధునిచేఁ జూడఁబడెనేని జ్యోతిశ్శాస్త్రజ్ఞుం డగును. గురువుచేఁ జూడఁబడెనేని ధనికుండగును. శుక్రునిచేఁ జూడఁబడెనేని రాజగును. శనిచేఁ జూడఁబడెనేని మంగలివాఁ డగును. రవిచేఁ జూడఁబడెనేని రాజగును. కుజునిచేఁ జూడఁబడెనేని భూపతి యగును. కన్యాలగ్నముగాని కన్యాలగ్నమున నున్న చంద్రుఁడుగాని బుధునిచేఁ జూడఁబడెనేని రాజగును. గురువుచేఁ జూడఁబడెనేని సేనాధిపతి యగును. శుక్రునిచేఁ జూడఁబడెనేని సకలకార్య సమర్థుం డగును. పాపగ్రహములగు శని కుజ రవులచేఁ జూడఁబడెనేని స్త్రీల నాశ్రయించి జీవించువాఁ డగును. తులయందు చంద్రుఁడుగాని తులాలగ్నముగాని బుధునిచేఁ జూడఁబడెనేని రాజగును. గురువుచేఁ జూడఁబడెనేని బంగారుపని చేయువాఁడగును. శుక్రునిచేఁ జూడఁబడెనేని వ్యాపారాదులు చేయువాఁ డగును. రవి కుజ శనులచేఁ జూడఁబడెనేని పరులకార్యములకు విముఖుండగును. వృశ్చికమున నున్న చంద్రుఁడుగాని వృశ్చిక లగ్నముగాని బుధునిచేఁ జూడఁబడెనేని అమడబిడ్డలకుఁ దండ్రియగును. స్వశక్తిచే జీవించువాఁడగును. లేక యిద్దఱు తండ్రులుగలవాఁ డనియుం జెప్పఁ దగినది. గురువుచేఁ జూడఁబడెనేని వినమ్రుఁడగును. శుక్రునిచేఁ జూడఁబడెనేని చాకలివాఁడగును. శనిచేఁ జూడఁబడెనేని దరిద్రుఁ డగును. కుజునిచేఁ జూడఁబడెనేని రాజగునని తెలియఁ దగినది.

జ్ఞాత్యుర్వీశ జనాశ్రయా శ్చతురగే పాపై స్సదంభ శ్శఠ
శ్చాత్యుర్వీశ నరేంద్ర పండిత ధని ద్రవ్యోన భూపామృగే,

భూపో భూపసమో న్యదార నిరత శ్శ్యైశ్చ కుంభస్థితే
హాస్యజ్ఞో నృపతి ర్బుధశ్చ ఝుషగే పాపశ్చ పాపేక్షితే. 3

తా. అనఁగా ధనుస్సునందున్న చంద్రుఁడుగాని ధనుర్లగ్నము గాని బుధునిచేతఁ జూడఁబడెనేని స్వజన భర్తయగును. గురునిచేఁ జూడఁబడెనేని రాజగును. శుక్రునిచేఁ జూడఁబడెనేని జనులకు నాశ్రయ భూతుఁ డగును. శని రవి కుజులచేఁ జూడఁబడినచో డాంభికుండును పరకార్య విముఖుండును అగును. మకరమున నున్న చంద్రుఁడు గాని మకరలగ్నముగాని బుధునిచేతఁ జూడఁబడెనేని రాజాధిరాజగును. గురువుచేఁ జూడఁబడిన రాజగును. శుక్రునిచేఁ జూడఁబడిన విద్వాంసుం డగును. శనిచేతఁ జూడఁబడినచో ధనవంతుఁ డగును. రవిచేఁ జూడఁబడినచో దరిద్రుఁ డగును. కుజునిచేఁ జూడఁబడెనేని రాజగునని తెలియఁ దగినది. కుంభమున చంద్రుఁ డుండుటగాని కుంభలగ్నము గాని బుధునిచేతఁ జూడఁబడెనేని రాజగును. గురువుచేతఁ జూడఁబడెనేని రాజ తుల్యుండగును. శుక్రునిచేఁ జూడఁబడినచోఁ బరస్త్రీసక్తుఁ డగును. రవి కుజ శనులచేఁ జూడఁబడెనేని పరస్త్రీ సక్తుం డగును. మీనమునఁ జంద్రుఁడుగాని మీనలగ్నముగాని బుధునిచేఁ జూడఁబడెనేని హాస్యరసం బెఱింగినవాఁ డగును. గురువుచేతఁ జూడఁబడెనేని రాజగును. శుక్రునిచేఁ జూడఁబడినచోఁ బండితుం డగును. శని రవి కుజులచేతఁ జూడఁబడెనేని పాప కర్ముండగును. "శిశిరకర సమాగ మేక్షణానాం సదృశ ఫలం ప్రవదంతి లగ్నజాతమ్" అని చంద్రదృష్టి ఫలమే లగ్నదృష్టి ఫలమని చెప్పఁబడెను. అందు లగ్నమునకుఁ జంద్ర దృష్టి ఫలము చెప్పఁబడలేదు. కాఁబట్టి "హోరాస్వామి గురుజ్ఞ వీక్షిత యుతా నాన్యైశ్చ వీర్యోత్కటా" అనిన ప్రకారముగఁ గర్కాటక వ్యతిరిక్తము లగు లగ్నములు చంద్ర దృష్టము లయ్యెనేని బలహీనము లగును. కాఁబట్టి యశుభ కరము లని తెలియఁ దగినది. ఇందులకు "ముక్తాతు చంద్ర భవనం లగ్నగతం శిశిరకిరణ సందృష్టం, అశుభ ఫలం నిర్దిష్టం పృచ్ఛాయాం జన్మ సమయేవా" అని పూర్వ శాస్త్రజ్ఞులచేతఁ జెప్పఁబడి యున్నయది.

హోరేశర్క్ష దళాశ్రితై శ్శుభకరో దృష్ట శ్శశీతద్గత
త్ర్యంశే తత్పతిభి స్సుహృద్భవన గై ర్వావీక్షిత శ్శస్యతే,
యత్తోఽప్రిత్తం ప్రతిరాశి వీక్షణ ఫలం తద్ద్వాదశాంశే స్మృతం
సూర్యాద్యై రవలోకితే శశిని విజ్ఞేయం నవాంశేష్వతః.

తా. హోరా ద్రేక్కాణ ద్వాదశాంశల యందుఁ జంద్రుడుండి అన్యగ్రహములచేతఁ జూడఁబడుట వలనం గల్గు ఫలములు చెప్పబడినవి. ఇక్కడ హోరాశబ్దము వలన రాశ్యర్థము గ్రహింప వలెను అనఁగా నేరాశియందైనను సూర్య హోరయం దున్నట్టి చంద్రుఁడ ఏరాశియందైనను సూర్యహోర యందున్నట్టి గ్రహములచేతఁ జూడఁబడెనేని శుభకరుం డగును. చంద్రహోరయం దుండు చంద్రుఁడు ఏరాశియందైనను జంద్రహోరయం దున్నట్టి గ్రహములచేతఁ జూడఁబడెనేని శుభప్రదుం డగును. అట్లు కాక సూర్యహోరయం దున్నట్టి చంద్రుఁడు చంద్రహోరయం దుండునట్టి గ్రహములచేతఁ జూడఁబడినను, స్వహోరయం దున్న చంద్రుఁడు సూర్యహోర యందున్నట్టి గ్రహములచేతఁ జూడఁబడినను అశుభకరుం డగును. ఈవిధముగ లగ్నమున సూర్య చంద్రహోరలలో నేహోర యుదయించునో ఆహోరయ దున్న గ్రహములచేత లగ్నము చూడఁబడెనేని శుభకర మగును అన్యహోరయం దున్న గ్రహములచేత లగ్నము చూడఁబడెనేని అశుభకర మగును. మఱి యేరాశియందైన నేద్రేక్కాణమునందుఁ జంద్రుడుండునో ఆ ద్రేక్కాణాధిపతిచేతఁ జంద్రుఁడు చూడఁబడెనేని శుభకరుం డగును. "పతిభిః" అను బహువచన నిర్దేశమువలన నవాంశ ద్వాదశాంశ త్రింశాంశాధిపతులు గ్రహింపఁబడుదురు. కాఁబట్టి వారిచేతఁ జూడఁబడిన చంద్రుఁడును శుభకరుం డగును. లగ్నమునకు ఈ విధముగ నెంచఁ దగినది. ఇక్కడ సాదృశ్యముగఁ జెప్పఁబడినను, పూర్వపు జీవశర్మాదులుగాక మఱియును "క్షేత్రాధిప సంద్రుష్టే శశి నృప స్తత్సుహృద్భి రపి ధనవాన్, ద్రేక్కాణాంశక పైర్వాప్రాయ స్సౌమ్యై శ్శుభం నాన్యైః" అని లఘుజాతకమునందుఁ జెప్పఁబడి యున్నది. కాఁబట్టి శుభగ్రహము లగు ద్రేక్కాణాధిపతులచేతఁ జూడ

బడెనేని యుత్తమ మనియుఁ, బాపగ్రహములగు ద్రేక్కాణపతులచేతఁ జూడఁబడెనేని మధ్యమ మనియుం దెలియఁ దగినది. "సుహృద్భవనగైః" మిత్రక్షేత్ర గత గ్రహములచేత నైనను స్వక్షేత్ర గత గ్రహములచేత నైనను చూడంబడిన చంద్రుఁడు శుభకరుం డగును. శత్రుక్షేత్రగతగ్రహములచేతఁ జూడఁబడిన చంద్రుఁడు అశుభ కరుం డని తెలియఁదగినది. లగ్నమునకు నీరీతిగ నూహింపఁ దగినది. మఱియు మేషాది ద్వాదశరాసులయందుఁ జంద్రుఁడుండఁగా నేదృష్టిఫలము "చంద్రభూపబుధా" ఇత్యాది శ్లోకములచేతఁ జెప్పఁబడెనో ఆఫలము మేషాది ద్వాదశ రాసుల యందున్నట్టి చంద్రునకుం జెప్పఁబడెను. లగ్నమునకు నివ్విధమున నూహింపఁ దగినది. చంద్రుఁడు మేషాది నవాంశ రాసుల యందున్నవాఁడై సూర్యుఁడు మొదలుగాఁగల గ్రహములచేతఁ జూడఁబడుచుండఁగా నిఁక నేర్పఁబడు "ఆరక్షకోవధరుచి" రిత్యాది ఫలములు తెలియఁ దగును.

ఆరక్షకో వధరుచిః కుశలోని యుద్ధే
భూపోర్థవాన్ కలహ కృత్క్షితిజాంశ సంస్థే,
మూర్ఖోన్యదార నిరత స్సుకవి స్సితాంశే
సత్కావ్య కృత్సుఖపరోన్య కళత్రగశ్చ. 5

తా. కుజాంశ లగు మేష వృశ్చిక నవాంశల యందున్నట్టి చంద్రుఁడు సూర్యునిచేతఁ జూడఁబడెనేని నగర రక్షాధికారి యగును. అంగారకునిచేఁ జూడఁబడినచోఁ బ్రాణి హింసయందుఁ బ్రీతిగలవాఁ డగును. బుధ దృష్టుఁడగునేని బాహుయుద్ధమునందు సమర్థుం డగును. గురుదృష్టుం డైనచో రాజగును. శుక్రుఁడు చూచినచో ధనవంతుం డగును. శనిచూచె నేని కలహించు వాఁడగును. శుక్రాంశ లగువృషభ తులా నవాంశలయందున్న చంద్రుఁడు రవిచేతఁ జూడఁబడెనేని మూర్ఖుఁ డగును. కుజునిచేతఁ జూడఁబడెనేని పరభార్యా ప్రియుండగును. బుధునిచేఁ జూడఁబడెనేని మంచి కవియగును. గురువుచేతఁ జూడఁబడినచోఁ గావ్యములు చేయువాఁ డగును. శుక్రునిచేఁ జూడఁబడెనేని సుఖాసక్తుఁడగును. శనిచేతఁ జూడఁబడినచో నన్యస్త్రీలం బొందువాఁ డగునని తెలియఁ దగినది.

బాధేహిరంగ చరచోర కవీంద్ర మంత్రి
గేయజ్ఞ శిల్ప నిపుణాశ్శశిని స్థితేంశే,
స్వాంశే ల్పగాత్ర ధన లుబ్ధ తపస్వి ముఖ్య
స్త్రీపోష్య కృత్య నిరతాశ్చ నిరీక్ష్యమాణే. 6

తా. అనఁగా మిథున నవాంశలయం దున్నట్టి చంద్రుఁడు సూర్యునిచేఁ జూడఁబడెనేని ముష్టియుద్ధముసేయు మల్లుఁ డగును. కుజునిచేతఁ జూడఁబడెనేని చోరుఁడగును. బుధునిచేఁ జూడఁబడెనేని కవీశుండగును. గురువుచేఁ జూడఁబడెనేని ప్రధాని యగును. శుక్రునిచేఁ జూడఁబడెనేని సంగీత మెఱింగినవాఁ డగును. శనిచేతఁ జూడఁబడెనేని శిల్ప కర్మలయందు నేర్పుగలవాఁడగును. తననవాంశయగు కర్కాటక నవాంశయం దుండు చంద్రుఁడు సూర్యునిచేఁ జూడఁబడెనేని కృశశరీరుం డగును. కుజవీక్షితుం డైనచో ధనాభిలాషఁ గలవాఁ డగును. అనఁగా లోభియగును. బుధదృష్టుఁడయ్యెనేని తాపసుండగును. గురుదృష్టుఁడయ్యెనేని మంత్రియగును. శుక్రునిచేఁ జూడఁబడెనేని స్త్రీలవలనఁ బోషింపఁబడు వాఁడగును. శనిచేతఁ జూడఁబడెనేని కార్యాసక్తుం డగునని తెలియఁ దగినది.

నక్రోధో నరపతి సమ్మతో నిధీశ
స్సింహాంశే ప్రభు రసుతో తి హింస్రకర్మా,
జైవాంశే ప్రథిత బలో రణోపదేష్టా
హాస్యజ్ఞ స్సచివ వికామ వృద్ధశీలః.

తా. సింహనవాంశ యందున్న చంద్రుఁడు సూర్యదృష్టుండగునేని క్రోధ యుతుండగును. అంగారక దృష్టుండగునేని రాజప్రియుడగును. బుధ దృష్టుండగునేని భూస్థాపిత ధనపతియగును. గురుదృష్టుడైనచో నప్రతిహతాజ్ఞుం డగును. శుక్రునిచేఁ జూడఁబడెనేని పుత్రులేనివాఁ డగును. శనిదృష్టి కల్గినచో హింసాపరుం డగును. గుర్వంలగు ధనుర్మీన నవాంశలయందుండు చంద్రుఁడు సూర్యునిచేతఁ జూఁబడెనేని ప్రథితబలుం డగును. అంగారకునిచేఁ జూడఁబడెనేని యుద్ధలమునందు దేశకాల వ్యూహ రచనాదు లెఱింగి చెప్పెడువాఁడగు

బుధునిచేఁ జూడఁబడెనేని హాస్య మెఱింగినవాఁ డగును. గురువుచేతఁ జూడఁబడెనేని మంత్రి యగును. శుక్రునిచేతఁ జూడఁబడెనేని, 'వికామ' నపుంసకుం డగును. అనఁగా వీర్యహీనుం డగును. శనిచేతఁ జూడఁబడినచో ధర్మచింత గలవాఁ డగునని తెలియఁ దగినది.

అల్పాపత్యో దుఃఖిత స్సత్యపిస్వే
మానాసక్తః కర్మణి స్వేనురక్తః,
దుష్టస్త్రీష్టః క్రోధన శ్చార్కి- భాగే
చంద్రే భానౌ తద్వదింద్వాది దృష్టే. 8

తా. మకర కుంభ నవాంశల యందుండు చంద్రుఁడు రవి దృష్టుండగునేని అల్పపుత్రులు గలవాఁడగును. కుజదృష్టుం డైనచో ధనవంతుండయ్యు దుఃఖము గలవాఁ డగును. బుధదృష్టుం డగునేని గర్వితుం డగును. గురు దృష్టుండగునేని తన కులాచారకృత్యములయందు ననురాగము గలవాఁ డగును. శుక్రదృష్టుండైనచో దుష్టస్త్రీలం జేరువాఁడగును. శనిదృష్టి గల్గెనేని రోషము గలవాఁడగును. ఈప్రకారముగ జన్మలగ్న నవాంశ వశమున గ్రహదృష్టి ఫలములను లగ్నమునకుం జెప్పవలెను. కర్కాటక నవాంశను నిరాకరించి చంద్రదృష్టి యశుభకర మని తెలియఁ దగినది. సూర్యుఁడు చంద్రాది గ్రహములచేతఁ జూడఁబడినను పూర్వోక్త ప్రకారము దృష్టిఫలముం జెప్పఁదగినది. అదెట్లనఁగా:—ఒకానొక రాశియందు నే నవాంశయందైన నున్నట్టి చంద్రుఁడు సూర్యాది గ్రహములచేతఁ జూడఁబడుచుండఁగా నేఫలము వచింపఁబడునో ఆఫలమునే ఏనవాంశ యందైన నున్న చంద్రుఁడ సూర్యాది గ్రహములచేతఁ జూడఁబడు చుండఁగాఁ జెప్పఁదగినది. అనఁగా నొకానొక నవాంశ యందుండు చంద్రునకుఁ దారాగ్రహములనెడు కుజాది పంచగ్రహముల దృష్టిఫలము సమానమే. అయితే సూర్యదృష్టిచేతఁ జంద్రునకు నేఫలము చెప్పఁబడెనో ఆఫలము చంద్రదృష్టిచేత సూర్యునకుం జెప్పఁదగినది. అది యెట్లనఁగా:—మేష వృశ్చిక నవాంశల యందున్నట్టి సూర్యుఁడు చంద్రునిచేఁ జూడఁబడెనే; జాతకుండు ఆరక్షకుం డగును. అనఁగాఁ గొత్వా లగును. వృష॥

తులా నవాంశల యందున్న సూర్యుఁడు చంద్ర దృష్టుండగునేని జాతకుఁడు మూర్ఖుం డగును. మిథున కన్యా నవాంశల యందున్నట్టి సూర్యుఁడు చంద్ర దృష్టుండగునేని జాతకుండు యుద్ధప్రియుండగును. సింహ నవాంశ యందున్న సూర్యుఁడు చంద్రదృష్టుఁడైన జాతకుఁడు కోపస్వభావుం డగును. ధనుర్మీన నవాంశల యందున్న సూర్యుండు చంద్ర దృష్టుండైనచో జాతకుండు ప్రఖ్యాత బలుం డగును. మకర కుంభ నవాంశలయందున్న సూర్యుఁడు చంద్రదృష్టుండైనచో జాతకుఁ డల్ప పుత్త్రుం డగును. కర్కాటక నవాంశ యందున్న సూర్యుఁడు చంద్ర దృష్టుండైనచో జాతకుఁడు కృశ దేహుం డగును. ఇవ్విధంబున నవాంశల యందున్నట్టి సూర్యునకుఁ జంద్రునితో సమానముగ గ్రహదృష్టి ఫలములు చెప్పఁదగినది.

> వర్గోత్తమ స్వపరగేషు శుభం యదుక్తం
> తత్పుష్ట మధ్య లఘుతా శుభ ముత్క్రమేణ,
> వీర్యాన్వితోంశక పతి ర్నిరుణద్ధి పూర్వం
> రాశీక్షణస్య ఫల మంశ ఫలం దదాతి. 9

తా. అనఁగా నవాంశయం దున్న చంద్రునకు ఆరక్షకేత్యాది శుభఫలములను వధరుచి రిత్యాద్యశుభ ఫలముల నిట్లు రెండు ప్రకారములుగా గ్రహదృష్టి ఫలములు జెప్పఁబడెనుగదా ? అందుఁ జంద్రుఁడు వర్గోత్తమ నవాంశ యందుండెనేని గ్రహదృష్టిజమగు శుభఫలము మిక్కిలిగ నగును. చంద్రుఁడు స్వనవాంశ యందుండెనేని శుభఫలము మధ్యమముగనగును. పరనవాంశ యందుండెనేని శుభఫలము కొంచెము గనగును. "వధరుచిః" అను నిత్యాద్యశుభఫల ముత్క్రమవ్యత్యయముగ నగును. అదెట్లనఁగా—అన్యనవాంశ యందున్నట్టి చంద్రునకుఁ జెప్పఁబడిన అశుభ ఫల మధికముగ నగును. స్వనవాంశ యందున్న చంద్రునకుఁ జెప్పఁబడిన యశుభఫలము మధ్యముగ నగును. వర్గోత్తమాంశ యందున్నట్టి చంద్రునకుం జెప్పఁబడిన యశుభ ఫల మొక్కింత జరుగును. ఈప్రకారముగ లగ్న సూర్యులకు గ్రహదృష్టి ఫలము యోచింపఁ దగినది. ఏనవాంశ యందుఁ జంద్రుఁ డుండునో ఆనవాంశాధిపతి బలవంతుఁ

డై యుండెనేని మొట్టమొదట చెప్పిన "రాశీశుణస్య ఫలం" రాశిస్థిత చంద్రునియొక్క గ్రహదృష్టి ఫలమును బోఁగొట్టును. మఱి యేమనఁగా నవాంశస్థిత చంద్రుని గ్రహదృష్టి ఫలము నొసంగును. హోరా ద్రేక్కాణ ద్వాదశాంశస్థిత చంద్రునియొక్క గ్రహదృష్టి ఫలము యథోక్తముగనే యగును. నవాంశాధిపతి బలహీనుఁడై యుండెనేని రాశిదృష్టి నవాంశదృష్టి ఫలములు రెండును నగును. ఈప్రకారముగఁ జంద్రి లగ్నములకు రెంటికిం జెప్పఁదగినది. సూర్యునకు రాశిదృష్టి ఫలమిచ్చుట చెప్పలేదు కాఁబట్టి నవాంశ దృష్టిఫలమునే చెప్పవలయును.

ఇట్టు బృహజ్జాతకమునందు దృష్టిఫలాధ్యాయము
సంపూర్ణము.

---

## భావ ఫ లా ధ్యా య ము.

శూర స్తబ్ధో వికల నయనో నిర్ఘృణో ర్కేతనుస్థే
మేషే సస్వ స్తిమిర నయన స్సింహ సంస్థే నిశాంధః,
నీచేంధో స్వశ్శిగృహగతే బుద్బుదాక్షః పతంగే
భూరి ద్రవ్యో నృపహృత ధనో వక్త్రి రోగీ ద్వితీయే. 1

తా. సూర్యుఁడు లగ్న ద్వితీయములయందుండునపుడు బుట్టిన వారి స్వరూపము చెప్పఁబడినది. సూర్యుఁడు లగ్నమునం దుండఁగా యుద్ధ ప్రియుండును పనులయం దాలస్యము గలవాఁడును నిర్దయుండును హీన దృష్టి గలవాఁడును అగును. ఇది సూర్యుఁ డున్నలగ్నమునకు సామాన్య ఫలము. మేష సింహ తులా కర్కాటకములలో నొకటి లగ్నమై ఆలగ్నమునందు సూర్యుఁ డుండెనేని యీ ఫలమును వచింపఁగూడదు. కాఁబట్టి మేషము లగ్నమై యందు సూర్యుఁ డుండెనేని ధనవంతుఁడును, చీఁకటి కన్నులు గలవాఁడును అగును. సింహములగ్నమై యందు సూర్యుఁ డుండెనేని రేచీఁకటి గలవాఁడును, లేక కన్నులకు బాధ గల వాఁడును నగును. నీచుఁడై తులయందు సూర్యుఁడుండెనేని గ్రుడ్డివాఁడును దరిద్రుఁడును నగును. కర్కాటకము లగ్నమై యందు సూర్యుఁ

ఉండెనేని పూర్వగన్నులు గలవాఁడును, స్ఫోటక పీడఁ గలవాఁడును నగు
ను. సూర్యుఁడు లగ్నమునకు ద్వితీయమున నుండెనేని బహుధనము
గలవాఁడును, రాజులచేత నపహరింపఁబడిన ధనము గలవాఁడును,
ముఖదంత రోగము గలవాఁడును నగునని తెలియఁ దగినది.

మతి విక్రమవాన్ తృతీయగేర్కే
విసుఖః పీడిత మానస శ్చతుర్థే,
అసుతో ధనవర్జిత స్త్రికోణే
బలవాం శ్ఛత్రు జిత శ్చ శత్రుయాతే. 2

తా. సూర్యుఁడు తృతీయమున నుండఁగాబుట్టినవాఁడు బుద్ధిమం
తుఁడును, పరాక్రమ వంతుఁడును అగును. చతుర్థమునం దుండఁగా జాత
కుఁడు సుఖములేని వాఁడును మనశ్చింత గలవాఁడును అగును. పంచమ
మునందుండినచో జాతకుఁడు పుత్రహీనుండును, దరిద్రుఁడును అగును.
షష్ఠమున నుండఁగా జాతకుఁడు బలవంతుఁడును శత్రుజయము గల
వాఁడు నగును. ఇదియునుం గాక "షష్ఠాశ్రితో ర్కో విష శ్త్ర్ర
నాహ తుదోగ్ర శత్రు వ్యసనోపత ప్తం" అను యవనేశ్వర మతా
నుసారముగ సంగీకరించి షష్ఠస్థిత సూర్యుఁ డనిష్ఠ ఫలము నిచ్చువాఁ
డనియున్నది. ఇయ్యది యోచింపఁ దగినది.

స్త్రీభిర్గతః పరిభవం మదగే పతంగే
స్వల్పాత్మజో నిధనగే వికలేక్షణశ్చ,
ధర్మే సుతార్థ సుఖభాక్ సుఖశౌర్య భాక్ఖే
లాభే ప్రభూత ధనవాన్ పతితస్తు రిఃఫే. 3

తా. సూర్యుఁడు సప్తమమందు నుండఁగాఁ బుట్టినవాఁడు స్త్రీల
చేతఁ దిరస్కారమునుబొందినవాఁడగును. అష్టమమునందుండెనేని యల్ప
పుత్త్రులుగలవాఁడును, దృష్టిహీనుండును నగును. నవమమునందునుండె
నేని పుత్త్రధన సుఖములు గలవాఁడు నగును. దశమమునందుండెనేని
సుఖమును బలమును గలవాఁ డగును. ఏకాదశమునందు నుండెనేని
అధిక ధనము గలఁవాడును, ద్వాదశమున నుండెనేని స్వధర్మ భ్రష్టుం
డగునని తెలియఁదగినది. ఇట్లు సూర్యచార ఫలము సంపూర్ణము.

మూ. మూకోన్మత్త జడాంధహీన బధిర ప్రేష్యా శ్శశాంకోదయే
స్వర్క్షాజోచ్చగతే ధనీ బహుసుత స్సస్వః కుటుంబీ ధనే,
హింస్రో భ్రాతృగతే సుఖే సతనయే తత్ప్రోక్త భావాన్వితో
నైకారిర్మృదుకాయ వహ్ని మదన స్తీక్ష్ణో లస శ్చారిగే. 4

తా. చంద్రుఁడు లగ్నమునం దుండఁగాఁ బుట్టినవాఁడు మూగవాఁ డైనను, పిచ్చివాఁడైనను, మూఢుఁ డైనను, గ్రుడ్డివాఁ డైనను, చెవిటివాఁడైనను, పరిచారికము చేయువాఁడైనను, నీచకృత్యములు చేయువాఁడైనను అగును. మేష వృషభ కర్కాటక వ్యతిరిక్త లగ్న ఫలములకు నధిక ఫలములు చెప్పఁబడినవి. కర్కాటకము లగ్నంబై యందుఁ జంద్రుఁ డుండెనేని ధనవంతుం డగును. మేషము లగ్నమై యందుఁ జంద్రుఁ డుండెనేని అనేక పుత్త్రులు గల్గుదురు. చంద్రునకు నుచ్చమగు వృషభము లగ్నమై యందుఁ జంద్రుఁడుండెనేని ధనాఢ్యుండగును. లగ్నమునకు ద్వితీయమునఁ జంద్రుఁ డుండెనేని పుత్త్రపౌత్త్రాద్యనేక కుటుంబములుగలవాఁడగును. తృతీయమునఁ జంద్రుఁ డుండెనేని ప్రాణిహింసకుండగును. చతుర్థ పంచమములఁ జంద్రుఁ డుండెనేని ఆచతుర్థ పంచమములకుం జెప్పిన భావము లనుభవించువాఁ డగును. అనఁగా సుఖమును పుత్త్రులును గలవాఁడగును. షష్ఠమమున నుండెనేని అనేక శత్రువులు గలవాఁడగును. మఱియు మృదుశరీరమును అల్ప మగు దీపాగ్ని గలవాఁడును, అల్ప కామక్రీడలు గలవాఁడును, క్రూరస్వభావుండును, పనుల యం దాలస్యము గలవాఁడును నగును.

ఈర్ష్యు స్తీవ్ర మదో మదే బహుమతి ర్వ్యాధ్యర్దిత శ్చాష్టమే
సౌభాగ్యాత్మజ మిత్త్ర బంధు ధనభాక్ ధర్మస్థితే శీతగౌ,
నిష్పత్తిం సముపైతి ధర్మ ధనధీ శౌర్యైర్యుతః కర్మగే
ఖ్యాతో భావ గుణాన్వితో భగవతే క్షుద్రోంగహీనో వ్యయే.

తా. లగ్నమునకుఁ జంద్రుఁడు ౭-౮-౯-౧౦-౧౧-౧౨ ఈస్థానముల యందుండఁగాఁ బుట్టినవారి స్వభావములు చెప్పఁబడినవి. చంద్రుఁడు సప్తమమున నుండెనేని పరుల సంపదలకు నోర్వఁజాలనివాఁడును, అధికమగు మన్మథవికారముగలవాఁడునుఅగును. అష్టమముననుండెనేని

అనేకవిధములగు తలంపులు గల చిత్తము గలవాఁడును, రోగపీడితుండును నగును. నవమమునం దుండెనేని సర్వజనానురాగమును పుత్త్రిలను స్నేహితులను స్వజనులను ధనమును గూడినవాఁ డగును. దశమమున నుండెనేని ప్రయత్న కార్యార్థముం బొందువాఁడును, ధర్మబుద్ధి పరాక్రమంబులతోఁ గూడినవాఁడును అగును. ఏకాదశమందు నుండెనేని ప్రసిద్ధుఁడును లాభముతోఁ గూడినవాఁడును నగును. ద్వాదశమున నుండెనేని హింస స్వభావుండును అంగహీనుండును నగును.

లగ్నే కుజే క్షత తను ర్ధనగే కదన్నో
ధర్మేఘవాన్ దినకర ప్రతిమోన్యసంస్థే,
విద్వాన్ ధనీ ప్రఖలపండిత మంత్రి శత్రు
ధర్మజ్ఞ విశ్రుత గుణాః పరతోర్కవద్జ్ఞే. 6

తా. లగ్నాది ద్వాదశ రాసులయం దుండు కుజుని ఫలములు చెప్పఁబడినవి. అంగారకుండు జన్మలగ్నమునం దుండెనేని గాయముగల్గిన శరీరము గలవాఁడును లేక స్ఫోటక పీడ గల్గినవాఁడును నగును. ద్వితీయ స్థానమున నుండెనేని కుత్సితాన్నము భుజించు వాఁడును, నవమమున నుండెనేని పాపవంతుండును నగును. ౩-౪-౫-౬-౭-౮-౧౦-౧౧-౧౨ ఈస్థానముల యందున్న సూర్యునకు నేఫలము చెప్పఁబడినదో యాఫలములే యాస్థానముల యందుండు కుజునకుం జెప్పవలెను. ఇట్లు కుజచార ఫలము సంపూర్ణము. బుధుఁడు లగ్నమునం దుండెనేని పండితుండగును. ద్వితీయమున నుండెనేని ధనవంతుఁడును, తృతీయమున నుండెనేని దుర్జనుండును, అసత్యవాదియు నగును. చతుర్థమం దుండెనేని విద్వాంసుం డగును. పంచమ మందుండెనేని రాజమంత్రి యగును. షష్ఠమున నుండెనేని శత్రురహితుఁ డగును. సప్తమమునందుండెనేని యుక్తాయుక్త పరిజ్ఞానము గలవాఁ డగును. అష్టమమున నుండెనేని విఖ్యాత గుణుం డగును. నవమ దశమైకాదశ ద్వాదశములనుండెనేని సూర్యునకుం జెప్పఁబడిన ఫలములతోఁ గూడినవాఁ డగునని తెలియఁ దగినది.

విద్వాన్ సువాక్యః కృపణః సుఖీచ ధీమానశత్రుః పితృతోధికశ్చ,
నీచ స్తపస్వీ సధన స్సలాభః ఖలశ్చ జీవే క్రమశో విలగ్నాత్.

తా. అనఁగా లగ్నమున గురువుండెనేని పండితుం డగును. ద్వితీయమున నుండినచో వాక్పటిమ గలవాఁడగును. తృతీయమున నుండెనేని దానరహితుం డగును. నాల్గవయింట నుండెనేని సుఖముగలవాఁడగును. పంచమమున నుండినచో బుద్ధిమంతుఁడగును. షష్ఠమున నుండెనేని శత్రురహితుం డగును. సప్తమమున నుండినచో జనకునకు మించినట్టి సద్గుణములు గలవాఁడును, అష్టమమున నుండినచో నీచకృత్యుండునునగును. నవమమున నుండెనేనితపస్వియగును. దశమమున నుండెనేని ధనవంతుఁ డగును. లాభస్థానంబున నుండినచో లాభయుక్తి గలవాఁడగును. ద్వాదశమున నుండెనేని దుర్జనుం డగును. లేక కులవిహీనత గలవాఁడగును. ఇట్లు గురుచార ఫలము సంపూర్ణము.

స్మర నిపుణ స్సుఖితశ్చ విలగ్నే
ప్రియ కలహోస్తగతే సురతేప్సుః,
తనయగతే సుఖితో భృగుపుత్రే
గురువదతోన్యగృహే సధనోంత్యే. 8

తా. శుక్రుఁడు జన్మలగ్నమునం దుండెనేని కామతంత్ర కుశలుండును, సౌఖ్యశీలుండును నగును. సప్తమమున నుండెనేని కలహప్రియుండును కామక్రీడాభిలాషియును నగును. పంచమమున నుండెనేని సుఖవంతుఁ డగును. ౨-౩-౪-౬-౮-౯-౧౦-౧౧-౧౨ ఈ యిండ్ల శుక్రుఁ డుండెనేని గురువునకుం జెప్పఁబడిన ఫలము లనుభవించు వాఁడగును. మీనమున శుక్రుఁ డుండెనేని ధనికుండగును. ద్వాదశమున శుక్రుఁడుండెనేని ధనవంతుం డగును. ఇట్లు శుక్రచార ఫలము సంపూర్ణము.

అదృష్టార్థో రోగీ మదన వశగో త్యంతమలినః
శిశుత్వే పీడార్త స్సవితృసుత లగ్నే త్వలసవాక్,
గురు స్వర్క్షోచ్చస్థే నృపతి సదృశో గ్రామ పురప
స్సువిద్వాం శ్చార్వంగో దినకర సమో న్యత్ర కథితః. 9

తా. శనైశ్చరుండు లగ్నమున నుండెనేని నిత్యదరిద్రుఁడగును. వ్యాధి గలవాఁడగును. మన్మథ పరతంత్రుం డగును, బాల్యమునందు

వ్యాధిపీడితుం డగును. అవ్యక్త సంభాషణము చేయువాఁడు నగును. తులా ధను ర్మకర కుంభ మీన రాసులలో నొకటి లగ్నమైనచో అనఁగా ధనుర్మీనములు గురుక్షేత్రములు, మకర కుంభములు శనికి స్వక్షేత్రములు, శనికి తులారాశి యుచ్చము, కాఁబట్టి యీ ధను ర్మీన మకర కుంభములలో నొకటి లగ్నమై యందు శనియుండెనేని రాజ తుల్యుం డగును. గ్రామ పురాధీశుండు నగును. పండితుం డగును. సుందరాంగుఁ డగును. ఇందులకు, "స్వోచ్చ స్వజీవ నేక్షితిపాల తుల్యో లగ్నేర్కజే భవతి దేశ నరాధనాథః, శేషేషు దుఃఖ గదపీడిత ఏవబాల్యే దారిద్ర్య కామ వశగో మలినోలసశ్చ." అని సారావళి యందుఁ జెప్పఁబడి యుండుటంజేసి, "సుహృ త్స్వర్క్షోచ్చస్థే" అను పాఠాంతర మంగీకార్యముగాదు. ద్వితీయాది స్థానముల యందుండు శనైశ్చరుఁడు సూర్యున కేఫలము చెప్పఁబడినదో ఆఫల మిచ్చు వాఁ డని జెప్పవలయు నని తెలియఁదగినది. ఇట్లు శనిచారఫలము సంపూర్ణము.

సుహృదరి పరకీయ స్వర్క్ష తుంగ స్థితానాం
ఫల మనుపరి చింత్యం లగ్న దేహాది భావైః,
సముపచయ విపత్తీ సౌమ్యపాపేషు సత్యః
కథయతి విపరీతం రిఃఫ షష్ఠాష్ట మేషు. 10

తా. తన్వాది ద్వాదశ భావముల యందుండు సర్వగ్రహము లకు ఫలవిశేషములు చెప్పఁబడినవి. అనఁగా లగ్నమును దేహముగఁ గల్పించి, "హోరాదయ స్తను కుటుంబ సహోత్థ బంధుపుత్రారి పత్ని మరణాని శుభాస్పదాయాః" ఇత్యాద్యుక్తభావములచేత మిత్ర క్షేత్ర శత్రుక్షేత్ర పరక్షేత్ర స్వక్షేత్ర స్వోచ్చముల యందుండు గ్రహ ముల ఫలములఁ బర్యాలోచింపఁ దగినది. ఇచ్చట మిత్రాది క్షేత్రములు నీచాది క్షేత్రముల కుపలక్షణములు. గావున నీచక్షేత్ర మూలత్రి కోణములు గ్రహింపఁ దగినవి. కాఁబట్టి యిందువలన నేర్పడిన ముఖ్య తాత్పర్యమేమనఁగ ; పాపగ్రహముగాని శుభగ్రహముగాని నీచక్షేత్ర మునం దైనను శత్రుక్షేత్రమునందైనను పాపక్షేత్రమునం దైన నుండెనేని తన్వాది భావములయందు నేభావ మందుండునో ఆభావము

హాని చెందును. అన్యక్షేత్రమం దుండెనేని ఆభావము హానివృద్ధులు లేక సమముగ నుండును. మిత్రక్షేత్ర స్వక్షేత్ర మూలత్రికోణ స్వోచ్చ స్థానముల యందు నెందైన నుండెనేని యాభావ మభివృద్ధి నొందును. ఇందులకు "నీచర్క్ష రిపుగేహస్థో గ్రహో భావ వినాశకృత్, ఉదాసీన గృహే మధ్యో మిత్రర్క్ష స్వత్రికోణగః, స్వోచ్చగశ్చ గ్రహోవశ్యం భావవృద్ధికరః స్మృతః." అని యివ్విధమున గార్గిమునిచేఁ జెప్పఁబడి యున్నది. సత్యాచార్యుండు మాత్రము "తన్వాది భావములలో నేభావమునందు శుభగ్రహ ముండునో ఆభావమునకు నభివృద్ధియు, ఏభావమునందుఁ బాపగ్రహ ముండునో ఆభావమునకు హానియుం గల్గు"నని యర్థ మొసంగి యున్నవాఁడు. అయితే షష్ఠాష్ట ద్వాదశములయందు నీచెప్పఁబడిన దానికి వ్యత్యస్తముగ సత్యాచార్యుఁడు చెప్పిన దెట్లనఁగా ద్వాదశము వ్యయభావము గనుక అందు శుభగ్రహము లుండెనేని వ్యయహానియు, పాప గ్రహము లుండెనేని వ్యయవృద్ధియు నగును. షష్ఠము శత్రుభావము గనుక అందు శుభగ్రహము లుండెనేని శత్రు హానియును, బాపగ్రహము లుండెనేని శత్రువృద్ధియు నగును. అష్టమము మృత్యుభావము గనుక అందు శుభగ్రహము లుండెనేని మృత్యు హానియుఁ బాపగ్రహము లుండెనేని మృత్యుప్రదమును నగును. ఇందులకు, "సౌమ్యాః పుష్టిం పాపాస్తద్ధానిం సంశ్రితా గ్రహాః కుర్యుః, మూర్త్యాదిషు నిధనేంత్యే షష్ఠేచ విపర్యయాత్ఫలదాః." అని సత్యాచార్య వచనము.

> ఉచ్చ త్రికోణ స్వసుహృ చ్ఛత్రు నీచ గృహార్క్ష గైః,
> శుభ సంపూర్ణ పాదోన దళపాదాల్ప నిష్ఫలమ్. 11

తా. అనఁగా నుచ్చాది స్థానములకు ఫలపరిమాణమును జెప్పఁబడినది. ఎట్లనఁగా ఉచ్చాది స్థానములయం దున్నట్టి గ్రహములచేత నీయఁబడినట్టి శుభ ఫలము క్రమముగ సంపూర్ణ పాదోన దళపాదాల్ప నిష్ఫలము నగును. అదెట్లనఁగా గ్రహకుండలిక యందుఁ జెప్పఁబడిన శుభాశుభ ఫలములలో శుభ ఫలముల నుచ్చస్థానమునం దున్నట్టి గ్రహము సంపూర్ణముగ నిచ్చును. మూలత్రికోణము నందుండు గ్రహము ము

కాలుభాగము ఫలమిచ్చును. స్వక్షేత్రమునం దుండుగ్రహ మర్ధభాగము ఫలం బిచ్చును. మిత్రక్షేత్రమునం దుండు గ్రహము కాలుభాగము ఫలం బిచ్చును. శత్రుక్షేత్రమునం దుండు గ్రహము పరకభాగము ఫలమిచ్చును. నీచక్షేత్రమునం గలగ్రహమును అస్తంగత గ్రహమును కొంచెముగూడ నే ఫలం బీయఁజాల దని తెలియఁ దగినది. మఱియు నిక్కడ శుభగ్రహమువలన నశుభ ఫలము వ్యుత్క్రమముగ నూహింపఁ దగినది. అదెట్లనఁగా అస్తమిత గ్రహమును నీచస్థిత గ్రహమును అశుభ ఫలము సంపూర్ణముగ నిత్తురని యెంచఁ దగినది. శత్రుక్షేత్రమునం దున్నట్టిగ్రహము పాతిక భాగము ఫలం బిచ్చును. మిత్రక్షేత్రమం దున్నట్టి గ్రహము అశుభ ఫల మర్ధభాగం బిచ్చును. స్వక్షేత్రమున నుండుగ్రహము అశుభ ఫలము పాతిక భాగ మిచ్చును. మూలత్రికోణమున నుండు గ్రహము అత్యల్పం బగు నశుభ ఫలం బిచ్చును. ఉచ్చస్థానమునం దుండు గ్రహము అశుభ ఫలమును గొంచెమైన నీయఁ జాలదు. ఇవ్విధమున జాతక కాలంబునందు గ్రహస్థితిం బట్టి ఫలము వచింపఁ దగినది. దశాష్టక వర్గాది ఫలకాలమునందు శుభాశుభ ఫలములు బలవద్గ్రహము లిత్తురని తెలియఁ దగినది. ఇందులకు "తత్కాలం బలయుక్తో భవతి యది దశాధిపస్తస్య,శుభ మశుభం వాపి ఫలం వక్తవ్యం నిత్య మేవ పరిపూర్ణమ్." అని, పూర్వమునం జెప్పఁబడి యున్నది కాఁబట్టి రాశి భావమును గ్రహబలానుసారముగ ఫలము నూహించి వచింపఁ దగినది.

ఇట్లు బృహజ్జాతకమునందుఁ బదునెన్మిదవ యధ్యాయమగు
భావఫలాధ్యాయము సంపూర్ణము.

---

## ఆశ్రయ యోగాధ్యాయము.

కులసమ కులముఖ్య బంధుపూజ్యా
ధనిసుఖి భోగి నృపాస్స్వభైక వృద్ధ్యా,
పర విభవ సుహృ త్స్వబంధు పోష్యా
గణప బలేశ నృపాశ్చ మిత్రభేషు. 1

తా. అనఁగా జన్మకాలమున స్వక్షేత్రమునందు నేదైన నొకగ్రహముండెనేని జాతకుఁడు స్వకులమునందు గల జనులతో సమానుం డగును. రెండుగ్రహము లుండెనేని స్వకుల ముఖ్యుం డగును. మూఁడుగ్రహము లుండెనేని బంధుపూజ్యుం డగును. నాల్గుగ్రహము లుండెనేని ధనవంతుం డగును. అయిదు గ్రహము లుండెనేని సుఖియగును. ఆఱు గ్రహము లుండెనేని రాజభోగము గలవాఁడగును. ఏడు గ్రహములుండినచో భూపాలుం డగునని తెలియఁ దగినది. మిత్రక్షేత్రములయం దొకగ్రహ ముండెనేని పరధనజీవనుం డగును. రెండుగ్రహము లుండెనేని స్నేహితుల మూలకముగ జీవించువాఁ డగును. మూఁడుగ్రహము లుండెనేని జ్ఞాతిజనులచేఁ బోషింపఁ బడువాఁడగును. నాల్గుగ్రహము లుండెనేని బంధుజనులచేఁ బోషింపఁ బడువాఁ డగును. అయిదు గ్రహము లుండినచో సమూ జాధిపతి యగును. ఆఱు గ్రహము లుండెనేని సేనాధిపతియగును. ఏడుగ్రహములుండినచో రా జగునని తలంపఁ దగినది.

జనయతి నృప మేకో ప్యుచ్చగో మిత్ర దృష్టః
ప్రచుర ధన సమేతం మిత్రయోగాచ్చ సిద్ధం,
విధన విసుఖ మూఢ వ్యాధితా బంధ తప్తా
వధదురిత సమేతా శ్శత్రు నీచర్క్షగేషు. 2

తా. అనఁగా నొకగ్రహ మైన నుచ్చస్థానమున నుండి మిత్రగ్రహముచేఁ జూడఁబడెనేని రాజుగ జనించును. ఆయుచ్చగత గ్రహము మిత్రగ్రహముతోఁగూడుట వలన నధిక ధనవంతునిగను సర్వజన పూజ్యునిగను జనింపఁ జేయును. శత్రుక్షేత్రమునంగాని నీచక్షేత్రమునంగాని యొకగ్రహ ముండెనేని జాతకుఁడు దరిద్రుఁ డగును. రెండుగ్రహము లుండెనేని సుఖము లేనివాఁ డగును. మూఁడు గ్రహము లుండెనేని మూర్ఖుం డగును. నాల్గు గ్రహము లుండెనేని వ్యాధిపీడితుం డగును. అయిదు గ్రహములుండెనేని బంధన ప్రాప్తిచేతఁ గష్టపడువాఁ డగును. ఆఱు గ్రహములుండెనేని ప్రాణిహింసచేయువాఁ డగును. ఏడు గ్రహము లుండెనేని పాపాత్ముం డగును. నీచస్థానమున నేడు గ్రహము లేక

కాలమున నెప్పుడుండవు. కాఁబట్టి వజ్రాది యోగములవలెఁ బూర్వశాస్త్రానుసారముగఁ జెప్పఁబడె నని యెంచఁ దగినది.

నకుంభ లగ్నం శుభమాహసత్యో
నభాగ భేదా ద్యవనా వదంతి,
కస్యాంశభేదో నతథాస్తి రాశే
రతిప్రసంగ స్త్వితి విష్ణుగుప్తః. 3

తా. కుంభలగ్న జాతకునకు నశుభ ఫలము చెప్పఁ బడినది. సత్యాచార్యులు కుంభలగ్నము శుభకర మైనది కాదని వచించినవాఁ డెట్లనఁగ—"జన్మని చంద్ర శ్రేష్ఠః ప్రవదేద్ధో రారి నిధనవర్గ శ్యస్స్యాత్, హోరాచ భవే దిష్టా ద్వివదేష్విహా కుంభ వర్జంహి, కుంభవిలగ్నే జాతో భవతి నరో దుఃఖ శోక సంతప్తః." అని సత్యాచార్యులు వచించినవారు. యవనేశుఁడుచెప్పిన దెట్లనఁగా—ఏలగ్నమునందైన కుంభ ద్వాదశాంశము జనన విషయమై "సర్వస్మిన్ లగ్నగతే కుంభ ద్వాదశాంశకో యదా భవతి, రాశౌ నతదా సుఖితః పరాన్నభోజీ భవేత్పురుషః" అని యశుభప్రదముగనే వచించినవాఁడు. మఱియు విష్ణుగుప్తుండు సకలరాసులకును కుంభ ద్వాదశాంశ యున్నది కాఁబట్టి కుంభద్వాదశాంశ అశుభకరమని చెప్పినపక్షమున సకల లగ్నములకుఁ జెప్పఁబడి యుండు ఫలములు నిరర్థకము కాఁబట్టి కుంభలగ్నమే అశుభముగాని కుంభ ద్వాదశాంశ అశుభకరము గాదని వచించినవాఁడు. మఱియు, "కుంభ ద్వాదశ భాగో లగ్నగతో నప్రశస్యతే యవనైః, యద్యేవం సర్వేషాం లగ్నగతానా మిష్టం ఫలం నస్యాత్. ఘటయోగాద్రాశీనాం నహ్యేత చ్ఛాస్త్రకారాణాం,తస్మాత్కుంభవిలగ్నం జన్మన్య శుభం నతద్భాగః" అని విష్ణుగుప్తునిచేఁ జెప్పఁబడినది. కాఁబట్టి కుంభ లగ్నమునం బుట్టినవాఁడు దుఃఖ శోక తప్తుం డగునని తెలియఁ దగినది.

యాతేష్వ సత్స్వ సమభేషు దినేశ హోరాం
ఖ్యాతో మహోద్యమ బలార్థ యుతోతి తేజాః,
చాంద్రీ శుభేషు యుజిమార్దవ కాంతిసౌఖ్య
సౌభాగ్య ధీ మధుర వాక్య యుతః ప్రజాతః. 4

తా. అనఁగా సూర్య చంద్ర హోరలయందుండు గ్రహ ఫలములు చెప్పఁబడినవి. అదెట్లనఁగా:— పాపగ్రహములు బేసిరాసుల యందు సూర్యహోరను బొందుచుండఁగాఁ బుట్టినవాఁడు మహోత్సాహుండును, శౌర్య ధనము గలవాఁడును, అధిక తేజము గలవాఁడును అగును. శుభగ్రహములు సమరాశి యందు "చాంద్రీం" చంద్రహోరను బొందుచుండఁగాఁ బుట్టినవాఁడు మృదు స్వభావముతోడను, కాంతితోడను, సౌఖ్యముతోడను, సౌభాగ్యముతోడను, మంచి బుద్ధితోడను, మృదువచనములతోడను కూడినవాఁ డగునని తెలియఁ దగినది.

తాస్వేవ హోరా స్వపరర్‌గాసు
జ్ఞేయా నరాః పూర్వగుణేషు మధ్యాః,
వ్యత్యస్తహోరా భవనస్థితేషు
మర్త్యా భవం త్యుక్త గుణై ర్విహీనాః. 5

తా. హోరాగత గ్రహ ఫలము జెప్పఁబడినది. ఆహోరలే ఉక్తేతర రాశిగతము లగుచుండఁగా జనించిన మనుష్యులు ముందు చెప్పఁబడినట్టి మహోద్యమత్వాది గుణములయందు మధ్యములగుదురని తెలియఁ దగినది. అనఁగా సమరాసులై యుండి అందుఁ బాపగ్రహము లుండఁగాఁ బుట్టినవారికిఁ బూర్వోక్తము లైనట్టి మహోద్యమత్వాది గుణములు మధ్యమములగు ననియు, విషరాసులై యుండి అందుఁ జంద్రహోర యందు శుభగ్రహము లుండఁగాఁ బుట్టిన వారికి మార్దవాది గుణములు మధ్యమము లగుననియు దెలియఁదగినది. "వ్యత్యస్త హోరా భవన స్థితేషు" అనఁగాఁ బూర్వము చెప్పినదానికి వ్యత్యస్తములైన హోరలయందును రాసులయందును గ్రహము లుండఁగాఁ బుట్టిన మనుష్యులు పూర్వోక్త గుణములచేత విడువఁబడిన వారగుదురని తెలియఁ దగినది. అనఁగా సమరాసులయందుఁ జంద్రహోరయందుఁ బాపగ్రహము లుండఁగాఁ బుట్టినవారు మహోద్యమహీనులును, బలహీనులును, ధనహీనులును, తేజోహీనులును నగుదురనియు; విషరాసులయందు సూర్యహోరలై శుభగ్రహయుతమై యుండఁగాఁ బుట్టినవారు మార్దవ కాంత్యాది గుణహీను లగుదు

రనియు తెలియఁ దగినది. ఈచెప్పఁబడినట్టి గ్రహస్థితి యందు గ్రహ బాహుళ్యము ననుసరించి గుణబాహుళ్యము చెప్పఁదగినది.

కల్యాణ రూప గుణ మాత్మ సుహృ ద్ద్రృకాణే
చంద్రోన్యగ స్తదధినాథ గుణం కరోతి,
వ్యాళోద్యతాయుధ చతు శ్చరణాండజేషు
తీక్ష్ణాతిహింస్రగురు తల్ప రతాటనశ్చ. 6

తా. ద్రేక్కాణ స్థిత చంద్ర ఫలములు చెప్పఁబడినది. ఎట్లనఁగా చంద్రుఁడు స్వద్రేక్కాణమునంగాని తన తత్కాల మిత్రద్రేక్కాణమునంగాని యుండఁగాఁ బుట్టినవాఁడు శ్రేష్ఠములగు రూప గుణములు గలవాఁడగును. అన్యద్రేక్కాణములం దుండెనేని అనఁగా నేద్రేక్కాణమందుఁ జంద్రుఁడుండునో ఆద్రేక్కాణాధిపతి చంద్రునకుఁ దత్కాలమునందు మధ్యస్థుఁడై యుండెనేని రూపగుణములు మధ్యమములై యుండు ననియు నాద్రేక్కాణాధిపతి చంద్రునకుఁ దత్కాలమునందు శత్రుఁడై యుండెనేని జాతకుఁడు రూపగుణ విహీనుం డగుననియు తెలియఁ దగినది. "వ్యాళోద్యతాయుధ చతు శ్చరణాండజేషు" ఈద్రేక్కాణములయందుఁ జంద్రుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు క్రమముగ అనఁగా సర్వ ద్రేక్కాణమునం జంద్రుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు క్రూరుండగును. ఆయుధ సహిత ద్రేక్కాణమునందుఁ జంద్రుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు ప్రాణిహింసకుం డగును. చతుష్పాదద్రేక్కాణమందుఁ జంద్రుఁడుండఁగాఁ బుట్టినవాఁడు గురుభార్యాసక్తుం డగును. పక్షిద్రేక్కాణమునందుఁ జంద్రుఁ డుండెనేని తిరుగువాఁ డగును. ఈద్రేక్కాణములు వ్యాళాది ద్రేక్కాణములై అందుఁజంద్రుఁడున్నచో రెండుఫలములు చెప్పఁదగినవి. అదెట్లనఁగ కర్కాటక ద్వితీయ తృతీయ ద్రేక్కాణములువను, వృశ్చిక ప్రథమ ద్వితీయములును, మీనతృతీయములును, ఇవి వ్యాళ ద్రేక్కాణము లనంబడును. మేష ప్రథమ తృతీయములును, మిథున ద్వితీయ తృతీయములును, సింహ ద్వితీయ తృతీయములును, కన్యాద్వితీయమును, ధనుః ప్రథమ తృతీయములును ఇవి సాయుధ ద్రేక్కాణము లనంబడును. మేష ద్వితీయ వృషభ ద్వితీయ

కర్కాటక ప్రథమ సింహ ప్రథమ ద్వితీయ వృశ్చిక తృతీయ ధనుః ప్రథమంబులు చతుష్పాద ద్రేక్కాణములు. మిధున ద్వితీయ తృతీయ సింహ ప్రథమ తులా ద్వితీయ కుంభప్రథమములు పక్షిద్రేక్కాణములని తెలియఁ దగినది.

స్తేనో భోక్తా పండితాఢ్యో నరేంద్రః
క్లీబ శ్శూరో విష్టికృ ద్దాసవృత్తిః,
పాపో హింస్రోభీశ్చ వర్గోత్తమాంశే
మేషాద్యా మీశా రాశివ ద్ద్వాదశాంశైః. 7

తా. మేషాది నవాంశలయందుఁ బుట్టిన వాని స్వరూపము చెప్పఁబడినది. అదెట్లనఁగా మేషలగ్నముగాక తక్కిన లగ్నములలో మేషనవాంశ యందుఁ బుట్టినవాఁడు దొంగయును, దబ్బరలాడు వాఁడును నగును. వృషభ లగ్నముగాక తక్కిన లగ్నములలో వృషభ నవాంశయందుఁ బుట్టినవాఁడు ధనమును బాగుగ ననుభవించువాఁడగును. మిధునముగాక తక్కిన లగ్నములలో మిథునవాంశయందుఁ బుట్టినవాఁడు విద్వాంసుండునగును. కర్కాటకముగాక తక్కిన లగ్నములలోఁ గర్కాటక నవాంశయందుఁ బుట్టినవాఁడు ధనికుండగును. సింహముగాక తక్కిన లగ్నములలో సింహ నవాంశ యందుఁ బుట్టినవాఁడు రాజగును. కన్యగాక తక్కిన లగ్నములలోఁ గన్యానవాంశ యందుఁ బుట్టినవాఁడు యుద్ధవీరుండగును. వృశ్చికముగాక తక్కిన లగ్నములలో వృశ్చిక నవాంశయందుఁ బుట్టినవాఁడు "విష్టికృత్" భారము మోసి జీవించువాఁడగును. ధనుస్సుగాక తక్కిన లగ్నములలో ధనుర్నవాంశ యందుఁ బుట్టినవాఁడు భృత్యవృత్తిచే జీవించు వాఁడగును. మకరముగాక తక్కిన లగ్నములలో మకర నవాంశ యందుఁ బుట్టినవాఁడు పాపాత్ముండగును. కుంభముగాక తక్కిన లగ్నములలోఁ గుంభనవాంశయందుఁ బుట్టినవాఁడు హింసకుఁడగును. మీనముగాక తక్కిన లగ్నములలో మీననవాంశయందుఁ బుట్టినవాఁడు నిర్భయుండుగాని లేక బుద్ధిహీనుండుగాని యగును. ఇందులకు "తస్కర భోక్తృ విచక్షణ ధని నృపతి నపుంసకాభఁయు దరిద్రాః, ఖల పాపో

గ్రోత్కృష్టా మేషా ద్యానాం నవాంశకా భావాః." అని లఘుజాతక మునం జెప్పఁబడి యున్నయది. అయితే నిది మిహిచార్యులవారిసమ్మత ముగాదు. కాఁబట్టి యీమేషాది రాసులలోఁ గల్గునవాంశలు వర్గోత్త మాంశలు. అట్టి వర్గోత్తమాంశల యందుఁ బుట్టినవారు ముందు చెప్పిన ప్రకారము స్తేన భోక్తృ పండితాదులకు నధిపతు లగుదురని వచింపఁ దగినది. "ద్వాదశాంశైః" మేషాది ద్వాదశాంశలచేత మేషాది రాసులవలె ఫలము చెప్పఁదగినవి. అనఁగా మేషమునఁ జంద్రుఁ డుండఁ గాఁ బుట్టినవానికి "వృత్తాతామ్ర దృగుష్ణ వాక లఘుభుక్" అని చెప్పఁబడినచోట నేఫలములు చెప్పఁబడినవో ఆఫలములు మేషాది ద్వాదశాంశ యందుఁ బుట్టినవానికిం జెప్పఁదగినవి. తక్కిన రాసులకు నీవిధముగ నూహించి చెప్పఁదగినది.

జాయాన్వితో బల విభూషణ సత్వయుక్త
స్తేజోతిసాహస యుతశ్చ కుజే స్వభాగే,
రోగీ మృతస్వయువతి ర్విషమో వ్యదారో
దుఃఖీ పరిచ్ఛద యుతో మలినోర్కపుత్రే. 8

తా. కుజ శనులు తమ త్రింశాంశల యందుండఁగాఁ బుట్టిన వారి స్వభావము చెప్పఁబడినది. అంగారకుఁడు తన త్రింశాంశలయం దుండఁగాఁ బుట్టినవాఁడు భార్యాసమేతుండును, వీర్య యుతుండును, తేజో సాహసములు గలవాఁడును అగును. శనైశ్చరుండు తన త్రిం శాంశలయం దుండఁగాఁ బుట్టినవాఁడు వ్యాధిగలవాఁడును, మృతినొం దిన భార్య గలవాఁడును, క్రూరుండును, పరదారాసక్తుండును, దుఃఖి తాత్ముండును, గృహపరివారములతో నుండువాఁడును, మాలిన్యముఁగల వాఁడును అగును.

స్వాంశే గురౌ ధనయశ స్సుఖ శుద్ధి యుక్తా
స్తేజస్వి పూజ్య నిరుగుద్యమ భోగవంతః,
మేధా కలా కపటకావ్య వివాద శిల్ప
శాస్త్రార్థ సాహస యుతా శ్శశిజేతిమాన్యాః. 9

తా. గురువు తనత్రింశాంశయం దుండఁగాఁ బుట్టినవాఁడు ధన కీర్తి సౌఖ్య ప్రజ్ఞలతోఁ గూడినవాఁడును, తేజస్వియును, సర్వజన

పూజ్యుండును, రోగములేనివాఁడును, ఉత్సాహవంతుఁడును, భోగవంతుఁడును అగును. బుధుఁడు తన త్రింశాంశ యందుండగాఁ బుట్టినవాఁడు బుద్ధియును, గీతవాద్యాదులును, దాంభికత్వమును, కవిత్వమును, వాక్పటుత్వమును, శిల్పకార్యములును, ధర్మశాస్త్రార్థ విషయములును, సాహసమును, గౌరవమును గలవాఁ డగును.

స్వత్రింశాంశే బహుసుత సుఖారోగ్య భాగ్యార్థ రూపః
శుక్రే తీక్ష్ణ స్సులలిత వపు స్సుప్రకీ ర్ణేంద్రియశ్చ,
శూర స్తబ్ధౌ విషమ వధకౌ సద్గుణాఢ్యౌ సుఖజ్ఞౌ
చార్వంగేష్టౌ రవి శశి యుతే ష్వార పూర్వాంశ కేషు. 10

తా. శుక్రుఁడు తనత్రింశాంశలయందుండఁగా జనించినవానియొక్కయు, రవిచంద్రులు కుజాదిత్రింశాంశలయందుండఁగా జనించినవానియొక్కయు స్వరూపము చెప్పఁబడినది. శుక్రుఁడు తన త్రింశాంశయందుండఁగాఁ బుట్టినవాఁడు అధికములగు పుత్రసుఖాయురారోగ్యసౌభాగ్యధనసంపత్తియును, సౌందర్యమును గలవాఁడగును. మఱియుఁ గ్రూరుండును, సుకుమార శరీరుండును, విషయాసక్తుండు నగును. అంగారకుఁడు మొదలగు వారి త్రింశాంశలు సూర్య చంద్ర యుక్తము లగుచుండఁగా అనఁగాఁ గుజత్రింశాంశ యందు సూర్యుం డుండెనేని రణశూరుం డగును. చంద్రుఁ డుండెనేని అలసుం డగును. శనిత్రింశాంశ యందు సూర్యుఁ డుండెనేని క్రూరుం డగును. చంద్రుఁడుండెనేని హింసకుం డగును. గురుత్రింశాంశయందు సూర్యుఁ డుండెనేని మంచి గుణములు గలవాఁ డగును. చంద్రుఁ డుండెనేని ధనికుం డగును. బుధ త్రింశాంశ యందు సూర్యుఁ డుండెనేని సౌఖ్యము గలవాఁ డగును. చంద్రుఁడుండెనేని పండితుం డగును. శుక్ర త్రింశాంశయందు సూర్యుఁ డుండెనేని సుందరాంగుం డగును. చంద్రుఁ డుండెనేని సర్వజన ప్రియుండును, సువస్త్రాభరణ ధారణాసక్తి గలవాఁడును, గోప్రీతిగలవాఁడును, బిడ్డలయందును దూఁడలయందును ప్రియము గలవాఁడును నగును.

ఇట్లు బృహజ్జాతకమునందుఁ బందొమ్మిదవ యధ్యాయ మగు
నాశ్రియ యోగాధ్యాయము సంపూర్ణము.

# ప్రకీర్ణాధ్యాయము.



స్వర్క్ష తుంగ మూలత్రికోణగాః
కంటకేషు యావంత ఆశ్రితాః,
సర్వ ఏవతే న్యోన్య కారకాః
కర్మగస్తు తేషాం విశేషతః. 1

తా. శుభాశుభ ఫలములుగూడి మిశ్రఫలములుగఁ జెప్పఁబడు టంజేసి యీయధ్యాయము ప్రకీర్ణాధ్యాయ మనంబడును. కాఁబట్టి అందు మొట్టమొదట గ్రహములకుం బరస్పర కారకసంజ్ఞ జెప్పఁబడినది. ఎట్లనఁగా—స్వక్షేత్రస్వోచ్ఛ మూలత్రికోణములం బొంది నట్టి గ్రహములు లగ్నాది కేంద్రములయందు నుండునో ఆయన్ని గ్రహములు ఒకరి కొకరు కారక సంజ్ఞ లగుదురు. దశమమందుండు గ్రహము అట్టికారక గ్రహములోపల నధికముగఁ గారకసంజ్ఞం బొందును. అనఁగా— స్వక్షేత్రమునంగాని స్వోచ్ఛయందుంగాని మూలత్రికోణమునంగాని యుండునట్టి గ్రహము లగ్నాది కేంద్రములలో నొక కేంద్రమునం దుండఁగా మఱియొక గ్రహము నీవిధముగ స్వక్షేత్ర స్వోచ్ఛ మూలత్రికోణములలో నొకస్థానమునొంది మఱియొక కేంద్రమున నుండెనేని ఈరెండుగ్రహము లొకరికొకరు కారక సంజ్ఞ లగుదురు. ఇట్లెన్ని గ్రహము లుండునో అన్నిగ్రహములును పరస్పరము కారక సంజ్ఞ గల వగును. ఈకారక గ్రహములలో నేగ్రహము దశమ కేంద్రమునం దుండునో ఆగ్రహము విశేషముగఁ గారక సంజ్ఞ నొందు నని తెలియఁ దగినది.

కర్కటోదయగతే యథోడుపే
స్వోచ్ఛగాః కుజ యమార్క సూరయః,
కారకాని గదితాః పరస్పరం
లగ్నగస్య సకలోంబ రాంబుగః. 2

తా. ఈకారకయోగమున కొక్క యుదాహరణ మీయఁబడినది. ఎట్లనఁగా—చంద్రుఁడు జన్మలగ్నమగు కర్కాటక లగ్నమున నుండఁగా నంగారక శని సూర్య గురువులు తమ యుచ్చస్థానముల యందుండిరేని ఈనైదుగురు నొక్కరి కొకరు కారకు లని చెప్పఁబడిరి. ఈ యోగమున స్వక్షేత్రమును లగ్నమును నైన కర్కాటకమునఁ జంద్రుఁడు స్వోచ్చయుక్త సప్తమ కేంద్ర మైన మకరమున నంగారకుండును, స్వోచ్చయుత చతుర్థ కేంద్రమునైన తులారాశియందు శనియును, స్వోచ్చయుత దశమ కేంద్ర మైన మేషమున సూర్యుఁడు, స్వోచ్చయుత లగ్న కేంద్ర మైన కర్కాటకమున గురువు ఇవ్విధ ముండుటంజేసి వీరొక్కరి కొకరు కారకు లగుదురు. లగ్నమున నున్న గ్రహమునకు దశమ చతుర్థముల యందున్నట్టి సమస్త గ్రహములును కారక సంజ్ఞ లగును. అనఁగా స్వక్షే త్రోచ్చ మూలత్రికోణముల యందుండి లగ్న గత మగు గ్రహమునకు దశమ చతుర్థముల యందున్నట్టి గ్రహములు స్వక్షేత్రోచ్చ మూలత్రికోణ గతములు గాకున్నను కారకాఖ్యము లగును. ఆగ్రహములకు లగ్నగత గ్రహము కారకాఖ్యము గానేర దని తెలియఁదగినది.

స్వత్రికో ణోచ్చగో హేతు రన్యోన్య యది కర్మగః,
సుహృ త్తద్గుణ సంపన్నః కారకశ్చాపి సస్మృతః. ౪

తా. అనఁగా మఱియొక కారక లక్షణము చెప్పఁబడినది. స్వక్షేత్ర మూలత్రికోణ స్వోచ్చస్థానములలో నొకస్థానమునం దున్నట్టి గ్రహము కారకసంజ్ఞకుఁగారణము. కేంద్రస్థానము నందున్నట్టి గ్రహము కారణముగాదు. కాఁబట్టి లగ్నాది కేంద్రములకు వెలిగ నుండినను ఈస్వక్షేత్రాది స్థానములయందున్న గ్రహమునకు దశమ స్థానమునందున్న స్వక్షేత్రాది గతముగాకయున్న గ్రహముగాని, ఆదశమస్థిత గ్రహమునకు నైసర్గిక మిత్ర గ్రహముగాని, తాత్కాలిక మిత్రత్వము నొందియున్న గ్రహముగాని, కారక గ్రహమని చెప్పఁబడును. ఇవ్విధముగ స్వక్షేత్రోచ్చ మూలత్రికోణములం బొందిన గ్రహమునకు స్వక్షేత్రాదులను బొందక యున్నగ్రహము కారకాఖ్య మగుంగాని స్వక్షే

త్రాదులం బొందక యున్న గ్రహమునకు స్వక్షేత్రాదులం బొందిన గ్రహము కారక గ్రహముగాదని తెలియఁ దగినది.

శుభం వర్గోత్తమే జన్మవేశిస్థానేచ సద్గ్రహే,
అశూన్యేషుచ కేంద్రేషు కారకాఖ్య గ్రహేషు చ. 4

తా. కారక సంజ్ఞకుఁ బ్రయోజనము చెప్పఁబడినది. అదెట్లనఁగా :—ఎవని జననము లగ్నమునందలి వర్గోత్తమాంశయందు నగునో ఎవని జన్మకాలమునందుఁ జంద్రుఁడు వర్గోత్తమాంశయందు నుండునో వానిజన్మము శుభమైనదని తెలియఁ దగినది. "వేశిస్థానే" సూర్యుఁడున్న రాశికి రెండవస్థానమునకు వేశిస్థానమనిపేరు. కాఁబట్టి అట్టి వేశిస్థానమునందు సద్గ్రహములగు బుధ గురు శుక్రులలో నొకరుఁ డుండఁగా నైనజననము శుభమైనది. లగ్న కేంద్రములు నాల్గును గ్రహశూన్యములుగాక యుండెనేని యట్టికాలమునఁ బుట్టినచో శుభమయిన దగును. ఇందులకు "ఏకస్మిన్నపి కేంద్రే యది సౌమ్యే సగ్రహోస్తి యాత్రాయాం, జన్మన్యథవా కర్మణి సతచ్ఛుభం ప్రాహు రాచార్యాః." అని చెప్పఁబడి యుండుటవలన నా కేంద్రములయందు శుభగ్రహము లుండెనేని శుభమని తెలియఁ దగినది. ఎవని జన్మకాలమునందుఁ గారక గ్రహములు సంభవించి యుండునో వాని జననము శుభమైనది. ఇట్లు గుణాధిక్యము ననుసరించి శుభాధిక్యము జెప్పఁదగినది.

మధ్యే వయసి సుఖప్రదాః కేంద్రస్థా గురుజన్మ లగ్నపాః,
పృష్ఠోభయకోదయర్క్షగాస్త్వంతాంతః ప్రథమేషు పాకదాః, 5

తా. అనఁగా యౌవనకాలమున సుఖము గలుగఁజేసెడు యోగమును దశాధిపతి ఫలపాక కాలమును జెప్పఁబడినది. జన్మకాలమునందుఁ జంద్రుఁ డేరాశియందు నుండునో ఆరాశి కధిపతి జన్మాధిపతి. ఏ లగ్నమున జన్మమగునో ఆలగ్నమున కధిపతి లగ్నాధిపతి. గురువు, జన్మాధిపతి, లగ్నాధిపతి, వీంద్రయం దొకఁడు కేంద్రస్థానమునందు నుండెనేని యౌవనమునందు సుఖము గల్గును. బహువచనము వలన నీముగ్గురును కేంద్రములయందు నుండిరేని యౌవనమునందు సుఖం బిత్తురని తెలియఁ దగినది. ఈవిషయమై, "లగ్నాధిపో లగ్నపతిశ్చ

యేషాం చతుష్టయే స్యాద్బలవాన్ గురుర్వా, చతుర్షు హోరాదిషు సంగతస్స్యాచ్చతుర్వయః కాల ఫలప్రదస్స్యాత్." అని యవనేశ్వరుండు వచించి యున్నాఁడు. దశానాథుఁడు తన దశాప్రవేశ కాలమునందుఁ బృష్ఠోదయ రాసులగు మేష వృషభ ధను ర్మకరములలో నొక రాశియందు నుండెనేని ఆదశాఫలము శుభముగాని అశుభముగాని దశాంత్యమం దిచ్చుననియు నుభయోదయరాశి యగు మీనమునందు నుండెనేని దశామధ్యమునం దాఫలము నిచ్చుననియు, శీర్షోదయ రాసులగు మిథున సింహ కన్యా తులా వృశ్చిక కుంభములలో నొక రాశియందు నుండెనేని దశాప్రవేశ కాలమునందే ఫలము నిచ్చుననియు తెలియఁ దగినది. ఆయా దశాకాలమును మూఁడు భాగములుచేసి పూర్వోక్త ప్రకారముగ ఫలముం జెప్పఁదగినది. ఇందులకు, "ఆద్యంత మధ్య ఫలదా శ్శిరః పృష్ఠోభయోదయాః, దశాప్రవేశ సమయే తిష్ఠన్ వాచ్యో దశాపతిః" అని గార్గిమునిచేఁ జెప్పఁబడినది.

దినకర రుధిరౌ ప్రవేశకాలే గురు భృగుజౌ భవనస్యమధ్య యాతౌ,
రవిసుత శశినౌ వినిర్గమస్థౌ శశితనయః ఫలదస్తు సార్వకాలమ్. 6

తా. అనఁగా అష్టకవర్గ ఫలకాలము చెప్పఁబడినది. ఎట్లనఁగా:—సూర్యాంగారకులు ప్రవేశకాలమునందు అనఁగాఁ జారవశమున నేరాశియందుండి శుభమునుగాని అశుభమునుగాని అష్టకవర్గ ఫలము నిత్తురో ఆరాశియొక్క ప్రథమ తృతీయాంశ యందుండు నప్పుడు రవి కుజులు ఫలం బిత్తురు. గురు శుక్రులు ఆరాశి మధ్య తృతీయాంశమునందుండి ఫలము నిత్తురు. చంద్ర శనులు ఆరాశియొక్క కడపటి తృతీ యాంశమునందుండి ఫలము నిత్తురు. బుధుఁ డెల్ల కాలము ఆరాశియం దెన్నిదినము లుండునో అన్నిదినములు ఫలము నిచ్చును.

ఇట్లు బృహజ్జాతకమునందు ప్రకీర్ణాధ్యాయము
సంపూర్ణము.

## అ రి ష్టా ధ్యా య ము.



లగ్నా త్పు త్త్రి కళత్రభే శుభపతి ప్రాప్తే థవాలోకి తే
చంద్రాద్వాయది సంప ద స్తిహితయో ర్జ్ఞేయో న్యథాసంభవః,
పాథోనోదయగే రవౌ రవిసుతో మీనస్థితో దారహా
పుత్రస్థాన గతశ్చ పుత్రమరణం పుత్రోవనే ర్యచ్ఛతి. 1

తా. పుత్ర కళత్ర సంభవా సంభవముల నెఱుంగు తెఱంగు చెప్పఁబడినది. అదెట్లనఁగా లగ్నమునకుంగాని చంద్రునకుంగాని పంచమస్థానము శుభగ్రహాయుత దృష్టమైగాని స్వరాశ్యధిపతియుతదృష్టమైకాని యుండెనేని పుత్రులు గల్గుదు రనియును, అట్లు గాకుండెనేని పుత్రులు గలుగరనియును, లగ్నమునకుఁ గాని చంద్రునకుఁగాని సప్తమస్థానము శుభగ్రహాయుత దృష్టమైకాని, స్వరాశ్యధిపతియుత దృష్టమైగాని యుండెనేని పెండ్లి యగుననియు, అట్లుగాకుండెనేని పెండ్లిగాదనియు నెఱుంగునది. అయితే యిక్కడ పుత్ర కళత్ర భావము లుదాహరణార్థమై చెప్పఁబడెంగాని తన్వాది ద్వాదశ భావములకు నీవిధముగ లగ్న చంద్రులం బట్టి తత్తత్ఫలములు చెప్పఁదగినవి. ఇందులకు ''మూర్తించ హోరాం శశిభంచ విద్యాత్'' అని యవనేశ్వరుండు వచించి యున్నాఁడు. జన్మలగ్నంబైన కన్యయందు సూర్యుఁడుండఁగా శనైశ్చరుండు కళత్రస్థాన మగుమీనమునం దుండెనేని అట్టి కాలమునం బుట్టినవాని భార్య వానికి ముందుగ మృతినొందును. ఆకన్యాలగ్నమునందు సూర్యుఁ డుండఁగనే అంగారకుఁడు ఆకన్యాలగ్నమునకుఁ బుత్రస్థానమగు మకరరాశి యందుండెనేని పుత్రమరణము సంభవించు నని యెఱుంగ వలయును.

ఉగ్ర గ్రహై స్సిత చతురస్ర సంస్థితై
ర్మధ్యస్థితే భృగుతనయే థవోగ్రయోః,
సౌమ్యగ్రహై రసహిత సన్నిరీక్షి తే
జాయాననధో దహన నిపాతపాశజః. 2

తా. అనఁగా శుక్రునకుఁ జతుర్థాష్టమములయందు రవి కుజ శను లుండఁగాఁ బుట్టినవానికిఁ దా జీవించియుండఁగనే అగ్నివలన భార్యకు మరణము సంభవించునని తెలియఁ దగినది. అట్లు కానిపక్షమున శుక్రుఁడు రెండు పాపగ్రహముల మధ్యమున నుండఁగాఁ బుట్టినవానికి నున్నతస్థానమున నుండి పడుటచే నైనను భార్యామరణము సంప్రాప్తించు నని తెలియఁ దగినది. శుక్రుఁడు శుభగ్రహ సంయోగ వీక్షణములేక యుండఁగాఁ బుట్టినవానికి బంధన జనిత భార్యామృతి గల్గునని తెలియఁ దగినది. ఇందులకు, "చతు ర్థాష్టమగై శ్శుక్రాత్సౌరా రార్కై ర్హుతాశనాత్, తేషాం ద్వయోస్తు మధ్యస్థే తథా శుక్రే నిపాతిజః, శుక్రే సద్యోగ దృష్టీనే పాశా ద్భార్యా వధోభవేత్." అని గార్గిమునిచేత మూఁడు యోగములు చెప్పఁబడి యున్నయవి.

లగ్నా ద్వ్యయారి గతయో శ్శశి తిగ్మరశ్మ్యోః
పత్న్యైక స్తదైక నయనస్య వదంతి జన్మ,
ద్యూనస్థయో ర్నవమ పంచమ సంస్థయోర్వా
శుక్రార్కయో ర్వికల దారముశంతి జాతమ్. 3

తా. అనఁగాఁ జంద్ర సూర్యులలో నొకండు లగ్నమునకు ద్వాదశమునందును ఒకఁడు షష్ఠమునను నుండఁగాఁ బుట్టినవాఁడొంటికన్ను గలవాఁ డగును. వాని భార్య యొంటికన్ను గలదౌను. శుక్ర సూర్యు లిద్దఱును సప్తమమున నుండఁగాఁ బుట్టినవానికి నంగహీనురాలగుభార్య గలుగును. నవమమందైనను, పంచమమున నైనను శుక్ర సూర్యులు గూడియుండఁగాఁ బుట్టినవాని కంగహీన యగుకళత్రము ప్రాప్తించును. ఇందులకు "పంచమే నవమే ద్యూనే సమేతౌ సితభాస్కరౌ, యస్యస్యాత్తాం భవే ద్భార్యా తస్యై వాంగ వివర్జితా." అని గార్గిచేఁ జెప్పఁబడి యున్న దని తెలియఁ దగినది.

కోణోదయే భృగుతనయే స్త చక్రసంధౌ
వంధ్యా పతిర్య దినసుతర్క మిష్టయుక్తం,
పాపగ్రహై ర్వ్యయ మద లగ్నరాశి సంస్థైః
క్షీణే శశిన్యసుత కళత్ర జన్మధీస్థే.

తా. శని లగ్నస్థితుఁడై యుండఁగా శుక్రుఁడు చక్రసంధుల గు కర్కాటక వృశ్చిక మీనముల యంత్య నవాంశమునొంది లగ్నము నకు నేడవయింటనుండఁగా శుభగ్రహములు పంచమమున లేకుండెనేని జాతకుఁడు గొడ్డురాలగుభార్యఁ గలవాఁడగును. ఈయోగము మకరవృషకన్యా లగ్నముల యందు సంభవించును. మఱివంధ్యాపతియనిచెప్పుటంజేసి మఱియొక స్త్రీయందుఁ బుత్రోత్పత్తి యగునని తెలియఁ బడుచున్నది. క్షీణచంద్రుఁడు పంచమమున నుండఁగా ద్వాదశ సప్తమ జన్మ లగ్నముల యందుండు పాపగ్రహములచేతఁ బుత్ర కళత్రహీనుండగునని తెలియఁ దగినది.

అసిత కుజయో ర్వర్గేస్తస్థే సితే తదవీక్షితే
పర యువతిగస్తౌ చేత్సేందూ స్త్రియా సహ పుంశ్చలః,
భృగుజ శశినోరస్తే భార్యో నరో విసుతోఽపివా
పరిణత తనూ నృస్త్రీ ర్దృష్టౌ శుభై ప్రమదాపతీ. 5

తా. పరస్త్రీ రతుఁడు మున్నగు వారి జననము చెప్పఁబడినది. అనఁగా శని కుజుల వర్గమునం గల శుక్రుఁడు లగ్నమునకు సప్తమస్థానగతుఁడును, ఆశని కుజులలో నొకనిచేఁ జూడఁబడు వాఁడును నగుచుండఁగాఁ బుట్టినవాఁడు పరస్త్రీలనుబొందువాఁ డగును. ఆశన్యంగారకులు చంద్రునితోఁ గూడి యేకరాశి గతులై యుండిరేని ఆశన్యంగారకుల వర్గమునందు లగ్నమునకు సప్తమస్థానగతుఁడై యున్నశుక్రుండు శన్యంగారకులలో నొకనిచేఁ జూడంబడు చుండఁగాఁ బుట్టినవాఁడు తనభార్యతోఁగూడ వ్యభిచారము చేయువాఁ డగును. ఏస్థానమునంగాని యేకరాశి గతులై యున్నట్టి శుక్రచంద్రులకు సప్తమమున నా కుజ శనులుండిరేని జాతకుఁడు భార్యలేని వాఁడగును. మఱియుఁ బుత్రులులేని వాఁ డగును. మఱియు నొక పురుషగ్రహము నొక స్త్రీగ్రహముచు ఏకరాశి స్థితులై యుండఁగా నాగ్రహములకు సప్తమ మందున్న శన్యంగారకులు శుభగ్రహములచేఁ జూడఁబడిరేని యౌవన కాలమునందు సాంగత్యము లేకయుండి పురుషుని వృద్ధదశయందు వృద్ధురాలగు భార్య యుపచరించు ననియర్థము. ఇట్లు భట్టోత్పలుఁడనెడు వ్యాఖ్యాత యభి

ప్రాయము. మఱికొందఱు "పరిణత తనూరోన్నతౌ దృష్టౌ శుభైః" అనిపఠించి ఏకరాశిగతులగు శుక్ర చంద్రులకు సప్తమస్థానమందున్న ఆ శన్యంగారకులు శుభగ్రహములచేఁ జూడఁబడక పాపగ్రహములచేతఁ జూడఁబడు చుండిరేని జాతకుఁడు వృద్ధుఁడైన పిదప భార్యగల్గినవాఁడగునని తెలియఁ దగినది.

వంశ చ్ఛేత్తా ఖ మద సుఖగై శ్చంద్ర దైత్యేజ్య పాపై
శ్శిల్పీ త్ర్యంశే శశిసుత యుతే కేంద్ర సంస్థార్కి దృష్టే,
దాస్యాం జాతో దితి సుత గురౌ రిఃఫగే సౌరభాగే
నీచో కేంద్వో ర్మదన గతయో ర్దృష్టయో స్సూర్యజేన. 6

తా. దశమమునఁ జంద్రుండును, సప్తమమున శుక్రుండును, చతుర్థమునఁ బాపగ్రహములు నుండఁగాఁ బుట్టినవానికిం గల్గు సంతానము నశించునని తెలియఁదగినది. బుధునితోఁ గూడిన ద్రేక్కాణము ఏరాశి సంబంధమైనదో ఆరాశిని లగ్న కేంద్రమునం గల శని చూచినచోఁ జిత్రకర్మాదులవలన జీవించువాఁ డగును. శుక్రుఁడు లగ్నమునకు ద్వాదశస్థాన స్థితుఁడై శని నవాంశనుబొంది యుండినచో దాసియందు బుట్టినవాఁ డగును. సూర్య చంద్రు లిద్దఱును సప్తమస్థాన గతులై శనిచేతఁ జూడఁబడిరేని జాతకుఁడు అధమ కృత్యములు సేయువాఁ డగునని తెలియఁ దగినది.

పాపాలోకితయో స్సితావనిజయో రస్తస్థయో ర్వృద్ధిరు
క్చంద్రే కర్కట వృశ్చికాంశక గతే పాపైర్యుతే గుహ్యరుక్,
శ్విత్రీ రిఃఫ ధనస్థయో రశుభయో శ్చంద్రోదయే స్తే రవౌ
చంద్రే ఖేవనిజే స్తగేచ వికలో యద్యర్కజో వేశిగః. 7

తా. అనఁగా శుక్రాంగారకులు లగ్నమునకు సప్తమ మందున్న వారలై యొకానొక పాపగ్రహము చేతఁ జూడఁబడు చుండఁగాఁ బుట్టినవాఁడు వృద్ధియనెడువ్యాధి గలవాఁడగును. చంద్రుఁడు ఏరాశియందైనఁ గర్కాటక నవాంశయందుంగాని వృశ్చిక నవాంశయందుంగాని యున్నవాఁడై పాపగ్రహములతోడఁ గూడినచోఁ బుట్టినవాఁడు గుహ్యప్రదేశమున వ్యాధి గలవాఁ డగును. పాపగ్రహములగు శని

కుజులు ద్వాదశ ద్వితీయముల యందుండఁగాఁ జంద్రుఁడు లగ్నము నందుండఁగా సూర్యుఁడు సప్తమముననుండఁగాఁ బుట్టినవాఁడు శ్విత్రీ=(తెల్లకుష్టు) అనువ్యాధి గలవాఁ డగును. చంద్రుఁడు దశమ మందుండఁగా నంగారకుఁడు సప్తమమున నుండెనేని శనైశ్చరుఁడు సూర్యునకు రెండవ రాశియగు వేశిరాశియందు నుండెనేని జాతకుఁడు వికలాంగుం డగునని తెలియఁదగినది.

అంత శ్శశిన్య శుభయో ర్మృగగే పతంగే
శ్వాసక్షయ ప్లిహక విద్రధి గుల్మభాజః,
శోషీ పరస్పర గృహాంశగయో రవీంద్వోః
క్షే త్రేథవా యుగపదేకగయోః కృశోవా. 8

తా. చంద్రుఁడు శన్యంగారకుల నడుమ నుండఁగా సూర్యుండు మకరమం దుండఁగాఁ బుట్టినవారు శ్వాస క్షయ వ్యాధులును, ప్లిహ మనఁగాఁ గడుపున నెడమప్రక్కన నుండెడు మాంసఖండము తత్సంబంధ మగువ్యాధి ప్లిహావ్యాధి యనంబడును. అట్టి వ్యాధియు విద్రధి యనఁగాఁ గడుపులోఁబుట్టెడు బల్లగడ్డ అదియు గుల్మవ్యాధియు వీనిలో నొకవ్యాధి ననుభవించు వారగుదురు. మఱియు సూర్య చంద్రు లొకని యింట నొకఁడు పరివర్తనముగఁగాని లేక యొకని యంశయం దొకఁడు గాని యుండఁగా అనఁగాఁ గర్కాటకమందు సూర్యుండును, సింహమునఁ జంద్రుండును, లేక ఏరాశియందైన సింహాంశయందు చంద్రుఁడును, కర్కాటకాంశమున సూర్యుండు నుండఁగాఁ బుట్టినవాఁడు క్షయరోగము గలవాఁ డగును. ఇందులకు "పరస్పరగృహేయాతౌ యదివాపితదంశగౌ, భవేతా మర్కశీతాంశూ తదాశోషీ ప్రజాయతే.' అనుగార్గివచనము విరోధముగ నుండుటవలన గ్రాహ్యముగాదు. మఱియు సూర్య చంద్ర క్షేత్రములగు సింహ కర్కాటకములయందు సూర్య చంద్రు లిద్దఱును గూడియుండఁగా అనఁగా సింహమున సూర్య చంద్రులుండఁగా నైనను కర్కాటకమునఁ జంద్ర సూర్యు లుండఁగా నైనను బుట్టినవాఁడు క్షయరోగి యగును. లేక కృశాంగుం డగునని తెలియఁ దగినది.

చంద్రేశ్వి మధ్య ఝష కర్కి మృగాజ భాగే
కుష్ఠీ సమంద రుధిరే తద వేక్షితేవా,
యాతైస్త్రికోణ మళి కర్కి వృషైర్మృగేచ
కుష్ఠీచ పాప సహితై రవలోకితైర్వా." 9

తా. మఱికొన్ని యనిష్ట యోగములు చెప్పఁబడినవి. అశ్వి మధ్య=ధనుస్సుయొక్క పంచమాంశమైన సింహనవాంశయందుఁగాని మీన కర్కాటక మకర మేషనవాంశలలో నొకనవాంశయందు గాని యున్నట్టి చంద్రుఁడు శన్యంగారకులలో నొకనితోఁ గూడినను వారలచేఁ జూడఁబడినను బుట్టినవాఁడు కుష్ఠురోగి యగును. ఈయోగమందుఁ జంద్రుఁడు శుభగ్రహ దృష్టుఁడై యుండెనేని దురద రోగము గలవాఁ డగుంగాని కుష్ఠురోగి కాఁడని తెలియఁ దగినది. ఇందులకు "మీనాంశకే మేష మృగాంశకేవా చంద్రస్థ్సితో త్రైవహి పాప దృష్టః, కిలాస కుష్ఠాది వినష్ట దేహ మిష్టేక్షితః కండు వికారిణంచ." అని యవనేశ్వరునిచేఁ జెప్పఁబడినది. కాఁబట్టి వృశ్చిక కర్కాటక వృషభ మకరములయందు నొకరాశి లగ్నమునకుఁ ద్రికోణము నొంది యుండి ఆరాశి పాపగ్రహ యుతమైగాని చూడఁబడిగాని యుండునపుడు జాతకుండు కుష్ఠురోగి యగునని తెలియఁ దగినది.

నిధనారి ధన వ్యయస్థితా రవి చంద్రారయమాయథా తథా,
బలవ ద్గ్రిహ దోషకారకై ర్మనుజానాం జనయంత్య నేత్రతామ్.

తా. అనఁగా సూర్య చంద్ర కుజ శనులు క్రమ నియమము లేక ౮-౬-౨-౧౨ ఇండ్లయందున్నచో ఆనాల్గు గ్రహముల యందు నేగ్రహము బలయుతమై యుండునో ఆగ్రహమునకు వాత పిత్త శ్లేష్మాది వ్యాధులలో నేది చెప్పఁబడినదో యారోగములచేత గ్రుడ్డితనము జాతకునకుఁ గల్గునని తెలియఁ దగినది.

నవ మాయ తృతీయ ధీ యుతా
నచ సౌమ్యై రశుభా నిరీక్షితాః,
నియమా చ్ఛ్రివణో పఘాతదా
రద వైకృత్య కరాశ్చ సప్తమే. 11

తా. అనఁగా ౯-౧౧-౩-౫ ఇండ్ల నుండు పాపగ్రహములు శుభగ్రహములచేతఁ జూడఁబడ కుండిరేని ఆపాపగ్రహములలో బలయుక్తగ్రహమునకుఁ జెప్పఁబడిన వాతపిత్తాది దోషకారణములచేత నిశ్చయముగఁ జెవులకు నుపద్రవమును జేయువా రగుదురు. అశుభగ్రహణమువలనఁ బూర్వోక్త శ్లోక ప్రకారము రవి చంద్ర కుజ శనులే గ్రహింపఁ దగినది. లగ్నమునకు సప్తమమందున్న పాప గ్రహములు శుభ గ్రహములచేతఁ జూడఁబడ కుండిరేని దంత శిరో ముఖరోగములు గలుగఁ గలవని తెలియఁ దగినది.

ఉదయ త్యుడుపే సురాస్యగే
సపిశాచో శుభయో స్త్రికోణయోః,
సోపప్లవ మండలేరవా
వుదయస్థే నయనా పవర్జితః. 12

తా. రాహుగ్రస్తుం డగు చంద్రుఁడు లగ్నమునందుండి శని కుజులు ౫-౯ ఇండ్ల నుండఁగా జాతకుఁడు పిశాచ గ్రస్తుం డగునని తెలియఁ దగినది. రాహుగ్రస్త మండలుం డగుసూర్యుండు లగ్నమున నుండి శనికుజులు ౫-౯ ఇండ్ల నుండిరేని జాతకుఁడు గ్రుడ్డివాఁ డగునని యెఱుంగ వలయును.

సంస్పృష్టః పవనేన మందగ యుతే ద్యూనే విలగ్నే గురౌ
సోన్మా దోవనిజే స్థితే స్త భవనే జీవే విలగ్నాశ్రితే,
తద్వ త్సూర్యసుతోదయే వనిసుతే ధర్మాత్మజద్యూనగే
జాతోవా ససహస్రరశ్మితనయే క్షీణేవ్యయే శీతగౌ. 13

తా. అనఁగా నేడవయింట శనియుండి జన్మలగ్నమునందు గురువుండెనేని జాతకుఁడు వాతశ్లేష్మాది రోగము గలవాఁడగును. ఏడవయింట నంగారకుఁ డుండి లగ్నమున గురువుండెనేని జాతకుఁడు చిత్తవిభ్రమ గలవాఁడగును. శని లగ్నగతుఁడై యుండఁగా నంగారకుండు ౯-౫-౭ ఇండ్ల నుండెనేని జాతకుఁడు చిత్తవైకల్యము గలవాఁ డగును. క్షీణచంద్రుఁడు శనియుతుఁడై పండ్రెండవయింట నుండినచో జాతకుఁడు మతిభ్రమ గలవాఁ డగునని తెలియఁదగినది.

రాశ్యంశపోష్ణ కర శీతక రామరేజ్యై
ర్నీచాధిపాంశక గతై రరిభాగ గైర్వా,
ఏభ్యోల్ప మధ్య బహుభిః క్రమశః ప్రసూతా
జ్ఞేయా స్స్యరభ్యుపగమ క్రయ గర్భదాసాః. 1

తా. అనఁగా నేనవాంశయందుఁ జంద్రుఁ డుండునో ఆనవాం
శ రాశ్యంశ యనంబడును. కాఁబట్టి రాశ్యధిప సూర్య చంద
గురువులలో నొకండు నీచరాశ్యధిపతి నవాంశయందుఁగాని శత్రు
గ్రహ నవాంశయందుఁగాని యుండఁగా జనించినవాఁడు తనకుఁదాఁ
జీవనార్థముగ దాసత్వము నొందువాఁ డగుననియు, రెండు గ్రహముల
నీచరాశ్యధిపతి నవాంశయందుఁగాని శత్రుగ్రహ నవాంశయందు
గాని యుండఁగా జనించినవాఁడు దాసత్వమునందుఁ గేవలముగ నుండ
వాఁ డగు ననియు, మూఁడు నాలుగు గ్రహములు ఈప్రకారముగ
నుండఁగాఁ బుట్టినవాఁడు దాసపుత్రుఁడుగఁగాని దాసీపుత్రుఁడుగఁగాని
యగు ననియు నెఱుంగ వలయును.

వికృతదశనః ప్రాప్తై ర్దృష్టే వృషాజ హయోదయే
ఖలతిర శుభక్షేత్రే లగ్నే హయే వృషభేపివా,
నవమ సుతగే పాపై ర్దృష్టే రవానదృ ఢేక్షణో
దినకరసుతే నైకవ్యాధిః కుజే వికలః పుమాన్. 1

తా. అనఁగా వృషభ మేష ధనుస్సులయం దొకటి జన్మ
లగ్నమై ఆలగ్నము పాపగ్రహములచేతఁ జూడఁబడు చుండఁగాఁ బుట్టి
నవాఁడు వికృత రూపముగల దంతములు గలవాఁ డగు ననియు, పాప
గ్రహక్షేత్రము లగు మేష సింహ వృశ్చిక మకర కుంభములలో నొకటి
గాని, ధనుస్సుగాని వృషభముగాని జన్మలగ్నమై ఆలగ్నము పాపగ్రహ
ములచేతఁ జూడఁబడుచుండఁగాఁ బుట్టినవాఁడు బట్టతలగలవాఁ డగు
ననియు, ౫-౯ ఇండ్ల యందు సూర్యుఁ డుండి పాపగ్రహములచేఁ జూడ
బడు చుండఁగాఁ బుట్టినవాఁడు నేత్ర దార్ఢ్యములేనివాఁ డగుననియు
శనైశ్చరుఁడు లగ్నమునకు ౫-౯ ఇండ్ల యందుండి పాపగ్రహముల
చేతఁ జూడఁబడు చుండఁగాఁ బుట్టినవాఁడు అనేక రోగములుగలవా

డగుననియు, అంగారకుఁడు ౯-౫ ఇండ్ల నుండి పాపగ్రహములచేతఁ జూడఁబడు చుండఁగాఁ బుట్టినవాఁడు అంగహీనుం డగుననియుం దెలియఁ దగినది.

వ్యయసుత ధనధర్మగై రసౌమ్యై
ర్భవన సమాన నిబంధనం వికల్ప్యం,
భుజగ నిగళ పాశ భృద్ద్రికాణై
ర్బలవద సౌమ్య నిరీక్షితైశ్చ తద్వత్. 16

తా. ద్వాదశ పంచమ ద్వితీయ నవమముల యందుఁ బాప గ్రహము లుండి మేష వృషభ ధనుస్సులలో నొకటి లగ్నమగునేని జాతకుఁడు త్రాళ్లు మొదలగు వానిచేఁ గట్టఁబడువాఁ డగును. మిథున తులా కన్యా కుంభములలో నొకటి లగ్నమగునపుడు పుట్టినవాఁడు సంకెళ్లం బడువాఁ డగును. కర్కాటక మకర మీనములలో నొకటి లగ్నమైనచో భూమియందు గృహమున నుంచఁబడువాఁ డగును. ఇట్లు భవన సమాన నిబంధన మూహింపఁ దగినది. బలయుత పాప గ్రహములచేతఁ జూడఁబడినచో భుజగ పాశభృ ద్ద్రేకాణము, అనఁగా భుజగ ద్రేక్కాణము. నిగళ భృ ద్ద్రేకాణము, అనఁగా నిగళద్రేక్కాణము. ఈద్రేక్కాణములచేతఁ బూర్వోక్త విధముగ భువన సమాన నిబంధనము చెప్పఁదగినది. అనఁగా నేద్రేక్కాణమునందు శిశువు జనించునో ఆ ద్రేక్కాణము భుజగ ద్రేక్కాణముగాని నిగళ ద్రేక్కాణముగాని యైననా ద్రేక్కాణము ప్రథమ పంచమ నవమగణనచేత నేరాశి సంబంధి యగుచున్నదో యారాశి బలయుక్తంబైన పాపగ్రహముచేతఁ జూడఁబడెనేని భవన సమాన నిబంధనమును పూర్వోక్త ప్రకారముగఁ జెప్పఁ దగినది. కర్కాటకరాశి ప్రథమ ద్రేక్కాణమును, వృశ్చిక ప్రథమ ద్వితీయ ద్రేక్కాణములును, మీనాంత్య ద్రేక్కాణమును, ఇవి భుజగద్రేక్కాణము లనంబడును. మకర ప్రథమద్రేక్కాణము నిగళ ద్రేక్కాణ మనంబడును.

పరుష వచనోపస్మారార్తః క్షయీచ నిశాపతౌ
సరవితనయే శక్రాలోకం గతే పరివేషగే,

రవి యమ కుజై స్సౌమ్యా దృష్టై ర్నభస్థ్సల మాశ్రితై
ర్భృతక మనుజాః పూర్వోక్తై ర్ద్విత్రై ర్వరాధమ మధ్యమాః. 17

తా. చంద్రుఁడు శనితోఁగూడినవాఁడై అంగారకునిచేతఁ జూడఁబడినవాఁడై పరివేష మధ్యగతుండై యుండఁగాఁ బుట్టినవాఁడు నిష్ఠుర భాషియును, చిత్తభ్రమచే మాటాడు వాఁడును, క్షయరోగ యుక్తుండును నగును. అనఁగాఁ జంద్రుఁడు శనితోఁ గూడియుండఁగాఁ బుట్టినవాఁడు నిష్ఠుర భాషి యగుననియు, చంద్రుఁడు శనితోఁ గూడి కుజునిచేతఁ జూడఁబడుచుండఁగా జనించినవాఁడు మతిభ్రమ గలవాఁడగుననియు, చంద్రుఁడు శనితోఁ గూడి కుజునిచేతఁ జూడఁబడుచుఁ బరివేష గతుండై యుండఁగా జనించినవాఁడు క్షయరోగి యగు ననియు భావము. శుభగ్రహముచేతఁ జూడఁబడక దశమ స్థానమందున్నట్టి రవి శని కుజులచేతఁ జంద్రుఁడు చూడఁబడెనేని జాతకుఁడు కూలిసేయువాఁడగుననియు, పూర్వోక్త రవి శని కుజులచేత శుభగ్రహము చూడఁబడక దశమ మందుండఁగా జనించినవాఁడు శ్రేష్ఠమైన భృతిని చేయుననియు, రెండు గ్రహములు శుభగ్రహములచేతఁ జూడఁబడక దశమమందుండఁగాఁ బుట్టినవాఁడు మధ్యమ మగు భృతిని చేయుననియు, మూఁడు గ్రహములు శుభగ్రహముచేఁ జూడఁబడక దశమమం దుండఁగాఁ బుట్టినవాఁడు అధమంబగు కూలిసేయువాఁ డగునని తెలియఁదగినది.

ఇట్లు బృహజ్జాతకమునందు నరిష్టాధ్యాయము
సంపూర్ణము.

---

## స్త్రీజాతకాధ్యాయము.

యద్యత్ఫలం నరభవే క్షమ మంగనానాం
తత్తద్వదే త్పతిషువా సకలం విధేయం,
తాసాంతు భర్తృ మరణం నిధనే వపుస్తు
లగ్నేందుగంసుభగతా స్తమయే పతిశ్చ. 1

తా. పురుష జన్మమునందుఁ జెప్పఁబడిన ఫలములలో స్త్రీలకుం జెప్పఁదగి యుండెడు "నృత్తార్తాత్రమ దృగుష్ణ శాకలఘుభుక్" ఇత్యాది ఫలములు స్త్రీలకే చెప్పఁదగిన వనియు, స్త్రీలకు యోగ్యములుగాని యోగములు స్త్రీజాతకమునందు నుండెనేని అట్టి యోగములు ఆస్త్రీభర్తకుం జెప్పఁదగిన వనియు, సుఖ దుఃఖ ప్రదర్శకము లగు సునఫానఫాది యోగములన్నియు భార్యాభర్తల కిద్దఱకుం జెప్పఁదగిన వనియు, ఇట్లు మూఁడు విధములుగా స్త్రీజాతక ఫలము చెప్పఁదగినవని యెఱుంగ వలయును. అట్లు గానిపక్షమున సకల స్త్రీజాతక ఫలములును ఆస్త్రీల భర్తలయందుఁ జెప్పఁదగినవి. ఆ స్త్రీలకు జన్మ లగ్నమునకు అష్టమస్థానమునందు భర్తృ మరణమును ముందు దెల్పెడు తెఱంగునం జెప్పఁదగినది. స్త్రీల శరీరము లగ్నచంద్రుల వలన వక్ష్యమాణప్రకారముగఁ జెప్పఁ దగినది. సౌభాగ్యమును భర్త యెట్టివాఁడని తెలియఁదగినదో యదియును సప్తమస్థానమును బట్టి వక్ష్యమాణవిధమునఁ జెప్పఁదగినది.

యుగ్మేషు లగ్న శశినోః ప్రకృతి స్థితా స్త్రీ
సచ్ఛీల భూషణ యుతా శుభదృష్ట యోశ్చ,
ఓజస్థయోశ్చ పురుషాకృతి శీలయుక్తా
పాపాచ పాపయుతవీక్షిత యోర్గుణోనా. 2

తా. అనఁగా లగ్న చంద్రులు సమరాసులయం దుండఁగాఁ బుట్టిన స్త్రీ స్త్రీస్వభావము గలదిగ నుండును. ఆలగ్న చంద్రులు శుభగ్రహములచేఁ జూడఁబడుచుండిరేని సత్స్వభావముతో నాభరణాదులతోఁ గూడినదిగ నుండును. బేసిరాసులయందు లగ్న చంద్రు లుండఁగాఁ బుట్టిన స్త్రీ పురుషాకృతి పురుషస్వభావములతోఁ గూడిన దగును. ఆలగ్న చంద్రులు పాపగ్రహములతోఁ గూడియుండఁగాఁ బాపగ్రహములచేతఁ జూడఁబడఁగాఁ బుట్టిన స్త్రీ పాపాచారముతోఁ గూడినదియును, గుణహీనురాలు నగును. లగ్న చంద్రులలో నొకటి విషమరాశియై మఱొకటి సమరాశియై యుండఁగా జనించిన స్త్రీ స్త్రీపురుషాకృతుల స్వభావములు రెండునుగూడి యుండిన దగును. లగ్న చంద్రుల

లో నొకటి శుభగ్రహ యుతదృష్టమై మఱియొకండు పాపగ్రహ యుతదృష్టమై యుండఁగా నుదయించిన స్త్రీ సదాచార దురాచారములు రెండునుగూడి యుండినదగును. చంద్ర లగ్నములు రెండును శుభాశుభ మిశ్రగ్రహ యుతదృష్టములై యుండఁగాఁ బుట్టినస్త్రీ మిశ్రగుణాన్విత యగునని తెలియఁ దగినది.

కన్యైవ దుష్టా వ్రజతీహ దాస్యం
సాధ్వీ సమాయా కుచరిత్ర యుక్తా,
భూమ్యాత్మజర్క్షే క్రమశోంశకేషు
వక్రార్కి జీవేందుజ భార్గవానామ్. 3

తా. అనఁగా కుజక్షేత్రములగు మేష వృశ్చికములయందు నొకరాశి లగ్నముగాని చంద్రాధిష్ఠితముగాఁ గాని యైయుండెనేని కుజ శని గురు బుధ శుక్రుల త్రింశాంశలయందుఁ గ్రమముగా :—అనఁగా లగ్నముగాని చంద్రుఁడుగాని కుజక్షేత్రమందలి కుజత్రింశాంశయందుండఁగాఁ బుట్టినస్త్రీ వివాహము కాకమున్న పురుష సంపర్కము సేయును. కుజక్షేత్రమునందు శనిత్రింశాంశ యందుండఁగాఁ బుట్టిన స్త్రీ దాసీభావము నొందును. కుజక్షేత్రమునందలి గురుత్రింశాంశ యందుండఁగాఁ బుట్టినస్త్రీ పతివ్రత యగును. కుజక్షేత్రమున బుధ త్రింశాంశ యందుండఁగాఁ బుట్టినకన్యక మాయోపాయముచేయు టక్కులాడి యగును. కుజక్షేత్రమున శుక్రత్రింశాంశయందు లగ్నముగాని చంద్రుఁడుగాని యుండఁగాఁ బుట్టిన కన్యక దురాచార యుక్తురాలగును.

దుష్టా పునర్భూ స్సగుణా కలాజ్ఞా
ఖ్యాతా గుణై శ్చాసురపూజితర్క్షే,
స్యాత్కాపటీ క్లీబ సమా సతీచ
బౌధే గుణాఢ్యా ప్రవికీర్ణ కామా.

తా. శుక్రక్షేత్రములైన వృషభ తులలలో నొకరాశి లగ్నమైకాని చంద్రాధిష్ఠితమైకాని యుండఁగాఁ గుజ త్రింశాంశయందుఁ బుట్టినస్త్రీ దుష్టురాలగును. శని త్రింశాంశయందుఁ బుట్టిన కన్యక వివా

హానంతరము మఱియొకనిని పెండ్లియాడును. కుజత్రింశాంశలయందు మఱి రెండు పాపగ్రహాన్వితమై యుండెనేని రెండు వివాహములుగాని లేక యిద్దఱు పురుషులనుగాని విడిచి మఱియొకని చేఁబట్టినట్టి కన్యక యగును. అనఁగా వివాహమాడిన పిదప నీచెప్పిన ఫలములు నేర్పడుచున్నవి. గురుత్రింశాంశయందుఁ బుట్టినస్త్రీ సద్గుణవతియగును. బుధత్రింశాంశయందుఁ బుట్టినస్త్రీ సంగీతాది విద్యల నెఱింగినట్టి యుక్తాయుక్త పరిజ్ఞాన యగును. శుక్రత్రింశాంశయందుఁ బుట్టినస్త్రీ సౌశీల్యాది గుణములచేతఁ బ్రసిద్ధురాలగును. బుధక్షేత్రము లగుమిథున కన్యలయందు నొకరాశి లగ్నమైగాని చంద్రాధిష్ఠితమైగాని యుండఁగాఁ గుజత్రింశాంశయందుఁ బుట్టినస్త్రీ కపటచిత్తయగును. శనిత్రింశాంశయందుఁ బుట్టినది మాచకమ్మ యగు ననఁగా నపుంసకునివలె నుండునని తెలియఁ దగినది. గురుత్రింశాంశయందుఁ బుట్టినస్త్రీ పతివ్రత యగును. బుధత్రింశాంశయందుఁ బుట్టినకన్యక గుణాధికురాలును విద్యావినయ సంపత్తిం గూడినదియు నగును. శుక్రత్రింశాంశయందుఁ బుట్టిన కన్యక యనేక పురుషులం గామించు మనస్సు గలది యగును.

స్వచ్ఛందాపతి ఘాతినీ బహుగుణా శిల్పిన్య సాధ్వీందుభే
న్రాచారా కులటార్కభే నృపవధూః పుంశ్చేష్టితా గమ్యగా,
జైవేనైక గుణాల్పరత్యతిగుణా విజ్ఞాన యుక్తాసతీ
దాసీనీచరతార్కిభే పతిరతా దుష్టాప్రజా స్వాంశకైః. 5

తా. అనఁగాఁ గర్కాటము లగ్నమైగాని, చంద్రాధిష్ఠితమైగాని యుండఁగా, నంగారక త్రింశాంశయందుఁ బుట్టిన స్త్రీ స్వచ్ఛందా=అనఁగాఁ బురుషుఁడుండినను లక్ష్యము లేక యిష్టానుసారముగు చోట్లం దిరుగునది యగును. శనిత్రింశాంశయందుఁ బుట్టినది భర్తకుఁ బ్రాణాపద గలుగఁజేయునదిగ నగును. గురుత్రింశాంశయందుఁ బుట్టిన స్త్రీ బహు సుగుణాఢ్యయగును, మఱియుఁ బుత్రులు గలది యగుననియుఁ జెప్పఁదగినది. బుధత్రింశాంశయందు జనించిన స్త్రీ శిల్పకార్యములను చిత్రపనులం జేయునట్టిదగును. శుక్రత్రింశాంశయందుఁ బుట్టిన స్త్రీ వ్యభిచారిణియు, అన్యపురుషులకు సాహాయ్య మొనర్చునదియు నగును.

సింహములగ్నమైగాని చంద్రాధిష్ఠితమైగాని యుండఁగా కుజత్రింశాంశ యందుఁ బుట్టిన స్త్రీ) (నాచార = పురుషాచారము నొందునట్టిదియును పురుషుని నడవడిగలదియు నగును. శనిత్రింశాంశయందుఁ బుట్టి న స్త్రీ) వ్యభిచారవిద్యయందు నేర్పరియును, దురాచార సంసక్తయ ను, వాతోష్ణ దేహియును, అన్య దేశ సంచార ప్రియచిత్తయును నగు ను. గురుత్రింశాంశ యందుఁ బుట్టిన స్త్రీ) రాజభార్యగగాని, ధనా ఢ్యుని భార్యగగాని గొప్ప గుణవంతురాలుగ గాని యగును. బుధ త్రింశాంశయందుఁ బుట్టిన స్త్రీ) పురుషస్వభావము గలదియును పుర షులవలె లజ్జపడక రహస్య కామకీ)డాది వచనములు వెల్లడిం మాటాడునదియు నగును. శుక్ర త్రింశాంశ యందుఁ బుట్టిన స్త్రీ పొందరాని పురుషులం జేఁబట్టి రమించుటగాక అట్టివారి పరిచర్యలు సేయును. గురుక్షేత్రములగు ధనుర్మీనములలో నొకటి లగ్నమైగాని చంద్రాధిష్ఠితమైగాని యుండఁగాఁ గుజత్రింశాంశమైనచో నపుడు జనిం చినస్త్రీ బహుపురుషగామినియు, బహుగుణములు గలదియును గృహమునందు నిలువక తిరుగుచుండునదియు నగును. శనిత్రింశాంశ మైనచో నపుడు పుట్టినస్త్రీ అల్పరతియును, అల్పబుద్ధియును, అల్ప జాతివారలయందుఁ బ్రీతియును, భర్తచేఁ దిరస్కరింపఁ బడునట్టిదియు ను నగును. గురుత్రింశాంశమైనచో నపుడు జనించిన స్త్రీ) బహుగుణవతి యును, భర్తృప్రేమగలదియును, గురుదేవతారాధనాది సత్కృత్యము లయం దాశ గలదియును, జ్ఞానమార్గ మెఱింగినదియును నగును. బుధత్రింశాంశయందుఁ బుట్టినస్త్రీ శాస్త్రజ్ఞానమును, గ్రంథ రచనా శక్తియును గల్గినదగును. శుక్ర త్రింశాంశయందుఁ బుట్టినస్త్రీ భర్తను వదలి పరపురుషునితోఁ బరదేశమునకుఁ బోయి ధనవ్యయముచేసుకుని మఱలఁ బురుషునియొద్దకు వచ్చిచేరును. రాజదండన మొక్కింత యనుభ వించును. శనిక్షేత్రములగు మకర కుంభముల నొకటి లగ్నమైగాని, చంద్రాధిష్ఠితమైగాని యుండఁగాఁ గుజత్రింశాంశయందుఁ బుట్టిన స్త్రీ) దాసియగును. లేక యన్యస్త్రీ)లకు దుర్బోధనచేసి పరపురుషులకు వశ పఱచి ధనమార్జించునట్టిదిగాని యగును. శనిత్రింశాంశ యందుఁ బుట్టి న స్త్రీ) మ్లేచ్ఛ చండాలాది నీచజనులతోఁ స్నేహముచేతను, అట్టివా

సంభోగాదులచేతను నీచకార్యాసక్త యగును. గురుత్రింశాంశ యందుఁ బుట్టిన స్త్రీ పతివ్రతయగును. బుధత్రింశాంశయందుఁ బుట్టిన స్త్రీ కోపముగలదియును, మగని యెదుర్కొని దుష్కార్యములు సేయునట్టి దియును, ప్రాణాపద లొనరించునదియును, దుర్జనస్నేహముచేయునదియు నగును. శుక్రత్రింశాంశయందుఁ బుట్టినది పుత్రహీనయు, అన్యపురుషాపేక్షయు, మనశ్చలనయు నగును.

శశిలగ్న సమాయుక్తైః ఫలం త్రింశాంశకైరిదం,
బలాబల వికల్పేన తయోరుక్తం విచింతయేత్. 6

తా. అనఁగా నేరాశియందే నేగ్రహ సంబంధమయిన త్రింశాంశ యందుఁ జంద్రుఁ డుండునో ఆత్రింశాంశనుబట్టియు, ఏరాశి లగ్న మగుచున్నదో ఆలగ్నమునందు నేగ్రహ త్రింశాంశ ముదయించుచున్నదో ఆలగ్న త్రింశాంశను బట్టియు ఫలము చెప్పఁ దగినదని చెప్పఁబడినది. అందొకరాశియం దొకత్రింశాంశయందుఁ జంద్రుఁడును మఱియొక రాశియందు మఱియొక త్రింశాంశయందు లగ్నమును నుండెనేని అప్పుడు చంద్రలగ్నములలో నేది బలాధికమైయుండునో అది యేత్రింశాంశ యందుండునో ఆత్రింశాంశకుఁ జెప్పఁబడిన ఫలముం జెప్పవలయునుగాని బలహీన మయినదానికిఁ జెప్పిన త్రింశాంశ ఫలము చెప్పఁ దగినది కాదని తెలియఁ దగినది.

దృక్సంస్థావసితసితౌ పరస్పరాంశే
శౌక్రేవా యది ఘటరాశి సంభవోంశః,
స్త్రీభిః స్త్రీమదన విషానలం ప్రదీప్తం
సంశాంతిం నయతి నరాకృతి స్థితాభిః. 7

తా. స్త్రీ తన కామోద్రేకమును చర్మమయ లింగధారిణులగు స్త్రీలచేత రమింపఁజేసుకొనునట్టి యోగద్వయము చెప్పఁబడినది. అదెట్లనఁగా శని శుక్రులు ఏరాశియందైన శని నవాంశయందు శుక్రుండును, శుక్ర నవాంశయందు శనియును పరివర్తనముగ నుండిరేని యొకరినొకరు చూచుకొనఁబడిరేని యొకయోగము. మఱియు శుక్రక్షేత్రములగు వృషభ తులలలో నొకరాశి జన్మలగ్నమై ఆలగ్న నవాంశ

కుంభనవాంశమైనచో రెండవ యోగము. ఈరెండు యోగముల యందుఁ బుట్టిన స్త్రీ విషతుల్యమై జ్వలించు మన్మథాగ్నిని పురుషాకృతి గల చర్మ రచిత లింగముచేతను బురుషాకృతులైయుండు స్త్రీలచేతను దనకామమును నివారించుకొనునది యగును. లేక వేఱొక పురుషుని చేత రమింపఁ జేసుకొనునట్టి దగునని తెలియఁ దగినది.

శూన్యే కాపురుషో బలేస్తభవనే సౌమ్య గ్రహావీక్షితే
క్లీబోస్తే బుధ మందయో శ్చరగృహే నిత్యం ప్రవాసాన్వితః,
ఉత్సృష్టా తరణౌ కుజేతు విధవా బాల్యే స్తరాశిస్థితే
కన్యైవా శుభవీక్షితేర్కతనయే ద్యూనే జరాం గచ్ఛతి. 8

తా. అనఁగా లగ్నమునకుఁగాని చంద్రునకుఁగాని సప్తమరాశి గ్రహవర్జితమై బలరహితమై శుభగ్రహములచేఁ జూడఁబడక యుండఁ గాఁ బుట్టిన స్త్రీయొక్క భర్త కుత్సిత పురుషుండును, దుర్నడవడి గలవాఁ డును అగునని తెలియఁ దగినది. మఱియు లగ్నమునకుంగాని చంద్రు నకుంగాని సప్తమరాశి యందుండు బుధశనులలో నొకనిచేత జనించిన స్త్రీయొక్క భర్త నపుంసకుం డగును. ఆసప్తమరాశి చరరాశియైన చో నెల్లప్పుడు పరదేశమున దిరుగువాఁడగును. మఱియు స్త్రీజన్మరాశి కేడవరాశి స్థిరరాశియయ్యెనేని భర్త గృహమును విడువక యుండును. ద్విస్వభావరాశియైనచోఁ గొన్ని దినములు దేశములు దిరుగుటయుఁ గొ న్ని దినము లింట నుండుటయు నగును. సూర్యుఁడు సప్తమమందుండఁగా బుట్టినస్త్రీ భర్తచేత విడువఁబడిన దగును. లేక భర్త కుపయోగము లేక వ్యాధి పీడితురాలుగ నగును. అంగారకుండు సప్తమమునయుండి పాపగ్ర హములచేఁ జూడఁబడు చుండఁగాఁ బుట్టినస్త్రీ బాల్యమునందు విధవ యగును. శని సప్తమమున నుండి పాపగ్రహములచేతఁ జూడఁబడు చుం డఁగా జనించిన కన్యక వివాహము లేకుండ నుండును ముసలితనమును బొందును. కొంచెము శుభులయొక్క చూపుండినచో నేండ్లుమీఱినపిద ప వివాహ మగును. ఈఫలములు లగ్న చంద్రుల బలాబలముల నను సరించి చెప్పఁదగినది. సప్తమమున నున్న చంద్రునకు వేఱు ఫలము చెప్ప బోవుటవలన లగ్నమునకుంగాని చంద్రునకుంగాని సప్తమస్థానమును బట్టి యీఫలములు చెప్పఁదగినవి.

ఆగ్నేయై ర్విధవా స్తరాశి సహితై ర్మిశ్రైః పునర్భూర్భవే
త్క్రూరే హీనబలే స్తగే స్వపతినా సౌమ్యేక్షితే ప్రోజ్ఝితా,
అన్యోన్యాంశగయో స్సితావనిజయో రన్య ప్రసక్తాంగనా
ద్యూనేవా యది శీతరశ్మి సహితౌ భర్తు స్తదానుజ్ఞయా. 9

తా. అనఁగాఁ బాపగ్రహములు సప్తమరాశి యందుండఁగా జనించినస్త్రీ వితంతురాలగును. శుభాశుభ గ్రహములు మిశ్రములై సప్తమరాశి యందుండఁగా జనించిన వధూటి మగనిని విడిచి మఱి యొకని వివాహము చేసికొనును. సర్వ బలరహితములగు పాపగ్రహములు సప్తమస్థానమున నుండి శుభగ్రహముచేతఁ జూడఁబడకుండఁగా జనించినయింతి తనమగనిచేత విడువఁబడినదగును. శుక్రాంగారకులు ఏరాశియందైన శుక్ర నవాంశయందు నంగారకుండును శుక్రుఁ డంగారకుని నవాంశయందు నుండఁగాఁ బుట్టినయాఁడుది తనయిష్టప్రకారము పరపురుషునిం గూడునదగును. సప్తమమునందు శుక్రాంగారకులు చంద్రసహితులై యుండిరేని అపుడుజనించిన స్త్రీ తనభర్తయొక్క యుత్తరువునొంది పరపురుషుం గూడునది యగును.

సౌరారర్క్షే లగ్నగే సేందుశుక్రే
మాత్రాసార్థం బంధకీ పాపదృష్టే,
కౌజేస్తాంశే సౌరిణా వ్యాధియోని
శ్చారు శ్రోణీ వల్లభా సద్గ్రహాంశే. 10

తా. ఏయోగమునం బుట్టిన యువతి తనతల్లితోఁగూడ వ్యభిచారిణి యగునో ఏయోగమున జనించిన స్త్రీ సరోగయోని గలదగునో ఏయోగమున జనించిన వధూటి సుభగయగునో అమూఁడు యోగములు చెప్పఁబడినవి. అదెట్లనఁగా శని కుజ క్షేత్రములగు మకర కుంభ మేష వృశ్చికములలో నొకటిలగ్నమై ఆలగ్నము చంద్ర శుక్రులతోఁ గూడినదై పాపగ్రహములచేతఁ జూడఁబడుచుండఁగా జనించి నట్టి స్త్రీ తల్లితోఁగూడ వ్యభిచారిణియై భర్తను విడిచి పోవును. సప్తమ స్థానమున నున్నట్టి కుజ నవాంశ శనిచేతఁ జూడఁబడుచుండఁగా జనించిన కన్యక వ్యాధిపీడితయోని గలదగును. స్త్రీజనన లగ్నమునకు

సప్తమరాశి యందు శుభగ్రహములును శుభనవాంశయునై యుండె నేని మగని కిష్టురాలై సుభగ యగును.

వృద్ధో మూర్ఖ స్సూర్యజ క్షేంశ కేవా
స్త్రీలోలస్స్యా త్క్రోధన శ్చావనేయే,
శౌక్రే కాంతో తీవ సౌభాగ్య యుక్తో
విద్వాన్ భర్తా నైపుణజ్ఞశ్చ బౌధే. 11

తా. అనఁగా శనిక్షేత్రములగు మకర కుంభములలో నొకరాశిగాని ఆనవాంశగాని సప్తమ మందుండఁగా జనించిన స్త్రీయొక్క భర్త మూర్ఖుండును, ముసలివాఁడును, వాసనగల శరీరము గలవాఁడు నగును. అంగారకక్షేత్రము లగు మేష వృశ్చికములలో నొకరాశిగాని ఆనవాంశగాని సప్తమ మందుండఁగాఁ బుట్టినదాని మగండు స్త్రీలోలుండును,కోపచిత్తుండును నగును. శుక్రక్షేత్రములగు తులా వృషభములలో నొకరాశిగాని ఆనవాంశగాని సప్తమ మందుండఁగా జనించిన స్త్రీభర్త సుందరుండును, సౌభాగ్యముతో నుండువాఁడును అగును. బుధక్షేత్రములగు కన్యా మిథునములలో నొకరాశిగాని ఆనవాంశగాని సప్తమమందుండఁగాఁ బుట్టినయువతిభర్త విద్వాంసుండును, నేర్పు గలవాఁడును నగునని తెలియఁ దగినది.

మదన వశగతో మృదుశ్చ చాంద్రే
త్రిదశగురో ర్గుణవాన్ జితేంద్రియశ్చ,
అతిమృదు రతికర్మ కృచ్చ సౌర్యే
భవతి గృహే స్తమయ స్థితేంశ కేవా. 12

తా. అనఁగాఁ జంద్ర క్షేత్రమగు కర్కాటక రాశిగాని ఆనవాంశగాని లగ్నమునకు సప్తమమున నుండఁగాఁ బుట్టినదానిమగండు కామాతురుండును మృదుస్వభావుండును కన్యకా సంగమ ప్రియుండును నగును. గురుక్షేత్రము లగుధనుర్మీనములలో నొకరాశిగాని ఆనవాంశగాని సప్తమమై యుండఁగాఁ బుట్టిన దానిమగండు మంచిగుణములు గలవాఁడగును. పండితుండని పేరొందును. జితేంద్రియుండగును. సూర్యక్షేత్రమగు సింహముగాని ఆనవాంశగాని సప్తమమందుండఁగా జనిం

నదానిమగండు అతిమృదు స్వభావుండును బహువ్యాపారములు సేయువాఁడును కామాసక్తుండును నగును. ఈచెప్పఁబడిన రాశి నవాంశ లో రాశి యొక గ్రహసంబంధియు నవాంశ మఱియొక గ్రహసంబంధియునై యుండెనేని అపుడు రాశ్యధిప నవాంశాధిపులలో రాశ్యపతి బలాధికుండై యుండెనేని రాశిబలమును నవాంశాధిపతి బలాధికుండై యుండెనేని నవాంశ ఫలమును చెప్పందగినది.

ఈర్ష్యాన్వితా సుఖపరా శశి శుక్ర లగ్నే
జ్ఞేందోః కలాసు నిపుణా సుఖితా గుణాఢ్యా,
శుక్రజ్ఞయోస్తు రుచిరా సుభగా కలాజ్ఞా
త్రిష్వప్యనేక వసుసౌఖ్య గుణాశుభేషు. 13

తా. అనఁగాఁ జంద్ర శుక్రు లుండునట్టి లగ్నమునందుఁ బుట్టి స్త్రీ మాత్సర్య యుక్తురాలును, సుఖాసక్తురాలును, ముంగోపము లదియునగును. బుధచంద్రులు జన్మలగ్నమందుండిరేని గీతవాద్యాది కలయందు సమర్థురాలును, గుణవంతురాలును, భర్తకుఁ బ్రియమగుదియును అగును. శుక్ర బుధులు జన్మలగ్నమున నుండిరేని సౌందర్యతియును, సౌభాగ్యవతియును, గీతవాద్యాది కళాభిజ్ఞురాలును, సుందర ుందిర నివాసురాలును నగును. బుధ శుక్ర చంద్రులు ముగ్గురును బుధ ురు శుక్రులు ముగ్గురును ఈవిధముగ జన్మలగ్నమునం దుండిరేని హువిధము లగు ధన సుఖ వాహన భాగ్య భూధాన్యాదులతోను శువులతోను విద్యాధనములతోను గూడినదిగ నగును.

క్రూరేష్టమే విధవతా నిధనేశ్వరోంశే
యస్యస్థితో వయసి తస్య సమేప్రదిష్టా,
సత్స్వర్థగేషు మరణం స్వయమేవ తస్యాః
కన్యాళిగోహరిషు చాల్ప సుతత్వ మిందౌ. 14

తా. అధ్యాయాది శ్లోకమునందు, "తాసాంతుభర్తృమరణం ధనే" అని చెప్పఁబడి యున్నదిగదా! అది యిచ్చట చెప్పఁబడి ది. అదెట్లనిన జన్మలగ్నమునకు అష్టమ మందుఁ బాపగ్రహము ుండెనేని అష్టమస్థానాధిపతి యేగ్రహముయొక్క నవాంశయందుం

డునో వివాహానంతరమున నాపాపగ్రహము అంతర్దశాధిపతియై యుండె నేని అయ్యంతర్దశాకాలమున వైధవ్యము గల్గునని తెలియఁ దగినది. కొందఱు 'వయసి' యన్నప్పుడు "ఏకం ద్వా నవ వింశతిర్ధృతి కృతే" త్యాద్యుక్త గ్రహ వయస్సనఁ దని చెప్పెదరు. అది భట్టోత్పల వ్యాఖ్యాతకు సమ్మతముగాదు. శుభగ్రహము లష్టమమున లేకుండి ద్వితీయముననుండి పాపగ్రహము లష్టమమందుండఁగాఁ బుట్టినస్త్రీ భర్తకంటె ముందుగఁ దా మరణము నొందు నని తెలియఁ దగినది. చంద్రుఁడు కన్యా వృశ్చిక వృషభ సింహములయం దుండఁగాఁ బుట్టిన స్త్రీకి స్వల్పపుత్త్రిలును స్వల్ప రతిప్రియమును గల్గునని యెఱుంగఁ దగినది.

సౌరే మధ్యబలే బలేన రహితైః శీతాంశు శుక్రేందుజైః
శేషైః వీర్య సమన్వితైః పురుషిణీ యద్యోజరా శ్యుద్గమః,
జీవా రాస్ఫుజిదైందవేషు బలిషు ప్రాగ్లగ్న రాశౌ సమే
విఖ్యాతా భువి నైకశాస్త్రనిపుణా స్త్రీ బ్రహ్మవాది న్యపి. 15

తా. అనఁగా శనైశ్చరుండు మధ్యబల యుతుండై యుండఁగాఁ జంద్ర శుక్ర బుధులు బలహీనులై యుండఁగా నితర సూర్యాంగారక గురువులు బలవంతులై యుండఁగా విషమరాసులగు మేష మిథున సింహ తులా ధనుః కుంభములయందు నొకటి జన్మలగ్నమై యుండె నేని యపుడు పుట్టిన స్త్రీ పురుష స్వభావ చేష్టలుగల దగును. లేక పెక్కండ్రు పురుషులకుఁ బ్రియురా లనియుం జెప్పఁదగినది. గురు కుజ శుక్రబుధు లేరాసులయందైన బలవంతులై యుండఁగా స్త్రీజన్మ లగ్నరాశి సమరాశియైనచో భూమియందుఁ బ్రసిద్ధురాలును, అనేక శాస్త్రములయందు సమర్థురాలును, బ్రహ్మజ్ఞానము గలదియును, నవీన గ్రంథరచనా శక్తి గలదియు నగును.

పాపేస్తే నవమగత గ్రహస్య తుల్యాం
ప్రవ్రజ్యాం యువతి రుపైత్యసంశయేన,
ఉద్వాహే వరణ విధౌ ప్రదానకాలే
చింతాయా మపి సకలం విధేయ మేతత్. 16

తా. అనఁగాఁ బూర్వము లగ్న సప్తమముల నున్నట్టి గ్రహము లకుఁ బ్రత్యేకముగ ఫలము చెప్పఁబడెను. ఆసప్తమమందుఁ బాప గ్రహ ముండి నవమమందు మఱియొక గ్రహ ముండెనేని సప్తమమం దున్నట్టి గ్రహఫలమును చెప్పక ప్రవ్రజ్యను జెప్పవలయును. అదెట్లనఁగా ప్రవ్రజ్యాధ్యాయ ప్రథమ శ్లోకమునందు నొక్కొక్క గ్రహమున కొక్కొక్క ప్రవ్రజ్యఁ జెప్పఁబడియున్నది. కాఁబట్టి ఆప్రకారము నవమమందున్న గ్రహమునకు సమానమగు ప్రవ్రజ్యను నిశ్శంకముగ స్త్రీపొందును. ఈప్రకారముగ స్త్రీజాతకము వ్యాఖ్యానము చేయఁబడెను. ఈస్త్రీజాతకమందుఁ జెప్పఁబడిన సకలయోగములును వివాహమునకు ముందుఁగాని కన్యావరణకాలమునంగాని కన్యాదానకాలము నంగాని యోచింపఁ దగినది.

ఇట్లు బృహజ్జాతకమునందు నిరువది రెండవ యధ్యాయమగు స్త్రీజాతకాధ్యాయము సంపూర్ణము.

---

## నైర్యాణికాధ్యాయము.

మృత్యుర్మృత్యుగ్రహేక్షణేన బలిభి స్తద్ధాతుకోపోద్భవ
స్తత్సంయుక్తభగాత్రజో బహుభవో వీర్యాన్వితై ర్భూరిభిః,
అగ్న్యంబ్వాయుధజోజ్వరామయకృత స్తృట్ క్షుత్కృతశ్చాష్టమే
సూర్యాద్యై ర్నిధనే చరాదిషు పర స్వాధ్వ ప్రదేశే ష్వపి. 1

తా. అష్టమ స్థానగ్రహ వీక్షణాదుల వలన మరణ విధము జెప్పఁబడినది. అదెట్లనఁగా బలయుక్త గ్రహములచేత జన్మలగ్నమున కు అష్టమరాశి గ్రహవర్జితమై చూడఁబడుటచేత నాగ్రహమునకుం జెప్పఁబడిన ధాతు ప్రకోపమువలన మరణము సంభవించునని తెలియఁ దగినది. అదెట్లనఁగా సూర్యునకుఁ బైత్యము, చంద్రునకు వాతశ్లేష్మములు, అంగారకునకుఁ బిత్తవికారము, బుధునకు వాత పిత్తశ్లేష్మాదులు, గురువుకు వాతశ్లేష్మము, శుక్రునకు వాతశ్లేష్మము, శనికి వాత పిత్తశ్లేష్మము ఈవిధముగఁ జెప్పఁబడియున్నది కాఁబట్టి జన్మలగ్నము

నకు అష్టమస్థానము శూన్యమై బలయుక్త మగు నే గ్రహముచేతఁ జూడఁబడునో ఆగ్రహధాతు జనిత మగు వ్యాధివలన మరణము గల్గు నని తెలియఁ దగినది. "తత్సంయుక్తభగాత్రజః" అనఁగా నాయ ష్టమ స్థానగతమైన రాశి కాలపురుషుని యొక్క యేయంగమున నుం డునో ఆయంగమునందు నేగ్రహముచేత నష్టమస్థానము జూడఁబడు నో ఆగ్రహమునకుం జెప్పఁబడిన ధాతుదోషము వలన మరణము సంభ వించునని తెలియఁ దగినది. బలసమేతములైన యనేక గ్రహములచేత ననేక ధాతుదోష జనితమయిన మరణము సంభవించును. అదెట్లనిన లగ్నమునకు అష్టమమున రవియుండెనేని అగ్నివలనను, చంద్రుఁడుండె నేని యుదకమువలనను, అంగారకుఁ డుండెనేని ఆయుధముల వలనను, బుధుఁడుండెనేని జ్వరము వలనను, గురుడుండెనేని తెలియని హృద్రో గము వలనను, శుక్రుఁ డుండెనేని దప్పివలనను, శనియుండెనేని ఆఁకలి వలననైనను, వ్రణము వలననైనను మరణము గల్గునని తెలియఁ దగినది. ఈగ్రహములు బలయుక్తములై యుండెనేని శుభకర్మాదులచేతను, బల హీనులై యుండిరేని అశుభ కర్మాదులచేతను, మధ్యమ బలయుతులై యుండిరేని మిశ్ర కర్మాదులచేతను, మృతిగల్గునని తెలియఁ దగినది. కొందఱీగ్రహములు బలాధికులై యుండిరేని వీరికిఁ జెప్పఁబడిన అగ్న్యా దుల వలన మరణము గల్గుననియు, బలహీనులై యుండిరేని గ్రిహో క్తాగ్న్యాదిబాధ కొంతగల్గి శాంత మగుననియు, మధ్యమ బలయుతు లై యుండిరేని ఆగ్రిహమునకుం జెప్పఁబడిన మృత్యువు గల్గునట్లుండి పరిహార మగుననియుం జెప్పెదరు. మరణదేశము దెలియు విధమెట్ల నిన; అష్టమరాశి చర స్థిర ద్విస్వభావ రాసు లగుచుండఁగా, అనఁగా జన్మలగ్నమునకు అష్టమరాశి చరమైనచోఁ బరదేశమునను, స్థిరమైనచో స్వదేశమునను, ద్విస్వభావమైనచో మార్గప్రదేశమునను మృతి గల్గు నని తెలియం దగినది. ఈవిషయముచే గ్రిహబలానుసారముగ గృహ మునను ద్వారమునను వృక్షముక్రిందను గల్గు మరణము దెలియఁ దగును.

శైలాగ్రాభిహతస్య సూర్య కుజయో ర్మృత్యుఃఖబంధుస్థయోః
కూపే మంద శశాంక భూమితనయై ర్బంధ్వస్త కర్మస్థితైః,

కన్యాయాం స్వజనాద్ధి మోక్షకరయోః పాపగ్రహై ర్దృష్టయోః
స్యాతాం యద్యుభయో దయేర్క శశినౌ తోయే తదామజ్జతి.

తా. అనఁగా సూర్య కుజు లిద్దఱును దశమమందుఁగాని చతుర్థ మందుఁగాని యుండఁగాఁ బుట్టినవానికిఁ బర్వతాగ్రమున ఱాతిదెబ్బ చేత మృతిగల్గునని యెఱుంగ వలయును. కొందఱు రవి దశయందు దఁ గారకుఁడు చతుర్థమున నుండఁగా నని చెప్పెదరు. శని చంద్ర కుజుల క్రమముగఁ జతుర్థ సప్తమ దశమముల నుండఁగా జనించినవానికి బావి యందు మృతిగల్గునని యెఱుంగ వలయును. పాపగ్రహములచేత జూ డఁబడుచున్న చంద్రసూర్యులు కన్యారాశి యందుండఁగాఁ బుట్టినవా నికి తన బంధువులవలన మృతి సంభవించునని తెలియఁ దగినది. ద్విస్వ భావ రాశి లగ్నమై ఆలగ్నమునందు సూర్య చంద్రు లుండిరేని అపుడ పుట్టినవాఁ డుదకమున మునిఁగిపోవు వాఁడని తెలియఁ దగినది.

మందే కర్కటకే జలోదర కృతో మృత్యు ర్మృగాంకేమృగే
శస్త్రాగ్ని ప్రభవ శ్శశి న్యశుభయో ర్మధ్యే కుజర్క్షేస్థితే,
కన్యాయాం రుధిరోత్థ శోష జనిత స్తద్వత్ స్థితే శీతగౌ
సౌరర్క్షే యది తద్వదేవ హిమగౌ రజ్జ్వగ్ని పాతైః కృతః.

తా. అనఁగాఁ గర్కాటకమునందు శనైశ్చరుండును చంద్రుఁడు మకరమునను నుండఁగాఁ బుట్టినవానికి జలమధ్య ప్రాప్తంబైన మరణము గల్గును. కొందఱు జలోదరమనెడు వ్యాధిచే ననియుం జెప్పెదరు. చం ద్రుఁడు రెండు పాపగ్రహముల నడుమను మేష వృశ్చికములలో నొక రాశియం దుండఁగాఁ బుట్టినవానికి శస్త్రాగ్ని వ్రణాదులచే మృతి సంభవించునని తెలియఁ దగినది. చంద్రుఁడు కన్యారాశియందు నావిధ ముగనే పాపగ్రహ మధ్యగతుండై యుండఁగాఁ బుట్టినవానికి దుష్టరక్త ముచేఁ గాని క్షయరోగముచేఁగాని మృతి గల్గును. చంద్రుఁడు మకర కుంభములలో నొకరాశియందుఁ బాపద్వయ మధ్యస్థితుఁడై యుండఁ గా జనించినవాఁడు అగ్నిచేతఁగాని క్రిందపడుటచేఁగాని త్రాళ్లచేఁగాని ప్రయత్నపూర్వక మరణము నందునని తెలియఁదగినది.

బందా ద్ధీ నవమ స్థయో రశుభయో స్సౌమ్యగ్రహా దృష్టయో
ర్ద్రేకాణైశ్చ ససర్పపాశ నిగళై శ్ఛిద్రస్థితై ర్బంధతః,
కన్యాయా మశుభాన్వితే స్తమయగే చంద్రేస్థితే మేషగే
సూర్యే లగ్నగతేచ విద్ధి మరణం స్త్రీహేతుకం మందిరే.

తా. అనఁగా శుభగ్రహములచేతఁ జూడఁబడక యుండు రెఁ పాపగ్రహములు ౯-వఇంట నొకండును, ౫-వఇంట నొకండు నుండఁ బుట్టినవాఁడు బంధనముచే మృతి నొందునని తెలియఁ దగినది. ల లగ్నమునకు అష్టమమందు నుదయించిన సర్పపాశ నిగళాఖ్యము ద్రేకాణములచేత బంధనముగల్గి మృతి సంభవించునని తెలియఁ నది. ఆద్రేకాణము లెవ్వియనఁగా కర్కాటకాంత్యమును, మీన త్యమును, సర్పపాశ ద్రేకాణములు. మకర ప్రథమము నిగళ కాణము. కాఁబట్టి మీనములగ్నమగుచుండఁగాను, పాపగ్రహయు డైన చంద్రుఁడు సప్తమ గతుండై కన్యయం దుండఁగాను, శుక్రు మేషమున నుండఁగను, సూర్యుఁడు లగ్నమగు మీనమునం దుఁ గాను, జనించినవానికి స్వగృహమున స్త్రీమూలకముగ మరణము నని తెలియఁ దగినది.

శూలోద్భిన్న తను స్సుఖేవనిసుతే సూర్యేపివా ఖేయమే
సప్రక్షీణ హిమాంశు భిశ్చ యుగప త్పాపై స్త్రికోణాద్యగై
బంధుస్థేచ రవౌ వియత్యవనిజే క్షీణేందు సంవీక్షితే
కాష్ఠై నాభిహతః ప్రయాతి మరణం సూర్యాత్మజే నేక్షితే.

తా. చతుర్థమందు నంగారకుండైన, సూర్యుండైన నుండ దశమస్థానమున శనియుండఁగాఁ బుట్టినవాఁడు శూలముచేత ప్ర లింపఁ బడి మృతినొందు నని తెలియఁ దగినది. క్షీణ చంద్ర సహి తములగు పాపగ్రహము లేకకాలమున నవమ పంచమ జన్మ లగ్న యందుండి యితరస్థానముల యందు లేకుండఁగాఁ బుట్టినవాఁడు శూ ముచేత మృతినొందును. చతుర్థమున నున్న సూర్యుఁడును దశమవ నున్న కుజుండును క్షీణ చంద్రునిచేతఁ జూడఁబడుచుండఁగాఁ బు వాఁడు శూలముచేత హతుఁ డగునని తెలియఁ దగినది. ఆచతుర్థ

మములయందున్న సూర్యాంగారకులు శనిచేతఁ జూడఁబడు చుండఁగా బుట్టినవాఁడు కట్టెచేఁ గొట్టఁబడి మృతినొందు వాఁడగునని తెలియఁ దగినది.

రంధ్రాస్పదాంగ హిబుకై ర్లగుడా హతాంగః
ప్రక్షీణ చంద్ర రుధిరార్కి దినేశ యుక్తైః,
తైరేవ కర్మ నవమోదయ పుత్రసంస్థై
ర్ధూమాగ్ని బంధన శరీర నికుట్ట నాంతః.

తా. అనఁగాఁ జంద్రుఁ డష్టమమున క్షీణత్వము నొంది యుడువాఁడై యుండఁగా దశమమున నంగారకుండును, లగ్నమున శనైశ్చరుండును, చతుర్థమున సూర్యుండు నుండఁగాఁ బుట్టినవాఁడు దుడ్డుకలచేత హతుం డగునని తెలియఁ దగినది. మఱియు దశమమున క్షీ చంద్రుఁడును, నవమమందు నంగారకుండును, లగ్నమున శనియును పంచమమున రవియును, ఇవ్విధముననుండఁగఁ బుట్టినవాఁడు అగ్నితఁగాని పొగచేతగాని బంధనముచేతగాని మృతినొందునని తెలియఁ దగినది.

బంధ్వాస్తకర్మ సహితైః కుజ సూర్య మందై
ర్నిర్యాణ మాయుధ శిఖిక్షితిపాల కోపాత్,
సౌరేందు భూమితనయై స్స్వసుఖాస్పదస్థై
ర్జ్ఞేయః క్షత క్రిమికృతశ్చ శరీరపాతః.

తా. చతుర్థమున నంగారకుండును, సప్తమమున రవిరను, దశమమున శనియు నుండఁగాఁ బుట్టినవానికి ఖడ్గాద్యాయుధములవలనఁగాని అగ్నివలనగాని రాజదండనచేఁగాని మరణము కనని తెలియఁ దగినది. ద్వితీయమందు శనియును, చతుర్థమున జంద్రుడును, దశమమున నంగారకుండు నుండఁగాఁ బుట్టినవాఁడు వ్రణ క్రిగణముచేత మరణము నొందు నని తెలియఁ దగినది.

ఖస్థేర్కే౽వనిజే రసాతలగతే యాన ప్రపాతాద్వధో
యంత్రోత్పీడనజః కుజేస్తమయగే సౌరేం ద్వినాభ్యుద్గమే,

విణ్మధ్యే రుధిరార్కి శీతకిరణై ర్జూకాజ సౌరర్క్షగై
ర్యాతైర్వాగళితేందుసూర్యరుధిరై ర్వ్యోమాస్తబంధ్వాహ్వయాః.

తా. సూర్యుఁడు దశమమం దుండఁగాను జతుర్థమున నంగారకుఁ డుండఁగాను జనించినవానికి వాహనముమీఁద నుండిగాని క్రింద పడుటచేఁగాని మరణము గల్గునని యర్థము. అంగారకుఁడు సప్తమ రాశియం దుండఁగా శని చంద్ర సూర్యులు లగ్నమునం దుండఁగాఁ బుట్టినవానికి యంత్రములచేత మరణము గల్గునని యర్థము. అంగారకుఁడు తులారాశియందును, మేషమున శనియును, మకర కుంభములయం దొక రాశియందుఁ జంద్రుఁడు నుండఁగాఁ బుట్టినవాఁడు అమేధ్యమునందుఁబడి మృతినొందువాఁ డగును. దశమమందు క్షీణ చంద్రుండును, సప్తమమున రవియును, చతుర్థమున నంగారకుండు నుండఁగాఁ బుట్టినవాఁడు అమేధ్యమునంబడి మృతినొందువాఁ డగునని తెలియఁ దగినది.

వీర్యాన్విత వక్ర వీక్షితే క్షీణేందౌ నిధనస్థి తేర్కజే,
గుహ్యోద్భవరోగపీడయా మృత్యుస్స్యాత్క్రిమిశస్త్రదాహజః. 9

తా. క్షీణచంద్రుఁడు బలయుక్తుం డైన కుజునిచేతఁ జూడఁబడుచుండఁగా శనైశ్చరుఁడు అష్టమమున నుండఁగా జనించినవానికి గుహ్యావయవమున జనించిన భగంధరాది రోగాదులచేతగాని శస్త్రపీడలు గల్గి గాని క్రిమిబాధ వలనంగాని నిప్పునం గాల్చుటచే నైనంగాని మరణము గల్గునని యెఱుంగ వలయును.

అస్తే రవౌ సరుధిరే నిధనేర్కపుత్రే
క్షీణే రసాతలగతే హిమగౌ ఖగాంతః,
లగ్నాత్మజాష్టమ తపస్స్వినభౌమ మంద
చంద్రైస్తు శైల శిఖరాశని కుడ్యపాతైః. 10

తా. అనఁగా నంగారకునితోఁ గూడిన సూర్యుఁడు సప్తమమందును శనైశ్చరుఁడు అష్టమమునను క్షీణచంద్రుఁడు చతుర్థమునను నుండఁగా జనించినవాఁడు పక్షివలన మరణము గలవాఁడగును. వానిశరీర

మాపక్షులే తినుటంజేసి అగ్నిసంస్కారము వానికి లేదని యర్థము. మఱియు లగ్నమందు సూర్యుఁడు, పంచమమున నంగారకుఁడు, అష్టమమున శనైశ్చరుఁడు నవమమునఁ జంద్రుఁడు నుండఁగాఁ బుట్టిన వాఁడు పర్వత శిఖరమున నుండి పడుటచేగాని, పిడుగుచేఁగాని గోడ వల్లనంగాని మృతినొందు నని తెలియఁదగినది.

ద్వావింశః కథితస్తు కారణం ద్రేక్కాణో నిధనస్య సూరిభిః,
తస్యాధిపతి ర్భవోపివా నిర్యాణం స్వగుణైః ప్రయచ్ఛతి. 11

తా. అనఁగా జన్మద్రేక్కాణమునకు నిరువది రెండవ ద్రేక్కాణము మరణమునకుఁ గారణమని చెప్పఁబడినది. అదెట్లనఁగ ; ఏద్రేక్కాణమునందు మనుజుండు జనించునో ఆద్రేక్కాణము మొదలుకొని యిరువది రెండవ ద్రేక్కాణమునకు అధిపతి యేగ్రహమో ఆగ్రహమునకు అగ్నిజ్వాలాదులలో నేహేతువు జెప్పఁబడినదో ఆహేతువు వలన మృతి సంభవించుననియు, అట్లుకాదేని అష్టమ రాశ్యధిపతిగ నున్నగ్రహమునకుఁ జెప్పఁబడిన అగ్నిజ్వాలాది కారణముల వలన మరణము సంభవించు ననియు నెఱుంగ వలయును. ఆయిరువది రెండవ ద్రేక్కాణమేదియనిన; లగ్న ప్రథమ ద్రేక్కాణమునందు జననమయిన అష్టమము నందుఁ బ్రథమద్రేక్కాణము ఇరువదిరెండవ ద్రేక్కాణ మగును. లగ్నద్వితీయ ద్రేక్కాణమందు జననమైనచో అష్టమమందు ద్వితీయ ద్రేక్కాణము ద్వావింశ ద్రేక్కాణ మగును. లగ్న తృతీయ ద్రేక్కాణమందు జన్మించినచో అష్టమమందుఁ దృతీయ ద్రేక్కాణము ఇరువది రెండవ ద్రేక్కాణ మగును. ఇవ్విధమున నన్నిరాసులకును జూడఁ దగినది. పూర్వోక్త యోగములలో నొక్కయోగమును లేక అష్టమస్థానము గ్రహయుత దృష్టముగాక యుండఁగా జనించిన వానికి ద్వావింశ ద్రేక్కాణాధిపాష్టమ రాశ్యధిపతులలో నెవఁడు బలాధికుండై యుండునో వానికిఁ జెప్పఁబడినట్టి దోషకారణముచేత మరణము సంభవించునని యెఱుంగునది.

హోరా నవాంశ కపయుక్త సమాన భూమా
యోగేక్షణాదిభి రతః పరికల్ప్య మేతత్,

మోహాస్తు మృత్యుః సమయే నుదితాంశ తుల్యః
స్వేశేక్షితే ద్విగుణిత స్త్రిగుణ శ్శుభైశ్చ. 12

తా. అనఁగా లగ్న నవాంశయొక్క అధిపతి యుండు రాశి మేషమైనచో మేఁకలు గొఱ్ఱియలు తిరుగు నేలయందు మృతిగల్గునని యు, వృషభమైనచో వృషభ గోగణ సంచార భూమియందు మరణము గల్గుననియు, మిధునమైనచో గృహమునందు మరణంబనియు, కర్కాటక మైనచో బావియందు మరణ మనియు, సింహమైనచో అడవియందు మృతి గల్గుననియు, కన్యయైనచో జలసమాన ప్రదేశమున మరణ మనియు, తులారాశియైనచో అంగళ్లుగలచోట మరణ మనియు, వృశ్చికమైనచో చెఱువు మడువులయందు మరణ మనియు, ధనుస్సగు నేని గుఱ్ఱములు గలయెడ మృతి గల్గుననియు, మకరమైనచో జలప్రదేశమున మరణమనియు, కుంభమగు నేని గృహమున మృతినొందు ననియు, మీనమైనచో జలప్రదేశమునందు మరణము గల్గుననియుం జెప్పఁదగినది. మఱియు లగ్ననవాంశాధిపతి యేరాశి యందుండునో ఆరాశియందు మఱియొక గ్రహ ముండెనేని ఆగ్రహసంచార భూమియును, ఆనవాంశాధిపతి యుండు రాశిని ఏగ్రహము చూచుచుండునో ఆగ్రహ సంచారభూమియును, ఆదిశబ్దముచేత నేగ్రహ నవాంశయందుండునో ఆగ్రహ సంచార భూమియునుం జెప్పఁదగినవి. ఇవ్విధమున బహుభూములుగఁ జెప్పఁదగినవిగ నేర్పడిన పక్షమున నీగ్రహములలో నేది బలయుక్తమై యుండునో ఆగ్రహసంచార భూమి నిశ్చయింపవలయును. గ్రహమునకు భూమి యేదనఁగ స్వరాశిం జెప్పఁబడి యుండు భూమి యని తెలియఁ దగినది. ఏగ్రహమునకు రాశిద్వయము గల్గియుండునో ఆగ్రహమునకు స్వత్రికోణరాశి సంబంధ భూమిం జెప్పవలయు. అదెట్లనఁగా సూర్యునకు సింహ భూమి యగు నరణ్యము, చంద్రునకుఁ కర్కాటక భూమి యగు జలప్రాయప్రదేశము, అంగారకునకు మేషభూమి యగు నజాది సంచార ప్రదేశము, బుధునకుఁ గన్యాభూమి యగు జలప్రాయ ప్రదేశము. గురువుకు ధనుర్భూమి యగు నశ్వసంచార ప్రదేశము, శుక్రునకుఁ దులాభూమి యగు నంగడివీధి, శనికిఁ కుంభ భూమి యగుగృహము, కొందఱు గ్రహములకు "దేవాలయేగ్ని

విహాఁర క్రోశ శయన క్షితుత్యక్తా రాస్యుః" అనిఇవ్విధ మగు స్థానములం జెప్పెద రట్లు వచించినను సమ్మతమునం దగును. జన్మించినపుడు లగ్నమునందు శేషించి యుండు నవాంశలుగూడితే యెంతకాల మగునో అంతకాలము ,మరణకాలమునందు దేహ మెఱుంగక యుండునని తెలియఁ దగినది. ఆలగ్నరాశి స్వామి దృష్టమై యుండినచో లగ్నమందు శేషించి యుండు కాలమునకు రెండింతలు కాలము దేహము దెలియక యుండుననియు, ఆలగ్నరాశి శుభగ్రహములచేతఁ జూడఁబడు చుండెనేని లగ్నమున శేషించి యుండు కాలమునకు మూఁడంతలు కాలము దేహ మెఱుంగక యుండుననియు లగ్నరాశి స్వస్వామిచేతను శుభగ్రహములచేతను జూడఁబడు చుండెనేని లగ్నమందు శేషించి యున్న కాలమునకు నాలింతలకాలము దేహ మెఱుంగక యుండుననియు చెప్పఁ దగినది.

దహన జల విమిశ్రై ర్భస్మ సంక్లేదశోషై
ర్నిధన భవన సంస్థై ర్వ్యాళ వర్గై ర్విడంతః,
ఇతి శవ పరిణామ శ్చింతనీయో యథోక్తః
పృథు విరచిత శాస్త్రా ద్గత్యనూకాది చింత్యమ్. 13

తా. లగ్నద్రేక్కాణమునకు నిరువది రెండవ ద్రేక్కాణమును బట్టి శరీర పరిణామ మాలోచింపఁ దగినది. అదెట్లనఁగా పాపగ్రహ ద్రేక్కాణ మగ్ని ద్రేక్కాణ మనంబడును. శుభగ్రహ ద్రేక్కాణము జలద్రేక్కాణ మనంబడును. పాపగ్రహయుత మగు శుభ ద్రేక్కాణ మును శుభగ్రహ యుతమగు పాపద్రేక్కాణమును మిశ్రద్రేక్కాణ ము లనఁబడును. ఇందు నగ్నిద్రేక్కాణమైనచో మరణ మొందినవాని శరీరము దహింపఁబడుననియు, జలద్రేక్కాణమయ్యెనేని జలమధ్యమున వేయఁబడిన శరీరము గలవాఁ డగుననియును, మిశ్రద్రేక్కాణమయిన చో శరీరముదహింపఁ బడకజలమునందును వేయఁబడక యెండుననియు తెలియఁదగినది. మఱియు అష్టమ రాశ్యాశ్రిత మగు నాయిరువది రెండవ ద్రేక్కాణము సర్పద్రేక్కాణమైనచో మృతశరీరము కుక్కలు నక్కలు మొదలగు జంతువులచేఁ దినఁబడి విష్టారూపమై పరిణమించును.

మఱియు వ్యాళద్రేక్కాణములు అనఁగా గర్కట ప్రథమ తృతీయములు, వృశ్చిక ప్రథమ ద్వితీయములు, మీనతృతీయములు, ఈవిషయమై "శశిగృహ పూర్వాపరగః కీటస్యచ మీన పశ్చిమోపగతః, నిధనే యస్య భవంతి ద్రేక్కాణా స్తస్యచ మృతస్య. భుంజంతి వాయసాద్యాః ప్రాణి సమూహేన చాస్తి సందేహః, పాపగ్రహ దృక్కాణో యస్యాష్టమరాశి సంస్థితో భవతి. దహనం ప్రాప్నోతి నరోమృతమాత్రో నిశ్చయాత్ప్రవదేత్, ఏవం సౌమ్య దృక్కాణో జలమధ్యే క్షిప్యతే నరోత్ర మృతః. సౌమ్య దృక్కాణః పాపైః పాపదృక్కాణోపి సౌమ్య యుతః, యస్యాష్టమ భవన గత శ్శోషం ప్రాప్నోతి సోపిమృతః." అని యనేకులగు మునుల వలనం జెప్పఁబడి యున్నది. కాఁబట్టి యిట్లు మృతునిశరీర పరిపాకము దెలియఁదగినది. విపులముగఁ జేయఁబడినట్టి శాస్త్రములచేత మృతునకుఁ గల్గెడు గతియుం బూర్వజన్మ స్థితియు విచారింపఁ దగినది.

గురు రుడుపతి శుక్రౌ సూర్య భౌమౌ యమ జ్ఞౌ
విబుధ పితృతిరశ్చో నారకీయాంశ్చ కుర్యుః,
దినకర శశి వీర్యాధిష్ఠితా త్ర్యంశ నాథా
త్ప్రవర సమనికృష్టా స్తుంగ హీనాదనూకే. 14

తా. "దినకర శశి వీర్యాధిష్ఠితా త్ర్యంశ నాథాత్" అనఁగా సూర్య చంద్రులలో నెవఁడు బలవంతుఁడై యుండునో వానితోఁడఁ గూడిన ద్రేక్కాణమునకు నధిపతి యేగ్రహమో ఆగ్రహమునకుఁ జెప్పిన లోకమున నుండి వచ్చి జనించె ననిచెప్ప వలయు నని యర్థము. ఆద్రేక్కాణాధిపతి గురువైనచో దేవలోకమున నుండియు, చంద్ర శుక్రు లా ద్రేక్కాణాధిపతు లైనచో నందొక గ్రహాధిపత్యముచేతఁ బిత్రులోకమున నుండియు, రవి కుజులలో నొకఁ డయ్యేనేని తిర్యగ్లోకమున నుండియు, శని బుధులలో నొకఁడగునేని నరలోకమునను౦డియు, వచ్చిజనించెనని చెప్పఁదగినది. జాతకుఁ డేలోకముననుండి వచ్చెనో ఆ లోకమునకుఁ జెప్పఁబడినట్టి గ్రహ ముచ్చరాశి స్థితుఁడగునేని శ్రేష్ఠుండై యుండెననియు నీచరాశి గతమై యుండెనేని హీనుండై యుండెననియు, ఉచ్చరాశిని విడిచి నీచరాశిం బొందక యుండెనేని

మధ్యముండై యుండె ననియుఁ దెలియఁ దగినది. "అనూక" మన పూర్వజన్మము అనిఅర్థము.

గతిరపి రిపు రంధ్ర త్ర్యంశపోస్త స్థితోవా
గురు రథ రిపు కేంద్ర చ్ఛిద్రగ స్స్వోచ్చ సంస్థః,
ఉదయతి భవనేంత్యే సౌమ్య భాగేచ మోక్షో
భవతి యదిబలేన ప్రోజ్ఝితా స్తత్ర శేషాః. 15

తా. మృతుఁడైన వానికిఁ గలుగఁ బోవు గతి నెఱుంగు విధము తెలియఁ జేయఁబడినది. అనఁగా జననకాలమునందు ౬-౭-౮ ఈ స్థానములు గ్రహ వర్జితములై యుండెనేని షష్ఠాష్టమ భావముల యందే ద్రేక్కాణము లుండునో ఆ రెండు ద్రేక్కాణాధిపతులలో నెవఁడు బలవంతుఁడై యుండునో వానికిఁ జెప్పఁబడి యుండు లోకమునకు జన్మించినవాఁడు పోవునని తెలియఁ దగినది. మఱియు జన్మ లగ్నమునకు ౬-౭-౮ ఈస్థానములలో నొకస్థానమునందు గ్రహ ముం డెనేని ఆగ్రహమునకుఁ జెప్పఁబడి యుండు లోకమునకుఁ బోవునని చెప్పఁ దగినది. మఱియు ౬-౭-౮ ఈయిండ్లలో రెండు స్థానముల యందుగాని మూఁడుస్థానములందుగాని గ్రహము లుండెనేని బలాధిక మేగ్రహమునకుండునో ఆగ్రహమునకుఁగల లోకమునకుంబోవునని వచిం పఁ దగినది. ఇక్కడ "అస్తస్థితోవా" అని మూలమునందు సప్తమ స్థానము మాత్రమే గ్రహింపఁ బడి యున్నను వా శబ్దము వలన షష్ఠా ష్టమములును గ్రహింపఁ దగినవి. ఇందులకు "సుర పితృ తిర్యఙ్నా రకాః గురురుడుపసితావస్సుగ్ర విజ్ఞయమా, రిపురంధ్ర త్ర్యంశక పాః యంతిచా స్తారి నిధన స్థాః." అని లఘుజాతకమునఁ జెప్పఁబడి యున్న యది. అనఁగా షష్ఠముంగాని కేంద్రముంగాని అష్టమముంగాని పొందినట్టి గురువు తన యుచ్చస్థాన మగు కర్కాటకమునం దుండెనే అట్టికాలమునం బుట్టిన వానికి మోక్షము గలుగు నని తెలియఁ దగి నది. మఱియు మీనరాశి లగ్నమై శుభగ్రహ నవాంశ యందు గురు వుండి తక్కిన గ్రహములు బలవర్జితములై యుండెనేని అట్టికాలమున బుట్టిన వానికి మోక్షము గలుగు నని యెఱుంగునది. జన్మకాలమున

బట్టి యేప్రకారముగ గతి చెప్పఁబడెనో ఆప్రకారమే మరణకాలమును బట్టియు గతి చెప్పనగును. ఇందులకు "షష్ఠాష్టమ కంటక గో జీవశ్చే ద్భవతి మీనలగ్నే వా, శేషైః గబలై ర్జన్మని మరణేవా మోక్షగతిమాహుః." అని లఘుజాతక గ్రంథమునందుఁ జెప్పఁబడి యున్నది.

ఇట్లు బృహజ్జాతక గ్రంథమునందు నిరువది మూఁడవ
యధ్యాయ మగు నైర్యాణికాధ్యాయము
సంపూర్ణము.

---

## నష్టజాతకాధ్యాయము.

ఆధాన జన్మా పరిబోధ కాలే
సంపృచ్ఛతో జన్మవదే ద్విలగ్నాత్,
పూర్వాపరార్థే భవనస్య వింద్యా
ద్భానా వుదగ్దక్షిణగే ప్రసూతిమ్. 1

తా. జన్మకాలము తెలియని వానికిఁ బ్రశ్నకాలమువలన జన్మకాలము నెఱుంగు తెఱంగుఁ జెప్పఁబడినది. అదెట్లనఁగా ఆధానకాలమును జనన కాలమును దెలియ కుండు సమయమునందుఁ బ్రశ్న చేసిన వానికిఁ బ్రశ్నలగ్నముం బట్టి జన్మకాలమును జెప్పవలయును. అదెట్లనఁగా "పూర్వాపరార్థే భవనస్య వింద్యా ద్భానా వుదగ్దక్షిణగే ప్రసూతిమ్" అనుటంజేసి పృచ్ఛకుఁడు లగ్నప్రథమ హోరయందుఁ బ్రశ్న చేసినచో సూర్యుం డుత్తరాయణమైన మకరాది షట్కమునం దుండఁగా జనన మనియు లగ్నద్వితీయ హోరయందుఁ బ్రశ్న చేసినచో సూర్యుండు దక్షిణాయన మగు కర్కాటకాదిరాశి షట్కమునం దుండునపుడు జనించిన వాఁడనియు తెలియఁ దగినది.

లగ్నత్రికోణేషు గురు స్త్రిభాగై
ర్వికల్ప్య వర్షాణి వయో నుమానాత్,
గ్రీష్మోర్క లగ్నే కథితాస్తు శేషై
రన్యాయ నర్తా వృతు రర్కచారాత్. 2

తా. ప్రశ్నలగ్న ద్రేక్కాణముచేత లగ్నపంచమ నవమ రాసులయందు గురు వుండెనని తెలియఁ దగినది. అదెట్లనఁగా ప్రశ్నలగ్నమునందుఁ బ్రథమ ద్రేక్కాణమగునేని ప్రశ్న లగ్నరాశి యేదియో ఆరాశియందు గురువుండఁగా జనన మనియు, ద్వితీయ ద్రేక్కాణమాయెనేని ప్రశ్నలగ్నమునకుఁ బంచమరాశి యేదియో ఆరాశియందు గురువుండఁగా జననమనియు, తృతీయద్రేక్కాణమయ్యేనేని ప్రశ్నలగ్నమునకు నవమ రాశి యేదియో ఆరాశియందు గురు వుండఁగా జనన మనియు నెఱుంగఁ దగినది. మఱికొందఱు ప్రశ్నలగ్నమునఁ బ్రథమ ద్రేక్కాణోదయమగునేని లగ్నరాశి కెన్నవరాశియందు గురు వుండునో అన్ని సంవత్సరాలు పృచ్ఛకున కైనవనియు, ద్వితీయ ద్రేక్కాణమగునేని ప్రశ్నలగ్నమునకుఁ బంచమరాశి మొదలు ఎన్నవరాశియందు గురువుండునో అన్నిసంవత్సరాలు గతించిన వనియు, తృతీయ ద్రేక్కాణమగునేని ప్రశ్నలగ్నమునకు నవమరాశి మొద లెన్నవరాశియందు గురు వుండునో యన్నిసంవత్సరము లైనవనియు చెప్ప వలెనని వచింతురు. అది యుక్తముగాదు.

### సంవత్సరనిర్ణయము.

"ద్రేక్కాణ లగ్నే క్రమశస్తు రాశౌ
గురు ర్విలగ్నాది త్రికోణగో భవేత్,
సముద్భవే తద్భగణ క్రమేణ
స్వాచ్చార భాదబ్దగతిం ప్రగణ్యాత్."

అని యవనేశునిచే ముందు నుడివిన యర్థమునకు ననుకూలముగఁ జెప్పఁబడినది. కాఁబట్టి యిక్కడ సామాన్యముగ గురుస్థితి చెప్పఁబడియుండినను ద్వాదశ భాగక్రమమునఁ బ్రతిరాశియందును సంచార మూహింపఁ దగినది. ఈవిషయము పంచాంగమునందు గురు సంచార విషయము తప్పుగ నుండెనేని ఫలదృష్టాంతములు తప్పిపోవును. కాఁబట్టి గురుసంచార సిద్ధాంతము స్ఫుటీకరించు కొనఁదగినది. అట్లు గురుస్థితి నెఱింగి లగ్నమునందుఁ బ్రథమ ద్వాదశాంశ యుదయించెనేని గురువు లగ్నరాశి గతుండై యుండఁగా జనన మనియు,

ద్వితీయ ద్వాదశాంశ యుదయించెనేని లగ్నమునకు ద్వితీయరాశి యందు గురు వుండఁగా జనన మనియు, ఈవిధముగఁ దృతీయాది ద్వాదశాంశ లుదయించెనేని తృతీయాది రాసులయందు గురు వుండఁగా జననమన్నియూహింపఁ దగినది. ఇవ్విధమున జన్మకాలమునందు గురు వున్నట్టి స్థానము నెఱింగి నష్టజాతక ప్రశ్న చేసినవాని య్యాకారముం జూచి వానికిం గల వయస్సును బట్టి యిన్నేండ్లయి యుండు నను నూహావలన సంవత్సరములు చెప్పవలయును. అదెట్లనఁగా గురువు పండ్రెండేండ్ల కొక్కమాఱు పండ్రెండు రాసులయందు సంచారము చేయును. గనుక పూర్వోక్తప్రకారముగ జన్మకాలమునందు గురు వున్న రాశి నెఱింగి యీయాసంవత్సరముల యందు గురు వీయారాశి యందు నుండెనుగదా? యనియు నిందు వీని జనన సంవత్సరమై యుండు ననియు నిశ్చయింప వలయును. అట్లు వయోమానము వలనఁ దెలియక గురుభగణ సంశయము గల్గినచోఁ బురుషలక్షణోక్తప్రకారముగాఁ బృచ్ఛకునిచేత బృహస్పర్శ చేయించి గురుభగణ నిశ్చయము చేయఁ దగినది. అందులకు "పాదౌ సగుల్ఫౌ ప్రథమం ప్రదిష్టం,జంఘే ద్వితీయంతు సజాను చక్రే, మేఢ్రోరు ముష్కంచ తత స్తృతీయం నాభిం కటించేతి చతుర్థ మాహుః. ఉదరం కథయంతి పంచమం హృదయం షష్ఠమథ స్తనాన్వితం, అథ సప్తమ మంసజ త్రుణీ కథయం త్యష్టమ మోష్ఠకంధరే. నవమం నయనేచ సభ్రుణీ సలలాటం దశమం శిరస్తథా, అశుభే ష్వశుభం దశాఫలం చరణాద్యేషు శుభేషు శోభనమ్." అని యివ్విధమునఁ బురుషుల లక్షణమునందుఁ జెప్పఁబడి యుండుటం జేసి పృచ్ఛకుండు పాదాలుగాని గుల్ఫములఁగాని చీలమండలం గాని స్పృశించెనేని యొక గురుభగణమును, పిక్కలఁగాని మోకాళ్లం గాని స్పృశించెనేని రెండు గురుభగణములును, శిశ్న వృషణములను గాని తొడలనుగాని స్పృశించెనేని మూఁడుభగణములును, నాభి కటిప్రదేశములం దాఁకినచో నాల్గు గురుభగణములును, కడుపుం దాఁకెనేని అయిదు భగణములును, రొమ్మును స్తనంబులం దాఁకెనేని యాఱుభగణములును, భుజశిరములను స్పృశించినచో నేడు భగణంబులను, ఓష్ఠకంధరములు దాఁకెనేని యెనిమిది భగణములును, నేత్రములుగా

కనుబొమ్మలుగాని ముట్టినచోఁ దొమ్మిది భగణాలును, లలాటమును రస్సును దాఁకినచోఁ బదిభగణములును గతించిన వని తెలుసుకుని ంవత్సర నిశ్చయము చేయఁ దగినది. ఇవ్విధ మొక గురుభగణమునకుఁ ం(డెండేండ్ల విధమునఁ బది గురు భగణములకు నూటయిరువది సంవ సరాలగుం గనుక ఈసంవత్సరములకుఁ బైఁబడిన వాని విషయమై యాసంశయము గల్గినచో సంవత్సర నిశ్చయమునకు నుపాయము లే సని తెలియఁ దగినది.

## ఋతునిర్ణయము.

ప్రశ్న లగ్నమున సూర్యుఁ డుండెనేని గ్రీష్మర్తునందు జనన మనం గినది. "ద్రేక్కాణై శ్శిశిరాదయ శ్శశి కుజజ్ఞ గ్వాదిషూ ద్యత్సువా" అని చంద్రాదులకుఁ జెప్పఁబడిన ఋతువులయందు జననముచెప్పఁ బడి నది. కాఁబట్టి ప్రశ్నలగ్నమున శనియుంశినను శని ద్రేక్కాణ మైనను శిరఋతువనియు, లగ్నమున శుక్రుఁ డున్నను శుక్రద్రేక్కాణ మైనను వసంత ఋతువనియు, లగ్నమందు నంగారకుఁ డుండినను నంగారకద్రే క్కాణమైనను గ్రీష్మఋతు వనియు, లగ్నమునఁ జంద్రుఁడుండినను చంద్రద్రేక్కాణమైనను వర్షఋతు వనియు, లగ్నమున బుధుఁ డుండి నను బుధద్రేక్కాణమైనను శరదృతు వనియు, లగ్నమున గురు వుం డినను గురుద్రేక్కాణమైనను హేమంతఋతు వనియు, లగ్నమునం దనేకగ్రహము లుండెనేని అందు బలాధిక్య గ్రహమునకుఁ జెప్పఁదగిన ఋతు వనియు, జాతకునకు అనఁగాఁ బృచ్ఛకునకు నూహింపఁ దగిన ది. లగ్నమున నేగ్రహముగాని లేకుండినచో నేగ్రహసంబంధ ద్రేక్కా ణ మగునో ఆగ్రహ సంబంధ మగు ఋతువును నిర్ణయింప వలయును. ఒక అయనమున మఱియొక్క ఋతువు వచ్చినచో సౌరమానము వల న ఋతువుఁ జెప్పఁ నగినది. అదెట్లనఁగా శిశిరఋతు వని తెలియఁ బడినచో సూర్యుఁడు మకరమునం గుంభమున సంచరించు చుండఁగా జనన మని తెలియఁ దగినది.

చంద్ర జ్ఞ జీవాః పరివర్త నీయా
శ్శుక్రార మందై రయనే విలోమే,

ద్రేక్కాణ భాగే ప్రథమేతు పూర్వో
మాసో నుపాతాచ్ఛతిథి ర్వికల్ప్యః. 3

తా. అనఁగా అయనము వ్యత్యస్త మగు చుండఁగా చంద్రజ్ఞజీవాః చంద్ర బుధ గురువులు శుక్ర కుజులచేత వ్యత్యస్తముగ నుంచఁ దగిన వారగుదురు. అదెట్లనఁగా శుక్ర ఋతువయ్యేనేని చంద్ర ఋతువనియు, కుజ ఋతువయ్యేనేని బుధ ఋతువనియు, శని ఋతువయ్యేనేని గురు ఋతువనియుం దెలియఁ దగినది. కుజ రవులకు గ్రీష్మఋతువు కాఁబట్టి బుధుఁడ యిద్దఱకుఁ బరివర్తనీయుం డగును. అనఁగా నుత్తరాయణమున వర్షర్తు వని తెలిసినచో వసంతఋతువందు జనన మని తెలియఁ దగినది. దక్షిణాయనమున వసంత ఋతువని తెలిసినచో వర్షఋతువందు జనన మని తెలియఁ దగినది. ఉత్తరాయణమున హేమంత ఋతువని యేర్పడినచో శిశిరఋతు వందు జనన మనియును, దక్షిణాయనమునందు శిశిరర్తువని తెలిసినచో హేమంతమున జనన మనియు, ఉత్తరాయణమందు శరదృతు వని తెలిసినచో గ్రీష్మర్తునందు జనన మనియు, దక్షిణాయనమున గ్రీష్మఋతు వని తెలిసినచో శరదృతువందు జనన మనియు చెప్పఁదగినది.

మాసక్రమ నిర్ణయము.

ప్రశ్న లగ్న ద్రేక్కాణ భాగములు పదియందు మొట్టమొదట అయిదు భాగములయందుఁ బ్రశ్న చేసెనేని వచ్చిన మాసములలో మొదటి మాస మనియు, ప్రశ్నలగ్న ద్రేక్కాణభాగములు ౧౦-లో నుత్తరార్ధమునందుండు నైదు భాగములయందుఁ బ్రశ్న చేసినచో వచ్చిన ఋతువులలో రెండవ మాస మనియుం జెప్పఁ దగినది.

తిథి నిర్ణయము.

త్రైరాశికము వలన జన్మతిథి కల్పింపఁ దగినది. ద్రేక్కాణమునకు ౬౦౦-లిప్తలు ఆద్రేక్కాణంబైన ౩౦౦-లిప్తలచేత మాసం బేర్పడుం గనుక పదేసిలిప్తల కొక్కొక్క తిథి ప్రకారముగా ఆద్రేక్కాణమం దెన్నిలిప్తలు చెల్లినవో తెలుసుకొని తిథి నిర్ణయము చేయఁ దగినది.

అత్రాపి హోరా పటవో ద్విజేంద్రా
స్సూర్యాంశ తుల్యాం తిథి ముద్దిశంతి,
రాత్రి ద్యుసంజ్ఞేషు విలోమ జన్మ
భాగైశ్చ వేలాః క్రమశో వికల్ప్యాః. 4

తా. - చాంద్రమాన తిథి యెఱుంగు తెఱంగు చెప్పఁబడినది. ఈతిథి జ్ఞానమునందు హోరా శాస్త్రకుశలు లైనట్టి మునిశ్రేష్ఠులు స్ఫుట సూర్య భాగ సమాన మగు తిథిని చెప్పుదురు. అనఁగాఁ బ్రశ్న కాలమున సూర్యుఁ డుండు రాశి యందు నెన్ని భాగములు భుక్తములై యుండునో అన్ని తిథులు జ్ఞాతమాసమందు శుక్లప్రతిపదాదిగ గతించిన వని యెఱింగి తత్కాలమందు సూర్యుఁడు ఎన్నవ భాగమున నుండునో అన్నవ తిథియందు జనన మని చెప్పఁ దగినది. మకర మాసమని తెలియఁ బడినచో మాఖమాస మనియు కుంభమాస మేర్పడినచో ఫాల్గునమాసమనియు నివ్విధమునం దక్కిన మాసములకు నూహింపఁ దగినది. ఇందులకు, ''పృచ్ఛాకాలే రవిణా యావంతోంశా స్ఫుటేన సంభుక్తాః, రాశేస్తాస్తిథ యస్స్యు శ్శుక్లా దావర్కమాసస్య.'' అని మణిత్థుఁడు చెప్పినవాఁడు. ఈవిషయము హోరాశాస్త్రవిచారకు లూహింప వలయును.

### దివారాత్రులనిర్ణయము.

రాత్రి సంజ్ఞము లగు మేష వృష మిథున కర్కాటక ధను ర్మకరములలో నొకటి ప్రశ్నలగ్నమగు నేని పగలు జననమనియు, దివా సంజ్ఞము లగు సింహ కన్యా తులా వృశ్చిక కుంభ మీనములలో నొకటి ప్రశ్నలగ్నమగు నేని రాత్రి జనన మనియు నెఱుంగ వలెను.

### సమయనిర్ణయము.

ప్రశ్నకాలమునందు రవిగత లిప్తలను గుణించి రాత్రి జనన మేర్పడినచో దివా ప్రమాణముచేత రవిగతలిప్తల గుణించి రాత్రిప్రమాణముచేతఁ బాల్గొనఁగా రాత్రి జనన ఘటిక లేర్పడును. దివా జనన మైనచో రాత్రి ప్రమాణముచేత రవిగత లిప్తలను గుణించి దివా ప్రమాణముచేతఁ బాల్గొనఁగా దివా జనన ఘటిక లేర్పడును. కొంద.

ఊ దివమందుఁగాని రాత్రియందుఁగాని ప్రశ్నకాలమునకు నెన్ని గడియలు చెల్లి యుండునో అన్నిగడియలకు జనన మని చెప్ప నగునని వచించెదరుగాని యది గ్రాహ్యము గాదు.

కేచి చ్ఛశాంకా ధ్యుషి తాన్నవాంశా
చ్ఛుక్లాంత సంజ్ఞం కథయంతి మాసం,
లగ్న త్రికో ణోత్తమ వీర్య యుక్తం
సంప్రోచ్య తేంగా లభనాదిభి ర్వా. 5

తా. మతాంతర మాసజ్ఞానోపాయము చెప్పఁబడినది. అదెట్లనఁగాఁ గొందఱు చంద్రాధిష్ఠిత మగు నవాంశవలన శుక్లాంత సంజ్ఞక మగు మాసమును చెప్పుదురు. అనఁగాఁ బ్రశ్నకాలమున నేరాశి నవాంశయందుఁ జంద్రుఁ డుండునో ఆనవాంశను మూఁడు విధములుగఁ జేసి చంద్ర నవాంశ ప్రాప్త నక్షత్రమును దెలిసికొని ఆనక్షత్రము ఏమాసమున శుక్లపక్షాంత మగు పూర్ణిమయందు వచ్చునో ఆమాసము జన్మమాసమని చెప్పఁ దగినది. శుక్లాంత సంజ్ఞకమగు మాసము లేని నక్షత్రమునకు గురువు చారోక్త విధానముచేత శుక్లాంత సంజ్ఞక మగు మాసము కల్పింపఁ దగినది. ఇందులకు, "నక్షత్రేణ సహోదయ మస్తం వాయేన యాతి సురమంత్రీ,తత్సంజ్ఞం వక్తవ్యం మాసః వర్షంక్రమేణైవ. వర్షాణి కార్తికాదీ న్యాగ్నేయా ద్భద్వయాని యోజ్యాని, క్రమశ స్త్రీభంతుపంచమ ముపాంత్య మంత్యంచయ ద్వర్షమ్." అని గ్రంథాంతరమునం జెప్పఁబడినది. అనఁగాఁ బ్రశ్నకాలమునందుఁ జంద్రుఁడు వృషభ రాశి నవాంశయందు నేడునవాంశలకులోఁగ నుండెనేని తన్నవాంశగతనక్షత్రములు కృత్తికా రోహిణులగుం గాఁబట్టి కార్తిక మాసమునందు జనన మని చెప్పఁదగినది. వృషరాశి నవాంశయందు నేడనవాంశలకు మీఁదను, మిథున రాశి నవాంశయందు నాఱు నవాంశలకు లోఁగను నుండెనేని తన్నవాంశ గతనక్షత్రములు మృగశీర్షార్ద్రలగనుక మార్గశిర మాసమునందు జనన మని చెప్పఁదగినది. మిథున నవాంశ యందు నాఱునవాంశలకు మీఁదను కర్కాటక నవాంశయందు నైదు నవాంశలకు లోఁగను నుండెనేని తన్నవాంశ గత నక్ష

త్రములు పునర్వసు పుష్యములు గనుక పుష్యమాస మనియుం జెప్పఁ దగినది. ఈవిధముగ నవాంశా గతనక్షత్రములు ఆశ్లేష మఖలయ్యేనేని మాఖమాస మనియు, పూర్వఫల్గు న్యుత్తర ఫల్గుని హస్తలయ్యేనేని ఫాల్గునమాస మనియు, చిత్రా స్వాతులయ్యేనేని చైత్రమాస మనియు, విశాఖానూరాధ లయ్యేనేని వైశాఖ మాసమనియు, జ్యేష్ఠ మూలలయ్యేనేని జ్యేష్ఠమాసమనియు, పూర్వాషా ఢో త్తరాషాఢ లయ్యేనేని ఆషాఢమాసమనియు, శ్రవణ ధనిష్ఠలయ్యేనేని శ్రావణ మాసమనియు, శతభిషక్పూర్వాభాద్రో త్తరాభాద్ర లయ్యేనేని భాద్రపద మాసమనియు రేవ త్యశ్వినీ భరణులయ్యేనేని ఆశ్వయుజ మాసమనియు, ఈమాసములయందు జననమని తెలియఁ దగినది. "త్రిభంతు పంచమ ముపాంత్యమంత్యంచ యద్వర్షమ్" అని గ్రంథాంతరమందుఁ జెప్పఁబడి యుండుటవలనఁ గార్తిక మాసము మొదలుకొని అయిదవ మాసమగు ఫాల్గునమునకును ౧౧ వ మాసమగు భాద్రపదమునకును పండ్రెండవ మాసమగు ఆశ్వయుజమునకును మూఁడేసి నక్షత్రములు చేర్పఁదగినవి. మిగిలిన మాసములకు రెండేసి నక్షత్రాలు చేర్పఁదగినవి. ఇది శుక్లాంత సంజ్ఞక మాసమును గూర్చి వ్యక్తపరచబడినది. మఱియుఁ గార్తిక శుక్ల పక్షాంతమునందుఁ జంద్రుఁడు కృత్తికా రోహిణులలో నొక నక్షత్రముతోఁ గూడి యుండును మార్గశీర్ష శుక్ల పూర్ణిమ యందుఁ జంద్రుఁడు మృగశిరార్ద్రలలో నొక నక్షత్రముతోఁ గూడి యుండును. తక్కినవి యిట్లూహింపఁ దగినవి. ఇందులకు "యద్రాశి సంజ్ఞే శీతాంశుః ప్రశ్నకాలే నవాంశకే, స్థితస్తద్రాశిగః పూర్ణో యస్మిన్ భవతి చంద్రమాః, జన్మమాస స్సనిర్దిష్టః పురుషస్యతు పృచ్ఛతః, కృష్ణ పక్షాంతికో మాసో జ్ఞేయో త్రతు విపశ్చితా." అని యవనేశ్వరుండును, "లగ్న త్రికోణో త్తమ వీర్యయుక్తతత్ప్రోచ్యతే" అనఁగాఁ బ్రశ్నలగ్న నవమ పంచమములలో నేరాశి యుత్తమ బలయుతమై యుండునో ఆరాశియందుఁ జంద్రుఁ డుండఁగా బుట్టినట్లు వచింపఁ దగినది." "అంగానాదిభిర్వా" అనఁగా "కాలాంగాని" యను శ్లోకమునం జెప్పఁబడిన కాలపురుషుని అంగములలో నేరాశియుండెడు నంగమును పృచ్ఛకుఁడు స్పృశించునో ఆరాశియందు జంద్రుఁ డుండఁగాఁ బుట్టినవాఁడని చెప్పఁదగినది. మఱియు నేరాశిక

జెప్పిన జంతు దర్శన శ్రవణములగునో ఆరాశి యందుఁ జంద్రుఁ డుండఁగా నైనం బుట్టియుండు నని చెప్పఁ దగినది.

యావాన్గత శ్శీతకరో విలగ్నా
చ్చంద్రాద్వదే త్తావతి జన్మరాశిః,
మీనోదయే మీనయుగం ప్రదిష్టం
భక్ష్యాహృతాకార రుతైశ్చ చింత్యమ్. 6

తా. అనఁగాఁ బ్రశ్నలగ్నము మొదలెన్నవ రాశియందుండునో ఆచంద్రుఁ డుండురాశి మొదలుకొని అన్నవరాశియందు జన్మరాశిని చెప్పఁదగినది. మీనము ప్రశ్నలగ్నమయ్యెనేని మీనమునఁ జంద్రుఁ డుండఁగా జననమని చెప్పవలయును. ఈప్రకార మనేకవిధముల వలన రాసులు వెవ్వేఱుగ నేర్పడెనేని అప్పుడేరాశి నిర్ణయింపఁ దగినదియు చెప్పఁబడినది. "భక్ష్యాహృతాకార రుతైశ్చ చింత్యమ్" అనఁగాఁ బ్రశ్నకాలమునందు నేరాశి సంబంధ మగు భక్ష్యద్రవ్యము తేఁబడునో ఆరాశియందుఁ జంద్రుఁ డుండఁగా జనన మనం దగినది. [illegible] సమాన ధ్వని ప్రశ్నకాలమున వినంబడునో ఆరాశి యం[illegible]దుఁ జ[illegible]డుండఁగాఁ బుట్టినాఁడని చెప్పఁదగినది. అదెట్లనఁగా మార్జాల[illegible]ర్శనముగాని తద్ధ్వని శ్రవణముగాని ఆయెనేని సింహరాశియనియును, వృషభాది దర్శనముగాని తద్ధ్వని శ్రవణముగాని వినంబడెనేని వృషభరాశి యనియు నివ్విధమున నూహింపఁ దగినది.

హోరా నవాంశ ప్రతిమం విలగ్నం
లగ్నాద్ర విర్యావతి చ దృక్కాణే,
తస్మాద్వదే త్తావతివా విలగ్నం
ప్రష్టుః ప్రసూతావితి శాస్త్రిమాహ. 7

తా. అనఁగాఁ బ్రశ్నమునందు నేరాశి సంబంధమగు నవాంశ యుదయించునో ఆరాశి జన్మలగ్న మగునని తెలియంగ వలయును. ప్రశ్నలగ్నము మొదలుకొని సూర్యుఁడు ఎన్నవద్రేక్కాణమునందుండునో ఆప్రశ్నలగ్నము మొదలుకొని అన్నవరాశి యందుఁ బృచ్ఛకుని జనన విషయమగు లగ్నముం జెప్పఁదగినది. అనఁగాఁ బ్రశ్నలగ్న

దేక్కాణము మొదలుకొని సూర్యుఁడుండు ద్రేక్కాణము వఱకు ెక్కింపఁగ నెన్నియగునో ప్రశ్నలగ్నము మొదలుకొని అన్నవరాశి న్మలగ్న మగునని తెలియఁ దగినది. మఱియు ద్రేక్కాణ సంఖ్య ం ద్రెండుకు అధికంబగునేని ౧౨ పుచ్చి తక్కిన సంఖ్య నుంచుకొని గ్ననిర్ణయము చేయఁదగినది. ఇందులకు "పృచ్ఛా లగ్ననవాంశస్య మోరాశి స్సంఖ్యయాసమః, తస్మిన్ లగ్నగతే రాశౌ వక్తవ్యం జన్మ పృచ్ఛతః, యావత్సంఖ్యా గతే లగ్నా ద్ద్రేక్కాణే దినకృత్తతః, కావత్సంఖ్యా గతే రాశౌ ప్రష్టుర్జన్మ వినిర్దిశేత్." అని పరాశర ఋనిచేఁ జెప్పఁబడినది.

జన్మాదిశేల్లగ్నగతే నవీర్యే
ఛాయాంగుళఘ్నోర్కహతే వశిష్టమ్,
ఆసీన సుప్తోత్థిత తిష్ఠతాంభం
జాయా సుఖో జ్ఞోదయగం ప్రదిష్టమ్. 8

తా. ప్రకారాంతముగ లగ్నమును దెచ్చెడు క్రమము చెప్పఁ ఁడినది. ప్రశ్నలగ్నమం దున్నగ్రహము తాత్కాలిక గ్రహముగ నిర్ణ యించుకొని దానిని లిప్తలుచేసి "ఛాయాంగుళఘ్న" మ్మదు వగు హమియందు ద్వాదశాంగుళ శంకువులో దృష్టమగు తాత్కాలిక ాయాంగుళ సంఖ్యలచేత గ్రహలిప్తలను గుణించి పంద్రెండింటఁ బాలు ానఁగ మిగిలిన సంఖ్య యెన్నియగునో మేషాదిగ నన్నవరాశి జన్మ గ్న మని తెలియఁ దగినది. మఱియుఁ బృచ్ఛకుండు కూర్చుని ప్రశ్న ేసినచోఁ బ్రశ్నలగ్నమునకు సప్తమరాశి జన్మలగ్నమనియు, పరుండి ేసెనేని ప్రశ్నలగ్నమునకు నాల్గవరాశి జన్మలగ్నమనియు, నడుచుచు శ్నచేసినచో ప్రశ్నలగ్నమునకుఁ బదవరాశి జన్మలగ్న మనియు, ిలుచుకొని ప్రశ్న నడిగెనేని ప్రశ్నలగ్నమే జన్మ లగ్నమనియుఁ ెప్పఁదగినది. ఇందులకు "ఉత్థితతో విలగ్నా త్ప్రోష్ఠు స్సుప్తస్యబంధు గ్నాచ్చ, ఉపవిష్టస్యాస్తమయే వ్రజతో మేషూరణే జన్మ." అని ంథాంతరమునఁ జెప్పఁబడియున్నది.

గోసింహౌ జతుమాష్టమౌ క్రియతులే కన్యా మృగౌచ క్రమాత్
త్పంవర్గ్యా దశకాష్ట సప్త విషయై శ్శేషాస్స్వ సంఖ్యా గుణాః,

జీవారా స్ఫుజిద్బైందవాః ప్రథమవచ్ఛేషా గ్రహాః స్స్యాద్వ
ద్రాశీనాం నియతో విధి ర్గ్రహ యుతైః కార్యాచ తద్వర్గణా. 9

తా. ప్రశ్నకాలమందుఁ దాత్కాలిక లగ్నమును లిప్తలు గావించి చేయఁదగిన రాశిగుణకార గ్రహగుణకార క్రమము జెప్పఁబడినది. ఎట్లనఁగా వృషభ సింహములు పదింటను, మిథున వృశ్చికములు ఎనిమిదింటను, మేష తులలు ఏడింటను, కన్యా మకరములు అయిదింటను ఈక్రమముగ గుణింపఁ దగినది. తక్కినరాసులు తమ రాశి సంఖ్యచేత గుణింపఁదగినది. అదెట్లనఁగాఁ గర్కాటకము నాల్గింటను, ధనుస్సు తొమ్మిదింటను, కుంభము పదనొకొండింటను మీనము

| మే | వృ | మిథు | క | సిం | క | తు | వృశ్చి | ధ | మ | కుం | మీ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ౭ | ౧౦ | ౮ | ౪ | ౧౦ | ౫ | ౭ | ౮ | ౯ | ౫ | ౧౧ | ౧౨ |

పంద్రెండింటను ఈప్రకారముగ గుణింపఁదగినవి. రాసులకు గుణకార విధి నియతమైనది. గ్రహ గుణకారవిధి యెట్లనిన; గురు కుజ శుక్ర బుధులు మొట్టమొదటివలె దశకాష్టక సప్తక విషయసంఖ్యలచేత అనఁగా, ౧౦-౮-౭-౫ చేతఁ గ్రమముగ గుణింపఁ దగిన వారలగుదురు. తక్కిన గ్రహములగు రవి చంద్ర శనులు బుధునివలె నైదుచేత గుణింపఁదగిన వారలగుదురు. ప్రశ్నలగ్నము గ్రహయుక్తమై యుండెనేని

| ర | చ | కు | బు | గు | శు | శ |
|---|---|---|---|---|---|---|
| ౫ | ౫ | ౮ | ౫ | ౧౦ | ౭ | ౫ |

ఆగ్రహ గుణకారము చేయఁ దగినది. అనఁగాఁ బ్రశ్నలగ్నమును లిప్తలు చేసి యీ చెప్పఁబడిన క్రమమున రాశి గుణకారముచే గుణింపవలయు. నాప్రశ్న లగ్నమునం దొక గ్రహముండెనేని ఆగ్రహ గుణకారముచేత గుణింపవలయును. అనేక గ్రహములుండెనేని అన్నిగ్రహముల గుణకారములచేత గుణింప వలయునని తెలియఁ దగినది.

సప్తాహతం త్రిఘనభాజిత శేషమృక్షం
దత్వాథవా నవవిశోధ్య నవాథవాస్మాత్,
ఏవం కళత్ర సహజాత్మజ శత్రుభేభ్యః
ప్రష్టు ర్వదే దుదయరాశి వశేన తేషామ్. 10

నక్షత్ర మెఱుంగు తెఱంగు సెప్పఁబడినది. పూర్వోక్త ప్రకారముగ రాశి గుణకార గ్రహ గుణకారములచేత గుణింపఁబడినట్టి లగ్న లిప్తలను ఏడింట గుణించి ఆసంఖ్యయందుఁ దొమ్మిదికూడికైనను లేకతొమ్మిది వుచ్చికైనను కూడుటను త్రోయుటను లేకయైనను అనఁగా ప్రశ్న లగ్నము చరరాశియగునేని ఆయేడింట గుణించిన సంఖ్యలోఁ దొమ్మిది గూడవలయును. స్థిరరాశియగునేని కూడనక్కఱలేదు. త్రోయనక్కఱ లేదు. ద్విస్వభావరాశియగునేని తొమ్మిదిత్రోయవలయును. ఇదికొందఱి మతము. చింతామణి వ్యాఖ్యానకారకుండగు భట్టోత్పలుని మతమెట్లనిన; ప్రశ్నలగ్నమందుఁ బ్రథమద్రేక్కాణోదయమగునేనిసప్తాహతమగు సంఖ్యతోఁ దొమ్మిది కూడవలయును. ద్వితీయ ద్రేక్కాణోదయమగు నేని కూడుట త్రోయుట పనిలేదు. తృతీయ ద్రేక్కాణోదయ మగునేని తొమ్మిది త్రోయవలయును. ఇట్లు నవకదాన విశోధనములు చేసి త్రిఘ్నవ ౨౭ట పాలుగొన్న శేషము. అశ్విన్యాదిగాఁ బృచ్ఛకుని నక్షత్ర మగునని చెప్పవలయు. ఈప్రకారముగా భార్యా భ్రాతృ పుత్ర శత్రు విషయమై నష్టజాతక ప్రశ్నచేసె నేని తద్భావముల వలన వారలకుఁ బృచ్ఛకుని యొక్క ప్రశ్న లగ్నవశముననే నక్షత్రమును చెప్పవలయును. అది యెట్లనిన పృచ్ఛకుడు తన పెండ్లము నక్షత్ర మడిగెనేని ప్రశ్నలగ్నమందు ౭ రాసులు గూర్చి లిప్తలు చేసి లగ్నరాశి గుణకముచేత గుణించి లగ్నమందు గ్రహముండెనేని గ్రహ గుణకముచేత గుణించి పిమ్మట ౭ తో గుణించి మొదటివలెనే నవక దానము గాని నవక విశోధనముగాని చేయవలసి యున్నయెడల చేసి ౨౭ట పాలు గొనగా ఎన్ని మిగులునో అశ్విన్యాదిగా అన్నవ నక్షత్రము పృచ్ఛకుని భార్య జన్మనక్షత్ర మని చెప్పఁ దగినది. తోడఁబుట్టినవాని విషయమై నష్టజాతక ప్రశ్నచేసెనేని ప్రశ్నలగ్నమునందు ౩ రాసులు గూర్చి లిప్తలుచేసి పూర్వోక్త ప్రకారముగాచేసి తోడఁబుట్టిన వాని నక్షత్రమును చెప్పవలయును. పుత్రుని విషయమై యీప్రశ్నచేసెనేని ప్రశ్నలగ్నమునందు ౫ రాసులు గూర్చి లిప్తలుచేసి పూర్వోక్త ప్రకారముగాఁ బుత్రనక్షత్రమును చెప్పవలయును. శత్రు విషయమై యీప్రశ్నచేసెనేని ప్రశ్న లగ్నమునందు ౬ రాసులు గూర్చి లిప్తలుచేసి పూర్వోక్త ప్రకారముగాఁ బగవాని నక్షత్ర

మును జెప్పవలయును. ఇక్కడ కళత్రాదులను జెప్పుట ఉపలక్షణార్థము గనుక మిత్రుని విషయమై ప్రశ్న చేసెనేని ప్రశ్నలగ్నమందు 3 రాసులు గూర్చి పూర్వోక్త ప్రకారముగా స్నేహితుని నక్షత్రమును చెప్పవలయును. ఇట్లు నక్షత్రమునకు మాత్రమేగాక నష్ట జాతకము నంతయుఁ జెప్పవచ్చును.

వర్షర్తు మాస తిథయో ద్యునిశం హ్యుడూని
వేలోదయర్క్ష నవభాగ వికల్ప నాత్స్యుః,
భూ యమోటశాది గుణితాః స్వవికల్ప భక్తా
వర్షా దయో నవక దాన విశోధనాభ్యామ్. 11

తా. ప్రశ్నలగ్న లిప్తలను రాశిగ్రహ గుణకారానంతరమున మఱల ౧౦-౮-౭-౫ సంఖ్యలచేత గుణించి నవక దాన విశోధనలుచేసి తమ సంఖ్యలచేతఁ బాలుగొనఁగా శేషము సంవత్సరాదు లగును. అనఁగాఁ ప్రశ్నలగ్నమును లిప్తలుచేసి రాశి గుణకార గ్రహగుణకారములచేతఁ బూర్వోక్తప్రకారముగ గుణించి ఆసంఖ్యను నాల్గు తావులయం దుంచి అందు మొదట నున్నదాని ౧౦ ని రెండవచోట నున్నదాని ౮ని మూఁడవచోట నున్నదాని ౭ను నాల్గవచోట నున్నదాని ౫ను గుణించి నాల్గు నిధనము లగు సంఖ్యలయందును నవకదానము గాని నవకశోధనముగాని చేయ వలసి యున్నయెడ యట్లొనర్చి వక్ష్యమాణ ప్రకారముగా వర్షాది సంఖ్యలచేతఁ బాలుగొనఁగా వర్ష ఋతు మాసాదు లేర్పడును.

విజ్ఞేయా దశకే ష్వబ్దా ఋతు మాసా స్తథైవచ,
అష్టకే ష్వపి మాసార్ధం తిథయశ్చ తథాస్మృతాః. 12

తా. పూర్వోక్త ప్రకారముగ నాల్గుచోట్ల యందు నుంచినట్టి సంఖ్యలలోఁ బదింట గుణించినట్టి సంఖ్యయందు నవక దానముగాని నవక విశోధనముగాని చేసినపిదప నాసంఖ్యను పరమాయుః ప్రమాణ వర్ష సంఖ్యయగు ౧౨౦ చేతఁ బాలుగొనఁగా శేషము పృచ్ఛకుని వర్తమాన వర్ష సంఖ్యయగును. కొంద ఱాసంఖ్యను వర్షసంఖ్యయగు ౬౦ట పాలు గొనఁగా నెన్ని మిగులునో ప్రభవ సంవత్సరాదిగా నన్నవ సంవత్సరము

...ని చెప్పవచ్చు నందురు. ఆపదింట గుణించినట్టి సంఖ్యనే ...మగు ౬ట పాలుగొనఁగా నెన్ని మిగులునో శిశిరాదిగా అ...వునందు జననమని చెప్పవలయును. ఆసంఖ్యను ఋతుమాస కల్పమగు ౨ ట పాలుగొనఁగా ౧మిగిలినేని ఆఋతువునందు మాసమనియు, శేషము లేకుండెనేని రెండవ మాసమనియు ...గ దశా సంఖ్యాగుణిత సంఖ్యనలన వర్ష ఋతు మాసములు ...ఁదగినవి. ఆవిధముగనే ౮ట గుణించి సంఖ్యయందు నవక దానముగాని నవక విశోధనముగాని చేసినపిదప నాసంఖ్యను పక్ష వికల్పమగు రెండింటఁ బాలుగొనఁగా ౧ మిగిలెనేని శుక్లపక్ష మనియు మిగత లేకుండెనేని కృష్ణపక్ష మని చెప్పఁదగినది. ఆయెనిమిదింట గుణించిన సంఖ్యను తిథివికల్పమగు ౧౫ట పాలుగొనఁగా నెన్ని మిగులునో అన్నవ తిథి యని చెప్పఁదగినది.

దివా రాత్రి ప్రసూతించ నక్షత్రా నయనం తథా,
సప్తకే ష్వపి వర్గేషు నిత్యమేవోప లక్షయేత్. 13

తా. అనఁగా నేడింట గుణింపఁబడిన నవక దానముగాని నవక విశోధనముగాని చేయఁబడినట్టి సంఖ్యను దివారాత్రి వికల్పమగు ౨ట భాగింపఁగా నొకటి శేషించెనేని పగలు జనన మనియు శేషము లేకుండెనేని రాత్రి జనన మనియుఁ జెప్పఁదగినది. ఆప్రకారము ఏడింట గుణించిన సంఖ్యను నవకదాన విశోధ నానంతరమునందు నక్షత్ర వికల్పమగు ౨౭ట భాగింపఁగా నెన్ని మిగులునో అశ్విన్యాది అన్నవ నక్షత్రమునందు జనన మని చెప్పఁదగినది.

వేలా మథ విలగ్నంచ హోరా మంశక మేవచ,
పంచకేషు విజానీయా న్నష్టజాతక సిద్ధయే. 14

తా. అనఁగా అయిదింట గుణించిన సంఖ్యయందు నవక దాన విశోధనములుచేసి ఆసంఖ్యను వేలాం—పదినమునందుఁ బగలుజననమని యేర్పడునో ఆదిన ప్రమాణ ఘటికలచేతఁ బాలుగొనఁగా నెన్ని మిగులునో అన్ని గడియలకు జనన మనిచెప్పఁదగినది. రాత్రి జననమని యేర్పడెనేని రాత్రిప్రమాణముచేతఁ బాలుగొనఁగా నెన్ని మిగులునో అన్ని

గడియలకు రాత్రి జనన మని చెప్పఁదగినది. ఆసంఖ్యను రాశివికల గు ౧౨ ట పాల్గొనఁగా నెన్నిమిగులునో మేషాదిగా నన్నవ రాశి లగ్న మగునని చెప్పఁదగినది. హోరా ద్రేక్కాణ నవాంశ ద్వాదశలను తాత్కాలిక గ్రహములును ఈచెప్పఁబడిన విధానముచేత యించి దశాంత ర్దశాష్టక వర్గాది ఫల నిర్దేశము చేయఁ దగినది.

సంస్కార నామమాత్రా ద్విగుణా శ్ఛాయాంగుళై స్సమాయుక్తా
శేషం త్రినవక భక్తా న్నక్షత్రం తద్ధనిష్ఠాది.

తా. నక్షత్రము నెఱుంగు క్రమము ప్రకారాంతముగఁ జెప్పఁబడినది. అనఁగా మాతాపిత్రాదులచే విధ్యుక్త ప్రకారముగ నుంచఁబడిన నామధేయ మాత్రలను అనఁగా హల్లు అర్ధమాత్రకము అచ్చు ఏకమాత్రకము. ఈప్రకారముగా నానామాక్షరములు ఎన్ని మాత్రలగుచున్నవో ఆమాత్రలను పెట్టుకొని ఆసంఖ్యను రెండింట గుణించి తత్కాలమందు ద్వాదశాంగుళ శంకువులోఁ గనఁబడినట్టి ఛాయ గుళికములతోడంగూర్చి ౨౭-ట భాగింపఁగా శేష మెన్ని మిగులు ధనిష్ఠాదిగా నన్నవ నక్షత్రమందు జనన మని యెఱుంగ వలయును.

ద్వి త్రి చతుర్దశ దశ తిథి సప్త త్రిగుణా నవాష్ట చైంద్రాద్యాః,
పంచ దశఘ్నా స్త ద్దిఙ్ముఖా న్వితం భం ధనిష్ఠాది.

తా. అనఁగాఁ బృచ్ఛకుఁడు పూర్వాభిముఖుఁడై యడిగెనేని రెండును, ఆగ్నేయాభి ముఖుఁడై యడిగెనేని మూఁడును, దక్షిణాముఖుఁడై యడిగెనేని పదునాల్గును, నిఋరుతి ముఖుఁడై యడిగెనేని పదియును, పశ్చిమాభి ముఖుఁడై యడిగెనేని ౧౫ ను, వాయవ్యాముఖుఁడై యడిగెనేని ౨౧ ను, ఉత్తరాభి ముఖుఁడై యడిగెనేని తొమ్మిదియును, ఈశాన్య ముఖుఁడై యడిగెనేని యెనిమిదియును ఈ విధముగఁ దూర్పు మొదలగు దిక్కులలో నేదిఙ్ముఖుఁడై ప్రశ్నచేయును ఆదిక్కునకుఁ జెప్పిన సంఖ్యను పెట్టుకొని ౧౫ ట గుణించి పృచ్ఛకుఁడు ఏదిఙ్ముఖుఁడై ప్రశ్న యడుగునో వాఁడుగాక ఆదిఙ్ముఖులై యెంఱుందురో అన్ని సంఖ్యలు మొదట ౧౫ ట గుణించిన సంఖ్యతో

గూడి యిరువదేడింట పాల్గొనఁగా నెన్నిమిగులునో ధనిష్ఠమొదలు కొని యన్నవ నక్షత్రమందు జనన మని చెప్పఁ దగినది.

ఇతి నష్టజాతక మిదం బహుప్రకారం మయావినిర్దిష్టం,
గ్రాహ్య మత స్సచ్ఛిష్యైః పరీక్ష్య యత్నా ద్యథాభవతి. 17

తా. ఇవ్విధమున వరాహమిహిరాచార్యుఁ డనెడు నాచేత నీ నష్టజాతకము అనేక విధములైన పరాశర వసిష్ఠాది ప్రోక్త శాస్త్రములను బర్యాలోచించి యనేక ప్రకారము లగునట్టుగఁ జెప్పఁబడెను. ఈకారణము వలన బుద్ధిమంతు లగుశిష్యులచేతఁ బ్రయత్నము వలనఁ బరీక్షించి యేపరికారముగ ననుభవమునకు వచ్చునో యాపరికారముగ గ్రహింపఁ దగినది.

ఇట్లు బృహజ్జాతకమునందు నిరువదినాల్గవ అధ్యాయ మగు
నష్టజాతకాధ్యాయము సంపూర్ణము.

---

## ద్రే క్కా ణా ధ్యా య ము.

---

కట్యాం సిత వస్త్ర వేష్టితః కృష్ణ శ్శక్త ఇవాభి రక్షితుం,
రౌద్రః పరశుం సముద్యతం ధత్తే రక్త విలోచనః పుమాన్.

తా. అనఁగా నీద్రేక్కాణము మొలయందుఁ దెల్లని వస్త్రి కట్టుకున్నవాఁడును నీల వర్ణుండును ఎదురుగ నుండి రక్షించుటకు ; ర్థుఁడువలె నుండువాఁడును, భయంకరుండును, ఎఱ్ఱని కన్నులుగల డునునైన పురుషుడనఁగాఁ బురుషస్వరూపంబైయె త్తఁబడినట్టి గ గొడ్డలిని ధరించుచుండును. ఇది ఆయుధ సహితమై కుజనక్తమగు ష ద్రేక్కాణము. మేషప్రథమ ద్రేక్కాణస్వరూపము.

రక్తాంబరాభూషణ భక్ష్య చిన్తా కుంభాకృతి ర్వాజిముఖీ తృష
ఏకేన పాదేనచ మేషమధ్యే ద్రేక్కాణ రూపం యవనోపదిష్టః

తా. మేష ద్వితీయ ద్రేక్కాణ స్వరూపం బెట్లనఁగా రఁ గట్టుకొని నదియు, అలంకారము నందును భక్ష్యములయ

మనస్సు గలదియును, ఘటోదరియును, గుఱ్ఱపు ముఖమువంటి ముఖము గలదియు, దప్పిచేతఁ బీడింపఁ బడినదియు, ఒకపాదముతోఁ గూడినది యును, స్త్రీరూపము గలదియును, మేషమధ్యమందున్న ద్రేక్కాణ స్వరూపంబని యవనేశ్వరాదులచేఁ జెప్పఁబడినది. ఇది చతుష్పాదో న్ముఖ ద్రేక్కాణము గనుక చతుష్పద ద్రేక్కాణమని వ్యాఖ్యానము చేసి యున్నారు. కాఁబట్టి చతుష్పదమును, అర్క నక్షంబును మృగ ముఖంబును నైన స్త్రీ ద్రేక్కాణము. ఇది మేష ద్వితీయ ద్రేక్కాణ స్వరూపము.

క్రూరః కలాజ్ఞః కపిలః క్రియార్థీ భగ్నవ్రతో భ్యుద్యత దండహస్తః,
రక్తాని వస్త్రాణి బిభర్తి చండో మేషే తృతీయః కథిత స్త్రిభాగః.3

తా. మేష తృతీయ ద్రేక్కాణ స్వరూపం బెట్లనిన—మేష రాశియందు మూఁడవ ద్రేక్కాణము విషమ స్వభావుండును, చతు ర్కలాభిజ్ఞుండును, పింగళ వర్ణుండును, కావ్యములయందు నాసక్తి వాఁడును, భగ్నమైన నియమము గలవాఁడును, ఎదురుగ నెత్తఁబ దండహస్తముగలవాఁడును, అధిక కోపమునుగలపురుషుఁడై యెఱ్ఱ వస్త్రములను ధరించుచుండును. ఈ ప్రకారముగ సాయుధమై బృహస్పతి నక్షత్రమగు పురుష ద్రేక్కాణము.

కుంచిత లూనకచా ఘటదేహా దగ్ధపటా తృషితాశన చిత్తా,
ఆభరణా న్యపివాంఛతి నారీ రూపమిదం వృషభే ప్రథమస్య. 4

తా. వృషభ ద్రేక్కాణ స్వరూపం బెట్లనిన—ముడుచుకొని తెగిన వెండ్రుకలు గలదియు, కుండవంటి కడుపు గలదియు, దప్పిగొని నదియు, భోజనమునందు నాశ గల మనస్సు కలదియు, స్త్రీరూపము గలదియు, భూషణములు కోరుచుండు నదియును నగును. ఇది వృషభ ప్రథమ ద్రేక్కాణ స్వరూపము. అగ్నిసహితంబై శుక్రనక్షత్రమైన స్త్రీ ద్రేక్కాణము.

క్షేత్ర ధాన్య గృహ ధేను కలాజ్ఞో లాంగలే సశకటే కుశలశ్చ,
స్కంధముద్వహతి గోపతి తుల్యం క్షుత్సరోజ వదనో మలవాసాః.5

తా. వృషభ ద్వితీయ ద్రేక్కాణ స్వరూపం బెట్లనఁగా—
రిమళ్లను, ధాన్యములును, ఇండ్లును, ఆవులును, గీతవాద్యాది చతుష్ష
కళలను, వీని నెఱింగినవాఁడును, బండితోఁగూడిన నాగేటియందు
మార్థుండును, ఆఁకలి గలవాఁడును, మేకవంటి ముఖము గలవాఁడును,
మలిన వస్త్రమునందుఁ బ్రియమైనవాఁడును, వృషభ స్కంధ సమాన
మగుమూపుతో నుండును. ఇది చతుష్పదమును బుధసక్తమును నైన
పురుష ద్రేక్కాణము.

ద్విప సమకాయః పాండుర దంష్ట్రః
శరభ సమాంఘ్రిః పింగళమూర్తిః,
అజమృగలోభ వ్యాకుల చిత్తో
వృషభ వనస్యాంత గతోయమ్. 6

తా. వృషభ తృతీయ ద్రేక్కాణ స్వరూపం బెట్లనిన; గజ శరీ
రము వంటి గొప్పశరీరము గలవాఁడును తెల్లకోరలు గలవాఁడును శర
భ మృగపాదములవలె గొప్పలైన పాదములు గలవాఁడును, కపిల వర్ణ
శరీరము గలవాఁడును, మేఁకలు అరణ్య మృగములు వీనివలె వ్యాకు
లంబగు మనస్సు గలవాఁడును, కొందఱు అళిమృగ లోమా అని పఠిం
చి తుమ్మెదవలె నల్లనై మృగములయొక్క రోమములవంటి రోమములు
గలవాఁడని వచించుదురు. వ్యాకులచిత్తుండనియుం జెప్పుదురు. ఇట్టి
పురుషుఁడం వృషభ రాశి తృతీయ ద్రేక్కాణము. ఇది చతుష్పదమును
శని యుక్తంబును నైన పురుష ద్రేక్కాణము.

సూచ్యాశ్రయం సమభివాంఛతి కర్మనారీ
రూపాన్వితా భరణకార్య కృతాదరాచ,
హీన ప్రజోచ్ఛ్రిత భుజర్తుమతీ త్రిభాగ
మాద్యం తృతీయ భువనస్యవదంతి తజ్జ్ఞాః. 7

తా. మిథున ప్రథమ ద్రేక్కాణ స్వరూపంబెట్టిదనిన; సౌందర్య
ముతురాలును, భూషణ క్రియలయందు నభిలాష గలదియును, సంతా
నహీనురాలును, నూర్ధ్వ భుజంబులు గలదియును, రజస్వలయును, మఱి
యు "నుచ్ఛ్రిత భుజాతు సతీ" అను పాఠమునందుఁ బతివ్రతయునైనట్టి

స్త్రీస్వరూపంబై సూది నాశ్రయించిన కుట్టుపనిని కోరుచుండు :
నర్థము. ఈప్రకారముగఁ బండితులు మిథున రాశి మొదటిదై
క్కాణమును జెప్పుదురు. ఇది బుధసక్తమైన స్త్రీద్రేక్కాణము.

ఉద్యాన సంస్థః కవచీ ధనుష్మాన్ శూరోస్త్రధారీ గరుడాననః
క్రీడాత్మజాలంకరణార్థ చింతాం కరోతి మధ్యే మిథునస్య

తా. మిథునరాశి మధ్య ద్రేక్కాణ ముద్యాన వనమున
డువాఁడును కవచము గలవాఁడును విల్లుగలవాఁడును యుద్ధ
దును అస్త్రములను ధరించిన వాఁడును గరుడ ముఖము గలవా
పురుష స్వరూపమై రతి పుత్ర భూషణ ధన విషయముల యం
చారమును ఆయుధ సహితమును నైన ఖద్రేక్కాణము=అనఁ
థున ద్వితీయ ద్రేక్కాణము.

భూషితో వరుణవ ద్బహురత్నో బద్ధతూణ కవచ స్సధనుః
నృత్త వాదిత కలాసుచ విద్వాన్ కావ్యకృన్మిథున రాశ్య :

తా. మిథున తృతీయ ద్రేక్కాణము అలంకరింపఁ బ
డును సముద్రునివలె అనేక మణులు గలవాఁడును కట్టఁబడిన అ
పొదియు మైజోడుం గలవాఁడును విల్లుతోఁ గూడినవాఁడును
వాద్యములయందును జతు ష్షష్టి కళలయందును ఎఱుక గలవా
కవిత్వ మొనర్చువాఁడును నైన పురుషుఁడై ఆయుధ సహితము
సంయుక్తమును నైన పురుష ద్రేక్కాణము.

పత్రమూల ఫల భృ ద్ద్విప కాయః
కాననే మలయగ శ్శరభాంఘ్రిః,
క్రోడ తుల్య వదనో హయ కంఠః
కర్కటే ప్రథమ రూప ముశంతి.

తా. ఆఁకులును గడ్డలును పండ్లను భరించువాఁడును గజ
న శరీరుండును అడవియందుఁ జందన వృక్షము నొందినవాఁడు
భ మృగపాదములవంటి పాదములు గలవాఁడును పంది మొగవ
మొగము గలవాఁడును గుఱ్ఱపు మెడవంటి మెడగల వాఁడునునై
షుండు ఇవ్విధమునఁ గర్కాటక రాశి ప్రథమద్రేక్కాణ స్వరూ

చెప్పుదురు. ఇది చతుష్పదమును చంద్రసక్తమును నైన నరద్రేక్కాణము.

పద్మార్చితా మూర్ధని భోగి యుక్తా
స్త్రీ కర్కశారణ్య గతా విరౌతి,
శాఖాం పలాశస్య సమాశ్రితా చ
మధ్యేస్థితా కర్కటకస్య రాశేః. 1.

తా. కర్కాటకరాశీ మధ్యమునందు నున్న ద్రేక్కాణము శిరస్సునందుఁ గమలములచేతఁ బూజింపఁబడి నట్టిదియు, సర్పములతోఁ గూడినదియు, కఠినురాలైనట్టి స్త్రీయైనదై విజన మగు నడవిం బోఁదినదై మోదుగచెట్టు కొమ్మను ఆశ్రయించినదై అరచుచుండును. ఇది భౌమసక్త మగు స్త్రీద్రేక్కాణము.

భార్యాభరణార్థ మర్ణవేనా స్థోగచ్ఛతి సర్పవేష్టితః,
హైమైశ్చ యుతో విభూషణై శ్చిపిటాస్యోంత్యగతశ్చ కర్కటే.

తా. కర్కాటక తృతీయ ద్రేక్కాణము సర్పములచేతఁ జుట్టఁబడినట్టియు, కనక నిర్మితములగు నాభరణములతోఁడఁ గూడుకొనినట్టియు అడుగులు నోటగల్గినట్టి పురుషుఁడై భార్యకొఱకు భూషణాలకు సముద్రమునందు నోడనెక్కినవాఁడై పోవుచుండును. ఇది సర్పసహిత గురుసక్త మగు నరద్రేక్కాణము.

శాల్మలే రుపరి గృధ్ర జంబుకౌ
శ్వానరశ్చ మలినాంబ రాన్వితః,
రౌతి మాతృపితృవిప్రయోజిత
స్సింహ రూప మిదమాద్య ముచ్యతే. 13

తా. బూరుగచెట్టు మీఁద గృధ్ర జంబుకములై యుండువాఁడును, కుక్కయు మలినవస్త్ర యుతుండును తలిదండ్రులచేత విడువఁబడినవాఁడును అరచుచుండుసింహద్రేక్కాణ స్వరూపమని చెప్పఁబడును. ఇది నరరూపంబును చతుష్పదమును అర్కసక్తమును నైన పక్షి ద్రేక్కాణము.

హయాకృతిః పాండుర మాల శేఖరో
బిభర్తి కృష్ణాజిన కంబళం నరః,
దురాసద స్సింహ ఇవాత్త కార్ముకో
నతాగ్ర నాసో మృగరాజ మధ్యమః. 14

తా. అశ్వాకారుండును తెల్లని పూలదండలు తలయందు దాల్చుకున్న వాఁడును సింహమువలె దుస్సాధ్యుండును ధనుర్ధరుండును వంగిన కొనముక్కు గలవాఁడును అయిన మనుష్యుఁడై కృష్ణాజిన కంబళములను ధరించుచుండును. ఇది ఆయుధ సహితమును గురుసక్తమును నైన నరద్రేక్కాణము.

ఋక్షాననో వానర తుల్యచేష్టో
భిభర్తి దండం ఫల మామిషంచ,
కూర్చీ మనుష్యః కుటిలైశ్చ కేశై
ర్మృగేశ్వర స్యాంత్య గతస్త్రిభాగః. 15

తా. భల్లూక ముఖుండును, వానరముతో సమానమగుచేష్టలు గలవాఁడును, నిడుపైన గడ్డమును మీఁసములును గలవాఁడును, వంకరవెండ్రుకలు గలవాఁడును అయినమనుష్యుఁడు ఆయుధంబును పండును మాంసమును ధరించుచుండును. ఇది చతుష్పదమును ఆయుధ సహితమును భౌమ సక్తమును నైన నరద్రేక్కాణము.

పుష్ప ప్రపూర్ణేన ఘటేన కన్యా
మలప్రదిగ్ధాంబర సంవృతాంగీ,
వస్త్రార్థ సంయోగ మభీప్స మానా
గురోః కులం వాంఛతి కన్యకాద్యః. 16

తా. పుష్పములచే నింపఁబడిన కడవతోఁ గూడుకొనినదియు మలినవస్త్రము గట్టుకొనినదియు, వస్త్ర ధనసంప్రాప్తిం గోరుచున్నదియు, కన్యకయునై గురు గృహమును కోరుచుండును. ఇది బుధసక్తమగు స్త్రీద్రేక్కాణము.

పురుషః ప్రగృహీత లేఖనిశ్శ్యామో వస్త్ర శిరా వ్యయాయకృత్
విపులంచ బిభర్తి కార్ముకం రోమవ్యాప్త తనుశ్చ మధ్యమః. 17

తా. అక్షరములు వ్రాయు లేఖనిగలవాఁడును, శ్యామల వర్ణం ను, వస్త్రయుక్త శిరముగలవాఁడును, ఆదాయ వ్యయముల గణించు ాఁడును, రోమములచే వ్యాపింపఁబడిన శరీరము గలవాఁడును, పొడ గువిల్లును ధరించినవాఁడును అయియుండెను. ఇది ఆయుధ సహిత ధిన క్త పురుషద్రేక్కాణము.

గౌరీ సుధౌతాగ్ర దుకూల గుప్తా
సముచ్ఛ్రితా కుంభకటచ్ఛు హస్తా,
దేవాలయం స్త్రీప్రయతా ప్రవృత్తా
వదంతి కన్యాంత్యగత స్త్రిభాగః. 18

తా. గౌరవర్ణము గలదియు నిర్మలమగు కొంగుగల పట్టుచీర తేఁ గప్పఁబడినదియు మిక్కిలిపొడవగు కడవయు గరిటయు హస్తము ందుఁ గలదియు నియతురాలై దేవాలయమును గూర్చి పోవుచున్నట్టి యు నైనస్త్రీయని మునులు చెప్పుదురు. ఇది శుక్రస క్తమైన స్త్రీద్రే క్కాణము.

వీథ్యంత రాపణగతః పురుషస్తు లావా
నున్మానమాన కుశలః ప్రతిమాన హస్తః,
భాండం విచింతయతి తస్యచమూల్య మేత
ద్రూపం వదంతి యవనాః ప్రథమం తులాయాః. 19

తా. వీథి నడియంగడియం దుండువాఁడును, త్రాసుగలవాఁ ను, త్రాసు మొదలగువాని యందును కొలుచు ఘానికలయందును ర్పుగలవాఁడును, స్వర్ణాదిద్రవ్య పరీక్షసేయు సాధకము హస్తము ందుఁ గలవాఁడును, పురుషుఁడై మూలధనమును, ఆమూలధనము కుఁ గొనఁదగిన వస్తు క్రయమును చింతించుచుండువాఁడును అగును. ట్లు తులారాశిప్రథమ ద్రేక్కాణరూపమని యవనులు చెప్పెదరు. ఇది ్రక సహిత నరద్రేక్కాణము.

కలశం పరిగృహ్య వినిష్పతితం సమభీప్సతి గృధ్రముఖః పురుషః,
క్షుధితః తృషితశ్చ కళత్రసుతా స్మనసైన తులా ధరమధ్యగతః.20

తా. అనఁగా గృధ్రిముఖము గలపురుషుఁడై క్రిందపడిన క వను పట్టుకొని ఆఁకలిగొనినవాఁడును దప్పిగొనినవాఁడునై ఆలుక లను మనస్సుచేతఁ గోరుచుండును. ఇది నరరూపమును శనిస్వక్షేత్రము నైన పక్షి ద్రేక్కాణము.

విభీషయన్ తిష్ఠతి రత్నచిత్రితో
వనేమృగాన్ కాంచన తూణ వర్మభృత్,
ఫలామిషం వానర రూప భృన్నర
స్తులావసానే యవనై రుదాహృతః.

తా. రత్నములచేత నలంకరింపఁబడినవాఁడును బంగారు టం పొదిని బంగరు మైజోడును ఫలమాంసములను కోతి రూపమును ధ చిన వాఁడును ధనుర్ధరుండును కిన్నరరూపమును ధరించినవాఁడ "కిన్నర రూపభృత్" అనుపాఠాంతరముచేఁ జెప్పుదురు. అడవియం మృగములను బెదరించుచు నుండు పురుషుఁ డైనట్టివాఁడును ఇ పురాణ యవనాదులచేతఁ దులాంత్య ద్రేక్కాణము చెప్పఁబడెన ఇది వానరరూప చతుష్పదమును బుధస్వక్షేత్రమును నగు ద్రేక్కాణమ

వస్త్రైర్విహీ నాభరణైశ్చ నారీ
మహా సముద్రా త్సముపైతి కూలమ్,
స్థానచ్యుతా సర్ప నిబద్ధ పాదా
మనోరమా వృశ్చికరాశి పూర్వః.

తా. వస్త్రములచేతను భూషణములచేతను విడువఁబడినట్టి స్థా భ్రంశురాలును, పాములచేఁ గట్టఁబడిన కాళ్లు గలదియు, సౌందర్య తియు నైన స్త్రీయైనదై అపారమగు సముద్రమున నుండి దరింగూ వచ్చుచుండును. ఇది సర్పయుక్తమును కుజ స్వక్షేత్రమును నైన ద్రేక్కా ణము.

స్థాన సుఖా న్యభివాంఛతి నారీ భర్తృకృతే భుజగావృత దేహా,
కచ్ఛప కుంభ సమాన శరీరా వృశ్చిక మధ్యమ రూప ముశంతి

తా. పాములచేఁ జుట్టఁబడిన శరీరముగలదై తాఁబేటితోడను డవతోడను సమానమైన శరీరముగల్గిన స్త్రీయైనదై పెనిమిటికొఱ

స్థాన సుఖములం గోరుచుండును. ఇది వృశ్చిక ద్వితీయ ద్రేక్కాణ స్వరూపము. సర్పయుక్త గురుసక్త స్త్రీద్రేక్కాణము.

పృథుల చిపిట కూర్మ తుల్యవక్త్రః
శ్వమృగ వరాహ సృగాల భీతికారీ,
అవతిచ మలయాకర ప్రదేశం
మృగపతి రంత్య గతశ్చ వృశ్చికస్య. 24

తా. విస్తీర్ణమై చెమ్మటలతోఁ గూడి కచ్ఛపాకారమగు ముఖము గల్గినట్టియు, కుక్క, లేడి, పంది, నక్క, వీనికి భయమును జేయుచున్నట్టియు సింహమైనదై శ్రీగంధ వృక్ష జన్మస్థానమును రక్షించు చుండును. ఇది కూర్మ ముఖమును చతుష్పదమును చంద్రసక్తమును సింహాకారమును నైన పుంద్రేక్కాణము.

మనుష్య వక్త్రోశ్వ సమాన కాయో
ధను ర్విగృహ్యాయత మాశ్రమస్థః,
క్రతూపయో జ్యాని తపస్వి నశ్చ
రరక్ష పూర్వో ధనుష స్త్రిభాగః. 25

తా. పురుష ముఖుండును అశ్వ తుల్య శరీరుండును నైన పురుషుండై దీర్ఘమయిన విల్లును పట్టుకొని తపోవనము నందుండువాఁడై యజ్ఞోపకరణములగు స్రుక్స్రువాదులను ధరించి, తాపసులను రక్షించును. ఇది శ్వశరీర చతుష్పదగురుసక్తధనుఃప్రథమ పురుష ద్రేక్కాణము.

మనోరమా చంపక హేమ వర్ణా భద్రాసనే తిష్ఠతి మధ్యరూపా,
సముద్ర రత్నాని విఘట్టయంతీ మధ్య త్రిభాగో ధనుషః ప్రదిష్టః.

తా. చిత్తాహ్లాదకారిణియు సంపెగ పూవువంటి బంగరువంటి కాంతిగల్గినదియు హీనముగాక సౌందర్యము గల్గినట్టిదియు నై స్త్రీయై నదై సముద్రములోని మణుల నొరిపిడిపెట్టుచు సింహాసనమునందుఁ గూర్చుండును. కొందఱు "రత్నాని విభూషయంతీ" అనిపఠించి రత్నముల నలంకరించుకున్నదని చెప్పుదురు. ఇట్లు మునులచేఁ జెప్పఁబడెను. ఇది కుజసక్త మగు స్త్రీద్రేక్కాణము.

కూర్చ్చీనరో హాటక చంపకాభో వరాసనే దండధరో నిషణ్ణః,
కౌశేయ కాన్యు ద్వహతేజినంచ తృతీయ రూపం నవమస్య రాశేః

తా. పెంచిన గడ్డము మీసలు గలవాఁడును, స్వర్ణకాంతియు చంపక పుష్పకాంతియుం గలవాఁడును, ప్రధానమగు సింహాసనమునందుఁ గూర్చున్నవాఁడును, దండాయుధమును పట్టు వస్త్రములున్న మృగచర్మమును ధరించుకొని యుండు పురుషుఁడై యుండును. ఇది ఆయుధసహితమును అర్క సక్తమును నైన నర ద్రేక్కాణము.

రోమ చితో మకరోపమ దంష్ట్రః సూకర కాయ సమాన శరీరః,
యోక్త్రిక జాలక బంధన ధారీ రౌద్ర ముఖో మకర ప్రథమస్తు. 2(

తా. అధిక మగురోమములతో నిండిన శరీరముగలవాఁడును, మొసలివంటి రూపమును కోరలును గలవాఁడును, పందివంటి దేహము గలవాఁడును, ఎద్దులు కట్టెడు త్రాళ్లును, వల, బంధనములు, వీనిని ధరించినవాఁడును నగును. ఇది నిగళ సహితమును శనిసక్తమును నగు పురుష ద్రేక్కాణచతుష్పదము.

కలా స్వభిజ్ఞాబ్జదళాయ తాక్షీ శ్యామా విచిత్రాణిచ మార్గమాణా,
విభూష ణాలంకృత లోహ కర్ణా యోషాప్రదిష్టా మకరస్య మధ్యే.

తా. గీతవాద్యాదులయందు నేర్పుగలిగి తామర రేకులవంటి వెడల్పగు కన్నులుగలిగి శ్యామల వర్ణమయి నానావిధము లగు చిత్ర వస్తువులను వెదకుచున్నట్టియు లోహ భూషణాదులచే నలంకరింపఁబడిన చెవులు గల్గినట్టియు స్త్రీయని శుక్ర సక్త స్త్రీద్రేక్కాణము చెప్పఁబడెను.

కిన్నరోపమ తను స్సకంబళ స్తూణ చాప కవచై స్సమన్వితః,
కుంభ ముద్వహతి రత్న చిత్రితం స్కంధగం మకరరాశి పశ్చిమః.

తా. కిన్నరు లనఁగాఁ గొంద అశ్వముఖులును పురుషాకారులును నైన దేవయోని విశేషులు. వారితో సమాన మగుశరీరము గలవాఁడును కంబళయుతుండును అంబులపొది విల్లు మైజోడులతోఁ గూడినవాఁడు నైన పురుషుఁడై రత్న ఖచితమై భుజము మీఁదనున్న ఘట

నను భరించువాఁ డగును. ఇది ఆయుధ సహితమై బుధసక్తమైన పు
ష ద్రేక్కాణము.

స్నేహమద్య జలభోజ నాగమ వ్యాకులీకృత మనా స్సకంబళః,
క్షౌమ కార వసనోజి నాన్వితో గృధ్రతుల్య వదనో ఘటాదిగః. 31

తా. ఘృత తైలాదులు మద్యము ఉదకము భోజనము వీని
నాగమ ప్రాప్తిచేతఁ గలఁతఁబెట్టఁబడిన మనస్సు గలవాఁడును కంబ
యుతుండును కౌశేయ వస్త్రముగలవాఁడును కృష్ణాజినముతోఁ
డినవాఁడును గృధ్రముఖమువంటి ముఖము గలవాఁడును పురు
డు నైన శనిసక్త పురుష ద్రేక్కాణముండును.

దగ్ధే శకటే సశాల్మలే లోహాన్యాహ రతేంగనావనే,
మలినేన పటేన సంవృతా భాండై ర్మూర్ధగ తైశ్చ మధ్యమః. 32

తా. అడవియందు మాసిన వలువచేతఁ జుట్టఁబడినట్టిదియు శిర
న భాండముతోడఁ గూడుకొనినట్టి స్త్రీయైనట్టిదియు కాలినట్టి
రుగచెట్లతోఁగూడినట్టి బండియందు లోహములను గ్రహించు
ండునదియు నగును. ఇది అగ్ని యుక్తమును బుధసక్తమును నైన
స్త్రీద్రేక్కాణము.

శ్యామ స్సరోమ శ్రవణః కిరీటీ
త్వక్పత్ర నిర్యాసఫలై ర్బిభర్తి,
భాండాని లోహ వ్యతి మిశ్రితాని
సంచార యత్యంత్యగతో ఘటస్య. 33

తా. కుంభరాశితృతీయద్రేక్కాణము శ్యామలవర్ణుండును, రో
ములతోఁగూడిన చెవులుగలవాఁడును, కిరీటముగలవాఁడును, పురుషుఁ
ను, చర్మము, ఆకులు, బంక, పండ్లు వీనితోఁగూడినవాఁడును, లోహ
మిశ్రితములైన భాండములను ధరించుచుండువాఁడును, ఆభాండము
ను ధరించి తిరుగువాఁడును, కొందఱు త్వక్పత్ర నిర్యాసఫలములను
రించుచుండునని చెప్పుదురు. ఇది శుక్రసహిత పురుష ద్రేక్కాణము.

స్రుగ్భాండముక్తామణిశంఖమిశ్రై
ర్వ్యాక్షిప్తహస్త స్సవిభూషణశ్చ,

భార్యావిభూషార్థ మపాం నిధానం
నావాప్లవత్యాదిగతో ఝషస్య. 34

తా. యజ్ఞోపకరణ పాత్రములును, ముత్యములును, రత్నములును, శంఖములును వీనితోఁ గలసిన వ్యగ్రహస్తుఁడును సొమ్ములతోఁ గూడినవాఁడును నైన పురుషుఁడై భార్యకు సొమ్ములకొఱకు సముద్రమునందు నోడచేతఁ బోవుచుండును. ఇది గురు సక్త పురుష ద్రేక్కాణము.

అత్యుచ్ఛ్రిత ధ్వజపతాక ముపైతి పోతం
కూలం ప్రయాతి జలధేః పరివార యుక్తా,
వర్ణేన చంపక ముపా ప్రమదా త్రిభాగో
మీనస్య చైష కథితో మునిభి ర్ద్వితీయః. 35

తా. అనఁగా సఖీజనులతోఁ గూడినట్టిదియు, చంపక పుష్ప కాంతి నపహసించు చున్నట్టి దేహకాంతి యుక్తయు, స్త్రీయును, అధికోన్నతములగు టెక్కెయములును వస్త్ర సహితము లగు టెక్కెములును గల్గిన యోడనెక్కినదియునగును. సముద్ర తీరములం గూర్చి పోవుచుండును. ఇది మునులచేతఁ జెప్పఁబడెను. ఇది చంద్ర సక్తమగు స్త్రీద్రేక్కాణము.

శ్వభ్రాంతికే సర్ప విచేష్టితాంగో
వస్త్రై ర్విహీనః పురుష స్త్వటవ్యామ్,
చోరానల వ్యాకులితాంత రాత్మా
విక్రోశ తేంత్యోపగతో ఝషస్య. 36

తా. అనఁగా "శ్వభ్రాంతికే" నేల బొఱియసమీపమునందుఁ బాములచేతఁ జుట్టఁబడినట్టి అవయవములు గలవాఁడును, దిగంబరుండును, అడవియందు దొంగలచేతను, అగ్నిచేతను వ్యాకులపడు మనస్సు గలవాఁడునునై, పురుషుఁడై యేడ్చుచుండును. ఇది సర్పయుక్తమును కుజ సక్తమును నైన పురుషద్రేక్కాణము. ఈద్రేక్కాణ స్వరూపమునకుఁ బ్రయోజనమేమనఁగ "ద్రేక్కాణ కార చేష్టాం గుణ సదృశ ఫలం యోజయేద్వృద్ధి హేతో ర్ద్రేక్కాణే సౌమ్యరూపే కుసుమ ఫలయుతే రత్న భాండాన్వితేచ, సౌమ్యై ర్దృష్టే జయస్స్యాత్ ప్రహ

రణ సదృశే పాపదృష్టేచ భంగః సమ్మోహో వాథ బంధ స్సభుజగ నిగడే పాప ముక్తే పిపాసుః." అని యాత్రా విషయమునందుఁ జెప్పఁబడి యున్నది. ఇదియునుంగాక ఛప్పన్న గ్రంథములయందు విశేష ముగ విశదీకరింపఁ బడినది. మఱియు, "అంశకాద్ జ్ఞాయతే ద్రవ్యం ద్రేక్కాణై స్తస్కరాః స్మృతాః, రాశిభ్యః కాల దిగ్దేశా శ్చవయో జాతిశ్చ లగ్నపాత్." అని షట్పంచాశిక యందుఁ జెప్పఁబడి యున్నది. గనుక చోర రూప స్థానాది పరిజ్ఞానమునకును వస్తు నిర్దేశమునకు సాధన భూతమై వఱలుచుండు నని తెలియఁ దగినది.

ఇట్లు బృహజ్జాతకమునందు నిరువదైదవ యధ్యాయ మగు
ద్రేక్కాణాధ్యాయము సంపూర్ణము.

---

## ఉ ప సం హా రా ధ్యా య ము

రాశి ప్రభేదో గ్రహయోని భేదో వియోని జన్మాథ నిషేక కాలః,
జన్మాథ సద్యోమరణం తథాయు ర్దశావిపా కోష్టక వర్గ సంజ్ఞః. 1

తా. అనఁగా, (౧) రాశిభేదాధ్యాయము, (౨) గ్రహయోని భేదాధ్యాయము, (3) వియోని జన్మాధ్యాయము, (౪) నిషేక కాలాధ్యాయము, (౫) జన్మాధ్యాయము, (౬) బాలారిష్టాధ్యాయము, (౭) ఆయుర్దాయాధ్యాయము, (౮) దశా విపాకాధ్యాయము, (౯) అష్టకవర్గాధ్యాయము.

కర్మాజీవో రాజయోగాః ఖయోగా
శ్చాంద్రా యోగా ద్విగ్రహా ద్యాశ్చయోగాః,
ప్రవ్రజ్యాథో రాశిశీలాని దృష్టి
ర్భావ స్తస్మా దాశ్రయోథ ప్రకీర్ణః. 2

తా. (౧౦) కర్మజీవాధ్యాయము, (౧౧) రాజయోగాధ్యాయము, (౧౨) ఖయోగాధ్యాయము లేక నాభస యోగాధ్యాయము, (౧3) చంద్రయోగాధ్యాయము, (౧౪) ద్విగ్రహ త్రిగ్రహ యోగాధ్యాయము, (౧౫) ప్రవ్రజ్యా యోగాధ్యాయము, (౧౬) రాశి శీలాధ్యాయము, (౧౭) దృష్టిఫలాధ్యాయము, (౧౮) భావ ఫలాధ్యాయము, (౧౯) ఆశ్రయాధ్యాయము, (౨౦) ప్రకీర్ణాధ్యాయము.

నేష్టా యోగా జాతకం కామినీనాం
నిర్యాణం స్యా న్నష్ట జన్మ దృకాణః,
అధ్యాయానాం వింశతిః పంచయుక్తా
జన్మన్యే తద్యా త్రికం చాభి ధాన్యే. 3

తా. (౨౧)అనిష్టయోగాధ్యాయము, (౨౨)స్త్రీజాతకాధ్యాయము, (౨౩)నిర్యాణాధ్యాయము, (౨౪)నష్టజాతకాధ్యాయము, (౨౫) ద్రేక్కాణాధ్యాయము. ఈప్రకారముగ జాతక విషయమై అయిదుతోఁ గూడినట్టి యధ్యాయము లిరువదియుం జెప్పఁబడెను. యాత్రా గ్రంథమునందుఁ జెప్పఁబడిన అధ్యాయ సంగ్రహమును జెప్పుచున్నాను. కొన్ని గ్రంథములయందు "అధ్యాయానాం వింశతిః పంచయుక్తా చత్వార్యుక్తాన్యత్రి వృత్తైశ్శతాని" అని యున్నయది. ఈపాఠ ప్రకారము భట్టోత్పలునిచే వ్యాఖ్యానము చేయఁబడలేదు కాఁబట్టి వ్యాఖ్యానానుసారముగా నర్థము వ్రాయఁబడినది. ఆయాత్రా గ్రంథోక్తాధ్యాయానుక్రమణిక యెట్లనఁగ.

ప్రశ్న స్తిథి ర్భం దివసః క్షణశ్చ
చంద్రో విలగ్నం త్వథ లగ్న భేదః,
శుద్ధి ర్గ్రహాణా మథవా పవాదో
విమిశ్రకాఖ్యం తను వేపనంచ. 4

అతఃపరం గుహ్యక పూజనంస్యా
త్స్వప్న స్తత స్స్నానవిధిః ప్రదిష్టః,
యజ్ఞో గ్రహాణా మథ నిర్గమశ్చ
క్రమాచ్ఛదిష్ట శ్శకు నోపదేశః. 5

వివాహకాలః కరణం గ్రహాణాం
ప్రోక్తం పృథ క్త ద్విపులాచ శాఖా,
స్కంధై స్త్రిభి ర్జ్యోతిష సంగ్రహోయం
మయాకృతో దైవ విదాం హితాయ. 6

తా. ఈశ్లోకములు మూఁడును ఏత ద్గ్రంథోప యుక్తములు గాకపోవుటంజేసి యిమ్మూఁడు శ్లోకములకు నర్థాదులు వ్రాయలేదు.

పృథు విరచిత మన్యైః శాస్త్రమేతత్సమస్తం
తదను లఘుమయేదం తత్ప్రదిష్టార్థ మేవ,
కృతమిహ హి సమర్థం ధీవిషాణా మలబ్ధ్వా
మమ యది నసదుక్తం సజ్జనైః క్షమ్యతాంతత్.

తా. అనఁగా నీగ్రంథకర్త విస్తీర్ణము లగు పూర్వశాస్త్రముల నాలోచించి చూచి అర్థమంతయు వచ్చునట్లు సంగ్రహముగ నీగ్రంథము చేయఁబడె నని తెలియఁ జేయుచున్నాఁడు. ఈశాస్త్రమునంతయు నితరులగు పరాశరాదులచేత విస్తార మగునట్లు రచింపఁబడెను. తదనంతరమునందుఁ దత్పరాశరాదులచేతఁ జెప్పఁబడినట్టి యర్థము గలుగునట్లు సంక్షేపముగ బుద్ధి యనెడు కొమ్మయొక్క నిర్మల మగు విషయమందు సమర్థమైన యీబృహజ్జాతక మనెడు శాస్త్రము నాచేతఁ జేయఁబడెను గదా? కాఁబట్టి యీబృహజ్జాతకమునందు నాచేత బాగుఁ జెప్పఁబడ కుండెనేని సత్పురుషులచేత నయ్యది క్షమింపఁబడుఁ గాక.

గ్రంథస్య యత్ప్రచరతోఽస్య వినాశమేతి
లేఖ్యా ద్బహుశ్రుత ముఖాధిగమ క్రమేణ,
యద్వామయా కుకృత మల్ప మిహాకృతంవా
కార్యం తదత్ర విదుషా పరిహృత్య రాగమ్. 8

తా. అనఁగా నీగ్రంథము ప్రచారముగల దగుచుండఁగా లేఖదోషముల వలన నెయ్యది చెడిపోవునో, ఈశాస్త్రమునందు నాచేత నెయ్యది దోషయుక్తముగఁ జేయఁబడి యుండునో, ఎయ్యది సంపూర్ణముగఁ జేయఁబడి యుండునో, ఎయ్యది చేయఁబడక యుండునో, అయ్యదంతయు నీవిషయమై మాత్సర్యమును విడిచి పండితునిచేత బహుశాస్త్రవేత్త లగుపూర్వ పండితుల వలనఁ దెలిసికొనిన క్రమముఁ దప్పకుండ, బాగుగ సంపూర్ణముగఁ జేయఁదగినది.

ఆదిత్య దాస తనయ స్తదవాప్త బోధః
కాపిత్థకే సవితృలబ్ధ వరప్రసాదః,
ఆవంతికో మునిమతా న్యవలోక్య సమ్య
గ్ఘోరాం వరాహ మిహిరో రుచిరాం చకార. 9

తా. ఈశ్లోకమున గ్రంథకర్త తనపితృనామధేయ ప్రకటన
ర్వకముగ సూర్యవర ప్రసాదమువలనఁ దనకుఁ గల్గిన సకలశాస్త్ర
జ్ఞానము మున్నగు వానిం దెలియఁజేయుచున్నాఁడు. ఎట్లనఁగా, ఆ
దాసుఁడనెడు బ్రాహ్మణోత్తముని పుత్త్రుఁడును ఆయాదిత్య దాసు
ను తండ్రివలనం బొందఁబడినట్టి జ్ఞానము గలవాఁడును కాపిత్థ మ
గ్రామమునందు సూర్యుని వలనఁ బొందఁబడినట్టి వరప్రసాదము
వాఁడును అనంతికాదేశ నివాసియునైనట్టి వరాహమిహిరాచార
డు ఋషిప్రోక్తము లగుశాస్త్రములను జూచి చక్కఁగ నీహో
శాస్త్రమును జేసెనని తెలియఁదగినది.

దినకర ముని గురుచరణ ప్రణిపాతకృత ప్రసాద మతినేదమ్,
శాస్త్ర ముపసంగృహీతం నమోస్తు పూర్వప్రణేతృభ్యః.

అనఁగా గ్రంథకర్త ఈశాస్త్రాంతమునందు పూర్వ శాస్త్ర
నమస్కార రూపమగు మంగళముం జేయుచున్నాఁడు. ఎట్లనఁగ;
ర్యునియొక్కయు, వసిష్ఠ పరాశరాదులయొక్కయు, తండ్రియగు నాది
దాసునియొక్క పాదములయొక్క నమస్కారములచేతఁ జేయఁబడిన నై
ల్యము గలబుద్ధి గల్గిన నాచేత నీశాస్త్రము లెస్సగా గ్రహిం
బడెను. అనఁగా, నమస్కారముచేత నాబుద్ధి నైర్మల్యము నొం
గాఁబట్టి పూర్వశాస్త్ర కారకులగు వసిష్ఠ పరాశర మాండవ్యాద
కాలకు నమస్కారము నగుంగాక.

ఉపసంహారాధ్యాయము సంపూర్ణము.



ఆలూరు రామకృష్ణ జ్యౌతిషిక తనూజ వాసుదేవేన
దైవజ్ఞ నివహ నిధినా ద్విజనుర్మణి నాంధ్రతంత్రపారదృశా,
అనితర సుగమార్థాంతా ప్రౌఢ బృహజ్జాతకాఖ్య మంజూషా
ఉద్ఘాట్య సర్వసులభా కృతాంధ్ర తాత్పర్యవర్య కీలికయా.



చెన్నపురి: వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు ముద్రితము—1914.